# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 17 సంచిక : 7 హైదరాబాద్ 216 జూలై 2019 పేజీలు : 68 రు. 25

* కులవ్యవస్థలో మామిడిపండూ ప్రాణాంతకమే
* ఆంధ్రప్రదేశ్ కొత్త ప్రభుత్వం - రాయలసీమ
* విద్యార్థుల ఆత్మహత్యలు ప్రభుత్వ వైఫల్యమే
* నిజం మాట్లాడితే ప్రభుత్వోద్యోగం ఖతం
* నూతన జాతీయ విద్యా విధానం
* కశ్మీర్ లోయలో రక్తపాత సంగీత శ్రుతి
* పశ్చిమాసియాలో అమెరికా బరి తెగింపు



సమరకవి సమయం
అజ్ఞాత కవిత్వ విశ్లేషణ
వరవరరావు



పేజీలు: 190
వెల: రు. 150

# సమరకవి సమయం

## అజ్ఞాత కవిత్వ విశ్లేషణ

## వరవరరావు

విరసం ప్రచురణ

ప్రతులకు:
**డి.వి. రామకృష్ణారావు,** ఎం.ఐ.జి.-14, ఎ.పి.ఐ.సి. కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ - 500 040. ఫోన్: 9989189250

**నవోదయ బుక్ హౌస్,** కాచిగూడ, హైదరాబాద్. ఫోన్: 24652387

**నవ తెలంగాణ,** చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్: 27608107

**అనేక బుక్‌స్టాల్,** ఏలూరు రోడ్, విజయవాడ. ఫోన్: 8977493465;

ఇతర ప్రముఖ పుస్తక షాపులు

Advt.




పేజీలు: 424
వెల: రు. 290

## బస్తర్‌లో భారత యుద్ధం

# రగులుతున్న అడవి

## నందిని సుందర్

మలుపు ప్రచురణ

ప్రతులకు: **మలుపు బుక్స్**
ఫ్లాట్ నం. 302, 3వ ఫ్లోర్, ఎంఎస్‌కె టవర్స్,
స్ట్రీట్ నం. 11, హిమాయత్‌నగర్,
హైదరాబాద్-029; ఫోన్: 9866559868

ఇతర ప్రముఖ పుస్తక షాపులు

Advt.

216 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2019
సంపుటి : 17
సంచిక : 7







**‘వీక్షణం’ పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై ‘**VEEKSHANAM**’ అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన సంహిత, వరంగల్ - రు. 2500, మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం జూన్ సంచికలో 'దేశీయం'లో 'ఎన్నికల ఫలితాలు – అనుకూల, ప్రతికూల గుణపాఠాలు' వ్యాసం చదివాను. ఎన్నికల ఫలితాల మాయాజాలం చూసినప్పటి నుండి ఈ వారం పది రోజులు నా మనసు మనసులో లేదు. ఆశ్చర్యం, అశాంతి, ఆందోళన, నిస్త్రాణ, విసుగు, విభ్రమ, కోపం, ద్వేషం, కసి, పగ, రాజకీయ వైపరీత్యాలపై విరక్తి, మేడిపండు ప్రజాస్వామ్యంపై విరక్తి, ఆనాటి పెద్ద పార్టీలు నామరూపాలు లేకుండా పోవడం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, పెద్ద పెద్ద దోపిడీ దొంగలే నిస్సిగ్గుగా నెగ్గి మీసాలు మెలేయడం, డబ్బు, మతం, కులం, జాతి, రౌడీయిజం, అసత్యం, అబద్ధాలే నిజాలవడం, దొంగ దేశభక్తి ప్రకోపింపచేయడం, యుద్ధ మేఘాలు సృష్టించడం, మత దురభిమానాలు వ్యాపింపచేయడం, ఎన్నెన్నో దుష్టకౌరవ పన్నాగాలు పన్నినవారే నెగ్గడం నన్ను బాగా నొప్పికలిగించాయి. మీ వ్యాసంలోని ప్రతి వాక్యం, ప్రతి పేరా, ప్రతి పేజీ ఒకటికి నాలుగు సార్లు తిరగేసి ఈ ఎన్నికల గెలుపుపై ఏయే కారణాలు ఎంతెంత, ఎట్లెట్లా, ఎవరెవరిని ప్రేరేపించాయో సైద్ధాంతిక చర్వోప చర్చల సంగ్రహీకరణగా 5–6 పేజీలలో మీ మేధో శక్తిని చూసి ఆశ్చర్యపోయాను. పత్రికలలో అక్కడక్కడ వైఫల్యాలపై ఎడిటోరియల్స్ లోను, ప్రత్యేక వ్యాసాల రూపాన మేధావులు, విలేకరులు, నాయకులు, రచయితలు రాసిన వ్యాసాలు చూసినా మీ అంత విపులంగా ధైర్యంగా, బిజెపి ద్రోహ బుద్ధిని సూటిగా తెల్పలేకపోయాయి. అంతకు ముందు మీడియా అంతా ప్రత్యామ్నాయ ప్రభుత్వంపై సూచనలు ఇచ్చినా కూడా ఈ ప్రభుత్వం కాస్త జాగ్రత్తగా ఉండకపోతే నష్టపోతామని సూచీ మాత్రంగానే హెచ్చరించాయే గానీ, ప్రత్యామ్నాయ కృషి, ఎదుర్కోవడం చూపలేకపోయాయి. మీరైనా ప్రతిఘటనోద్యమం ప్రగతిశీల, సామ్యవాద, ఉదారవాద నిర్మాణాన్ని నిర్మించాలన్నారే గానీ, వారెట్ల ఐక్యతా పోరాటాలు చేయాలో, చేయగలరో, భవిష్యద్దర్శనం చేయనేలేదు.

నిన్నటిదాకా విర్రవీగిన నాయకులు నోరు విప్పడం లేదు. గెలిచిన అనామకులు అవాకులు చవాకులు విసిరి నోటి దురద తీర్చుకుంటున్నారు. శత్రువు ప్రణాళికాబద్ధంగా చేసే పనులను కండ్లముందు ఉంచారే గానీ, ఈ కమ్యూనిస్టు నాయకులకైనా సలహాలివ్వలేదు. జైలులో ఉండాల్సిన అవినీతిపరులు, దొంగలు, దోపిడీదారులు, నేరస్థులు కోర్టుల చుట్టూ తిరుగుతూనే, రాజకీయ ఎన్నికలలో ఊరూరా తిరుగుతూ, ఓదార్పు సానుభూతి అంటూ కల్లబొల్లి కబుర్లు చెప్పినవారే అధికార పీఠమెక్కి పట్టాభిషిక్తులై రాజ్యాలేలుతుంటే, వారిని ఒక్కమాట అనడానికి సాహసించడం లేదు. శ్రీశ్రీ లాగా 'ఇది దొంగల రాజ్యం, దోపిడీ రాజ్యం, పోలీసు రాజ్యం…' అని నేటి పరిస్థితులలో వ్యక్తిగతంగా కూడా పేరుపెట్టి అనాల్సిన రోజులు. అయినా ఎవరూ ఆ 'దొంగల్ని' దొంగనాకొడుకులు మెసిలే దేశంలో అని అనలేక పోతున్నారు. మళ్లీ వ్యక్తిగత భజనలు, భట్రాజు పొగడ్తలు పొగుడుతున్నారు. పత్రికలు కూడా తాము రాసిన పాత మాటల్ని మరిచిపోయి కొత్త ప్రభుత్వాల్ని పొగుడుతూ రాస్తున్నాయి. పత్రికల్ని కూడా శ్రీశ్రీ తిట్టిన తిట్లు ఈనాడు ఎవరూ తిట్టలేకపోతున్నారు. ఏమిటీ అన్యాయం? ప్రజలు ఇంత మోసం ఎలా చేయగలిగారు? పూర్వం మాకీ ప్రభుత్వం వద్దని వీధుల్లో పడి కేకలు వేసేవారు. ఓట్లెవరికి వేసిందీ, వేసేదీ బహిరంగంగా చెప్పేవారు గానీ, చాపకింద నీరులా, ముక్కూ మొహం తెలియని నాయకుల్ని, అనామకుల్ని, అజ్ఞానుల్ని, అవినీతిపరుల్ని, ఖైదీలను ఓట్లు వేసి, గెలిపించి గంతులేసేవారు కాదు. ప్రజలూ నమ్మక ద్రోహులైపోయారు. చేసిన మేలు మరచి, ఏ మేలూ చేయని ద్రోహుల్ని గెలిపించారు. ప్రజాస్వామ్యం పేరున ఎవరూ ఆ ప్రజల్ని ఒక్కమాట అనడం లేదు. అమాయకులు మోసపోయి డబ్బుకీ, సారాకీ, కులానికీ, కూటికీ బానిసలై పార్టీ నాయకుడిని నమ్మి పేరూ, ఊరూలేని వారికి ఓటువేసి ఎంపిలు, ఎంఎల్ఎ, మంత్రులుగా శిరసావహించేలా చేసిన పిచ్చివాడి చేతిలో ఓటు విలువ కోల్పోయిన ఈ రాజ్యం ఒక రాజ్యమా? రాజులేని ప్రజాస్వామ్యంలో పట్టాభిషేకాలు, అట్టహాసాలు, విగ్రహ ప్రతిష్ఠాపనలు, సర్వమత విచిత్ర వేషధారణలు వేసి, తిరిగి తమతమ మతాల్ని అంట్టిపెట్టుకొని పక్షపాతంతో, స్వార్థంతో, కసితో, పాత నేరాల్ని తిరగదోడి, వారూ ఒక తానులోని ముక్కలే అనే విధంగా ప్రవర్తిస్తుంటే ఈ మాటల్ని చెప్పేదెవరు? తమ తప్పులు తమకు కనిపించవు. ఒక్కసారి అధికారం వస్తే చాలు మరో 20–30 ఏండ్లు నాదే రాజ్యం అని విర్రవీగే మనస్తత్వాలు, స్వార్థబుద్ధులు దేశసేవ చేయడానికి తయారైన దొంగల రాజ్యమే ఇది! అని తిట్టేవారూ కరువయ్యారు! కవులు వ్యంగ్యంగానైనా పేర్కొనేవారు. ఇప్పుడు వారూ భజనపరులే అయ్యారు! పత్రికలూ అంతే అయినాయని నా బాధ.

జూన్ సంచికలో వచ్చిన వ్యాసాలు అన్నీ బాగున్నాయి. తెలంగాణ సంపాదకీయ వ్యాఖ్య ప్రతి నెలనెలా వచ్చి తెలంగాణ యాసలో మురిపిస్తున్నాయి. సామ్రాజ్యవాద చదువులు మాకువద్దు అని అనవలసిన ప్రజలే అవే మాకు కావాలని ఎల్‌కెజి నుండి ఇంగ్లిష్ మాధ్యమం కావాలని అంటుంటే వద్దనేవారెవరూ? 'కోర్టు తీర్పులు–న్యాయన్యాయాలు' అన్న వ్యాసంలో లోకే రాజ్‌పవన్ వ్యాసం నా కోర్టు పోరాటం గుర్తుచేసింది. 1977 నుండి 2007 దాకా పోరాటం చేసి గెలిచీ ఓడిపోయాను ఆ తీర్పులు అమలు గాక. తిరిగి ఇప్పుడు రిటైర్ అయిన 24 ఏండ్లకి ఆ తీర్పు చెల్లదని గత 1996 నుండి రిటైర్ అయిన తర్వాత (23 ఏండ్ల నాటి నుండి) రిఫిక్స్ చేసి రికవరీలు చేశారు పెన్షన్ నుండి! ఆహా ఏమి న్యాయ వ్యవస్థ? కోర్టులలో న్యాయం ఎండమావే కదా! సంఘ్‌పరివార్ బాణం 'సాధ్వి ప్రజ్ఞాసింగ్ ఠాకూర్' పై వ్యాసం బాగుంది.ఎ. నర్సింహారెడ్డి 'శ్రీలంకలో నరమేధానికి మూలాలు' బౌద్ధంలోనూ, సూఫీయిజంలోనూ తీవ్రవాద సంస్థలున్నాయనీ, అహింసా సిద్ధాంతం ఎంత డొల్లదో తెల్పినారు. వారికి అభినందనలు. 'స్పెయిన్ జాతీయవాద ప్రమాద ఘంటికలు' బ్రెగ్జిట్ సంక్షోభాలు, మొదలైన ప్రపంచ రాజకీయ వ్యాసాలు, పోరాట పాటల వీరుడు అరుణోదయ రామారావుపై వ్యాసం అన్నీ నాకు నచ్చినవే. ప్రతి సంచిక నాకు ఈ వయస్సు (83) లోనూ జ్ఞానోదయం (పఠనాసక్తి) కల్గిస్తున్నందుకు కృతజ్ఞుణ్ని.

**– యస్. హజరత్ అలి**
వేమూరు, గుంటూరు

(మిగతా 44వ పేజీలో…)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# విద్వేష రాజకీయ మహమ్మారి తొలి అడుగులు

విద్వేష రాజకీయాధికారం నెల తిరగక ముందే తన విషవిశ్వరూప ప్రదర్శన ప్రారంభించింది. ఎన్నికల ఫలితాలు వెలువడిన మొదటి వారంలోనే, ప్రధానమంత్రి ఇంకా మంత్రివర్గాన్ని ఏర్పరచుకోకముందే, ఉత్తరాది రాష్ట్రాలలో ముస్లింల మీద, దళితుల మీద సంఘ్ పరివార్ మూకల దాడి ఘటనలు ఐదు నమోదయ్యాయి. ఇక మంత్రివర్గాన్ని ప్రకటించి, హోం మంత్రిగా అమిత్ షాను నియమించడంతో దేశంలో ఎటువంటి ఘటనలు, పరిణామాలు జరగనున్నాయో ఒక సూచిక, హెచ్చరిక ఇచ్చినట్టయింది. మూడువేల మంది ముస్లింలను ఊచకోత కోసిన గుజరాత్ మారణకాండలో ముఖ్యమంత్రిగా, ప్రోత్సాహకుడిగా నరేంద్ర మోడీ పాత్ర ఎంతటిదో అప్పుడు అక్కడ అనేక శాఖల మంత్రిగా, మోడీకి కుడి భుజంగా ఉన్న ఆర్ఎస్ఎస్ నాయకుడు అమిత్ షా పాత్ర అంతటిదే. తన కంటె ముందరి హోం మంత్రి హరేన్ పాండ్యాను హత్య చేయించడం, ఆయనను హత్య చేయడానికి ఉపయోగించిన సోహ్రాబుద్దీన్ షేక్, ఆయన భార్య కౌసర్ బీ, తుల్సీరాం ప్రజాపతిలను, ముంబై విద్యార్థిని ఇష్రత్ జహాన్‌తో సహా మరెందరినో బూటకపు ఎన్ కౌంటర్లలో చంపించడంలో, కొందరు పోలీసు అధికారులతో మాఫియా ముఠాను నిర్వహించడంలో అమిత్ షా పాత్ర గురించి విమర్శకులు మాత్రమే కాదు, స్వయంగా సిబిఐ కూడ తీవ్రమైన నేరారోపణలు చేసింది. అటువంటి వ్యక్తి ఇవాళ భారత ప్రభుత్వంలో అత్యంత కీలకమైన హోం మంత్రిత్వ శాఖకు అగ్రాసనంలో ఉన్నాడంటే, ఇక దేశంలో పోలీసు రాజ్యం, సంఘ్ పరివార్ రాజ్యం జమిలిగా సాగుతాయన్నమాట. ఈ రెండు విష రసాయనాల కలయిక తప్పనిసరిగా ముస్లింల పట్ల, దళితుల పట్ల, మహిళల పట్ల, ఆదివాసుల పట్ల, భిన్నాభిప్రాయాలు గల వాళ్ల పట్ల ప్రాణాంతకంగా ఉండబోతుంది. ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తగా భావజాల వ్యతిరేకుల మీద మాత్రమే కాదు, పార్లమెంటరీ రాజకీయాలలో భిన్నాభిప్రాయాలు ప్రకటించే, పాలకవర్గ ముఠాలకు చెందినవారి మీద కూడ దాడులు చేయడానికి వీలుగా అమిత్ షా తన కోరలు పదును పెట్టుకుంటున్నాడనే సూచనలు అప్పుడే మొదలయ్యాయి. నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ పరిధిని విస్తరించడం, ఇప్పటివరకూ తీవ్రవాద సంస్థలను మాత్రమే గుర్తించడానికి అవకాశం ఉన్న అన్ లా ఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ ఆక్ట్ అధికారాలు పెంచి వ్యక్తులను కూడ తీవ్రవాదులుగా ప్రకటించడానికి వీలు కల్పించడం, ఇప్పటివరకూ ఆర్థిక మంత్రి పరిధిలో ఉన్న, రాజకీయ ప్రత్యర్థులను ఆర్థిక నేరాలలో ఇరికించడానికి అవకాశం ఇచ్చే ఎన్ ఫోర్స్ మెంట్ డైరెక్టరేట్ ను హోం మంత్రి పరిధిలోకి తేవడం వంటి మార్పులు చకచకా జరిగిపోతున్నాయి.

అయితే ఇదంతా నరేంద్ర మోడీ, అమిత్ షా అనే ఇద్దరు వ్యక్తుల వ్యవహారం మాత్రమే కాదు. సంఘ్ పరివార్ – పోలీసు రాజ్యం కేవలం ఆధిపత్యం వహిస్తున్న వ్యక్తుల స్వభావాల మీద మాత్రమే కాదు, మొత్తంగా ఒక తిరోగమన భావజాలం మీద, ఫాసిస్టు భావజాలం మీద, సమాజాన్ని భయ భీతావహంలో ముంచే విధానాల మీద ఆధారపడబోతున్నదని ఈ నెల రోజుల పాలనలో గడిచిన ఉదాహరణ ప్రాయమైన ఘటనలూ పరిణామాలూ చూపుతున్నాయి.

గుజరాత్ మారణకాండలో మోడీకి ప్రత్యక్ష పాత్ర ఉందని సుప్రీం కోర్టు బృందానికి వెల్లడించిన ఐపిఎస్ అధికారి సంజీవ్ భట్ ను పదవి నుంచి తొలగించి, ఎప్పటిదో ముప్పై ఏళ్ల కింది కేసు తవ్వి తీసి, ఎనిమిది నెలల కింద అరెస్టు చేశారు. కింది కోర్టు ఆ కేసులో ఇచ్చిన తీర్పులో సంజీవ్ భట్ కు ముప్పై సంవత్సరాల శిక్ష విధించింది. భీమా కోరేగాం హింసాకాండ కేసులో అంతకు ముందు నుంచీ సాగుతున్న జాప్యం మరింత ఎక్కువగా జరగడానికి మార్గం సుగమం అవుతున్నది. ఆ కేసులో నిందితుడిగా చూపి, ఇప్పటివరకూ అరెస్టు చేయని ఫాదర్ స్టాన్ స్వామి ఇంటి మీద మరొకసారి దాడి చేసి, ఎలక్ట్రానిక్ పరికరాలు ఎత్తుకుపోవడం జరిగింది. ఎన్‌డిటివి మీద గతంలో పెట్టిన కేసును మళ్లీ తవ్వి తీస్తున్నారు. న్యాయవాది ఇందిరా జైసింగ్, ఆనంద్ గ్రోవర్ ల మీద కక్ష సాధింపుగా వారు నడుపుతున్న లాయర్స్ కలెక్టివ్ సంస్థ మీద అబద్ధపు కేసుకు సన్నాహాలు చేస్తున్నారు. మతవిద్వేష రాజకీయాలను నిరంతరం వ్యతిరేకిస్తున్న రామ్ పునియానీని చంపుతామని బెదిరింపులు సాగిస్తున్నారు. మరొకవైపు జార్ఖండ్‌లో ముస్లిం యువకుడు తబ్రేజ్ అన్సారీని దొంగతనం ఆరోపణపై చిత్రహింసలు పెట్టి, మూడు రోజుల తర్వాత ఆస్పత్రిలో చనిపోవడానికి కారకులైన సంఘ్ పరివార్ మూకలు, ఆ చిత్రహింసల క్రమంలో జై శ్రీరాం అనీ, జై హనుమాన్ అనీ నినాదాలు ఇమ్మని ఒత్తిడి చేశారని తెలుస్తున్నది. ఈ ఘటనలన్నీ ఎనభై సంవత్సరాల కింద జర్మనీలో నాజీ మూకలు చేసిన దాడులను గుర్తు చేస్తున్నాయి. ఇక ముందు దేశవ్యాప్తంగా పెరగనున్న మూకదాడుల గురించి హెచ్చరిస్తున్నాయి.

ఈ విడివిడి ఘటనలు మాత్రమే కాదు, విద్యా రంగంలో, రాజకీయ రంగంలో, ఆర్థిక రంగంలో సంఘ్ పరివార్ శక్తులు తేదలచుకున్న మార్పులకు నాందీ ప్రస్తావనలు కూడ అప్పుడే కనబడుతున్నాయి. సంఘ్ పరివార్ భావజాలాన్ని, హిందీ పెత్తనాన్ని విద్యారంగంలో చొప్పించడానికి ఉద్దేశించిన నూతన జాతీయ విద్యా విధానం ప్రతిపాదనలను బైటపెట్టారు. దేశవ్యాప్తంగా ఎన్నోసార్లు బాధితులు వైద్యుల మీద దాడులు చేసిన ఘటనలు జరిగినప్పటికీ, బెంగాల్ లో జరిగిన ఒక ఘటనను సాకుగా తీసుకుని సంఘ్ పరివార్ ప్రభావంలో ఉన్న ఇండియన్ మెడికల్ అసోసియేషన్ సహాయంతో బెంగాల్ లో సంక్షోభం సృష్టించడానికి ప్రయత్నించారు. బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వాన్ని కూల్చడానికి ప్రయత్నిస్తున్నారు. కొత్త విడత ఆర్థిక సంస్కరణల పేరుతో పెద్ద ఎత్తున ప్రభుత్వ రంగ సంస్థల అమ్మకానికి పావులు కదుపుతున్నారు. బి ఎస్ ఎన్ ఎల్ ను బలిపశువుగా మారుస్తున్నారు. ఖనిజ నిలువల్లో గణనీయమైన భాగాన్ని అదానీ చేతికి అందించడానికి ఎత్తులు వేస్తున్నారు.

ఇవి దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, భావజాల రంగాలను కమ్ముకుంటున్న మహమ్మారి తొలి అడుగులు. ఈ విపత్తును అడ్డుకోవడానికి, క్రియాశీలంగా ప్రతిఘటించడానికి ప్రజలను సమీకరించడం, సంఘటిత పరచడం తప్ప మరొక దగ్గరి దారి ఏదీ లేదు. ఇటలీ, జర్మనీ, స్పెయిన్ లు గత శతాబ్దిలో ఇటువంటి ప్రమాదాలనూ, ఆ ప్రమాదాలను ప్రతిఘటించిన ప్రజాసమీకరణనూ చూపాయి. ఆ పాఠాలు నేర్చుకుంటామా లేదా అని చరిత్ర మనవైపు చూస్తున్నది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# మళ్ల గదే ప్రశ్న: తెలంగాణొస్తే ఏమొచ్చింది?

తెలంగాణొచ్చి ఐదేండ్లయింది గద. అంటె శాన రోజులే గద. ఒక సర్కారు దిగిపోయి రెండో సర్కారు గుడ ఎక్కింది గద. ఎన్నేండ్లు కొట్లాడి తెచ్చుకుంటిమి! ఎంత మంది బిడ్డలు రాలిపోతె ఒచ్చింది! ఏదైన ఎదురు చూడంగ ఎదురుచూడంగ ఒస్తె ఆశ ఎక్కువుంటది గద. తెలంగాణొస్తే ఏమొచ్చింది ఎవరికొచ్చింది అని ఎవరైన అమాయకంగ అడుగొచ్చు. అంతకు ముందు ఎట్లుండె, ఇప్పుడెట్లున్నది అని లెక్కలేసుకోవచ్చు. వాండ్ల బతుకుల్ల ఏమి మారకపోయిన, వాండ్ల ఊళ్ల ఏమి కనబడకపోయిన గుడ ఎవనికో ఒకనికి ఎక్కడ్నో ఒక కాడ వచ్చే ఉంటదిలే, ఏదో ఒక ఊళ్లె మంచి జరిగే ఉంటదిలే, జనానికి ఒరిగే ఉంటదిలే అని సంబుర పడొచ్చు. మారె, అస్సలేమి రాలే, పెనం మీంచి పొయిల బడ్డట్టయింది, పురాగ అన్నాలమై పోయింది, గొర్లను దినెటోడు బోయి బర్లను దినెటోడు ఒచ్చినట్టయింది అని కొట్టిపారేసి నిరాశగ నాలిక చప్పరిచ్చెటోల్లు గుడ ఉండొచ్చు. ఇగ పెద్ద దొర భక్తులూ చిన్న దొర భక్తులూ శానశాన ఒచ్చినయని పెగ్గెలు గుడ చెపుతుండొచ్చు. నీళ్లు దెచ్చినం, పెండ్లిండ్లు జేసినం, ముసలోల్లకు ముద్ద బెట్టినం, పంటకు పెట్టుబడి బెట్టినం, ఢిల్లిల చక్రం దిప్పెడిదుండె, కీసల దప్పిపోయింది అని చాంతాడంత పురాణం జెప్పొచ్చు. అవన్ని నివద్దె. గాని వాటి ఎనుకా ముందు జూడాలె గద. ఇది జేసినం, అది జేసినం అని టుపాకి ఎంకట్రాముని తీర్గ ఒర్రితె గాదు, ఆ పెగ్గెల ఎనుక ఏమున్నది జూడాలె. చెర్ల బియ్యం బోసి తూముల మంటబెట్న మారాజ అంటే ఇనుటానికి బాగనే ఉంటది గాని చెర్ల ఎన్ని బియ్యం బోసిండు, తూముల మంట బెడితె ఉడుకుతాందా లేద, ఉడికినా ఊరి జనానికి మెతుకు మెతుకన్న ఒస్తదా లేదా అని ఇశారించాలె గద. అట్లనే పెద్ద దొర, చిన్న దొర, భక్తులు చెప్పేటియన్ని తిర్లమర్లేసి జూస్తె అసలు సంగతి తెలుస్తది. ఇంతకు ఏమన్న ఒచ్చిందా లేదా అని ఎట్ల జూడాలె? తెలంగాణ ఎందుకు రావాల్నని కొట్లాడినమో అవి ఒచ్చినయా లేదా అని చూడాలె. ఆంధ్రోడు ఎల్లి పోవాలె అని ఎందుకన్నమో అవి జరిగినయా లేదా చూడాలె. జనానికి కావల్సినవి అందినయా లేదా అని చూడాలె. తెలంగాణ ఎందుకు రావాల్నంటిమంటె నీళ్లనిరి, పైసలనిరి, కొలువులనిరి. నీళ్లు ఇగొ వచ్చె అగొ వచ్చె అని పెగ్గెలే గాని యాడిదాక ఒచ్చినయి? నూరు పైసల పనిల ముప్పై పైసలు గుడ కాకమునుపె దొర అయిపాయె అయిపాయె అని పండుగ జేసిండట గద. ఎనబై వేల కోట్ల రూపాయల పనిల అరవై వేల కోట్లు ఒక్క గుత్తెదారుకె ఇచ్చిండట గద. ఎంత దండి గొట్టిండొ మారాజు. అయినా మా ఊళ్లె నూటికి ముప్పై మందికి భూమే లేకపాయె, నీళ్లొస్తె మాకేమొస్తది. కొలువులు గావాలె. అవి గావాల్నంటె మస్తుగ మిల్లులు గట్టాలె. కొత్త మిల్లుల సంగతి వదిలిపెట్టు, మూసినయే దెరిపియ్యక పాయె, ఉన్నయి మూయబట్టె. ఇగ పైసలంటే మస్తు పైసలు మిత్తికి దెస్తాండట గద. తెచ్చి ఏం జేస్తాండో తెల్వదు. ఆ అసల్లు, మిత్తులు ఎవలు గట్టాలె. మా ఊళ్ల కాటిపాపల తాత నోట్లెనుంచి బంగారు గుండ్లు దీసెటోడు. మరెందుకు బిచ్చమడుగుతానవే అంటె, "నా సొమ్ము సొక్కమైతే ఇంకాడనో ఉందు' అనెటోడు. తెలంగాణ కత గట్లనే ఆయెనా. ఆయినెవలో, నాకు పేరు నోరు దిరగది గని, సాములోరట, గదేదో తూర్పు దేశం నుంచొచ్చి ఐద్రాబాదల జాగ గావాల్నన్నడట. ఐద్రబాదల శాన పిరమాయె. మస్తు పైస గావాలె గద. అయిన, నాకు తెల్వకడుగుత. సాములోరు భూమి పుట్టిచ్చులేడా, పైస పుట్టిచ్చులేడా? గాయినెకు రూపాయికో రెండు రూపాలకో ఎకరం చొప్పున రెండెకరాలు ఇచ్చిండట గద దొర. వారెవ్వా, ఇప్పుడు ఎరుకైంది నాకు. తెలంగాణొస్తే ఏమొచ్చిందా? పెద్దోళ్లకు రూపాయికి ఎకరం ఒచ్చింది మారాజ. పనిపాటలోళ్లకు ఉన్న భూమి ఊడగుంజుకున్నరు మారాజ. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ఇవి ప్రజానుకూల గుణాత్మక మార్పులేనా?

విపరీతమైన ఆధిక్యతతో అధికారానికి వచ్చిన వైఎస్ జగన్‌మోహన్ రెడ్డి ప్రభుత్వం మొదటి నెల రోజుల్లోనే ఆకర్షణీయమైన విధాన ప్రకటనలెన్నో చేస్తున్నది. ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసిన నవరత్నాలు (రైతు భరోసా, ఫీ రియింబర్స్‌మెంట్, ఆరోగ్యశ్రీ, జలయజ్ఞం, మద్య నిషేధం, అమ్మ ఒడి, ఆసరా – చేయూత, పేదలందరికీ ఇళ్లు, పెన్షన్ల పెంపు) అమలులోకి తెస్తున్నాననే పేరుతో కొన్ని ప్రకటనలు ఇప్పటికే చేసింది. మరికొన్ని ప్రక్రియ ప్రారంభమైందంటున్నారు. ఇప్పటికి జరిగిన పనుల గురించి ప్రభుత్వానుకూల ప్రచారకర్తల ఆర్భాటం సరే, విమర్శనాత్మకంగా చూసేవారు కూడ కొందరు తబ్బిబ్బు అవుతున్నారు. అయితే నవరత్నాలలో చెప్పినవన్నీ గత ప్రభుత్వాలో, ఇతర రాష్ట్రాల్లో ప్రభుత్వాలో అమలు చేసిన, చేస్తున్న సంక్షేమ పథకాలే గనుక అవన్నీ నామమాత్రపు సంక్షేమ రాజ్యంలో పరిమాణాత్మక మార్పులు మాత్రమే తేగలవు గాని గుణాత్మకంగా ప్రజానుకూల పాలన తేలేవు. సంక్షేమ పథకాలే, లేదా సంక్షేమ పథకాల్లో స్వల్ప పెంపుదలే గొప్ప ప్రజా ప్రయోజనకర పథకాలుగా ప్రచారం చేసుకోగలిగే తెలివితేటలు ఇప్పుడు అన్ని పాలకవర్గ పార్టీలకూ అబ్బాయి. జగన్ ప్రకటించిన నవరత్నాలలో ఫీ రియింబర్స్‌మెంట్, ఆరోగ్యశ్రీ, జలయజ్ఞం మూడూ వైఎస్ రాజశేఖరరెడ్డి అమలు చేసినవే, విస్తృతమైన అవినీతికి ఆలవాలమైనవే, సామాజిక అవసరాలు తీర్చకుండా వ్యక్తిగత అవసరాలు తీర్చి లబ్ధిదార్లను సంతృప్తి పరచడానికీ, మరొకవైపు విద్యా, ఆరోగ్య వ్యాపారస్తులకు ఇబ్బడి ముబ్బడి లాభాలు కట్టబెట్టడానికీ ఉపయోగపడినవే. అలాగే భరోసా, ఆసరా – చేయూత, పేదలందరికీ ఇళ్లు, పెన్షన్లు అనే నాలుగు పథకాలు కూడ గత ప్రభుత్వాలో, పొరుగు ప్రభుత్వాలో అమలుచేస్తున్నవే. ఇప్పుడు కొత్త ప్రభుత్వం వాటినే కొనసాగించడమో, పదో పాతికో పెంచడమో చేస్తానంటున్నది. మిగిలిన రెండు పథకాల్లో అత్యవసర మైనదీ, నిజంగా అమలు చేస్తే ప్రజా జీవనాన్ని మెరుగుపరచగలదీ అయిన మద్య నిషేధం వాగ్దానం పెద్దగా ముందుకు కదులుతున్నట్టు లేదు. కాగా మెట్రిక్ తర్వాతి చదువుకు ఫీ రియింబర్స్‌మెంట్ ఉన్నట్టుగానే అమ్మఒడి పేరుతో పాఠశాల విద్యకు ప్రకటించిన పథకం కొత్తది. కాని అది ఒకసారి ప్రభుత్వ పాఠశాలలకు మాత్రమే అనీ, ఆ తర్వాత కాదనీ పిల్లి మొగ్గలు వేసి చివరికి రియింబర్స్‌మెంట్ పథకం లాగనే ప్రైవేటు విద్యాసంస్థలకు కూడ అందించడానికి నిర్ణయం తీసుకున్నారు. అంటే ప్రభుత్వ పాఠశాల విద్యా రంగాన్ని బలహీనపరచడానికి రంగం సిద్ధం చేస్తున్నారు. బాక్సైట్ తవ్వకాలను నిలిపివేస్తూ ఇచ్చిన ఉత్తర్వులు, అక్రమ నిర్మాణాలను కూల్చివేయడం పేరుతో ప్రజావేదిక భవనాన్ని కూల్చివేయడం, పాత కంట్రాక్టులను సమీక్షించడం అనే మూడు పనులూ పైకి చూడడానికి ఆహ్వానించదగినట్టుగా ఉన్నాయి గాని ఒక పాలకవర్గపార్టీ అమలుచేస్తున్న పనులుగా వీటినికూడ శంకించవలసి ఉన్నది. బాక్సైట్ తవ్వకాల ద్వారా సొమ్ము చేసుకుంటున్న ప్రత్యర్థి రాజకీయ నాయకులను బలహీన పరచగానే, సొంత పార్టీ రాజకీయ నాయకులు ఆ వ్యాపారంలో ప్రవేశించగానే దానికి మళ్లీ అనుమతి దొరక వచ్చు. అలాగే ప్రత్యర్థుల నిర్మాణాలలో 'అక్రమాలు' మాత్రమే కనబడి, ఆశ్రితుల నిర్మాణాలన్నీ సక్రమం అయిపోవచ్చు. కాంట్రాక్టుల సమీక్ష కూడ ప్రత్యర్థి రాజకీయాల సమీక్షగా మిగిలిపోవచ్చు. నిరంతర జాగరూకత, ప్రతి ప్రభుత్వవిధానం మీద, పథకం మీద ప్రజా పర్యవేక్షణ మాత్రమే ఇవాళ అవసరమైన కర్తవ్యాలు. వీ

# ఐరోపా పార్లమెంట్ ఎన్నికల్లో మితవాదుల గెలుపు

**- ఎ. నర్సింహా రెడ్డి**

ఐరోపా పార్లమెంట్‌లో 751 స్థానాలకు మే 23, 26 తేదీలలో ఎన్నికలు జరిగాయి. 28 సభ్య దేశాలలోని 45 కోట్ల ఓటర్లు ఎన్నికల్లో ఓటు చేశారు. పశ్చిమాసియా యుద్ధాల కారణంగా పెరుగుతున్న వలసలు, పొదుపు చర్యల పేరిట పెరిగిన నిరుద్యోగం, తగ్గుతున్న సాంఘిక భద్రత, వృద్ధాప్య పించన్ల కోతల నడుమ తలనొప్పిగా మారిన బ్రెగ్జిట్ తదితర అంశాల మధ్యన ఐరోపా పార్లమెంట్‌కు ఎన్నికలు జరిగాయి. మరొకవైపు అమెరికా తీసుకొచ్చిన వాణిజ్య యుద్ధం, యూరప్ సొంత మిలిటరీ అనే రెండు కీలక అంశాలు కూడా ఎన్నికల్లో చర్చకు వచ్చాయి. ప్రభుత్వ ఏర్పాటుకు అవసరమైన 376 స్థానాలకు చేరుకోవడం ఇప్పటివరకు ఇయు పార్లమెంట్‌ను శాసించిన యూరోపియన్ పీపుల్స్ పార్టీ (ఇపిపి), సోషలిస్టులు, డెమోక్రాట్స్ (ఎస్&డి) కూటమికి అసాధ్యంగా మారింది. లిబరల్స్, గ్రీన్ పార్టీలు, మితవాద జాతీయవాద అర్ధ ఫాసిస్టు పార్టీలు నూతన విజయాల్ని నమోదు చేసుకొన్నాయి. దశాబ్దాల పాటు జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్‌లను శాసించిన పార్టీలు యూరప్ ప్రజల మన్ననలను పొందలేకపోయాయి. వీరికి 50 శాతం పార్లమెంట్ సీట్లు రాలేదు. ఇయు దేశాల్లో సాంఘిక భద్రతను నీరుగారుస్తూ, కార్మిక హక్కులను హరించే చట్టాలకు వ్యతిరేకంగా ఉద్యమించిన వీరిపై పోలీసు జులుం ప్రదర్శించిన ప్రభుత్వ అధికార పార్టీలు ఘోరంగా ఓడిపోయాయి. జర్మనీ, పోర్చుగల్, బెల్జియంలో కనీస వేతనాల కోసం, ఫ్రాన్స్‌లో పెట్రోలు ధరల తగ్గింపుకోసం, పోలెండ్‌లో ఉపాధ్యాయుల సమ్మెను, హంగేరిలో ఓవర్‌టైం చెల్లింపు కోసం జరిగిన ఉద్యమాలను అణచివేసిన ప్రభుత్వాలు ఓటమి పాలయ్యాయి. నూతన పార్లమెంటులో లిబరల్స్ గ్రూపు కింగ్‌మేకర్ పాత్ర పోషించనున్నది. ఐరోపా పార్లమెంట్ ఎన్నికల్లో అధికార కూటమికి గట్టి ఎదురుదెబ్బ తగిలింది. గత ఎన్నికలతో పోల్చితే సాంప్రదాయక మధ్యేవాద–మితవాద, మధ్యేవాద–లెఫ్ట్ గ్రూపుల బలం బాగా తగ్గింది. ఆ మేరకు పచ్చి మితవాద, లిబరల్స్, గ్రీన్స్, జాతీయవాద, కన్సర్వేటివ్స్ వంటి పార్టీల ప్రభావం పెరిగింది. బ్రిటన్‌లో బ్రెగ్జిట్ పార్టీకి గణనీయంగా సీట్లు లభించినా, బ్రెగ్జిట్ అనుకూల పార్టీల కన్నా వ్యతిరేక పార్టీలకు ఎక్కువ ఓట్లు వచ్చాయి. ఫ్రాన్స్‌లో జాతి విద్వేషం, ఇస్లామిక్ వ్యతిరేకత, వలసల పట్ల వ్యతిరేకత, విద్వేషం నిలువెల్లా నింపుకున్న మెరీ లీపెన్ నేతృత్వంలోని నియో ఫాసిస్ట్ నేషనల్ ర్యాలీ పార్టీ (ఎన్ఆర్‌పి), మాక్రాన్ పార్టీకన్నా ఒక శాతం అధికంగా ఓట్లు సాధించింది. జర్మనీలో వాతావరణ మార్పులపై పోరాడడంలో ముందుండే గ్రీన్స్ పార్టీ 69 స్థానాలతో రెండవ స్థానంలో నిలిచింది. గతసారి ఆ పార్టీకి 52 సీట్లే లభించాయి. గ్రీన్ ఎన్నికల్లో సిప్రాస్ నేతృత్వంలోని అధికార సిరిజా పార్టీకి ఘోర పరాజయ మెదురైంది. గత పార్లమెంట్‌లో సిడియు / సిఎస్‌యులు 35 శాతం ఉండగా ప్రస్తుతం 28 శాతానికి పడిపోయారు. సోషల్ డెమోక్రాట్లు 27.3 శాతం నుండి 15.5 శాతం ఓట్లకు తగ్గారు. 7.4 శాతం ఓట్లు గల లెఫ్ట్ పార్టీ 5.4 శాతానికి పడిపోయింది. అనూహ్యంగా గ్రీన్‌పార్టీ 22 శాతం, ఫాసిస్టు పార్టీ జర్మనీ ప్రత్యామ్నాయ పార్టీ (ఎఎఫ్‌జి) 10.5 శాతం ఓట్లను పెంచుకుంది. మొత్తంగా చూస్తే గత శతాబ్ది చివరి దశకాలలో విప్లవ వామపక్ష భావాల వైపు ఉండిన మొగ్గుకు పూర్తి వ్యతిరేకంగా ఈ శతాబ్ది తొలి దశకాలు మితవాద, అభివృద్ధి నిరోధక పక్షాల వైపు నడుస్తున్నట్టు కనబడుతున్నది. ప్రగతిశీల శక్తుల బాధ్యత మరింత పెరుగుతున్నదని ఈ పరిణామాలు హెచ్చరిస్తున్నాయి. వీ



❖ **నిప్పుల సముద్రం ఇంద్రవెల్లి** – ఇంద్రవెల్లి నెత్తుటి గాయాల సంపుటి – నల్లెల్ల రాజయ్య – వరంగల్ రచయితల సంఘం ప్రచురణ – 70 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నల్లెల్ల సుగుణ, ఇ.నెం. 7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ – 506001, ఫోన్ : 9989415571



❖ **టూకీగా ప్రపంచ చరిత్ర** – మూడవ భాగం – ఎం.వి. రమణారెడ్డి – కవిత పబ్లికేషన్స్ ప్రచురణ – 344 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు: కవిత పబ్లికేషన్స్, ఇ.నెం. 3/75, ఖాదరబాద్ (పి.ఒ), ప్రొద్దుటూరు, కడప – 516362, ఫోన : 9063077367



❖ **వికారి** – కవిత్వం – మాడభూషి సంపత్ కుమార్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 100,



❖ **రవీంద్ర గీతాంజలి** – తెలుగు అనువాదం కమలేకర్ రామచందర్‌జీరావు – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 135 పేజీలు, 1/8 డెమీ, రు. 80,



❖ **కలల గూడు** – కవిత్వం – డా. బి. బాలకృష్ణ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 100, పై మూడు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036



❖ **కావ్య కుసుమాలు** – బొంత లచ్చారెడ్డి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 60,



❖ **బాలబోధ** – శతకము – బొంత లచ్చారెడ్డి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 30 పేజీలు, 1/8 డెమీ, రు. 50, పై రెండు ప్రతులకు: బొంత లచ్చారెడ్డి, రిటైర్డ్ ఎంఇఒ, ఇ.నెం. 1-2-400, శాంతినగర్, కాలేజ్ కాలనీ, ఆదిలాబాద్ – 504001, ఫోన్ : 9493557554



❖ **చైతన్య రథ చక్రాలు** – (66 వ్యాసాల సంకలనం) – వి. జయరాముడు – 287 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: వి. జయరాముడు, ఫ్లాట్ నె. 302, కొంగళ్ల జంగమ్మ నారాయణ ఎన్‌క్లేవ్, (జనప్రియ అపార్ట్‌మెంట్స్‌కు ఎదురుగా), హైదర్‌గూడ, అత్తాపూర్, హైదరాబాద్ – 500048, సెల్ నెం. 9848215650



❖ **కాళోజీ రామేశ్వరరావు** – తెలుగు కవితలు, ఉర్దూ కవితల అనువాదాలు – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 25



❖ **జనని** – తెలంగాణ ఉద్యమ కవితా సంకలనము – రుద్రశ్రీ, వెన్నెల – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 35



❖ **కథాకళి** – బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **ఏరికూర్చిన ఉమర్ ఖయ్యాం రుబాయీలు** – తెలుగు పద్యానువాదం కీ.శే. డా. బూర్గుల రామకృష్ణరావు, తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 25



❖ **కథానికా గుచ్ఛం** – పది ఉత్తమ పోటీ కథలు – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **అక్కమహాదేవి వచనములు** – అనువాదము: రేకళిగె మఠం వీరయ్య – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 238 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **మీరంతా నేనే** – (వచన కవితా సంపుటి) – అప్పారి సూర్యప్రకాశ్ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **శ్రీకృష్ణ సత్యభామా విజయము (నరకాసురవధ)** – యక్షగానము – సంగిశెట్టి మల్లయ్య, తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ–94 పేజీలు, 1/8 డెమీ, రు. 40

పై ఎనిమిది ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభారతి, రవీంద్రభారతి ప్రాంగణము, హైదరాబాద్ – 500004, ఫోన్ : 040-29703142

# కులవ్యవస్థలో మామిడిపండూ ప్రాణాంతకమే

***దేశంలో అడుగడుగునా కులవ్యవస్థ తన విశృంఖల ధోరణులను ప్రదర్శిస్తోందనీ, దళితులు, అట్టడుగువర్గాలపై అగ్రవర్ణాల వారు ఏ చిన్న కారణంతోనైనా దాడి చేసి, హత్యలు చేసేంత వరకూ వెళ్తున్నారని అంటున్నారు* కె. మహేష్**

దళితులపై దాడులు దినదినం అతి సామాన్య విషయంగా మారుతున్నది. దేశంలో ప్రతిరోజూ ఏదో ఓ చోట ఈ ఉన్మాద ఘటనలు జరుగుతూనే ఉన్నాయి. ఒకదానికి స్పందన వచ్చేలోపే మరోటి చోటుచేసుకుంటోంది. మీసం పెంచాడని, గుర్రం ఎక్కాడని, పెద్దకులాల వారు వేసుకునే చెప్పులు తొడిగాడని, ఫేస్‌బుక్‌లో పెద్ద కులాల పేర్లలో ఉండే తోకను తగిలించుకున్నాడని, గుడిలో అడుగుపెట్టారని నిమ్న కులాల వారిని చితకబాదిన ఘటనలు చూస్తున్నాం. అంతెందుకు ఉత్తరాఖండ్‌లో ఒక దళిత జంట పెండ్లి విందులో ఆధిపత్య కులాల ముందు కుర్చీలో కూర్చుని అన్నం తిన్న 'పాపాని'కి ఓ దళిత యువకుడు వారి ఆగ్రహానికి కారకుడయ్యాడు. వారి చేతిలో తీవ్రంగా గాయపడి.. ప్రాణాలొదిలాడు. దళితులు వండిన ఆహారం మా పిల్లలు తినాలా? అని 70 ఏండ్ల స్వాతంత్ర్య భారతంలో బహిరంగంగానే 'అంటు'ను ప్రకటిస్తున్నారంటే దళితులకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సంగతి ఇట్టే అర్థమవుతుంది.

ఒక తోటలో మామిడి పండ్లను దొంగిలించి దొరికితే ఏ శిక్ష పడుతుందని నువ్వు భావిస్తావు? గాలి దుమారానికి రాలిపడిన మామిడి పండ్లను తీసుకున్నందుకు ప్రాణాలనే తీసేస్తారని ఊహిస్తావా? సరదాకి అడిగిన ప్రశ్నలు కాదు.. నిజంగా జరిగిన ఘటన తాలూకు ప్రశ్నలే అవి. మనుస్మృతి ప్రకారం.. కులాల ఆధారంగా శిక్షలు పడతాయన్న విషయం తెలియకుంటే ఎలా? ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పు గోదావరికి చెందిన బిక్కి శ్రీనివాస్ ఈ విషయం తెలుసుకునేలోపే ప్రాణాలు కోల్పోయాడు. తూర్పుగోదావరి జిల్లా పెదపుడి మండలం, గొల్లల మామిడాడ గ్రామానికి చెందిన బిక్కి శ్రీనివాస్ వ్యవసాయ కూలీ. పిల్లలను, భార్యను వడ్లమూరులోని అత్తగారింటిలో దిగబెట్టి తిరిగి పయనమవుతుండగా.. రంగంపేట మండలం, సింగంపల్లి గ్రామంలో సేద తీరేందుకు ఓ మామిడి తోట పక్కనే ఆగాడు. తిరిగి వస్తూ.. తీసుకున్న మటన్‌ను తోటలో రాలిపడిన మామిడి పండ్లతో వండుకుందామని ఆశపడ్డాడు. కానీ, మామిడి పండ్లు ముట్టుకోగానే తోటను కౌలుకు తీసుకున్న ఇద్దరు ఉన్నత సామాజిక తరగతికి చెందిన వ్యక్తులు వచ్చి దాడి చేశారు. గ్రామ పంచాయతీ కార్యాలయానికి తీసుకొచ్చి మరీ తీవ్రంగా కొట్టారు. కర్రలతో దేహాన్నంతా కుళ్లబొడిచారు. చనిపోయాడని గుర్తించి కార్యాలయంలో శ్రీను తనకు తానే ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నట్టు చిత్రీకరించేందుకు యత్నించారు. (దళితుడై ఉండి.. ఆధిపత్య కులానికి చెందినవారి తోటలోకి వెళ్లి మామిడి పండ్లు తీసుకున్నందుకు చేయరాని నేరం చేశానని క్షోభ పడి.. మరే ఇతర దళితుడు ఇలాంటి నేరానికి ఒడిగట్టరాదని సంకేతాన్నిచ్చేందుకు కావాలనే పంచాయతీ కార్యాలయాన్నే ఎంచుకుని మరీ ఉరేసుకున్నాడని వారు చెప్పాలనుకున్నారా?) విషయం తెలుసుకున్న శ్రీను కుటుంబీకులు, దళితులు గొల్లల మామిడాడ నుంచి సింగంపల్లి గ్రామానికి చేరుకున్నారు. మృతుడి కుటుంబీకులతో రాజీ కోసం ఆ 'పెద్దలు' ఎన్నో ఎత్తులు వేశారు. ఆ ఊరి ప్రజలకు ఎలాంటి సహాయం చేయకుండా ఊరిని కట్టడి చేశారు. కానీ, దళితులు తెగువతో వర్షం పడుతున్నా.. ధర్నాకు దిగారు. దీంతో దిగొచ్చిన అధికారులు నిందితులపై ఎఫ్ఐఆర్ నమోదు చేశారు. ఇక, ఈ కేసు ఎన్ని మలుపులు తిరుగుతుందో చూడాల్సే ఉంది.

బహిరంగంగా ఒక దళితుడిని కొట్టి చంపి గ్రామ పంచాయతీ కార్యాలయంలోనే ఇంత తతంగం నడిపించారంటే కుల ఆధిపత్యాన్ని అర్థం చేసుకోవచ్చు. పోలీసులను, అధికారులను గ్రామస్తులను కిక్కురుమనకుండా చేశారంటే.. పోలీసులు, అధికారుల వద్దకూ సార్.. సార్... అంటూ బెరుకుగా వెళ్లే దళితుడిని చంపడాన్ని వారు పెద్ద విషయంగా భావించి ఉండరని తోస్తున్నది. ఇటీవలే కర్నాటకలో ఐఎఎస్‌కు ప్రిపేర్ అవుతున్న ప్రతాప్ అనే దళితుడు గుడిలో అడుగు పెట్టాడని కొబ్బరి చెట్టుకు కట్టేసి చితకబాదారు. బట్టలు చించేసి నగ్నంగా ఊరేగించారు. ఈ ఘటనపై ఎఫ్ఐఆర్ నమోదు కాలేదు. అసలు వార్తనే బయటకు రాలేదు. సోషల్ మీడియాతో విషయం బటయకు పొక్కడంతో దళిత సంఘాలు ధర్నాకు దిగడంతో ఎఫ్ఐఆర్ నమోదైంది. ఐఎఎస్‌కు ప్రిపేర్ అవుతున్న ప్రతాప్‌కు మతిస్థిమితం లేదని, తాము అతనిపై దాడికి దిగినట్టు భ్రమించి కూతలు కూస్తున్నాడని తిరిగి ప్రతాప్ పైనే కేసు పెట్టారు. అక్కడా పోలీసు అధికారులు, వార్త ప్రతినిధులను మేనేజ్ చేయడం గమనార్హం.

ఇన్ని అరాచకాలు జరుగుతున్నా.. దేశంలో ఇంకా కులం సమసి పోలేదన్న వాస్తవాన్ని చెప్పడానికే పీడితులు అష్టకష్టాలు పడుతున్నారు. ఎందుకంటే ఇందులో కులం కోణమే లేదని పీడితులపైనే ప్రత్యారోపణలు చేసే కులోన్మాదులున్నారు. కులాంతర వివాహం చేసుకున్నందుకు హత్యగావించినా.. అది వారి కుటుంబ సమస్యనో, వ్యక్తిగత గొడవలనో చెబుతూ నిజాలను కప్పిపుచ్చే కుత్సిత వాదనలు చేస్తుంటారు. అలాగే, దళితులపై జరిగిన మెజార్టీ దాడుల్లో బాధితులను ఘటనకు ముందుగా లేదా తర్వాతైనా.. ఓ దొంగ గానో, నేరస్తుడిగానో చిత్రించడం మనం గమనించవచ్చు. ఈ ఆరోపణలతో అగ్రవర్ణాలు అల్లిన ఉచ్చులో నుంచి బయటపడేందుకే బాధితవర్గాలు ప్రయాస పడుతుంటాయి. వాస్తవ పరిస్థితులు ఇలా ఉండగా, కేంద్రంలోని ప్రస్తుత సర్కారు.. దళితులకు

# ఎపి ముఖ్యమంత్రి ముందున్న సవాళ్లు

***కొత్తగా అధికారంలోకి వచ్చిన వైఎస్ఆర్‌సిపి వ్యవస్థాగతమైన అవినీతిని నిర్మూలించి, మద్య నిషేధాన్ని అమలు చేసి ప్రజలకు మౌలిక అవసరాలను అందుబాటులోకి తేవాలని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నూతన ముఖ్యమంత్రిగా 2019 మే 30న పదవీ ప్రమాణ స్వీకారం చేసిన వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి, ఆంధ్రప్రదేశ్ నూతన రాష్ట్రం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలు, తక్షణం ప్రక్షాళన కావలసిన శాఖలు, అంశాలు చాలా ఉన్నాయి.

మొట్ట మొదటగా వివిధ శాఖలలో ప్రభుత్వ పరమైన సమీక్షలు చేసి, సంస్థాగతమైన 'అవినీతి'ని నిర్మూలించాలనీ, అందుకు ఈ ప్రభుత్వం కట్టుబడి ఉందనీ బహిరంగంగానే ముఖ్యమంత్రి పత్రికా ప్రతినిధుల సమక్షంలో ప్రకటించారు. కానీ మనముందున్న కర్తవ్యం అంతా దానిని నిర్మూలించడం ఎట్లా అనేది ప్రస్తుత చర్చనీయాంశం. ఇప్పుడు ప్రతి ప్రభుత్వ శాఖలో చిన్న సమస్య పరిష్కారానికి సైతం ఎంతో కొంత ముట్టజెప్పవలసిన పరిస్థితి నెలకొన్న విషయం అందరికీ తెలిసిందే. ఆ పరిస్థితి లేకుండా చేయాలన్నది ముఖ్యమంత్రి ప్రాధాన్యతా అంశం. అయితే 9 సంవత్సరాలు అధికారానికి అన్ని విధాలుగా దూరంగా ఉండి, ఇప్పుడిప్పుడే అధికారంలోకి వచ్చిన పార్టీకి; తమ కార్యకర్తలకు ఏదో విధంగా జీవనోపాధి చూపించాలనే తపన మాత్రం పార్టీ నడుపుతున్న నాయకులకూ, అధికారంలో ఉన్న వారికీ సర్వసాధారణంగా ఉంటుంది.

ప్రజల సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వ ప్రాధాన్యతా అంశాలైన ఉచిత విద్య, వైద్యం, మంచినీరు, విద్యుత్, భూ తగాదాల పరిష్కారం గ్రామాల్లో చేపట్టడానికి తీవ్రంగా కృషి చేయవలసి ఉంది. ఇప్పుడున్న ఐఎఎస్, ఐపిఎస్ అధికారులంతా గతంలో కూడా పనిచేసినవారే కాబట్టి అన్ని విషయాలు వారికి క్షుణ్ణంగా తెలుసు. కానీ కొత్త ప్రభుత్వం ఏర్పడే సమయంలో అనగా తాను పదవీ ప్రమాణ స్వీకారంం చేసిన తర్వాత చేసిన ఉపన్యాసంలో అవన్నీ ప్రస్తావించలేదు. అనగా అవి ఎలాగూ మేం చేస్తాం, మా ప్రాధాన్యతలు ఇంకా వేరే ఉన్నాయనే సంకేతాన్ని ప్రజల్లో ఇచ్చినట్లయింది. ఇది లోపమే.

మొత్తం ప్రాధాన్యత అంతా తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వంతో సఖ్యతతో మెదులుతూ, ఉమ్మడి సమస్యలను పరిష్కరించుకోవాలనే దృష్టి కనబడింది. కొంతమంది తనకు అనుకూలమైన ఐఎఎస్, ఐపిఎస్ అధికారులను తెలంగాణ నుంచి డిప్యుటేషన్‌పై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో పనిచేయడానికి రప్పించేందుకు జగన్‌మోహన్‌రెడ్డి సానుకూలంగా ఉన్నట్లు స్పష్టమవుతున్నది.

తెలంగాణ ప్రభుత్వం కూడా ఇన్నాళ్లూ కనబరచని ప్రేమ ఇప్పుడు జగన్‌మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి అయిన వెంటనే సానుకూలత ప్రకటించింది. ఆ కొద్ది ఐఎఎస్, ఐపిఎస్ అధికారులంతా గతంలో వై.ఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ఆయనకు చాలా అనుకూలంగా పనిచేసినవారు, మరికొందరైతే ఏకంగా ప్రస్తుత ముఖ్యమంత్రితో పాటు కొన్ని కేసులలో నిందితులుగా కోర్టులకు హాజరైనవారు. ఇప్పుడు వీరికి రెక్కలొచ్చినట్లు జగన్‌మోహన్‌రెడ్డి దగ్గర వాలిపోతున్నారు. వీరి గత చరిత్రంతా అవినీతిమయమన్నది చారిత్రక సత్యం. విజ్ఞులందరికీ తెలిసిన విషయమే.

అన్నింటికన్నా ముఖ్యంగా విద్య, వైద్యం, మంచినీరు, పారిశుద్యం, విద్యుత్, గ్రామీణ ప్రాంతాలకు రోడ్లు, బస్సు సౌకర్యం, రెవెన్యూ –

---

పెద్దపీట వేస్తున్నదని, దేశ మొదటి పౌరుడు దళితుడేననే, దేశంలో దళితులు సురక్షితంగా ఉన్నారనే వాదనలు వినిపిస్తుంటాయి. కానీ, కాషాయరంగు పులుముకున్న ఆ దళితుడు ఈ ఘటనల ఊసే ఎత్తడు. బీఫ్ తినడం తమ సంస్కృతిలో భాగమని చెప్పడు. అలాగే, సఫాయి కార్మికుల కాళ్లు కడుగుతూ ఫొటో దిగిన ప్రధాని వారి జీవితాలు మెరుగుపడే కార్యాచరణను మాత్రం తీసుకోరు. ఇలా విమర్శలను ఎదుర్కొనేందుకు సింబాలిక్ విధానాలను అమలు చేయడంలో ఈ సర్కారుది అందెవేసిన చేయి.

2014 నుంచి దేశంలో 266 (జార్ఖండ్ ఘటనతో) మూకదాడులు జరిగాయి. అరకొర ఖండనలు మినహా సర్కారు కచ్చితంగా వాటిని అడ్డుకునే చర్యలు తీసుకున్నది లేదు. మూకదాడులను నేరంగా పరిగణిస్తూ ప్రత్యేక చట్టం చేయాలని సుప్రీంకోర్టు సూచనలిచ్చినా వాటిని పెడచెవిన పెట్టింది. ఇప్పుడు జార్ఖండ్ (తబ్రేజ్ అన్సారీ) మూకదాడితో ఎంతో బాధ కలిగిందని ప్రధానమంత్రి వ్యాఖ్యానించారు. అంతేకాదు, ఆ ఘటనను చూపెడుతూ రాష్ట్ర పరువు తీయొద్దనీ కోరారు. ప్రాణం కంటే పరువే ముఖ్యమేమో! కానీ, ఆప్ పాలిస్తున్న ఢిల్లీని మాత్రం అత్యాచారాల ఢిల్లీ అని ఆయన వ్యాఖ్యానించవచ్చును. కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చాక దళితులు, ముస్లింలు, మహిళలపై దాడులు విపరీతంగా పెరిగిన విషయంలో సందేహమేమీ లేదు. 'డివైడర్ ఇన్ చీఫ్' మోడీ హయాంలో ఓట్ల లెక్కన ప్రజల విభజన వేగం పుంజుకున్నది. జాతీయవాదమో, కాషాయవాదమో, పోలింగ్‌లో అవకతవకలో.. కారణం ఎదైతేనేమీ బిజెపి కేంద్రంలో మరోసారి అధికారంలోకి వచ్చింది. దీంతో మతోన్మాదాన్ని, బ్రాహ్మణీయ భావజాలాన్ని, విద్వేషాన్ని విడమర్చి వివరించి ప్రజల్లో చైతన్యం కలిగించేందుకు బుద్ధిజీవులు మరింత విస్తృతంగా పనిచేయాల్సిన అవసరముంది.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్ట్)*

వీ

పోలీస్ యంత్రాంగంలో అవినీతి రాహిత్యం చూడవలసిన బాధ్యత నూతన ముఖ్యమంత్రి మీద ఉన్న ప్రధాన బాధ్యత. గత ప్రభుత్వ పాలనలో ఇవన్నీ గాడితప్పినావనే ఉద్దేశంతోనే తనకు ప్రజలు అవకాశం కల్పించారనే మౌలిక విషయాన్ని జగన్‌మోహన్‌రెడ్డి విస్మరించరాదు.

గతంలో జరిగిన రైతుల, మహిళల ఆత్మహత్యలు ఇప్పుడు జరగకూడదనే భావనతో ఈ ప్రభుత్వం పనిచేయాలి. ప్రజలు పోలీస్ స్టేషన్‌లలో ఫిర్యాదు చేయడానికి పోయినప్పుడు కానీ, విచారణను ఎదుర్కొనే సమయంలో కానీ హింసకు గురికారాదు. డబ్బు ఇచ్చుకునే పరిస్థితి ఉండరాదు. సామాన్య ప్రజల కనీస అవసరాలైన నీరు, కూడు, గూడు, గుడ్డ అందరికీ అందే విధంగా చూడాలి. నగరాలలో నివసించే ప్రజలలో చాలా మంది పట్టాలు లేని స్థలాలలో నివసిస్తున్నారు. వీరందరికీ ఇళ్ల పట్టాలు మధ్యవర్తులు లేకుండా మంజూరు చేయాలి.

గ్రామ పంచాయితీ కార్యదర్శి మొదలు జిల్లా కలెక్టర్ కార్యాలయం వరకూ కొనసాగుతున్న, సంస్థాగతమైన అవినీతిని రూపుమాపాలి. దీనిని నిర్మూలించడానికి తీసుకోవలసిన చర్యలను వెంటనే చేపట్టాలి. ముఖ్యంగా ప్రజల నుంచి వచ్చే విజ్ఞాపనలను, అర్జీలను క్రమం తప్పకుండా స్వీకరించి, వాటికి వెంటనే సమాధానాలను రాతమూలకంగా అందజేయాలి. అది ఎప్పుడు పరిష్కారమవుతుందో, అందుకు ఎంత సమయం తీసుకుంటుందో కూడా ఫిర్యాదు దారునికి రాతమూలకంగా తెలియజేయాలి. తన పాలన పారదర్శకంగా ఉందనడానికి నిదర్శనంగా ప్రతి ఫిర్యాదుకు ఒక నంబర్‌తో పాటుగా కంప్యూటర్ రసీదును ఇచ్చే విధంగా యంత్రాంగాన్ని తయారు చేయాలి.

ప్రజల సహజ సంపదయిన ఇసుక, మట్టి, రాళ్లు, సున్నపు రాయి నిక్షేపాలు ప్రభుత్వ రాయితీలతో, సాధారణ పన్నులతో తమ అవసరాలు తీరే విధంగా వినియోగించుకోవడానికి అవసరమైతే ఇవ్వగలగాలి. లేదా నిరుద్యోగ యువకులకు ఉపాధి కింద, సహకార సంఘాల రూపంలో జీవనోపాధి కొరకు ఉపాధిగా బతుకుదెరువు చూపగలగాలి. అన్నింటికన్నా ప్రభుత్వ సంస్థలన్నీ పూర్తిగా అవినీతి మయమైన కారణంగా వీటిని 'ప్రజల భాగస్వామ్యం' లోనికి తీసుకొని రాగలగాలి. తన ఎన్నికల హామీ అయిన విడతల వారీగా మద్యపాన నిషేధాన్ని వెంటనే అమలులోనికి తీసుకొని రావాలి. పేద ప్రజల కష్టార్జితాన్నంతా దోపిడీ చేస్తూ మద్యానికి బానిసలను చేస్తున్న వైనాన్ని ఎండగట్టాలి.

గత సంవత్సరం ఎపిఎస్‌ఆర్‌టిసి బస్సుల్లో ప్రయాణిస్తున్న ప్రయాణికులకు (ఒకసారి రు. 150 చెల్లిస్తే ఇచ్చేవారు) 10 శాతం రాయితీనిస్తున్న క్యాట్ కార్డ్ (కన్సేషనల్ అన్యువల్ టికెట్ కార్డ్) సౌకర్యాన్ని నిలుపుదల చేశారు. దానిని వెంటనే పునరుద్ధరించాలి. దానివలన రోజూ ప్రయాణం చేసే ప్రయాణికులకు ఎంతో కొంత మొత్తం ధనం మిగులుతుంది. సరిగ్గా 2018 జూన్ నెల నుంచి ఈ పథకం నిలుపుదల చేశారు. దీనిని వెంటనే పునరుద్ధరించాలి. చాలా గ్రామీణ ప్రాంతాలకు నేటికీ ఎపిఎస్ ఆర్‌టిసి బస్సు సౌకర్యం లేదు. కనీసం గ్రామీణ ప్రాంతాలకు రోజుకు 4 ట్రిప్పుల వారీగా బస్సు సౌకర్యం కల్పించాలి. ఎపిఎస్ ఆర్‌టిసి సంస్థ నష్టాలలో నడుస్తున్నదంటూ గత ప్రభుత్వాలు చెప్పినప్పటికీ దానిని ప్రభుత్వమే ఎందుకు తన ఆధీనంలోనికి తీసుకోలేదో అర్థం కాదు. వెంటనే ప్రభుత్వం ఆ సంస్థను స్వాధీనం చేసుకొని గ్రామీణ ప్రాంతాలకు బస్సు సౌకర్యం కల్పించాలి. కేవలం 'విద్యార్థి బస్సు' పేరు మీద ఉదయం – సాయంత్రం మాత్రమే బస్సులు నడుపుతున్నారు. దీనిని తొలగించాలి. ఎందుకనగా ఎక్కువ లగేజీ ఉన్న ప్రయాణికులు ఆ బస్సులను ఎక్కే అవకాశం లేదు కాబట్టి అధిక మొత్తం చెల్లించి ఆటోలలోనే ప్రయాణం చేస్తున్నారు. ప్రజలకు సౌకర్యవంతమైన ప్రయాణం చేసే సౌలభ్యం, సౌఖ్యం కొత్త ప్రభుత్వం కల్పించాలి.

పేద ప్రజలకు విద్యను ఉచితంగా అందించే విధంగా విద్యా పథకాన్ని రూపకల్పన చేయాలి. మొదటి తరగతి నుండి డిగ్రీ వరకు మాతృ భాషలోనే విద్యనభ్యసించే విధంగా అవకాశం కల్పించాలి. ఇంగ్లీష్, హిందీ ఐచ్ఛికంగానే చదువుకునే విధంగా ఉండాలి. తెలుగు భాషను పరిపాలనా భాషగా ప్రకటించాలి. అన్ని అధికారిక కార్యకలాపాలన్నీ తెలుగులోనే జరిగే విధంగా చూడాలి. తెలుగు సాహిత్య, కళా రంగాలు అభివృద్ధి పథంలో నడిచే విధంగా ప్రత్యేక శాఖను కేటాయించి ప్రత్యేక నిధులను సమకూర్చాలి.

తెలుగు భాషా సాహిత్యాలను ప్రాచుర్యంలోకి తెచ్చే విధంగా విద్యార్థినీ విద్యార్థులను పాఠశాల స్థాయి విద్య నుండే వారిని ప్రోత్సహించాలి. గ్రామీణ ప్రాంతాలలో గ్రంథాలయాలను అభివృద్ధి పరచాలి. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి పథంలోనికి వచ్చిన తర్వాత 'చదవడం – రాయడం' బాగా తగ్గిపోయింది. కావున విద్యార్థినీ విద్యార్థులకు పాఠశాల స్థాయిలోనే రచనా వ్యాసాంగాన్ని పెంచే ప్రక్రియలను రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సహించాలి. ఇది ప్రజలలో ఎంతో మేధో సాధనకు కృషి జరిగినట్లవుతుంది.

ప్రభుత్వ ఆసుపత్రులలో అన్ని సౌకర్యాలు మెరుగుపరచాలి. నియోజవర్గ స్థాయి ఆసుపత్రులలో కూడా సిబ్బందిని నియమించాలి. డాక్టర్లు సమయ పాలన పాటించే విధంగా చూడాలి. మందులు, ఇతర ఆసుపత్రి పరికరాలన్నీ కూడా అందుబాటులోనికి తేవాలి. అంతే కాకుండా ప్రభుత్వ ఆసుపత్రులలో కిందిస్థాయి సిబ్బంది సామాన్య ప్రజలను వేధించడం మానివేయాలి. ఆసుపత్రులకు వచ్చే రోగుల వద్ద, వారి బంధువుల దగ్గర బెదిరింపులతో డబ్బులు వసూలు చేస్తున్న ఆసుపత్రి సిబ్బందిపై చర్యలు తీసుకొనే విధంగా పాలన ఉండాలి. జిల్లా మెడికల్ అండ్ హెల్త్ అధికారి (డిఎంఎచ్ఒ) ఆసుపత్రులను ఎప్పటికప్పుడు పర్యవేక్షిస్తూ ఉండాలి. అన్నింటికీ సంకల్పం బలంగా ఉండాలి. ప్రభుత్వ అధికార వ్యవస్థ అంతా అవినీతిలో మునిగిపోయి ఉంది కాబట్టి వారిని సంస్కరించే పనంతా పై నుంచే మొదలవ్వాలి. ఛీఫ్ సెక్రటరీ స్థాయి నుంచి శాఖల ప్రిన్సిపల్ సెక్రటరీల వరకూ, జిల్లా స్థాయి అధికారులను గంట గంటకూ పర్యవేక్షిస్తూ ఉండాలి. అందరికీ విద్య–వైద్యం ఉచితంగా అందించడం ప్రభుత్వ లక్ష్యంగా మారాలి. అంతే కాకుండా ప్రజలను కూడా చైతన్యవంతం చేసే విధంగా పాలన ఉండాలి.

చివరగా గ్రామీణ ప్రాంతాలలో దళిత ప్రజలపై దాడులు చేస్తున్న అగ్రకుల దురహంకారులపై వెంటనే చర్యలు తీసుకునే విధంగా పోలీసు వ్యవస్థను పటిష్ట పరచాలి. మహిళలపై అత్యాచారాలు, మహిళల ఆత్మహత్యలు, విద్యార్థినీ విద్యార్థుల ఆత్మహత్యలు నివారించబడాలి. ప్రభుత్వ యంత్రాంగం బాధ్యతగా వీటినన్నింటినీ క్రమంగా నివారించగలగాలి. ప్రజలకు బాధ్యతాయుతంగా ఉండే ప్రభుత్వ వ్యవస్థను పాలనా పరంగా అందించాలి. అప్పుడే కొత్త ప్రభుత్వం ప్రాధాన్యత బయటపడుతుంది.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)*

వీ

# నూతన ప్రభుత్వం - రాయలసీమ

***చంద్రబాబు పాలనతో విసిగిపోయిన ఆంధ్రప్రదేశ్ ప్రజలు జగన్‌కు పూర్తి మెజారిటీతో అధికారం ఇచ్చారనీ, ముఖ్యమంత్రిగా జగన్ రాయలసీమ ప్రజల సమస్యలను పరిష్కరిస్తాడా అనేది ప్రశ్నార్థకమేననీ అంటున్నారు*** **అరుణ్**

ఈసారి అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ బిజెపి, వైఎస్ఆర్‌సిపిలు అనూహ్యామైన మెజారిటీతో విజయం సాధించి అందరినీ విస్మయ పరిచాయని చెప్పవచ్చు. రాష్ట్రంలో చంద్రబాబు, జగన్ పార్టీల మధ్య తీవ్రమైన పోటీ ఉంటుందని అనుకున్నారు. చివరిలో ఎన్నికల నిర్వహణ తీరుపై చంద్రబాబు పదే పదే అనుమానాలు వ్యక్తం చేయడం, ఏనాడు ధైర్యంగా మంత్రుల ముందు ప్రజలకు సంబంధించిన న్యాయమైన విషయాలలో కూడా నోరు విప్పని ప్రభుత్వ ఉన్నతాధికారుల ధిక్కార చర్యలు చంద్రబాబుకు ఓటమి తప్పదని విశ్లేషకులకు స్పష్టమయ్యింది.

అయితే ఈ ఎన్నికలు జరిగిన తీరు, నాయకుల ప్రచారశైలి, ఫలితాలు మాత్రం ఇప్పటికే మూగవోయిన ప్రజాస్వామ్యానికి మరింత చేటు అని చెప్పవచ్చు. ఏకపక్ష తీర్పు, అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ నియంతృత్వ పోకడలను బలోపేతం చేశాయి కూడా. వ్యక్తి కేంద్రంగా జరిగిన ఎన్నికలు పార్లమెంటరీ తరహా ఎన్నికలుగా కాక, అధ్యక్ష తరహా ఎన్నికల లాగా నిర్వహించబడ్డాయి. ఇది భూస్వామ్య భావజాలం మన సమాజంలో ఎంతగా వేల్లూనుకుని ఉందో స్పష్టం చేస్తున్నది. ఇప్పటికే రాజ్యాంగ విలువలు, సెక్యూలరిజం, భావప్రకటనా స్వేచ్ఛను ఇస్తున్న తరుణంలో భవిష్యత్తు ఎలా ఉంటుందో అని ప్రజాస్వామ్య వాదులు ఆందోళన చెందాల్సిన పరిస్థితి.

రాష్ట్రంలో జగన్ అత్యంత మెజారిటీతో గెలవడం, చంద్రబాబు ప్రభుత్వం అన్నివర్గాలలో ఎంత ఆదరణ కోల్పోయిందో విధితం చేస్తుంది. మరీ ముఖ్యంగా రాయలసీమలో వైఎస్ఆర్‌సిపి తెలుగుదేశం పార్టీని పూర్తిగా తుడిచి పెట్టింది. దీనికి చంద్రబాబు రాయలసీమ ప్రాంతం పట్ల వహించిన నిర్లక్ష్య వైఖరి కూడా కారణంగా చెప్పవచ్చు. దానికి తగిన బుద్ధే చెప్పారు సీమ ప్రాంతం వాళ్లు. దానికి తోడు రాయలసీమలో జగన్ సామాజికవర్గం బలంగా ఉంది. వారు 9 సంవత్సరాలుగా అధికార దాహంతో, అసంతృప్తితో ఆగ్రహంగా ఉన్నారు. రాష్ట్రాన్ని ఏలడానికి ఇది వారికి చివరి అవకాశం అని తెలుసు. అందుకే, వారు చావో-రేవో తెల్చుకునేలా పనిచేయడం కూడా జగన్ విజయానికి దోహద పడిందని చెప్పవచ్చు.

ప్రభుత్వ యంత్రాంగం మొత్తం కోస్తా, మరీ ముఖ్యంగా కృష్ణా, గుంటూరు జిల్లాల సేవకై వినియోగిస్తూ, తన రెండుకళ్లు అమరావతి, పోలవరం అంటూ వెనుకబడిన ప్రాంతాలయిన శ్రీకాకుళాంధ్ర, రాయలసీమ కనీస నీటి అవసరాలను పట్టించుకోక పోవడంతో, ఆ రెండు ప్రాంతాలలో తెలుగుదేశం పార్టీపై వ్యతిరేకత ఏర్పడింది. కాపుల వ్యతిరేకత, దళితుల ఆగ్రహం, తెలుగుదేశం నాయకుల అవినీతి అరాచక చర్యలు-ఇవన్నీ ఇతర ప్రాంతాలలో తెలుగుదేశం పార్టీ ఓటమికి దోహదం చేశాయని చెప్పవచ్చు.

జగన్ ఎన్నికతో సీమవాసుల చిరకాల ఆకాంక్షలు తీరుతాయా? అంటే ఇక్కడి జగన్ అభిమానులు తప్పక అంటున్నారు. కాని ప్రతిపక్ష నాయకునిగా అతని గత చరిత్ర చూస్తే ఆ ఆశలు అడియాసలవుతాయని ఉద్యమకారుల అనుమానం. గత ఐదు సంవత్సరాలలో ఏనాడు సీమ న్యాయమైన డిమాండ్ల గురించి మాట్లాడని జగన్ ఇప్పుడు కోస్తా ప్రాంత అంగ, అర్థబలాన్ని విస్మరించి, ధిక్కరించి సీమకు న్యాయం చేస్తాడా అనేది అనుమానంగా ఉంది. గతంలో కృష్ణా నదిపై తెలంగాణ రాష్ట్రం కొత్త ప్రాజెక్టులు కట్టుకుంటున్నదనీ, అందువల్ల, (రాయలసీమ రైతాంగం కాదు) సాగర్, కృష్ణా ఆయకట్టుదారులు నష్టపోతారంటూ కర్నూల్‌లో రెండు రోజుల నిరసన దీక్షకు పూనినప్పుడే జగన్ ఏవైపు ఉన్నాడు అనేది అర్థమయ్యింది. కోస్తా ప్రాంత రైతులు నష్టపోతారని నిరసన తెలపడానికి సీమవాసులకే అభ్యంతరం లేదు, కాని ఆ దీక్షను ఏ ప్రకాశం బ్యారేజ్‌పైన జరపకుండా, సీమ సాగు, తాగునీటి ఊసు ఏనాడు ఎత్తని నాయకుడు, సాగర్, కృష్ణా ఆయకట్టుదారుల కోసం కర్నూల్‌లో నిరసన జరపడంలో ఔచిత్యం ఏమిటని మేం కరపత్రం వేసి నాడే ప్రశ్నించాం. ఆయన నిరసనను నిరసిస్తూ ఇక్కడి సీమ సంఘాలు ఒకరోజు నిరాహార దీక్ష జరిపాయి కూడా.

జగన్ పట్ల సీమ ఉద్యమకారులకు ఉన్న మరో అసంతృప్తి, అమరావతిని రాజధానిగా ప్రకటించినపుడు నోటిమాటకైనా రాజధానిని సీమలో ఏర్పాటు చేయాలని అనకపోవడం, శ్రీబాగ్ ఒడంబడిక ప్రకారం కనీసం హైకోర్టునైనా సీమలో ఏర్పాటు చేయాలని సీమ నాలుగు జిల్లాల్లో ఉవ్వెత్తున నెలల తరబడి ఉద్యమాలు కొనసాగినా జగన్ మౌనవ్రతం పాటించడం. సరే ఇవన్నీ తన కోస్తా అధినేతలకు ఆగ్రహం తెప్పిస్తాయని మౌనంగా ఉన్నాడనుకుందాం. విభజన చట్టంలో స్పష్టంగా హామీ ఇవ్వబడ్డ బుందేల్‌ఖండ్ ప్యాకేజీని గాని, కడపలో ఉక్కు కర్మాగారం విషయం లో గాని, హంద్రీ-నీవ, గాలేరు నగరి లాంటి నీటి ప్రాజెక్టుల పూర్తి విషయం గాని ఆయన నోరు విప్పలేదు. చివరకు తన జిల్లాలో ఏర్పాటు కావాల్సిన ఉక్కు కర్మాగారం గురించి కొన్ని నెలల పాటు ఉద్యమాలు జరిగినా ఆయన పట్టించుకోకపోవడం ఏం సూచిస్తుంది. ఇక విభజన చట్టంలో ఎక్కడా విశాఖలో రైల్వే జోన్ అని పేర్కొనలేదు కదా. అయినా అందరిలాగే తానూ విశాఖలో రైల్వే జోన్ ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. అక్కడ అవకాశం లేదని కేంద్రం స్పష్టంగా తెల్పినా, ఆ రైల్వే జోన్‌ను వెనుకబడిన ప్రాంతమైన గుంతకల్‌లో ఏర్పాటు చేయమని ఎందుకు మాట్లాడ లేదు అనే భాద సీమవాసులకుంది.

ఇవన్నీ వదిలేసినా కేసి ఆయకట్టుదారులకు కేటాయించిన సాగు నీరందేల గుండ్రేవుల రిజర్వాయర్ నిర్మాణానికి 2014 లోనే వివరమైన ప్రాజెక్టు నివేదిక ప్రభుత్వానికి సమర్పించబడ్డది కదా. ఆ విషయం ఆయన నంద్యాల ఉప ఎన్నికల వరకు మాట్లాడలేదు. అప్పుడు ఓట్ల కోసం మాట్లాడినా, ఆయన దాని నిర్మాణానికి చేసిన కృషి శూన్యం.

ఎన్నికలలో ఓట్ల కోసం చంద్రబాబు సీమవాసుల కన్నీటి తుడుపుగా గుండ్రేవుల రిజర్వాయర్, వేదవతి ఎత్తిపోతల పథక నిర్మాణానికి ఉత్తర్వులిచ్చినా, ఇప్పుడు వస్తున్న సమాచారం బట్టి నిధుల కొరత పేరుతో వాటిని రద్దుచేసే ఆలోచనలో ఉన్నట్టు తెలుస్తోంది. అదే నిజమైతే జగన్‌కు సీమ రైతాంగం నుండి తీవ్ర వ్యతిరేకత ఎదుర్కొనక తప్పదు.

అంతకన్నా దుర్మార్గం రాజధాని ప్రాంతాన్ని ఫ్రీజోన్ చేయకపోవడంతో సీమ యువతకు ఉద్యోగావకాశాలు లేవు. రాజధాని ప్రాంతాన్ని ఫ్రీ జోన్ చేయాలని ఇక్కడి నిరుద్యోగ యువత ఘోషిస్తున్నా జగనే కాదు, ఏ రాజకీయ పార్టీ ఈ న్యాయమైన డిమాండ్‌ను పట్టించుకోలేదు.

అంటే రాయలసీమ వాళ్లు వారికేమీ చేయకపోయినా వ్యక్తి ఆరాధనతో ఓట్లు వేస్తారనే నమ్మకం ఆయనకుంది. అలాగే జరిగింది.

సరే గతం గతహః అనుకుందాం ఇప్పుడు కూడా జగన్ ప్రమాణ స్వీకారం తిరుపతిలోనని ప్రకటించిన గంటలోనే కాదు ప్రమాణ స్వీకారం అమరావతిలోనని చెప్పడం వెనుక ఎవరి హస్తం ఉంది. గతంలో కూడా చంద్రబాబు ఇలానే మార్చాడు. ప్రమాణస్వీకారం తిరుపతిలో జరిగినంత మాత్రాన రాయలసీమకు ఏదో ఒరుగుతుందని కాదు. అదొక అస్తిత్వ సమస్య. క్షణాలలో జరిగిన స్థల మార్పు నిజమైన అధికారం ఎవరి చేతిలో ఉంది అనేదానికి సూచనేమోనని సీమవాసులకు ఆందోళనగా ఉండడం సహజమే.

మరొక కారణం, ప్రభుత్వాలపై గుంటూరు, కృష్ణ జిల్లాల ధనిక రైతాంగపు భల్లూకపు పట్టు. తిరుగులేని నేతగా చెప్పబడే రాజశేఖరరెడ్డే తొలుత శ్రీశైలం రిజర్వాయర్ కనీస నీటి మట్టాన్ని 834 అడుగుల నుంచి 854 అడుగులకు పునరుద్ధరించి గుంటూరు, కృష్ణ జిల్లాల ధనిక రైతాంగపు ఒత్తిడికి లొంగి, రెండు నెలలలోపే రిజర్వాయర్ కనీస నీటిమట్టాన్ని తిరిగి 834 అడుగులకు కుదించాడు. ఈ నేపథ్యంలో జగన్ గుంటూరు, కృష్ణ జిల్లాల ధనిక రైతాంగపు కనుసన్నలలో మెలగకుండా ఉండగలడా?

ఏది ఏమైనా ఈ యువనాయకునిపై రాయలసీమ ప్రజలు చాలా ఆశలు పెట్టుకున్నారు. జగన్ ప్రమాణస్వీకారం నాడే అవినీతిరహిత ప్రభుత్వం అందిస్తానని హామీ ఇచ్చాడు. అది ఈ వ్యవస్థలో సాధ్యం కాదనీ తెలుసు. జగన్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేపట్టగానే, గతంలో ఆయన తండ్రి రాజశేఖర రెడ్డికి విధేయులైన ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు అయన సేవకై క్యూ కట్టారు. నేడు ఏ అధికారైనా ప్రజల సేవకు కాకుండా పార్టీ అధినేతల సేవకే జీవితాలను అంకురార్పణ చేయడం చూస్తూనే ఉన్నాం. వారిలో 'నాకింత ఇచ్చుకో - నీవింత పుచ్చుకో' ఆరోపణలున్న అధికారులుండడం కాకతాలీయమని అనుకోలేం. ఈ నేపథ్యంలో అవినీతిరహిత పాలన ఊహించడమూ కష్టమే.

ఏమైనా, ఇప్పుడు జగన్‌కు రాయలసీమకు జరిగిన అన్యాయాలను సరిదిద్దే అవకాశం వచ్చింది.

అందులో ముఖ్యంగా చేయవలసింది- రాజధాని ప్రాంతాన్ని ఫ్రీజోన్ చేయాలి. అన్ని ప్రాంతాల వాళ్లకూ రాజధాని ప్రాంతంలో ఉద్యోగావకాశాలు ఉండాలి. జిఒ 69ను రద్దు చేయాలి. ఇది రాయలసీమకు మరణశాసనం. శ్రీశైలం రిజర్వాయర్‌లో కనీస నీటిమట్టం 854కు పునరుద్ధరించాలి. కృష్ణా డెల్టాకు పట్టిసీమ నుండి 80-120 టిఎంసిల నీరందుతున్నది కాబట్టే, ఇక శ్రీశైలం రిజర్వాయర్ నుండి కృష్ణా డెల్టాకు కేటాయించిన నీటిని విడుదల చేయాల్సిన అవసరం లేదు. అందువల్ల శ్రీశైలం రిజర్వాయర్ నుండి కృష్ణా డెల్టాకు నీరు ఆపివేయాలి.

పోతిరెడ్డిపాడు నుండి సీమ సాగునీటి పథకాలకు సరైన సమయంలో నీరందాలంటే సిద్ధేశ్వరం అలుగు నిర్మాణం తప్పని సరి. దీనిని ముగ్గురు ఇంజనీర్స్-ఇన్-చీఫ్స్ సిఫారసు చేశారు కూడా. రాయలసీమ యువతకు ఉపాధి కల్పించేలా గుంతకల్‌లో రైల్వే జోన్ ఏర్పాటు. హంద్రీ-నీవా, గాలేరు-నగరి పథకాలకు నికర జలాలు అందించేలా చర్యలు చేపట్టాలి. చింతలపూడి, వైకుంటపురం, పులిచింతల లాంటి స్కీంల వల్ల ఆదా అయ్యే నీటిని కృష్ణా డెల్టాకు వినియోగిస్తూ, కృష్ణా జలాల పునః పంపిణీ చేసి రాయలసీమలో కనీసం ప్రతి ఎకరాకు ఒక పంటకైనా నీరందివ్వాలి. వేదవతిపై ఎత్తిపోతల పథకం నిర్మించాలి. ఆర్‌డిఎస్ కుడి వరద కాలువ నిర్మాణంతో వృథా అవుతున్నా తుంగభద్రా వరద జలాలను కరువుసీమకు అందజేయాలి. కర్నాటక రాష్ట్రంతో చర్చలు జరిపి తుంగభద్ర ఎగువ సమాంతర కాలువ నిర్మాణం చేపట్టి అనంతపురం జిల్లా ను సస్యశ్యామలం చేయాలి. రాయలసీమకు ప్రత్యేక హోదా వల్ల ఒరిగేదేమీ ఉండదు. రాయలసీమకు, దక్షిణ తెలంగాణకు శ్రీశైలం రిజర్వాయర్ నీటిని పూర్తిగా కేటాయించాలంటే ఏ రాజశేఖరరెడ్డి పేరు చెప్పుకొని ప్రజల ఓట్లు పొందారో, ఆ నేత ప్రారంభించిన, దాదాపు రు. 500 కోట్లకు పైగా ఖర్చుపెట్టిన దుమ్ముగూడెం-నాగార్జున సాగర్ టైల్ పాండ్ ప్రాజెక్టును సాధించాలి.

అంతేకాదు ప్రభుత్వ కార్యాలయాలు, విద్యా, వైద్య సంస్థలూ ఒకే ప్రాంతంలో ఉండకుండా వికేంద్రీకరణ జరగాలి. అందులో భాగంగా కేంద్ర లేక రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లో ఒక దానిని నంద్యాలలో ఏర్పాటు చేయాలి. నంద్యాల వ్యవసాయ పరిశోధన సంస్థకు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సోనా మసూరి, నరసింహ పత్తి వంగడం కనిపెట్టిన ఘనత ఉంది.

ఇవన్నీ గొంతెమ్మ కోర్కెలు కాదు. ఇతర ప్రాంతాల రైతాంగపు హక్కుల దోపిడీ కాదు. ప్రభుత్వాలకు చిత్తశుద్ధి ఉంటే చేపట్టవలసిన ప్రజాహిత కార్యక్రమాలు. ఇలాంటి పథకాల పూర్తితో నవరత్నాలతో పని ఉండదు. ప్రజలు తమ కాళ్లపై తాము నిలబడి స్వతంత్రంగా బతికే అవకాశాలు కల్పించే పథకాలివి.

ఇంతవరకు ఎవ్వరికీ రాని అవకాశం జగన్‌కు వచ్చింది. అందులోనూ తెలంగాణ ముఖ్యమంత్రితో జగన్‌కు సత్సంబంధాలున్నాయి. కేంద్ర ప్రభుత్వంతో కూడా విరోధం లేదు. ఆ విషయమై ఆయన తొలి నుండి స్పష్టంగా ఉన్నాడు. రాష్ట్రానికి ప్రత్యేక హోదా అంటూ గొంతు చించుకొని అరుస్తూ పార్లమెంట్ సభ్యత్వానికి రాజీనామలిచ్చారు సభ్యులు. అది తమ చిత్తశుద్ధికి సంకేతం అని డప్పాలు కొట్టుకున్నారు కూడా. ఇప్పుడు జగన్ ప్లేటు ఫిరాయించాడు. మోడీకి స్పష్టమైన మెజారిటీ ఉందని, అందువల్ల ప్రత్యేక హోదా సాధ్యం కాదని చెప్పాడు. మొన్నటివరకు విభజన చట్టంలోని 'ప్రత్యేక ప్యాకేజీ' డిమాండ్ చేయక చట్టంలో లేని 'ప్రత్యేక హోదా' ఎండమావుల వెంట జగన్‌తో సహా అన్ని పార్టీలు ప్రజల్ని పరిగెత్తించాయి. గెలిచాక ఇప్పుడు 'ప్రత్యేక హోదా' సాధ్యం కాదని తోకముడుచడం ఎంత సబబు? జగన్, తన నిజాయితీని నిరూపించుకునే అవసరం ఇంత త్వరలో వస్తుందనుకొని ఉండడు.

చంద్రబాబుకు లేని అనుకూల వాతావరణం ఈయనకుంది. ఈ పథకాలు చేపట్టి పుట్టినగడ్డ రుణం తీర్చుకుంటారో? లేక గత ముఖ్యమంత్రులలాగే ద్రోహిగా మిగులుతారో జగనే నిర్ణయించుకోవాలి. జగన్‌ను గుడ్డిగా ఆరాధించే ఆయన సీమ అభిమానులకూ ఆయనపై తగినంత ఒత్తిడి తేవడమనే ప్రత్యేక బాధ్యత ఉంది. లేకపోతే చరిత్రహీనులుగా నిలిచిపోతారు.

*(రచయిత రాయలసీమ విద్యావంతుల వేదిక)* వీ

# సిద్ధేశ్వరం ప్రజా పాదయాత్ర

***రాయలసీమకు పాలకులు చేసిన అన్యాయం గురించి, సాధించాల్సిన లక్ష్యాల గురించి పాదయాత్ర ద్వారా ప్రజలకు అవగాహన కల్పించే కార్యక్రమాలను చేపడుతున్నామని అంటున్నారు బొజ్జా దశరథరామి రెడ్డి***

సాగునీటికి సంబంధించి జరిగిన అనేక చర్చలు, వచ్చిన అనేక వ్యాసాలు, పుస్తకాలు అన్నీ కృష్ణా డెల్టాలోని అభివృద్ధి చెందిన సామాజిక ప్రాధాన్యత దృష్టితోనే వచ్చాయి. రాయలసీమకున్న సాగు నీటి హక్కులు, వనరులు, అవకాశాలను వివరించడానికి చర్చలు, వార్తలు, వ్యాసాలు, పుస్తకాల ద్వారా రావలసినంత సమాచారం సమాజానికి అందడంలో కొంత ఖాళీ ప్రస్ఫుటంగా ఉన్నది. రాయలసీమ కోణంలో సాగునీటి అంశాలపై రావల్సినంత సమాచారం అందుబాటులోకి రాలేదు. దీంతో రాయలసీమలో వర్షపాతం తక్కువ, నీళ్లు లేవు, కరువు కాటకాలు, వలసలు. ఎవరు ఏమి చేస్తారు అనే నిర్లిప్తత సామాన్య రాయలసీమ ప్రజానీకంలో ఏర్పడింది. ప్రకృతే చిన్నచూపు చూడడంతో వర్షమే లేనప్పుడు ఏ ముఖ్యమంత్రి అయినా ఏమి చేస్తాడనే నైరాశ్యం సీమ ప్రజానీకంలో బలంగా ఆవహించింది. ఈ నిర్లిప్తత, నైరాశ్యం కేవలం రాయలసీమ సామాన్య ప్రజానీకంలోనే కాదు, బాగా చదువుకొని పెద్ద పెద్ద ఉద్యోగాలు, వ్యాపారాలు చేస్తున్న వారిలో కూడా ఉంది.

రాయలసీమకు చట్టబద్ధంగా రావలసిన నీటి కంటే అదనంగానే తుంగభద్ర నదిలో నీరు ప్రవహిస్తున్నా, రాయలసీమ ప్రాజెక్టులకు 40 శాతం కూడా నీరు లభించడం లేదు. రాయలసీమ గుండా కృష్ణ, తుంగభద్ర, పెన్నా నదుల ద్వారా వెయ్యి టిఎంసిల పైగానే నీరు ప్రవహిస్తున్నది. ఈ నీటిని రాయలసీమ జిల్లాలు ఐక్యంగా పోరాడి సాధించుకోవల్సినది పోయి, సమాచార లోపంతో రాయలసీమ జిల్లాల మధ్య వైషమ్యాలు సృష్టించబడ్డాయి. సామాజికంగా అభివృద్ధి చెందిన కృష్ణాడెల్టా ఆధిపత్య వర్గాలు సమాచార రంగాన్ని తమకు సానుకూలంగా వినియోగించుకొని, రాయలసీమకు సాగునీటి అంశాలలో తీవ్రమైన అన్యాయాలు జరుగుతున్న రాయలసీమ ప్రజానీకాన్ని అచేతనం చేయడంతో పాటు వారి మధ్యనే వైషమ్యాలు సృష్టించాయేమో అన్న భావన బలంగా కలుగుతుంది.

**రాయలసీమ సాగునీటి సాధన సమితి ఏర్పాటు – లక్ష్యం**

రాయలసీమ ప్రాంత మౌలిక వసతుల కల్పన కుంటుబడడంతో రాయలసీమ సమాజం ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడింది. ఆర్థిక, సామాజిక ఇబ్బందులు ప్రజలను పరాధీనతకు గురిచేసాయి. నిర్లిప్తతకు, నైరాశ్యానికి, పరాధీనత కూడ తోడవడంతో, ఈ ప్రాంతం అభివృద్ధికి పోరాటం చేస్తున్న ప్రజా సంఘాల మద్దతుగా నిలబడడానికి రాయలసీమ సమాజంలోని ఏ వర్గం అడుగు ముందుకు వెయ్యని పరిస్థితి నెలకొని ఉంది. ఇది రాయలసీమకు శాపంగా మారింది. రాయలసీమ దోపిడీ విముక్తి వారి ప్రజల చైతన్యంతోనే వస్తుందన్న భావనతో ఆ దిశగా అడుగులు వెయ్యడానికి కార్యాచరణ చేపట్టాం. ఆ దిశగా అనేక రాయలసీమ సంస్థలతో కలిసి పనిచేస్తూనే రాయలసీమ సాగునీటి సాధన సమితిని 2011లో ఏర్పాటు చేశాం. రాయలసీమకున్న సాగునీటి వనరులు, హక్కులపై ప్రజలకు అవగాహన కలుగచేయడం ద్వారా రాయలసీమ ప్రజలలో చైతన్యం నింపే లక్ష్యంతో ఈ సంస్థ ఏర్పడింది.

**అవగాహనతో పాటు– ప్రజల భాగస్వామ్యం కోసం కీలక కార్యక్రమం**

రాయలసీమ వ్యాప్తంగా అవగాహన కార్యక్రమాలు చేపట్టడంలో రాయలసీమ సాగునీటి సాధన సమితితో పాటు అనేక రాయలసీమ ప్రజా సంఘాలు కూడా చురుకైన పాత్ర వహించాయి. ఈ క్రమంలో రాయలసీమ ప్రజలకు అవగాహన కలగచేయడంతో పాటు, రాయలసీమ జిల్లాల మధ్య ఉన్న వైషమ్యాలను తొలగించుకోవడానికి కూడా కొద్ది సమయం పట్టింది. అవగాహన కార్యక్రమాలతో పాటు రాయలసీమ ప్రజలను చైతన్యవంతం చెయ్యడానికి ఒక కీలకమైన కార్యక్రమం చేపట్టాలన్న ఆలోచన సాగునీటి సాధన సమితి కార్యవర్గానికి కలిగింది. నాలుగు జిల్లాల ప్రజలను కదిలించడానికి అన్ని ప్రాంతాలకు అవసరమైన ప్రాజెక్టు సిద్ధేశ్వరం అలుగు నిర్మాణంపై కార్యక్రమం చేపట్టాలని నిర్ణయించాం. రాయలసీమ ప్రజా సంఘాలతో ఈ కార్యక్రమంపై సమావేశం ఏర్పాటు చేసి కార్యక్రమ నిర్వహణ చేపట్టాలని తీర్మానం చేశాం. ఈ నేపథ్యంలో రాయలసీమ ప్రజలు తమపై తమకు నమ్మకం పెంపొందించుకోవడానికి అనేక వినూత్నమైన పద్ధతులను అవలంభించే లాగ సిద్ధేశ్వరం ఉద్యమం చేపట్టడం జరిగింది.

ఏ ప్రభుత్వ పథకాల శంకుస్థాపన అయిన ప్రభుత్వ అధికారులో, ప్రజా ప్రతినిధులో చేస్తారు. కాని రాయలసీమ ప్రజలచేత సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన చేపట్టేలాగ కార్యాచరణ చేపట్టడం జరిగింది. 'రాయలసీమ పట్ల పాలకుల నిర్లక్ష్యాన్ని సభ్య సమాజం ముందుంచే లక్ష్యం'తో ఈ కార్యక్రమం చేపట్టడం జరిగింది.

నీటి వనరులపై, నీటి లెక్కలపై, రాయలసీమకు పాలకులు చేసిన నీటి మోసాలపై వివరించడానికి కరపత్రాలతో పాటుగ ప్రజలతో ప్రత్యక్ష సమావేశాలు నిర్వహించడం జరిగింది. సుమారు డెబ్బై రోజులు నిర్వహించిన ఈ కార్యక్రమాలకు ఒకరిద్దరు హాజరైనా, వందలాది మంది వచ్చినా సమావేశాలను నిర్వహించడం జరిగింది. ప్రజలకు అవగాహన కలగజేయడంలో, చైతన్య పరచడంలో ఈ సమావేశాలు తమ లక్ష్యాన్ని వందశాతం సాధించాయి. ఈ లక్ష్యాన్ని ఛేధించడంలో ప్రజా సంఘాల కార్యకర్తల నిబద్ధతే ప్రధాన కారణం.

రాయలసీమ లోని అనేక చిన్న చిన్న రైతు సంఘాలు, విద్యార్థి, ప్రజా సంఘాలు తమ సంస్థల ప్రాధాన్యతలను పక్కనపెట్టి రాయలసీమ సాగునీటి సమస్యలపై ప్రాధాన్యతతో పనిచేసాయి. ఎక్కడికక్కడ రైతులలో,

ప్రజలలో క్షేత్రస్థాయి సంఘాల ఏర్పాటును ప్రోత్సహించాయి. అనేక గ్రామస్థాయి సంఘాల ఏర్పాటు చేయడం అంటే గ్రామ స్థాయిలో నాయకత్వం రూపుదిద్దుకోవడమే. అధికార కేంద్రీకృతమైన రాష్ట్రస్థాయి నాయకత్వాలతో మోసపోయిన ప్రజలకు క్షేత్రస్థాయి సంఘాల ఏర్పాటు తమ సమస్యలను తామే సాధించుకోగలమన్న నమ్మకాన్ని కలుగచేశాయి.

సమావేశాలను గ్రామ రచ్చబండ, గుడి లేదా బడి దగ్గర గ్రామ రైతు సంఘాల ద్వారా నిర్వహించడం జరిగింది. కుర్చీలు, షామియానా, టీ ఖర్చులు లేకుండ కేవలం మంచినీటిని ఏర్పాటు చేసేలాగ సమావేశాలు నిర్వహించడం జరిగింది. ఆర్థికంగా వెనుకబడిన రాయలసీమ ప్రాంతంలో గ్రామ రైతు సంఘాలకు కనీస ఖర్చుతో గ్రామ సమావేశాలు నిర్వహించడానికి ఎన్నుకున్న పద్ధతుల వల్ల అనేక సమావేశాలు నిర్వహించడానికి వీలైంది.

ప్రజల జెండా – ప్రజల అజెండాగా కార్యక్రమాలు కారణాలు ఏవైనా ప్రజల కోసం, ప్రజల చేత, ప్రజల కొరకు ప్రభుత్వ ఏర్పాటు అన్నది కల లాగానే మిగిలిపోయింది. నాయకుల జెండా మోయడానికి, నాయకుడి అజెండాను అమలు చేయడానికి ప్రజలకు వాహనాలను, భోజనాలను, తదితర వసతులు ఏర్పాటు చేయడం ఆనవాయితీగా మారింది. ఈ సాంప్రదాయాన్ని బద్దలుకొడుతూ తమ తమ సమస్యలపై తామే పోరడడానికి స్వచ్ఛందంగా రావాల్సిన అవసరాన్ని ప్రజలకు చేరవేయడం జరిగింది. తమ పొలం పనులకు, వసతులను ఏ విధంగా ఏర్పాటు చేసుకుంటారో అదే విధంగా సాగు నీటికై, రాయలసీమ ప్రాంత అభివృద్ధికి తమ నీళ్లు, ఆహారం, వాహనాలతో కార్యక్రమాలను చేపట్టే సాంప్రదాయానికి అంకురార్పణ జరిగింది.

సిద్ధేశ్వర అలుగు శంకుస్థాపన సందర్భంగా పాలకులు ప్రజలను అనేక ఒత్తిడులకు లోను చేసినా మొక్కవోని దీక్షతో ముందుకు కదిలారు. నిండు వేసవిలో మండుటెండలో పాలకులు రహదారులు దిగ్బంధం చేసినా, రహదారులను అడ్డంగా తొవ్వినా, తాగడానికి తెచ్చుకున్న నీటిని పారబోసినా ఎలాంటి ఆవేశాలకు లోనుకాలేదు. తమ నాయకత్వ లక్షణాలను ప్రదర్శించి అత్యంత శాంతియుతంగా తమ లక్ష్యమైన సిద్ధేశ్వరం ప్రజా శంకుస్థాపన విజయవంతంగా పూర్తి చేసారు.

రాయలసీమ ప్రజలు అవగాహన, ఆలోచన, చైతన్యంలో సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన పెనుమార్పులను తీసుకొని వచ్చింది. నిస్తేజంగా ఉన్న రాయలసీమ ప్రజానీకానికి సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన స్పూర్తినిచ్చింది. రాజకీయ పార్టీలకు ఒక హెచ్చరికను జారీచేసింది.

సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన స్పూర్తితో విస్తృతమౌతున్న కార్యక్రమాలు–

- సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన స్పూర్తితో రాయలసీమలోని నాలుగు జిల్లాలలో తమ చట్టబద్ధమైన నీటిహక్కుల కొరకు అనేక కార్యక్రమాలను ప్రజా సంఘాలు చేపట్టాయి.
- డిసెంబర్ 2016లో కర్నూల్ పశ్చిమ ప్రాంతంలో పులికనుమ ప్రాజెక్టు పూర్తి చేయాలని పెద్దఎత్తున 20 కి.మీ. పాదయాత్ర చేపట్టడం జరిగింది.
- 2017 ఏప్రిల్ 3న రాయలసీమ నాలుగు జిల్లాల్లో వందకుపైగా కేంద్రాలలో చట్టబద్ధ నీటి హక్కులకై సత్యాగ్రహ కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది.
- 2017 మే 21న నంద్యాల చరిత్రలో కనీవినీ ఎరగని రీతిలో రాయలసీమ ప్రజాసంఘాల నాయకులతో జలచైతన్య సభ ఏర్పాటు చెయ్యడం జరిగింది.
- శ్రీశైలం గేట్లు బార్లా తెరిచి కృష్ణా జలాలను కిందకు తరలిస్తూ రాయలసీమను ఎండగట్టడానికి వ్యతిరేకంగా కర్నూలు కలెక్టరేట్ ముట్టడి కార్యక్రమం పెద్దఎత్తున చేపట్టడం జరిగింది.
- 2018 జనవరి 28 – 29 తేదీలలో గుండ్రేవుల రిజర్వాయర్ నిర్మాణానికై 43 కి.మీ. రెండు రోజుల పాదయాత్ర విజయవంతంగా నిర్వహించడమైనది.
- అనంతపురం జిల్లాలో మా చెరువులకు నీళ్లు ఇవ్వాలని, హంద్రీనీవా ప్రధాన కాల్వ వెడెల్పు చెయ్యాలని అనేక ధర్నా కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.
- నంద్యాల ఉప ఎన్నికల నేపథ్యంలో 2017 జూలై, ఆగస్ట్ నెలలలో నంద్యాల పట్టణంలో బ్రహ్మాండమైన ర్యాలీ, రాయలసీమ సాగునీటి అంశాలపై రాజకీయ పార్టీలపై ఒత్తిడి పెంచడానికి పది రోజులపాటు వీధి మూల ప్రదర్శనలు, రాయలసీమ అంశాలపై రాజకీయ పార్టీలతో చర్చా వేదికను చేపట్టడం జరిగింది.
- రాయలసీమ ప్రాంతంలో హైకోర్టు, కడప ఉక్కు కర్మాగారం నిర్మాణం, గుంతకల్లు రైల్వేజోన్, చట్టబద్ధ నీటి హక్కులు, అభివృద్ధి వికేంద్రీకరణ తదితర అంశాల పట్ల పాలకుల నిర్లక్ష్యాన్ని ఎండగడుతూ నాలుగు జిల్లా కేంద్రాలలో 2018 ఏప్రిల్ నెలలో పెద్దఎత్తున నిరసన కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.
- రాయలసీమ పట్ల ప్రభుత్వం, రాజకీయ పార్టీల నిర్లక్ష్యాన్ని ప్రశ్నించడానికి, సీమ నీటి హక్కులు సాధించుకోడానికి, ఇందులో నిర్మాణాత్మక పాత్ర పోషించేలా ఈ ప్రాంత నాయకులపై ఒత్తిడి తేవడానికి సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన ద్వితీయ వార్షికోత్సవం 2018 మే 31న చేపట్టడం జరిగింది. ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా మండల సంఘాల నాయకుల ఆధ్వర్యంలో గ్రామ చైతన్య సభలు, గ్రామ సంఘాల నాయకుల ఆధ్వర్యంలో మోటార్ సైకిల్ ర్యాలీ, గ్రామ, మండల సంఘాల ఆధ్వర్యంలో ఆయా మండలాల తహసిల్దార్లకు వినతిపత్రాలు అందజేసే కార్యక్రమం, గ్రామ, మండల, జిల్లా సంఘాల ఆధ్వర్యంలో ఆయా జిల్లా కేంద్రాలలో కలెక్టర్లకు వినతిపత్రాలు అందచేసే కార్యక్రమం, గ్రామ, మండల, జిల్లా, రాయలసీమ సంఘాల ఆధ్వర్యంలో సిద్ధేశ్వరంకు వాహనర్యాలీ, సిద్ధేశ్వరం సంకల్ప దీక్ష చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమాలన్ని విస్తృతంగా క్షేత్రస్థాయి భాగస్వామ్యంతో, నాయకత్వంతో జరగడం రాయలసీమ ఉద్యమంలో గుర్తించవలసిన అత్యంత కీలక అంశం.

**రాయలసీమ ప్రజా సంఘాల సమన్వయ వేదిక ఏర్పాటు**

రాయలసీమ సాగునీటి సమస్యలే కాకుండా, రాయలసీమ ఆర్థికాభివృద్ధికి కీలకమైన కడప ఉక్కు కర్మాగారం, గుంతకల్లు రైల్వేజోన్, రాయలసీమలో హైకోర్టు, కర్నూలులో వ్యవసాయ విశ్వవిద్యాలయం, చిత్తూరు జిల్లాలో కాన్సర్ ఇన్‌స్టిట్యూట్, అనంతపురంలో ఎయిమ్స్, రాయలసీమ ప్రత్యేక ప్యాకేజీ ద్వార చెరువుల, కుంటలు అభివృద్ధితో పాటు సామాజిక అడవుల అభివృద్ధికి ప్రత్యేక సాగునీటి కమిషన్ ఏర్పాటు, రాజదానిలో రాయలసీమ యువతకు ఉద్యోగాలు, అధికార, అభివృద్ధి

వికేంద్రీకరణకు అనేక రాష్ట్రస్థాయి సంస్థలు రాయలసీమలో ఏర్పాటు, రాయలసీమలో వివిద జాతీయ, రాష్ట్రస్థాయి విద్యా సంస్థల ఏర్పాటు, రాయలసీమలో నూతన జిల్లాల ఏర్పాటు, ఇండస్ట్రియల్ కారిడార్ల ఏర్పాటు తదితర అంశాల సాధన అత్యంత కీలకం. ఈ అంశాల సాధనకు పాలకుల మీద ఒత్తిడిని మరింత పెంచేదిశగా కలిసివచ్చే రాయలసీమలోని ప్రజాసంఘాలతో రాయలసీమ ప్రజాసంఘాల సమన్వయ వేదికను ఈ సంవత్సరం ఏప్రిల్ నెలలో ఏర్పాటు చెయ్యడం రాయలసీమ ఉద్యమంలో మరొక ముందడుగు. ఈ సందర్భంగా కడపలో ఏప్రిల్ 15న జరిగిన సమావేశంలో రాయలసీమ అభివృద్ధికి సంబంధించిన అంశాలతో కూడిన రాయలసీమ డిక్లరేషన్ విడుదల చేయడం జరిగింది.

**రాయలసీమ ప్రజా చైతన్య కార్యక్రమంలో మలి దశ రాయలసీమ ప్రజా పాదయాత్ర –** సిద్దేశ్వరం అలుగు తృతీయ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 2019 సార్వత్రిక ఎన్నికలలో రాజకీయ పార్టీలు రాయలసీమకు చేసిన ఎన్నికల వాగ్దానాలను నిలబెట్టుకోవాలని గుర్తు చేస్తూ సిద్దేశ్వరం ప్రజా పాదయాత్ర చేపట్టాలని నిర్ణయించాం. రాయలసీమ ప్రజా పాదయాత్ర మే 28 నుండి మే 31 వరకు చేపట్టాలని 2019 ఏప్రిల్ నెలలో నిర్ణయించాం. ప్రజా పాదయాత్ర చేపట్టాలని నిర్ణయించే సమయానికి ఏ రాజకీయ పార్టీ అధికారంలోకి వస్తుందో తెలియదు. రాజకీయ పార్టీలకు అతీతంగా పని చేస్తున్న సాగునీటి సాధన సమితి, రాయలసీమ ప్రజా సంఘాలు, అధికారంలో ఏ పార్టీ ఉన్నా రాయలసీమ న్యాయమైన కోరికల సాధన కోసం ప్రజా పాదయాత్ర చేయాలన్న దృఢసంకల్పంతో ముందుకు సాగడం, అన్ని వర్గాలు స్వచ్ఛందంగా పాల్గొనడమే కాకుండా అన్ని రకాల సహాయ సహకారాలు అందించడంతో విజయవంతమైన ప్రజాపాదయాత్ర ప్రజాచైతన్య కార్యక్రమంలో మలిదశనే.

నంద్యాల నుండి సంగమేశ్వరం వరుకు నాలుగు రోజులు 100 కిలోమీటర్ల పాదయాత్ర కొనసాగింది. ప్రజా పాదయాత్రను ఆంధ్రప్రదేశ్ రైతు సంఘాల సమాఖ్య కృష్ణా జిల్లా నాయకులు వేణుగోపాల రావు, తెలంగాణ రైతు సంఘం నాయకులు సీతరామిరెడ్డి మే 28, 2019 నంద్యాలలో ప్రారంభించారు. రైతులు, వ్యాపారస్తులు, టీచర్లు, ఉద్యోగ సంఘాల నాయకులు, విద్యార్థి సంఘాల నాయకులు, న్యాయవాదులు, డాక్టర్లు, మేధావులు, కార్మికులు రాయలసీమ నాలుగు జిల్లాల నుండి వేలాదిగా పాదయాత్ర ప్రారంభ కార్యక్రమంలో పాల్గొన్నారు.

పాదయాత్ర కొనసాగిన మార్గంలోని, ఆ చుట్టుపక్కల గ్రామాలలో అంత పాదయాత్ర సంబరమే. గ్రామ పొలిమేర నుండి పాదయాత్రకు ఘనస్వాగతం పలికిన గ్రామ రైతులు, రైతు కూలీలు ఒక వైపు, గ్రామాలలో మంగళ హారతులతో స్వాగతం పలికిన రాయలసీమ మహిళా తోబుట్టువులు ఒక వైపు, మజ్జిగ, నీరు అందించిన ప్రేమమూర్తులు ఒక వైపు, పక్క గ్రామం దాక సాగనంపుతూ పాదయాత్రలో అడుగులు వేసిన ఆత్మీయులతో ఊరూరా పాదయాత్ర సంబరంగా జరిగింది.

పాదయాత్ర జరిగిన నాలుగు రోజులు అన్నం, పప్పు చారు, మజ్జిగతో లేదా పులగం చెట్నీ, మజ్జిగతో ఆప్యాయతతో భోజన వసతి, గుడి లోనో లేదా బడిలోనో బసవసతులతో పాదయాత్ర సజావుగా జరిగేలాగా రాయలసీమ సోదరులు, అక్క చెల్లెళ్లు స్వచ్ఛందంగా ఏర్పాట్లు చేసారు.

పాము – నిచ్చన ఆటలో (వైకుంటపాలి) రాయలసీమ అభివృద్ధికి అనేక సానుకూల అంశాలను నిచ్చెనల రూపంలో పొందుపర్చడం జరిగింది. పాలకుల విధానపరమైన, నిర్లక్ష్య ధోరణితో రాయలసీమకు జరుగుతున్న అన్యాయాలను పాముల రూపంలో పొందుపర్చడం జరిగింది. ఈ ఆట ఆడడం ద్వార మహిళలు, విద్యార్థులు, ఉద్యోగస్తులు, రైతులు రాయలసీమకు జరుగుతున్న అన్యాయాలపై అవగాహన పెంచు కుంటున్నారు. రాయలసీమ ప్రజలు చైతన్యవంతమై తమ న్యాయమైన కోర్కెల సాధన కోసం అడుగులు వెయ్యడానికి సిద్ధమౌతున్నారు.

పాదయాత్ర జరిగిన ప్రతి గ్రామంలో రాయలసీమ సమస్యలపై అవగాహన పెంపొందించుకొన్న ప్రజలు చైతన్య వంతమై ఊరూరా ఉద్యమ ఆకుపచ్చ జండాను స్వీకరించారు. చైతన్య కార్యక్రమాలు విస్తృతం చేయడానికి ఉద్యమ జెండా చేపట్టి సంకల్పం చేపట్టారు.

మండు వేసవిలో 46 డిగ్రీల సెంటిగ్రేడ్‌ల ఉష్ణోగ్రతను కూడా లెక్క చేయకుండా వందలాది మంది నాలుగు రోజుల 100 కి.మీ. పాదయాత్రను దిగ్విజయంగా పూర్తిచేశారు. నాలుగు రోజులు విపరీతమైన ఎండతోపాటు ఏ మాత్రం గాలి కూడా లేని ప్రతికూల పరిస్థితులను కూడా లెక్క చెయ్యకుండా మొక్కవోని దీక్షతో పాదయాత్ర పూర్తి చేశారు. ఈ కార్యక్రమంలో అన్ని వయసుల వారు పాల్గొన్నారు. ప్రతికూల పరిస్థితులలో కూడా పాదయాత్ర ను విజయవంతంగా పూర్తిచేసి రాయలసీమ ప్రజల ఆశలను ఆకాంక్షలను పాలకులకు బలంగా వినిపించడంలో విజయం సాధించారు. రాయలసీమ ప్రజా పాదయాత్ర పూర్తయిన సందర్భంగా జరిగిన బహిరంగ సభలో మహారాష్ట్ర రైతు సంఘం నాయకులు అనిల్ పాటిల్ ముఖ్య అతిథిగా పాల్గొని రాయలసీమ న్యాయమైన కోర్కెలకు సంఘీభావం తెలిపారు. రాయలసీమ నాలుగు జిల్లాల నుండి వేలాదిగా తరలివచ్చిన ప్రజలు ఈ బహిరంగ సభలో పాల్గొన్నారు.

సిద్దేశ్వరం అలుగు శంకుస్థాపన స్ఫూర్తితో జరిగిన అనేక కార్యక్రమాల పరంపరలో సమాజంలోని విద్యార్థి, యువత, ఉద్యోగ, వ్యాపార, కార్మిక, కర్షక, వివిద వృత్తుల ప్రజలకు అవగాహన కార్యక్రమాలను ప్రజా సంఘాలు విస్తృతంగా చేపట్టాయి. దీనికై రాయలసీమ అభివృద్ధికై కృషిచేస్తున్న ప్రజా సంఘాలు తమ సంఘాలను విస్తృతపరుచుకుంటూనే, రాయలసీమ అభివృద్ధికి అనేక నూతన సంఘాల, సాంస్కృతిక వేదిక ఏర్పాటును ప్రోత్సాహించడానికి కార్యాచరణ చేపట్టాయి. ఈవిధంగా విస్తృతంగా ఏర్పాటైన సంఘాల భాగస్వామ్యంతో రాయలసీమ ప్రజలకు అవగాహన, చైతన్యం కల్గించి రాజకీయ పార్టీలపై ఒత్తిడిపెంచి రాయలసీమ అభివృద్ధికి కావలసిన మౌలిక అంశాలను సాధించే దిశగా కార్యక్రమాల నిర్మాణానికి మరొక ముందడుగు వేయడానికి సిద్ధం అవుతున్నాయి.

రాయలసీమ అభివృద్ధి పట్ల నిర్లక్ష్యంగా ఉన్న రాజకీయ పార్టీలు రాయలసీమలో క్షేత్ర స్థాయిలో జరుగుతున్న ఉద్యమాలను గుర్తించాల్సిన అవసరముంది. నైరాశ్యం వీడి, నాయకులుగా ఎదుగుతూ తమ ప్రాంత భవిష్యత్తుకు బంగారు బాటలు వేసుకుంటున్న ప్రజలు ఈ ఉద్యమాల ద్వారా రాయలసీమ పట్ల నిర్లక్ష్యాన్ని, వివక్షతను పాలకులు వీడాలని,. మార్పును గ్రహంచి రాయలసీమ అభివృద్ధికి చిత్తశుద్ధితో రాజకీయ పార్టీలు కార్యక్రమాలు చేపట్టకపోతే ఆయా పార్టీల అస్తిత్వానికే ప్రమాదం అని రాజకీయ పార్టీలకు హెచ్చరిస్తున్నారు.

*(రచయిత అధ్యక్షులు, రాయలసీమ సాగునీటి సాధన సమితి)* వీ

# ప్రభుత్వ వైఫల్యంతోనే విద్యార్థుల ఆత్మహత్యలు

***కార్పొరేట్ విద్యను ప్రోత్సహిస్తూ, చదువులంటే కేవలం ర్యాంకులు, మార్కులు అనే ధోరణితో విద్యార్థులను తీవ్ర మానసిక ఒత్తిడికి గురిచేసే ప్రభుత్వ విధానాల వల్ల వారు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని అంటున్నారు డా. సిలువేరు హరినాథ్***

దేశ అభివృద్ధిలో భాగస్వాములు కావాల్సిన భావిభారత పౌరులు అర్థాంతరంగా తనువులు చాలిస్తున్న తీరు తీవ్ర ఆందోళన కల్గిస్తుంది. తాము చదివిన చదువులు సార్థకత కావడం లేదనే భావనలో ఉంటున్నారు. నిజమే మరి! విద్యార్థులు ఎంతో శ్రమకోడ్చి రేయింబవళ్లు చదివినా ఆశించిన స్థాయిలో ఫలితాలు రాకపోవడం ద్వారా నిరాశ నిస్పృహలో ఉంటున్నారు. ప్రవేశ పరీక్షల నుండి మొదలుకొంటే పరీక్ష ఫలితాలు విడుదల అయ్యే వరకు అన్నింటా అవకతవకలే! ఫలితంగా అవినీతికి అలవాటుపడిన రాజకీయ నాయకులతో పాటు ఉన్నతాధికారులు భాగస్వామ్యంతో విద్యావ్యవస్థ భ్రష్టుపట్టి పోతోంది. దేశ నలుమూలల ఎక్కడ చూసినా ఇదే తంతూ కనబడుతుంది.

2012లో మధ్యప్రదేశ్‌లో జరిగిన వ్యాపమ్ స్కామ్ విద్యారంగంలో అతిపెద్ద కుంభకోణంగా చరిత్రలో నిల్చిపోయింది. ఆ రాష్ట్రంలో జరిగిన మెడికల్ ప్రవేశ పరీక్ష పేపర్ లీకేజ్ వ్యవహారంలో సుమారు 2 వేల మందిని విచారణ చేపట్టగా 15 వందల మంది నిందితులుగా తేలారు. అందులో ప్రధానంగా నాటి రాష్ట్ర క్యాబినేట్ మంత్రితో పాటు ఒక ప్రజాప్రతినిధి, ఉన్నతాధికారులు అరెస్టు అయిన వారిలో ఉన్నారు. అంటే విద్యావ్యవస్థను రాజకీయాలు ఏవిధంగా శాసిస్తున్నాయో అర్థం చేసుకోవచ్చు. ఆ కుంభకోణంలో వేల కోట్ల రూపాయలు చేతులు మారాయనే అభియోగం తెరమీదకు వచ్చింది. అంటే కార్పొరేట్ కళాశాలలు ర్యాంకుల కోసం కరాళనృత్యం చేస్తుంటే ప్రభుత్వాలు నిమ్మకు నీరెత్తినట్టుగా వ్యవహరిస్తున్నాయి. ఇలాంటి పరిణామాల వల్ల ప్రతిభావంతులైన విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు. చివరికి చేసేదేమి లేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

ప్రపంచ ఆరోగ్య సంస్థ నివేదిక ప్రకారం ప్రతి ఏటా సుమారు ఎనిమిది లక్షల మంది విద్యార్థులు ఆత్మహత్య చేసుకుంటున్నారు. లాన్‌సెట్ సంస్థ నివేదిక ప్రకారం భారతదేశంలోనే అత్యధికంగా 15-29 సంవత్సరాల మధ్య ఉన్న యువత ఆత్మహత్య చేసుకుంటున్నారని తెలిసింది. జాతీయ నేర విభాగం గణాంకాల ప్రకారం 2007-16 మధ్య కాలంలో 75,697 మంది విద్యార్థులు రకరకాల కారణాల వల్ల ఆత్మహత్యలు చేసుకోగా వారిలో అత్యధికంగా 30.46 శాతం మంది విద్యార్థులు కేవలం పరీక్షల్లో ఫెయిల్ అయ్యామనే కారణంతోనే మరణించడం జరిగింది. అంటే విద్యార్థులు ఎంతో నమ్మకంతో విద్యారంగంలో రాణించాలనే తపనతో కష్టపడి చదివినా ఫలితాలు మాత్రం ఆశించిన స్థాయిలో రాకపోవడం వల్ల విద్యార్థులకు చావే దిక్కు అవుతుంది.

గతంలో 2017లో తెలంగాణలో చదువు ఒత్తిడిని తట్టుకోలేక కేవలం పది నెలల వ్యవధిలోనే 30 మంది కార్పొరేట్ కళాశాలల్లో చదువుతున్న విద్యార్థులు బలవన్మరణాలకు పాల్పడ్డారు. అదే విధంగా 2017లో మధ్యప్రదేశ్‌లో సుమారు 12 మంది కార్పొరేట్ కళాశాలలకు చెందిన విద్యార్థులు ఒకే ఒక నెలలో మరణించారు. ఈ ఆత్మహత్యల సంఘటన తీరు చూసినప్పుడు వారు ఎంతటి ఒత్తిడికి లోనై వాటిని భరించలేక ఆత్మహత్యలు చేసుకున్నారో అర్థం చేసుకోవచ్చు.

అయితే ప్రభుత్వాలు విద్యార్థి వ్యతిరేక విధానాలు అమలు చేస్తూ, కార్పొరేట్ విద్యాసంస్థలకు వంత పాడుతున్నాయి అనడంలో సందేహం లేదు. దాని కారణంగానే అనేక అవినీతి అక్రమాలు తెరమీదకు వస్తున్నాయి. అవి విద్యార్థుల భవిష్యత్తుకు ఆటంకాలుగా నిలుస్తున్నాయి. విద్యావ్యవస్థలో ఎన్నో అవినీతి అక్రమాలు జరుగుతున్నప్పటికీ వాటిపై నియంత్రణ కానీ, చర్యలు తీసుకోకపోవడం వల్ల కొత్తవి తెరమీదకు వస్తున్నాయి.

ప్రజలకు మంచి పరిపాలన అందించాల్సిన పాలకులే అక్రమాల్లో రాటుదేలుతున్నారు. అధికారాన్ని అడ్డుపెట్టుకొని కోట్లాది రూపాయలు సొమ్ము చేసుకుంటూ విద్యార్థుల జీవితాలతో చెలగాటాలు ఆడుతున్నారు.

గతంలో హర్యానాలో జరిగిన టీచర్ రిక్రూట్‌మెంట్‌లో ప్రతిభావంతులైన విద్యార్థులకు అన్యాయం చేసి అక్రమార్కులను అందలం ఎక్కించారు. అందులో నాటి ముఖ్యమంత్రి ఓంప్రకాశ్ చౌతాలా, అతని తనయుడికి పది సంవత్సరాల జైలుశిక్ష పడింది. అలాగే గతంలో కాంగ్రెస్ పార్టీ నుండి రాజ్యసభ సభ్యులుగా ఉన్న రషీద్ మసూద్ త్రిపురలో జరిగిన మెడికల్ సీట్ల వ్యవహారంలో కోట్లాది రూపాయలు దండుకున్నారనే విషయంలో నాలుగు సంవత్సరాల జైలు జీవితం గడిపారు. అదేవిధంగా బీహార్‌లో ఇంటర్‌బోర్డు చైర్మన్‌గా ఉన్న లంకేశ్వర్ సింగ్‌తో పాటు అతని భార్య ఉశాసింగ్ కార్పొరేట్ విద్యాసంస్థలల్లో చదివే విద్యార్థులకు మేటి ర్యాంకులు ఇప్పించిన వ్యవహారంలో కోట్లాది రూపాయలు లంచం తీసుకున్న వ్యవహారంలో అరెస్టు అయ్యి జైలు జీవితం గడిపారు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో పిజి మెడికల్ ప్రవేశ పరీక్ష పేపర్ లీకేజీ వ్యవహారం పెద్ద దూమారమే రేగింది. ఆ విషయంలో సుమారు రెండు వందల మంది విద్యార్థులకు అధికారులు ఎరవేసి కోట్లాది రూపాయలు వసూలు చేశారు. ఆ వ్యవహారం మసకబారక ముందే 2016లో తెలంగాణలో ఎంసెట్ పేపర్ లీక్ అయి ప్రవేశ పరీక్ష రద్దు చేసిన సందర్భాలు ఉన్నాయి. అంతెందుకు విద్యార్థులకు మంచి విద్యా బుద్దులు నేర్పాల్సిన వారే అవినీతికి పాల్పడుతున్నారు. ఇటీవల ఉస్మానియా మెడికల్ కళాశాలలో ఓ విభాగ అధిపతి తన విద్యార్థులను పరీక్షలో పాస్ చేస్తానంట9గా లంచం తీసుకుంటూ అవినీతి నిరోధక శాఖ అధికారులకు చిక్కి కటకటాలు లెక్కిస్తున్నారు.

ఈ సంఘటనలు ఒకెత్తు అయితే తెలంగాణలో ఇంటర్ ఫలితాలల్లో అతిపెద్ద గందరగోళం తెరమీదకు వచ్చింది. ఫలితాలల్లో అనేక తప్పిదాలు

చోటు చేసుకున్నాయి. అవి మానవ తప్పిదమా! లేదా సాంకేతిక లోపమో అనేది పక్కనపెడితే తీవ్రంగా నష్టపోయింది, బలైంది మాత్రం విద్యార్థులే!

తెలంగాణలో ఇంటర్‌బోర్డుకు 50 సంవత్సరాల చరిత్ర కలిగి ఉంది. దాని పరిధిలో ప్రస్తుతం 2537 జూనియర్ కళాశాలలు పనిచేస్తున్నాయి. వార్షిక పరీక్షల్లో సుమారు 9.74 లక్షల మంది విద్యార్థులు పరీక్షకు హజరుకాగా అందులో 34.04 శాతం మంది విద్యార్థులు ఫెయిల్ అయ్యారు. ఇది సహజమే! కానీ ఫెయిల్ అయిన విద్యార్థులల్లో సుమారు 21 వేల మంది ఫలితాలు అంతుచిక్కడం లేదు. అనేకమంది ప్రతిభావంతులైన విద్యార్థులు ఫెయిల్ అయ్యామనే చేదు నిజాన్ని తట్టుకోలేక పోయారు. 15 రోజుల కాలవ్యవధిలోనే సుమారు 23 మంది విద్యార్థులు ఆత్మహత్య చేసుకున్నారు. వారి తల్లిదండ్రులకు కడుపుకోత మిగిల్చారు.

అయితే ఇంటర్‌బోర్డు అధికారుల తీరు గమనించినప్పుడు పేపర్ మూల్యాంకనంతో పాటు పరీక్ష ఫలితాల విషయంలో చాలా తేలిగ్గా వ్యవహరించారనే విషయం స్పష్టం అవుతుంది. ఎందుకంటే పేపర్ మూల్యాంకనంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. బోధన వృత్తిలో కనీసం 5 సంవత్సరాల అనుభవం ఉంటే తప్ప మూల్యాంకనం చేసేందుకు అనుమతివ్వరు. కానీ నిబంధనలు తుంగలో తొక్కి కొత్తవారికి మూల్యాంకనం చేయించారనే విమర్శలు ఉన్నాయి. దాని వెనుక అనేక అనుమానాలు దాగున్నాయి.

మూల్యాంకనం చేసిన వారిలో అధికశాతం సిబ్బంది ప్రైవేట్ కళాశాలలకు చెందిన వారే కావడం వల్ల తప్పిదాలు జరిగే అవకాశాలు మెండుగా ఉన్నాయి. దానికి తోడు ఒక్కో అధ్యాపకుడు రోజు 30 పేపర్లు మాత్రమే మూల్యాంకనం చేయాలి. కానీ నిబంధనలు గాలికొదిలి రోజు 60-70 పేపర్లు మూల్యంకనం చేయించారు. మూల్యంకనం సరిగ్గా చేశారా లేదా అనేది పైఅధికారులు చూసుకోవాల్సి ఉంటుంది. కానీ జరిగిన తప్పిదాలను చూసినప్పుడు బాధ్యత గల అధికారులు నిమ్మకు నీరెత్తినట్లుగానే వ్యవహరించారనే విషయం తేటతెల్లం అవుతుంది.

సాంకేతికపరంగా ఎంతో అభివృద్ధి చెందుతున్న ఈ నేపథ్యంలో గ్లోబరీన సంస్థ సైతం ఫలితాల వెల్లడిలో విఫలం వెనక ఎన్నో అనుమానాలు తెరమీదకు వస్తున్నాయి. ఫలితాలు వెల్లడించే ముందు తప్పిదాలు ఉన్నాయా లేదా అనే విషయాన్ని అధికారులు పసికట్టలేక పోవడం విస్మయం కల్గిస్తుంది. కొన్ని సబ్జెక్టులల్లో మంచి మార్కులు వచ్చినా ఇతర సబ్జెక్టుల్లో సున్న మార్కులు ఎందుకు వచ్చాయనే కోణంలో ఎందుకు ఆలోచన చేయలేకపోయారనేది అంతుచిక్కని అంశం.

గ్లోబరీన సంస్థ చేసిన తప్పిదానికి ప్రభుత్వానికి మాయని మచ్చ తెచ్చిపెట్టింది. అంతేకాదు విద్యార్థుల బలిదానాలకు కారణం అయిందని చెప్పాలి. ఏది ఏమైనా కార్పొరేట్ సంస్థలకు తలొగ్గి పనిచేశారనే విమర్శలకు అధికారుల నుండి ప్రతిస్పందన లేకపోవడం తప్పిదాలు తెలిసే జరిగాయని భావించాల్సి ఉంటుంది.

మరో విషయానికి వచ్చినప్పుడు కార్పొరేటు కళాశాలల్లో తీవ్ర ఒత్తిడిని తట్టుకోలేక చిత్తవుతున్న విద్యార్థుల బతుకులు ఎన్నో ఉన్నాయి. తమ పిల్లలు కార్పొరేట్ కళాశాలల్లో చదివితేనే మంచి ఫలితాలు వస్తాయనే తల్లిదండ్రుల ధోరణి ఒకవైపు మరో కోణంలో విద్యార్థులను రేయింబవళ్లు చదివిస్తేనే మంచి ర్యాంకులు వస్తాయనే సిబ్బంది మొండి వైఖరి. ఈ రెండింటి మధ్య నలుగుతూ బలి అవుతుంది మాత్రం విద్యార్థులే! ఇప్పుడు పదోతరగతి పరీక్షలు అయిపోయి ఫలితాల కోసం ఎదురుచూపులు. కానీ అంతకుముందే కార్పొరేట్ కళాశాలల్లో సీట్ల భర్తీకోసం అన్ని సిద్ధం చేసుకున్నారు.

అయితే సహజంగా కళాశాలల్లో చేరిన విద్యార్థుల ప్రతిభను మెరుగుపెట్టడం అనే మూల సూత్రానికి కార్పొరేట్ కళాశాలల్లో విలువ ఉండటం లేదు. ఇరుకైన గదులల్లో విద్యార్థులను పడేసి క్లాసులు, స్టడీ అవర్స్ పేరిట గంటల తరబడి ఊపిరాడకుండా చేస్తున్నారు. కార్పొరేట్ హాస్టల్స్‌లో విద్యార్థులు సుమారు 14-16 గంటలు కేవలం చదువుతోనే కుస్తీ పడుతున్న సందర్భాలు ఉన్నాయి. ఇలా చదువుల ఒత్తిడితోనే విద్యార్థుల జీవితాలు తెల్లవారుతున్నాయి. రోజు వారీ పరీక్షలతో పాటు వారానికోకసారి నిర్వహించే పరీక్షల పేరుతో విద్యార్థులను మానసికంగా కుంగిపోయేలా చేస్తున్నారు. తక్కువ మార్కులు వస్తే సూటిపోటి మాటలతో ఆత్మహత్యలు చేసుకునేలా విద్యార్థులను ప్రేరేపిస్తున్నారు. ఫలితంగా కార్పొరేట్ కళాశాలల్లో యేటా పదుల సంఖ్యలో ఇం టర్ విద్యార్థులు బలన్మరణాలకు పాల్పడుతున్నారు.

ఇలాంటి సందర్భాలలో విద్యాసంస్థలు కానీ, అధికారులు కానీ విద్యార్థుల ఆత్మహత్యల నిరోధానికి తగు చర్యలు తీసుకోవడంలో విఫలం అవుతున్నారు. అలాంటి వారిపై ప్రభుత్వాలు కనీసం చర్యలు కూడా తీసుకోవడం లేదు. ఎందుకంటే కార్పొరేట్ విద్యాసంస్థలకు, రాజకీయ పార్టీ నేతలకు మధ్య ఉండే పలుకుబడితో పాటు వారికి మాముళ్లు ముట్టచెప్పుంటారు. అందుకని ప్రభుత్వాలు నోరుమెదపడం లేదనే విమర్శలు ఉండనే ఉన్నాయి.

కార్పొరేట్ విద్యాసంస్థలల్లో చదువుతున్న విద్యార్థులు అర్ధాంతరంగా ప్రాణాలు పోగొట్టుకుంటున్న నేపథ్యంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 2000ల లోనే నాటి ప్రభుత్వం విద్యార్థుల ఆత్మహత్యలపై నీరజారెడ్డి కమీషన్ ఏర్పాటు చేసి అధ్యాయం చేయించారు. 2002 లో ఆ కమిటీ ప్రభుత్వానికి నివేదిక అందచేసింది. అనేక వాస్తవిక అంశాలను తెరమీదకు తీసుకువచ్చింది ఆ కమిటీ. కానీ కార్పొరేట్ విద్యాసంస్థలకు తలొగ్గిన ప్రభుత్వాలు ఆ కమిటీ సూచనలను పాటించకుండా తుంగలో తొక్కారు. ఫలితంగా కార్పొరేట్ విద్యా సంస్థలు విశృంకల విద్యా వ్యాపారానికి మరింత ముందడుగు వేశారు తప్పితే ఆత్మహత్యల నివారణకు ఎలాంటి నియమాలు పాటించలేకపోయారు.

1. విద్యార్థుల ఆత్మహత్యలు జరిగినప్పుడు సిట్టింగ్ జడ్జి చేత న్యాయ విచారణ జరిపించాలి.
2. ఒక యాజమాన్యం ఒకే కళాశాల నడపాలి.
3. ప్రతి జూనియర్ కళాశాలలో సైన్స్ గ్రూప్‌తో పాటు ఆర్ట్స్ గ్రూపు కూడా ఖచ్చితంగా ఉంటేనే అనుమతులు ఇవ్వాలి.
4. సంబంధిత అధికారులు ప్రైవేటు కళాశాలల్లో రెగ్యూలర్‌గా తనిఖీలు నిర్వహించాలి.
5. బాలికల జూనియర్ కళాశాలల్లో ఖచ్చితంగా మహిళా సిబ్బందినే నియమించాలి.
6. కార్పొరేట్ హాస్టల్స్‌లో 10 గంటల స్టడీ అవర్స్ మాత్రమే ఉండాలి.
7. ఆటలు, సాంస్కృతిక కార్యక్రమాలు వంటి మానసిక ఉల్లాసానికి దోహదం చేసే ఎక్స్ట్రా కరికులర్ ఆక్టివిటీలకు ఖచ్చితంగా సమయం కేటాయించాలి.
8. విద్యార్థులకు రెగ్యులర్‌గా ఆరోగ్య పరీక్షలు నిర్వహించాలి.
9. అన్ని కళాశాలలు ఖచ్చితంగా ఇంటర్‌బోర్డు జారీ చేసే అకాడమిక్ క్యాలెండర్‌ని అనుసరించాలి.

# గిరీశ్ కర్నాడ్ మృతి ప్రగతిశీల శిబిరానికి తీరని లోటు

గిరీశ్ కర్నాడ్ మరణంతో దేశంలో ప్రగతిశీల స్వరాలలో ఒక బలమైన గొంతు మూగబోయింది. కన్నడ నాటక రచయిత, అనువాదకుడు, నటుడు, ప్రయోక్త, సినిమా నటుడు, సినిమా దర్శకుడు గిరీశ్ కర్నాడ్ మహారాష్ట్రలోని మాథెరాన్‌లో 1938 మే 19న పుట్టాకు. దక్షిణ మహారాష్ట్ర, ఉత్తర కర్నాటక సరిహద్దు ప్రాంతాలలోని సంపన్నమైన జానపద కళా సంస్కృతులను పునికిపుచ్చుకున్న కర్నాడ్ గణితశాస్త్రం, గణాంకశాస్త్రం చదువుకుని ఉన్నత విద్య కోసం ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం వెళ్లారు. అక్కడ రాజనీతి శాస్త్రం, అర్థశాస్త్రం, తత్వశాస్త్రం అధ్యయనం చేసి, 1962-63లో ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి సంఘానికి అధ్యక్షుడుగా కూడా ఎన్నికయి ప్రగతిశీల భావజాలం వైపు మళ్లారు. భారతదేశానికి తిరిగి వచ్చి 1970 వరకు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ అనే ప్రచురణ సంస్థలో మద్రాస్‌లో పనిచేశారు. అప్పటికే మూడు నాలుగు సుప్రసిద్ధ నాటకాలు రచించిన కర్నాడ్ 1970లో ఆ ఉద్యోగం వదిలి పూర్తిస్థాయి నాటక రచయితగా మారారు. 1974-75లో పూణెలోని ఫిలిం అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా డైరెక్టర్‌గా పనిచేశారు. సరిగ్గా ఆ సమయంలోనే భారత సినిమా రంగంలో దిగ్గజాల వంటి నసీరుద్దీన్ షా, స్మితా పాటిల్, షబానా ఆజ్మీ వంటి ఎందరో ఆ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులుగా ఉన్నారు.



తర్వాతి కాలంలో యూనివర్సిటీ ఆఫ్ షికాగో విసిటింగ్ ప్రొఫెసర్‌గా, సంగీత నాటక అకాడమీ చైర్మన్‌గా, లండన్‌లోని ఇండియన్ హై కమిషన్‌లో సాంస్కృతిక శాఖ బాధ్యుడిగా, నెహ్రూ సెంటర్ డైరెక్టర్‌గా ఎన్నో బాధ్యతలు నిర్వర్తించారు.

దేశంలో కొనసాగుతున్న కుల అసమానతల పట్ల, కుల వివక్ష పట్ల, మతోన్మాదం పట్ల, మూఢ నమ్మకాల పట్ల తీవ్రమైన వ్యతిరేకతను తన నాటకాలలోనూ, ప్రజా జీవితంలోనూ గత నాలుగు దశాబ్దాలుగా వ్యక్తీకరిస్తూ వచ్చారు.

టిప్పు సుల్తాన్ వలస వ్యతిరేకతను 'ది డ్రీమ్స్ ఆఫ్ టిప్పు సుల్తాన్'లో, రామాయణానికి భిన్న కోణాన్ని 'యయాతి'లో, నియంతృత్వ ప్రమాదాన్ని 'తుగ్లక్'లో, కుల వ్యవస్థ దుర్మార్గాన్ని 'నాగమండల', 'తలెదండ' వంటి నాటకాలలో ఆయన అత్యద్భుతంగా చిత్రించారు.

యు.ఆర్. అనంతమూర్తి రచించిన 'సంస్కార' నవల ఆధారంగా తీసిన సినిమాలో 1970లో మొదటిసారిగా నటన ప్రారంభించి, 'నిశాంత్', 'మంథన్', 'స్వామి', 'ఆనందభైరవి' వంటి ఎన్నో సినిమాలలో నటించారు. 1975 నుంచి తానే స్వయంగా చిత్ర దర్శకత్వం ప్రారంభించి 'వంశవృక్ష', 'గోధూళి', 'ఉత్సవ్' వంటి పేరెన్నికగన్న సినిమాలు తీశారు.

కన్నడ సమాజంలో మతోన్మాదానికి వ్యతిరేకంగా దాదాపు ఇరవై సంవత్సరాలుగా గళమెత్తుతున్న కర్నాడ్ 2014 ఎన్నికలలో మోడీ అధికారానికి రాకూడదని ప్రజలకు బహిరంగ విజ్ఞప్తి చేశారు. దేశద్రోహి అని సంఘ పరివార్‌తో నిందలు, హత్యా బెదిరింపులు ఎదుర్కొన్నారు. గౌరీ లంకేశ్ హత్యకు ముందు హంతకులు తయారు చేసుకున్న పథకంలో మొదట ఆయన పేరే ఉండిందని వారే స్వయంగా చెప్పారు. గౌరీ లంకేశ్ హత్యకు నిరసనగా ఎన్నో ప్రదర్శనలలో పాల్గొన్నారు. 'అర్బన్ నక్సల్' పేరిట ప్రజా మేధావుల మీద దమనకాండ ప్రారంభమైనప్పుడు 'ఐ టు అర్బన్ నక్సల్' అని మెడలో ఫలకం కట్టుకొని బహిరంగ ప్రదర్శనలకు హాజరయ్యారు.

ఫాసిజం జడలు విప్పుతున్న ప్రస్తుత తరుణంలో గిరీశ్ కర్నాడ్ అస్తమయం ప్రగతిశీల శిబిరానికి తీరని లోటు. గిరీశ్ కర్నాడ్ మృతికి వీక్షణం ప్రగాఢ సంతాపం వ్యక్తం చేస్తున్నది.

10. సైన్స్ విద్యలో ఖచ్చితంగా ప్రాక్టికల్స్ నిర్వహించాలి. అందుకు అవసరమైన ల్యాబ్‌లను ప్రైవేటు కళాశాలలు ఏర్పాటు చేసుకోవాలి.
11. కళాశాలల్లో విద్యార్థుల సంఖ్య నిబంధనల ప్రకారం ఉండాలి. నిబంధనలకు విరుద్ధంగా ఎక్కువగా ప్రవేశాలు చేపడితే కళాశాలలపై చర్యలు తీసుకోవాలి.
12. ఒక కళాశాలలో ప్రథమ, ద్వితీయ సంవత్సరాలు కలిపి 5-6 వందల మంది విద్యార్థులు ఉండేలా సీలింగ్ విధించాలి.

విద్యార్థులు మానసికంగా కుంగిపోకుండా వారిని చైతన్యవంతులను చేయాల్సిన బాధ్యత ప్రభుత్వాలతో పాటు విద్యాసంస్థలపై ఉంది. ప్రస్తుతం మన దేశంలో ప్రభుత్వపరంగా గుర్తింపు పొందిన మానసిక వైద్య నిపుణుల కొరత తీవ్రంగా ఉంది. 2015లో లోక్‌సభలో ఆరోగ్యశాఖామాత్యులు తెలిపిన వివరాల ప్రకారం 3500 మంది మానసిక వైద్య నిపుణులు ఉండగా, 898 మంది క్లినికల్ మనస్తత్వవేత్తలు, 850 మంది మానసిక వైద్య, సామాజిక కార్యకర్తలు ఉండగా, 1500 మంది మానసిక మహిళా వైద్య నర్సులు ఉన్నారని ప్రభుత్వ గణాంకాలు స్పష్టం చేస్తున్నాయి.

అంటే మనదేశంలో మానసిక వైద్యంపై శ్రద్ధ కనబర్చడం లేదనేది స్పష్టం అవుతుంది. అయితే ప్రపంచ ఆరోగ్య సంస్థ నివేదిక ప్రకారం మన దేశంలో కేవలం 0.06 శాతం నిధులు మాత్రమే మానసిక వైద్యంపై ఖర్చు చేస్తుండగా బంగ్లాదేశ్‌లో 0.44 శాతం నిధులు కేటాయిస్తుండగా అభివృద్ధి చెందిన దేశాలు మాత్రం 4 శాతం నిధులు తమ బడ్జెట్ నుండి ఖర్చు చేస్తున్నారని తెలిపింది. అంటే ఆయా దేశాలల్లో విద్యార్థులకు మానసిక స్థైర్యం దక్కుతుంది, కానీ మనదేశంలో అలాంటి తోడ్పాటు లేదు.

అయితే విద్యార్థులకు వచ్చే మార్కులు, ర్యాంకులు మాత్రమే పరమార్థం కాదనే సత్యాన్ని తల్లిదండ్రులు సైతం గ్రహించాలి. ఇటీవల హైదరాబాద్ నగరంలో సాహెల్ అనే విద్యార్థి జెఇఇ మెయిన్స్‌లో రాణించలేదని అతని తల్లిదండ్రులు సూటిపోటి మాటలు అనడం ద్వారనే ఆవేశంతో ఇంట్లో ఉన్న డబుల్ బారెల్‌గన్‌తో తల్లిదండ్రుల ముందే కాల్చుకొని ఆత్మహత్య చేసుకున్న పరిస్థితి. ఇలాంటి సంఘటనలు పుణారావృతం కాకుండా చూసుకోవాల్సిన బాధ్యత తల్లిదండ్రులదే! విద్యార్థులు ఒకసారి పరీక్షల్లో తప్పినంత మాత్రాన జీవితంలో ఓడిపోయినట్టు కాదు, ఓటమే ఓ గుణపాఠం నేర్పుతుందనే సంకేతాలు ఇవ్వాలి. అప్పుడు విద్యార్థులకు మనోధైర్యం పెరుగుతుంది.

*(రచయిత సెస్‌లో రీసెర్చ్ అసిస్టెంట్)* వీ

# నిజం మాట్లాడితే ప్రభుత్వోద్యోగం ఖతం

***గత ఎన్నికలకు ముందు చేసిన వాగ్దానాలు నెరవేర్చకుండా మళ్లీ ఎన్నికలకు వస్తున్న ముఖ్యమంత్రిని ప్రశ్నించిన నేరానికి పాఠశాల ప్రధానోపాధ్యాయ పదవిని పోగొట్టుకున్న* లతీఫ్ మహమ్మద్ ఖాన్ *గురించి ఒక నివేదిక***

**బం**గారు తెలంగాణ సాధిస్తామని ప్రకటిస్తున్న పాలకులు అది సాధిస్తారో లేదో గాని కదిలితే మెదిలితే అభిప్రాయాలు ప్రకటిస్తే ఆంక్షలు విధించే, వేధించే పోలీసు రాజ్యాన్ని మాత్రం సాధించారు. నాయకులు ఎన్నికల్లో భారీ వాగ్దానాలు చేయడమూ, గెలిచిన తర్వాత వాటిని మరిచిపోవడమూ, మళ్లీ ఎన్నికల కోసం ప్రజల ముందుకు రావడమూ సర్వసాధారణమే. అలా మళ్లీ ఎన్నికలకు వస్తున్న కె చంద్రశేఖర రావు అంతకు ముందు నాలుగేళ్లలో తన పాత వాగ్దానాలు అమలు చేయలేదని గుర్తు చేస్తూ, ఆ విషయం ప్రశ్నించమని ప్రజలను కోరుతూ సోషల్ మీడియాలో ఒక వీడియో పెట్టినందుకు ఒక ఉపాధ్యాయుడిని ఉద్యోగం నుంచి తొలగించారు.

హైదరాబాద్ లోని నాంపల్లి ప్రభుత్వ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా పని చేస్తున్న లతీఫ్ మహమ్మద్ ఖాన్ ప్రభుత్వోద్యోగిగా ఉంటూనే తన మానవ, పౌర బాధ్యతలు నిర్వర్తించడంలో భాగంగా పౌరహక్కుల కార్యకర్తగా ఉన్నారు. ప్రత్యేకంగా హైదరాబాద్ లో, తెలంగాణలో ముస్లిం మైనారిటీల మీద అమలవుతున్న దమననీతిని వ్యతిరేకిస్తూ రెండు దశాబ్దాలుగా సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ (సిఎల్ఎంసి) అనే సంస్థను నడుపుతున్నారు.

ప్రభుత్వోద్యోగం ఆయన మొత్తం జీవితంలో ఒకానొక భాగం మాత్రమే. భుక్తి కోసం రోజుకు కొన్ని గంటలు తన శ్రమనూ మేధస్సునూ అమ్ముకునే ఉద్యోగం చేస్తున్నారు గాని మనిషిగా, వ్యక్తిగా, సామాజిక జీవిగా ఆయనకు కొన్ని విలువలూ విశ్వాసాలూ ఉన్నాయి. ఆ వ్యక్తిగత బాధ్యతతోనే ఆయన తెలంగాణ శాసనసభ ఎన్నికల సందర్భంగా 2018 నవంబర్ లో ఒక వీడియో రికార్డ్ చేసి సోషల్ మీడియా మీద పోస్ట్ చేశారు. 'కెసిఆర్ ఎక్స్ పోజ్డ్' (బట్టబయలైన కెసిఆర్) అనే శీర్షికతో వెలువడిన ఈ 15 నిమిషాల వీడియోలో 2014 ఎన్నికల ముందు కె చంద్రశేఖరావు చేసిన వాగ్దానాలను ప్రస్తావించి, ఆ వాగ్దానాలలో ఏ ఒక్కటీ నాలుగు సంవత్సరాల తర్వాత కూడ అమలు కాలేదని చూపారు.

దళిత వ్యక్తిని ముఖ్యమంత్రిని చేస్తాననడం, విద్యా ఉద్యోగావకాశాలలో ముస్లింలకు 12 శాతం రిజర్వేషన్లు, పేదలందరికీ డబుల్ బెడ్ రూమ్ ఇళ్లు, ప్రతి ఇంటికీ మంచి నీరు అందించడం, నీటి పారుదల ఆనకట్టలు నిర్మించడం, కెజి నుంచి పిజి ఉచిత విద్య, యాభై వేల మంది నిరుద్యోగ యువతకు ఉద్యోగ కల్పన, బంగారు తెలంగాణ సాధన వంటి అనేక వాగ్దానాలను ప్రస్తావిస్తూ, వాటి అమలు నాలుగు సంవత్సరాలలో ఎంతవరకు వచ్చిందని లతీఫ్ ఖాన్ ప్రశ్నించారు. ఇలా అమలులోకి రాని వాగ్దానాల గురించి ఈసారి మళ్లీ వోట్లడుగుతూ వస్తున్న ముఖ్యమంత్రికి గుర్తు చేయాలని ప్రజలకు ఆయన విజ్ఞప్తి చేశారు.

ఆ తర్వాత ఎన్నికలు జరిగి, మళ్లీ కెసిఆర్ ముఖ్యమంత్రిగా కొత్త ప్రభుత్వం ఏర్పడిన తర్వాత, అంటే వీడియో వెలువడిన ఏడు నెలల తర్వాత 2019 మే 17న హఠాత్తుగా తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ పాఠశాల విద్యాశాఖ ప్రాంతీయ జాయింట్ డైరెక్టర్ కార్యాలయం నుంచి లతీఫ్ మహమ్మద్ ఖాన్‌ను ఉద్యోగం నుంచి సస్పెండ్ చేస్తున్నట్టుగా (తాత్కాలికంగా తొలగిస్తున్నట్టుగా) ఉత్తర్వులు అందాయి. ఈ ఉత్తర్వులను సంబంధిత ప్రభుత్వోద్యోగి వాదన ఏమిటో తెలుసుకోకుండానే నిరంకుశంగా ఇచ్చారు. ఆ వీడియోను సోషల్ మీడియా మీద పోస్ట్ చేయడం ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనా నియమావళిని ఉల్లంఘించడమేనని ఆ ఉత్తర్వుల్లో పేర్కొన్నారు.

కాని ఈ ఉత్తర్వులు ఇటువంటి సందర్భాల్లో పాటించవలసిన కనీస నియమాలను, ప్రమాణాలను, పద్ధతులను పాటించలేదు. ఈ సస్పెన్షన్ ఉత్తర్వులలో భాష అస్పష్టంగా, ఏ అర్థమైనా చెప్పుకునే విధంగా ఉంది. ఎప్పుడైనా ఇటువంటి ఉత్తర్వులు ఇచ్చినప్పుడు, అందుకు కారణమైన ఫిర్యాదును పేర్కొనాలి. కాని ఈ ఉత్తర్వులకు దారితీసిన ఫిర్యాదు ఏమిటో, ఎవరు చేశారో పాఠశాల విద్యాశాఖ ఈ ఉత్తర్వులలో వెల్లడించలేదు. పద్ధతి ప్రకారం ఆ ఫిర్యాదు ప్రతిని ఇచ్చి, దానికి జవాబు చెప్పాలని ఆదేశించవలసి ఉండగా, లతీఫ్ ఖాన్ కు ఆ ఫిర్యాదు ప్రతిని ఇవ్వలేదు. తన కథనం ఏమిటో చెప్పుకునే, తన వాదన వివరించే అవకాశమేదీ లతీఫ్ ఖాన్ కు ఇవ్వకుండా ఈ ఉత్తర్వులు ఏకపక్షంగా తీవ్రమైన చర్య ప్రకటించాయి.

అంటే ఈ ఉత్తర్వులు సహజ న్యాయసూత్రాలను, పద్ధతి ప్రకారం జరగవలసిన సక్రమ ప్రక్రియను స్పష్టంగా ఉల్లంఘించాయి. ప్రభుత్వోద్యోగులు ఎందరో వ్యక్తిగత స్థాయిలో పౌర సమాజంలో సభ్యులుగా ఉంటారు. సమాజంలోని ఎన్నో ప్రజా సంఘాలలో, పౌరహక్కుల బృందాలలో ఉంటారు. పాలనలో అక్రమాలు జరిగినప్పుడు, హామీల ఉల్లంఘనలు జరిగినప్పుడు, వాగ్దానాలు అమలు కానప్పుడు ఎన్నికైన ప్రజా ప్రతినిధులనూ, అధికారులనూ ప్రశ్నిస్తారు. వారిని చట్టానికి జవాబుదారీ చేస్తారు.

ఈ సాధారణ అంశాలు అందరికీ తెలిసినవే. కేవలం లతీఫ్ మహమ్మద్ ఖాన్ మాత్రమే కాదు తెలంగాణలోనూ, దేశవ్యాప్తంగానూ ఎన్నో కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో పనిచేస్తున్న ఎందరో అధ్యాపకులు ఎన్నోసార్లు ప్రభుత్వ విధానాల మీద తమ రచనల్లో, ఉపన్యాసాల్లో విమర్శలు చేశారు. రాజ్యాంగంలోని అధికరణం 19 భావ ప్రకటనా

# ఆదివాసుల్ని అడవి నుంచి తరిమేస్తున్న సర్కార్

***అడవిలో నివసిస్తూ ప్రకృతి వనరులను కాపాడుతున్న ఆదివాసులను వన్య ప్రాణుల సంరక్షణ పేరుతో నిర్వాసితులను చేసే పాలకుల ప్రయత్నాన్ని ప్రజాస్వామికవాదులు అడ్డుకుని వారికి రక్షణగా నిలవాలని అంటున్నారు*** **లక్ష్మణ్ గడ్డం**

**పా**లకులు ఈ దేశవాసులకు ఈ దేశంలో నివసించే అర్హత కొలబద్దలను నిర్దేశిస్తున్నారు. ఈ దేశంలో నివసించాలంటే ఏమి చేయాలో వాళ్లే నిర్ధారిస్తున్నారు. అది ఆదివాసుల దగ్గర మొదలైంది. మైనార్టీలు, దళితులు, పీడిత ప్రజలందరిని చుట్టుముట్టే ప్రమాదం ముంచుకొస్తోంది. రాజకీయాలు, న్యాయ వ్యవస్థల మధ్య ఉండే గీత చెరిపివేయడంతో రెండు గొంతులు ఒక్కటిగానే పలుకుతున్నాయి.

శతాబ్దాలుగా అడవిని నమ్ముకుని జీవిస్తున్న ఆదివాసులు ఇప్పటికిప్పుడు ఆకస్మికంగా అడవిలో నివసించడానికి అర్హులా కాదా నిరూపించుకోవాలని పాలకులు, న్యాయస్థానాలు ఆదేశిస్తున్నారు. చరిత్రలో ఇంతకు మించిన విషాదం మరొకటి లేదు. అసలు ఆదివాసుల ఆవాసాల అర్హత గురించి మాట్లాడే అర్హత మైదాన ప్రాంతంలో నివసించే ఏ వర్గానికుంటుందనేది ప్రాథమిక ప్రశ్న. మరీ విశాదకరమేమంటే తమ నివాస అర్హతను నిరూపించుకునే బాధ్యతను ఆదివాసుల పైనే మోపడం. ఒక నిలువెత్తు వ్యక్తి సాక్షాత్తు ఎదురుగా నిలబడితే నీవు బతికే ఉన్నట్లుగా రుజువేంటి అని అడిగినట్లుగా ఉంది. అడవిపై ఆధారపడి బతకడం ఒక్కటే తెలిసిన అక్షరజ్ఞానంలేని ఆదివాసులు ఏం రుజువు చూపెట్టగలరు. జనాభా గణన వివరాలు ప్రభుత్వాల దగ్గర ఉండాలి కాని, ప్రజల దగ్గర ఎలా ఉంటాయి?

నిజానికి ఆదివాసుల జనాభా గణన వివరాలు ప్రభుత్వం సమగ్రంగా సేకరించిందా? 2011 నాటి గణంకాలు దేశంలో 11 కోట్ల మంది ఆదివాసులు ఉన్నట్లు వెల్లడిస్తున్నాయి. దాదాపుగా వీళ్లంతా అడవుల్లో నివసిస్తున్నట్లుగానే లెక్కలు చెబుతున్నాయి. మరోవైపు ఆదివాసి తెగలు దేశంలో 700లకు పైగానే ఉన్నట్లు గుర్తించారు. ప్రభుత్వ లెక్కలే వాళ్లు అడవిలో నివసించే ఆదివాసులని చెబుతుంటే కొత్తగా రుజువులు అడగాల్సిన అవసరమేమిటి? రుజువులు లేవనే నెపంతో దాదాపుగా ఒక మిలియన్ ఆదివాసులను అడవి నుంచి తరిమివేసే ప్రమాదం ఉంది.

మైదాన ప్రాంతంలో సుఖవంతమైన జీవితానికి అలవాటుపడ్డవారు ఎవరైనా అడవిలోకి వెళ్లి జీవించడానికి ఇష్టపడతారా? ఇష్టపడరు గదా! ఒక్క రుజువు సరిపోదా అడవిలో నివసించే వారంతా ఆదివాసులేననడానికి అడవంతా తమదేననుకున్నారు. కనుక ఇటీవలి వరకు సంచార జీవులుగానే జీవించారు. మొత్తం అడవి వీరి ఆవాస ప్రాంతం. ఖచ్చితమైన ప్రాంతాన్ని నివాస ప్రాంతంగా గుర్తిస్తూ దృవపత్రాలను అందజేసిన అధికారులే లేరు. ఇప్పుడు మాత్రం అధికార యంత్రాంగం వీరిని మూడు తరాలుగా అడవిలో నివసించడం లేదనే నిర్ధారణకు వచ్చి అడవి నుండి నిర్వాసితులను చేస్తుంది. న్యాయస్థానాలు అడవి బిడ్డలను 'ఆక్రమణదారులు' అని ముద్రవేసి అడవి నుంచి వెళ్లగొడుతుంది.

కేంద్ర గిరిజన మంత్రిత్వ శాఖ లెక్కల ప్రకారం నవంబర్ 2018 నాటికి 44 లక్షల ధరఖాస్తులు తమని 2006 అటవీ హక్కుల చట్టం ప్రకారం ఆదివాసులుగా గుర్తించమని వచ్చాయి. అందులో 20.5 లక్షల మందిని ఆదివాసులుగా గుర్తించి మిగిలిన 23.5 లక్షల మంది ధరఖాస్తులను తిరస్కరించారు. ఆదివాసులను ఆదివాసులుగా గుర్తించే, తిరస్కరించే అధికారం ఎవరికుంది? తిరస్కరించబడ్డ వారిని ఆదివాసులే కారంటున్నారు. వీరు అడవిలో మూడు తరాల నుంచి అంటే 75 సంవత్సరాల నుంచి నివసించడం లేదని వాదిస్తున్నారు. అర్హత లేకుండా అడవుల్లో నివసిస్తున్న ఈ కుటుంబాలను అడవి నుంచి ఖాళీ చేయించాలని సుప్రీంకోర్టు గత ఫిబ్రవరి 13న రాష్ట్ర ప్రభుత్వాలకు సూచించింది. దేశవ్యాప్తంగా ఆందోళనలు వెలువెత్తడంతో వెనక్కి తగ్గి ఆదేశాలను నిలిపివేసింది. అయినప్పటికీ తెలంగాణ హైకోర్టు వారిని వెళ్లగొట్టాల్సిందేనని పట్టుబట్టింది. వారి తెగ, ఆ తెగకు సంబంధించిన భాష, అచ్చాదన, ఆహార్యం, జీవన విధానం, జీవిక మూలాలు ఇవేవీ పరిగణనలోకి తీసుకోకుండానే ఆదివాసులు కారని ఏకపక్షంగా నిర్ధారించి వెళ్లగొడుతున్నారు.

2019 జూన్ 12న తెలంగాణ రాష్ట్రం కొమురం భీం జిల్లాలోని

---

స్వేచ్ఛనూ, వాక్సభా స్వాతంత్ర్యాలనూ ఇచ్చింది. ఎన్నికైన ప్రజా ప్రతినిధులను విమర్శించే హక్కు ఈ రాజ్యాంగ అధికరణం పరిధిలోకే వస్తుంది.

నిజానికి లతీఫ్ ఖాన్ ఒక పౌరుడిగా తన పౌర బాధ్యతను నిర్వర్తించారు. ఎన్నికైన ప్రజా ప్రతినిధులను ప్రశ్నించడం, జవాబుదారీగా ఉండేలా చూడడం అనే ఈ బాధ్యతను, హక్కును కేవలం ప్రభుత్వోద్యోగి అయినంత మాత్రాన ఎవరి నుంచీ లాక్కోవడానికి వీలులేదు. వాస్తవంగా ఒక ప్రభుత్వోద్యోగి తన తోటి పౌరుల మానవ, రాజ్యాంగ హక్కుల పరిరక్షణ పట్ల చైతన్యయుతంగా, నిజాయితీగా ఉండాలి. ప్రభుత్వ ఉద్యోగంలో చేరడమంటే ఒక వ్యక్తి తన రాజ్యాంగ బాధ్యతలను వదులుకోవడం కాదు. సమాజం పట్ల తన బాధ్యతలను వదులుకోవడం కాదు.

ఈ సస్పన్షన్ ఉత్తర్వులను వెంటనే ఉపసంహరించుకోవాలనీ, లతీఫ్ ఖాన్ ను ఉద్యోగంలో పునర్నియమించాలనీ ఎన్నో ప్రజా సంఘాలు, మేధావులు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. వీ

కాగజ్‌నగర్ మండలం కొలాంగోండి గూడెంకు చెందిన 67 మంది ఆదివాసుల పైన అటవీ శాఖ అధికారులు దాడులు చేసి నిర్బంధించారు. మొత్తం 16 గిరిజన కుటుంబాలను రిజర్వు ఫారెస్టు భూమిలో అక్రమంగా నివసిస్తున్నారని విరుచుకుపడి వేంపల్లి కలప డిపోలో నిర్బంధించారు. వారి నివాసాలను బుల్‌డోజర్లతో కూల్చి వేశారు. వంట సామాగ్రిని ధ్వంసం చేశారు. పశువుల, గొర్రెల పాకలను కూల్చేశారు. అడ్డుకోవడానికి ప్రయత్నించిన వారిని పోలీసులు, అటవీ శాఖ అధికారులు కొట్టారు. ప్రజాస్వామ్యం అపహాస్యం అయింది.

ట్రాక్టర్లు, జెసిబి, జీపుల్లో వెళ్లి శత్రువులపై దాడి చేసినట్లుగా చేసి గుడిసెలను నేలమట్టం చేశారు. చత్తీస్‌గడ్‌లో సల్వాజుడుం గతంలో పట్టపగలే బుల్‌డోజర్లతో వెళ్లి మావోయిస్టు సానుభూతిపరుల ఇళ్లు ఇలాగే ధ్వంసం చేసేవారు. సల్వాజుడుంకు తెలంగాణ అటవీ అధికారులకు తేడా లేకుండా పోయింది. పైగా గిరిజనులు ఆరేడేళ్లుగా మాత్రమే ఇక్కడ నివాసముంటు న్నారని అధికారులు అబద్ధం చెబుతున్నారు. తాతల కాలంనాటి నుండి వారు ఇక్కడే నివసిస్తున్నారన్న వాస్తవాన్ని అంగీకరించడం లేదు.

ఆదివాసులుంటున్న ఈ స్థలం రిజర్వు ఫారెస్టు భూమిగా పేర్కొంటూ అటవీ అధికారులు ఖాళీ చేయాలని గిరిజనులకు ఇటీవల నోటీసులు జారీ చేశారు. దీనిపై గిరిజనులు హైకోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. చట్టం ప్రకారం పునరావాసం కల్పించాలని 2019 మార్చ్ 25న హైకోర్టు ఆదేశాలు జారీ చేసింది. దీన్ని వ్యతిరేకిస్తూ అటవీ శాఖ అధికారులు కౌంటర్ ఫైల్ దాఖలు చేశారు.

గిరిజనులు ఇక్కడ 2013 నుండి మాత్రమే నివాసముంటున్నారని కోర్టుకు తెలియజేస్తూ 2005 డిసెంబర్ 13కు ముందు నుంచి ఉన్న వారికి మాత్రమే పునరావాస హక్కులు వర్తిస్తాయని పేర్కొన్నారు. కావున కొలాంగోండి ఆదివాసులకు ప్రభుత్వ సహాయం పొందే హక్కులు లేవని అటవీ అధికారులు కోర్టుకు నివేదించారు. కేసు తిరిగి జూన్ 11న వాదనకు రావడంతో ఒక రోజు గడువు కావాలని సదరు న్యాయవాది న్యాయస్థానాన్ని కోరారు.

జూన్ 12న ఆదివాసులను బలవంతంగా జీపుల్లో ఎక్కించుకుని కాగజ్‌నగర్ కలప డిపోకు తరలించి వీరిని ఎపుడో ఖాళీ చేయించామని కోర్టుకు నివేదించారు. గతంలో ఇల్లు, సాగునీరు, తాగునీరు, భూమి, పంట రుణాలు ఇప్పిస్తామని మోసపూరితంగా సంతకాలు తీసుకుని ఖాళీ చేయించే సంతకాలుగా మార్చుకున్నారు. ఇప్పుడేమో ఒక్క సారిగా నిలువ నీడ లేకుండా చేశారు. అటవీ అధికార యంత్రాంగం వీరిపట్ల వ్యవహరించిన తీరు అత్యంత అమానుషమైనది.

కొమురం భీం జిల్లా కలెక్టరు కాని, ఐటిడిఏ అధికారులు గాని, ప్రజా ప్రతినిధులు గాని గిరిజనులకు అండగా నిలవలేదు. తెలంగాణ పౌర హక్కుల సంఘం ఆదివాసులను నిర్వాసితులను చేయకూడదని, వారిని అక్రమంగా నిర్బంధించడం అన్యాయమని దాఖలు చేసిన పిటిషన్‌పై ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఆర్.ఎస్. చౌహన్, జస్టిస్ షమీమ్‌లతో కూడిన ధర్మాసనం హౌజ్ మోషన్ విచారణ జరిపి ఆదివాసులకు ఆరు నెలల్లో కుటుంబానికి ఐదు ఎకరాల భూమి ఇవ్వాలని, ఏడాదిలోగా ఇళ్లు నిర్మించి ఇవ్వాలని ఆదేశించింది. ఈలోగా అప్పటి వరకు వీరిని వసతి గృహంలో ఆశ్రయం కల్పించాలని ఆదేశించింది. నిర్వాసితులను చేయరాదని, వారిని స్వస్థలాల్లోనే ఉండనివ్వాలన్న వాదనకు ప్రాముఖ్యతనివ్వలేదు. అటు దిశగా ప్రజా సంఘాలు పోరాటం చేయాల్సి ఉంది.

నిజానికి 2006 అటవీ హక్కుల చట్టం ఆదివాసులకు ఒనగూర్చిందేమీ లేదు. ఆదివాసులకు చాలా పరిమితమైన హక్కులను మాత్రమే ఇచ్చింది. కేవలం పర్యావరణ సమతుల్యతకు జీవ వైవిధ్య పరిరక్షణకు అధిక ప్రాధాన్యతనిచ్చింది. పులులను రక్షించడమే జీవ వైవిధ్య పరిరక్షణగా అధికారులు భావిస్తున్నారు. కనుక ఆదివాసులను వెళ్లగొట్టాలని చూస్తున్నారు.

అడవిలో జంతువులు, ఆదివాసులు కలిసే సహజీవనం చేస్తారని గుర్తించదలచుకోలేదు. చెట్లను కూల్చివేయడం కాని, జంతువులను చంపడం కాని ఆదివాసులు ఎట్టి పరిస్థితుల్లోనూ చేయరు. ఆదివాసులు వీటిని దైవంగా భావిస్తారు. అడవిని కాపాడేదది ఆదివాసులే. ప్రభుత్వాలకు ఆదివాసుల మనుకగకంటే వన్య ప్రాణుల సంరక్షణ ప్రాధాన్యమైంది. జంతువులను రక్షించే పేరుతో మనుషులను హింసించడం అనాగరిక చర్య.

కొలాంగోండి ఆదివాసులు కోర్టులో తమకు న్యాయం జరగలేదని అసంతృప్తితో ఉన్నారు. హాస్టల్ ఇచ్చిన అన్నపానీయాలను సైతం ముట్టకుండా నిరసన వ్యక్తపరిచారు. కొలాంగోండిలోనే ఉంటామన్న డిమాండును ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళతామని అధికారులు హామి ఇచ్చారు. ఆ ప్రాంతానికి వారికి సాంస్కృతిక సంబంధముంది. వారి పెద్దల సమాధులు, దేవతల విగ్రహాలు అక్కడే ఉన్నాయి. పుట్టి పెరిగిన గూడెంతో సంబంధం తెంచుకోలేక విలవిల్లాడుతున్నారు. వారిని వెంటనే స్వస్థలానికి పంపించి అక్కడే హైకోర్టు ఆదేశించిన సౌకర్యాలు కల్పించాలి.

జాతీయ షెడ్యూల్డ్ తెగల కమిషన్ జారీ చేసిన సిఫారసులను హైకోర్టు పరిగణనలోకి తీసుకోలేదు. భూమి, ఇల్లుతో పాటు రు. 25 లక్షల వరకు పరిహారం చెల్లించాలని కుటుంబంలో కనీసం ఒకరికి తగిన శిక్షణ ఇచ్చి ఉద్యోగం కల్పించాలని కూడా సూచించింది. అయినా ఆదివాసులు ఇవేం కోరుకోవడం లేదు. తమను ఉన్నచోట ఉండనిస్తే చాలనుకుంటున్నారు.

2006 అటవీ హక్కుల చట్టం తమ జీవించే హక్కుకు విఘాతం కలిగిస్తున్నది. 2005 డిసెంబర్ 13 కంటే ముందుర మూడు తరాలు అడవిలో నివసించే వారికే ఆ హక్కు ఉంటుందనడం నిర్హేతుకం. అటవీ అధికారులు ఈ చట్టాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. గ్రామ సభ తీర్మానాలను నిరుపయోగం చేస్తున్నారు. సబ్ డివిజన్ స్థాయిలో, జిల్లా స్థాయిలో అధికారుల అభిప్రాయాలే చెల్లుబాటవుతున్నాయి. కనుకనే 50 శాతం ధరఖాస్తులు తిరస్కరించబడ్డాయి.

కొలాంగోండి ఆదివాసులతో పాటు దేశంలో 21 రాష్ట్రాల్లో నివసిస్తున్న 10 లక్షలకు పైగా ఆదివాసుల జీవన్మరణ సమస్య ఇది. అటవీ హక్కుల చట్టం 2006 ఆదివాసులకు అనుకూలంగా సవరించాల్సిన అవసరం ఉంది. పులుల కంటే ముఖ్యంగా మనుషులైన ఆదివాసులను రక్షించుకోవాల్సిన తక్షణ కర్తవ్యం మనందరిపైనా ఉంది.

*(రచయిత అధ్యక్షులు పౌరహక్కుల సంఘం)* వీ

# మోడీ కుట్ర విప్పి చెప్పిన సాహసికి లేఖ

***గుజరాత్ మారణకాండలో నరేంద్ర మోడీ హస్తం సాక్ష్యాధారాలు బైటపెట్టాడన్న కోపంతో సీనియర్ పోలీసు అధికారి సంజీవ్ భట్‌ను ఒక పాత కేసులో ఇరికించి ముప్పై సంవత్సరాల శిక్ష వేసిన సందర్భంలో హర్ష్ మందర్ రాసిన లేఖ***

ప్రియమైన సంజీవ్,

ఈ ఉత్తరం నీకందుతుందా, అందినా ఎప్పుడు అందుతుంది, నువ్విది చదవగలవా నాకు తెలియదు. ఈసారి నిన్ను జైలులో కలవడానికి వచ్చినప్పుడు కృతనిశ్చయురాలైన నీ సహచరి శ్వేతా భట్ ఈ ఉత్తరం ప్రతిని నీకు తెచ్చి ఇవ్వవచ్చు. కాని ఇప్పుడైతే ఆమె ఎంతో పోరాడవలసి ఉంది, ఎంతో సంబాళించుకోవలసి ఉంది. నా ఉత్తరం అనే చిన్న విషయం ఆమె మరిచిపోవచ్చు కూడ.

మొత్తానికి నీకీ ఉత్తరం చేరినప్పుడు, జామ్‌నగర్ జిల్లాలోని ఆ కష్టభరితమైన జైలు బారక్‌లో ఒంటరితనంలో నువ్విది ఎలా చదువుకుంటావా అని ఊహిస్తుంటేనే నాకు బాధగా ఉంది. సివిల్ సర్వీస్ అధికారిగా నేను దేశంలోని ఎన్నో జైళ్లలోపల ఎలా ఉంటుందో చూశాను. అది నీకు ఎంత కష్టంగా ఉండి ఉంటుందో నేనూహించగలను. రోజువెంటరోజు అదే అదే విసుగెత్తించే ఒకే రకమైన జీవితం, కటిక నేల మీద పడక, కంపు కొట్టే ఉమ్మడి పాయిఖానా, మండుటెండల వేడి నుంచీ, ఈగల నుంచీ, దోమల నుంచీ రక్షణ లేని పరిసరాలు.

ఇప్పటికే నువ్వు తొమ్మిది నెలలు జైలులో గడిపావు. ఆ కాలం ఎంత ఇబ్బందికరమైనదైనా అప్పుడు నీకు ఒక ఆశ ఉండి ఉంటుంది. ఏదో ఒక కోర్టు – అది జిల్లా సెషన్స్ కోర్టు గాని, లేదా అహ్మదాబాద్‌లో, ఢిల్లీలో ఉన్న అత్యున్నత కోర్టులలో ఏదో ఒకటి గాని – న్యాయం చేస్తుందని ఆశ ఉండి ఉంటుంది.

అందుకు బదులుగా, జామ్ నగర్ జిల్లా సెషన్స్ కోర్టు నీకు 30 సంవత్సరాల జైలు శిక్ష విధించడం గొడ్డలిపెట్టులా తోచి ఉండవచ్చు. అయితే నువ్వు ధైర్యం, స్థిరనిశ్చయం నిండిన యోధుడివని నాకు తెలుసు. నువ్వు న్యాయం కోసం, నీ అమాయకత్వాన్ని రుజువు చేసుకోవడం కోసం, ఒకానొక రోజున స్వేచ్ఛగా విడుదల కావడం కోసం పోరాడుతూనే ఉంటావు.

ఇబ్బందికరమైన, హింసాత్మకమైన నీ చెరసాల కొట్టులో ఏకాకిగా ఒంటరి క్షణాలు అనుభవిస్తున్న నీకు నేనొకటి చెప్పదలచాను. జీవితంలోకెల్లా కఠినమైన పోరాటాన్ని నువ్వు సాగిస్తున్నప్పుడు దేశంలోనూ, ప్రపంచవ్యాప్తంగానూ ఎందరెందరో నీతోనే ఉన్నారు, నీకు సంఘీభావం ప్రకటిస్తున్నారు. మాకు నువ్వు అమాయకుడివనే విశ్వాసం ఉంది. ఈ దేశంలోకెల్లా శక్తిమంతుడైన మనిషికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పే అపూర్వ సాహసం ప్రదర్శించినందుకు మాత్రమే నీ మీద ఈ వేధింపు జరుగుతున్నదని మాకు తెలుసు. 2002లో జరిగిన, స్వతంత్ర భారత చరిత్రలోకెల్లా అత్యంత దారుణమైన, క్రూరమైన మారణకాండలో ఆ మనిషి పాత్ర ఉన్నదనే నిజాన్ని నువ్వు స్థాపించదలచావు గనుకనే ఈ వేధింపు.

నీకు ఇప్పుడు జరుగుతున్నదంతా, ఆ మనిషికీ, దేశంలో ఇప్పుడు అత్యంత శక్తిమంతుడిన రెండో మనిషికీ ఉన్న మితిమీరిన అహంకారపు పర్యవసానమేనని తేటతెల్లమవుతున్నది. ఒక సాహసికుడైన, మడమ తిప్పని యోధుడి మీద చౌకబారు ప్రతీకారం తీసుకోవడానికి వాళ్లు రాజ్యాధికారాన్ని దారుణంగా వాడుకుంటున్నారు. దేశంలో నీలా జాగరూకుడైన కాపలాదారుగా ఉన్న మరొకరు నాకు గుర్తు రావడం లేదు. అత్యున్నత అధికారాన్ని ఆక్రమించినవారికి వ్యతిరేకంగా గొంతెత్తిన కాపలాదారుగా ఒక సీనియర్ అధికారి ఉన్న ఉదాహరణ లేదు. అలాగే రానున్న మూడు దశాబ్దాలు జైలులో గడపాలని నీ వంటి శిక్ష పొందిన అధికారి ఉదాహరణ కూడ లేదు.

నీకు ఇటువంటి శిక్ష విధించడం దేశంలో న్యాయవ్యవస్థ నిర్మాణాలు తమ సమగ్రతనూ, స్వాతంత్ర్యాన్నీ కోల్పోయి, కుప్పకూలి పోయాయన డానికి దర్పణం. దర్యాప్తు సంస్థలు, న్యాయస్థానాలు, అధికారిక మానవహక్కుల సంస్థలు అన్నీ ధ్వంసమయ్యాయి. చివరికి ఖాకీ దుస్తులలో ఉన్న నీ సోదరులు, సోదరీమణులు కూడ నీ శిక్ష తర్వాత మౌనం వహించి నిన్ను వదిలేశారు.

ఈ శిక్ష మీద ప్రచారసాధనాలలో పెద్ద ఎత్తున వ్యతిరేకత, విమర్శ రాలేదంటే రాజ్యాధికారాన్ని ఇంత బహిరంగంగా, ఉద్దేశపూర్వకంగా దుర్వినియోగం చేస్తుంటే ప్రచారసాధనాలు ఆగ్రహంతో నిరసన వ్యక్తీకరించడానికి సిద్ధంగా లేవని అర్థం.

రాజ్యాంగబద్ధ సంస్థ అయిన యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ (యుపిఎస్‌సి) తో సహా రాజ్యవ్యవస్థలన్నిటి విధ్వంసం కూడ నీ శిక్ష సందర్భంలో మరొకసారి ఘోరంగా బైటపడింది. సివిల్ సర్వీస్ అధికారుల స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి రాజ్యాంగం 315 అధికరణం ప్రకారం ఏర్పడిన యుపిఎస్‌సి 2015లో నిన్ను సర్వీస్ నుంచి తొలగించినప్పుడు పిరికిగా మౌనం వహించింది. అప్పుడు స్క్రోల్‌లో రాసిన వ్యాసంలో నేను నా అసంతృప్తిని వ్యక్తం చేశాను. నిన్ను తొలగించడానికి వారు చూపినది నువ్వు కొద్దిరోజుల పాటు అనధికారికంగా సెలవు తీసుకున్నావనే అతి స్వల్ప కారణం.

కాని ఒక అధికారిని తొలగించడమనే శిక్ష అత్యంత తీవ్రమైన పాలనా చర్య. అది అరుదైనవాటిలోకెల్లా అరుదైన సందర్భంలోనే తీసుకోవాలి. ప్రభుత్వాధికారులు అతి తీవ్రమైన నేరాలు చేసినప్పుడు మాత్రమే తీసుకోవాలి. కాని యుపిఎస్‌సి ఆ ఉత్తర్వులు జారీ చేసింది. కనీసం నీకు నీ వాదన వినిపించుకోవడానికి కూడ అవకాశం ఇవ్వలేదు. నాకు తెలిసి ఎందరో ఐఎఎస్ అధికారులు చెప్పాపెట్టకుండా సంవత్సరాల తరబడి అనధికారిక సెలవులు తీసుకున్నారు. ఆ సమయంలో విదేశాలలోనో, ప్రైవేట్ కంపెనీలలోనో ఉద్యోగాలు కూడ చేశారు. కాని వారి మీద, తొలగింపు కాదు సరిగదా, కనీస చర్యలు కూడ తీసుకోలేదని నేనా వ్యాసంలో రాశాను.

నీ సెలవు అనధికారికమైనది కాదని నువ్వు ఖండించావు గాని, ఒకవేళ అది అనధికారికమైనదే అనుకున్నా, 'అటువంటి అనుచిత

ప్రవర్తనకు సకారణమైన, ఉచితమైన శిక్ష ఒక లిఖితపూర్వక అసంతృప్తి ప్రకటనా లేఖ తోనో, జీతం లేని సెలవుగా పరిగణించడంతోనో సరిపోయి ఉండేది' అని నేనప్పుడు రాశాను.

దేశంలో అత్యున్నత అధికారంలో ఉన్నవారు నువ్వు ఎట్లాగైనా ఉద్యోగం నుంచి తొలగించబడాలని అంతగా ఎందుకు కోరుకున్నారనే చిక్కుముడి ఆ 'అనధికార సెలవు' రోజుల్లో నువ్వు ఏం చేశావనేది చూస్తే సులభంగా విడిపోతుంది. ఆ రోజుల్లో నువ్వు, ఇండియన్ పోలీస్ సర్వీస్‌కు చెందిన గుజరాత్ కాడర్ అధికారిగా, ధైర్యంగా దేశ ప్రధానమంత్రి నరేంద్ర మోడీకి వ్యతిరేకంగా సాక్ష్యం ఇస్తున్నావు. మోడీకి జనహననపు మారణకాండతో సంబంధం ఉన్నదని చూపుతున్నావు.

నువ్వు ఆ సాక్ష్యాన్ని సుప్రీం కోర్టు నియమించిన స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీం (సిట్) ముందు, సుప్రీం కోర్టుకు సహాయకుడుగా వ్యవహరిస్తున్న రాజు రామచంద్రన్ ముందు ఇచ్చావు (ఆ తర్వాత ఆ సాక్ష్యమే లిఖిత పూర్వక అఫిడవిట్‌గా సుప్రీం కోర్టుకు చేరింది). వారు అప్పుడు మాజీ పార్లమెంటు సభ్యుడు ఎహ్సాన్ జాఫ్రీ భార్య జకియా జాఫ్రీ ఆరోపణలపై విచారిస్తున్నారు. ఎహ్సాన్ జాఫ్రీని, ఆయనతో పాటు మరొక 70 మందిని అహ్మదాబాద్‌లో గుల్బర్గ్ సొసైటీలో, 2002లో అత్యంత దారుణంగా చంపారు. ప్రాణాలనూ ఆస్తులనూ కాపాడడంలో "ఉద్దేశపూర్వకంగానే, తెలిసితెలిసీ వైఫల్యం చెందారు" అనే కారణంతో నరేంద్ర మోడీ ఈ హత్యాకాండలో మొదటి ముద్దాయి అని ఆమె ఆరోపించారు. అప్పటి ముఖ్యమంత్రిగా నరేంద్రమోడీ తన రాజ్యాంగబద్ధ విధులను నిర్వహించడంలో విఫలమయ్యారని ఆమె అన్నారు.

నిన్ను ఉద్యోగం నుంచి తొలగించడం అసాధారణమూ దిగ్భ్రాంతికరమూ. కాని ఇక అంతకంటె దారుణం చేయలేరని మేమప్పుడు అనుకున్నాం. ఇంకా దారుణాలు రానున్నాయని అప్పుడు మేం ఊహించలేకపోయాం. నిన్ను జీవితాంతం జైలులో గడిపేలా చేసేదాకా వాళ్ల పగ చల్లారదని మేం ఊహించలేకపోయాం.

స్వతంత్ర భారత చరిత్రలో అత్యంత కీలకమైన మతోన్మాద హింసా మారణకాండ నేరానికి సంబంధించిన కేసులో నీ సాక్ష్యం ఎంత బలమైనదో, నేరస్తులను ఎంత భయపెడుతున్నదో నీకు వేసిన శిక్షే చెప్పకనే చెపుతున్నది. నువ్వు వెల్లడించిన సాక్ష్యాధారాలు ఎంతో ప్రమాదకరమైనవి. ఈ శిక్ష నీ ఒక్కడికి మాత్రమే హెచ్చరిక కాదు, ఈ దేశంలో శక్తిమంతులైన మనుషులకు ఎదురుచెప్పే సాహసం చేసేవాళ్లందరికీ ఇది ఒక హెచ్చరిక. ఒక సీనియర్ పోలీస్ అధికారికే ఈ గతి పడితే, ఒక సాధారణ పౌరుడికి ఏం రక్షణ ఉంటుంది?

2002 ఫిబ్రవరి 27 రాత్రి పొద్దుపోయిన తర్వాత మోడీ నేతృత్వంలో జరిగిన అత్యంత వివాదాస్పద సమావేశంలో నీతోపాటు ఇతర పోలీసు అధికారులు కూడ పాల్గొన్నారు. కాని వాళ్లందరూ ఆ సమావేశానికి హాజరైనట్టు గుర్తు లేదన్నారు. లేదా, ఆ సమావేశంలో నువ్వు చెపుతున్నట్టుగా మోడీ ఆదేశాలు ఇచ్చిన సంగతి గుర్తు లేదన్నారు. లేదా ఆ సమావేశంలో నువ్వు ఉన్నట్టు గుర్తు లేదన్నారు. కాని నీ డ్రైవర్ చెప్పిన ప్రకారం, ఆ సమావేశానికి వెళ్లడానికి ముందు నీతో ఉన్న బిబిసి విలేఖరి చెప్పిన ప్రకారం నువ్వు ఆ సమావేశంలో పాల్గొన్నావన్నది నిస్సందేహం.

ఆ సమావేశంలో అధికారులకు మోడీ ఇచ్చిన ఆదేశాల గురించి బైటపెడితే విస్ఫోటనం సంభవిస్తుందని నీకు తెలుసు.

అయినా నువ్వు మాట్లాడదలచుకున్నావు. నువ్వు ఆ మాట అనడానికి, ఆ మాటకు కట్టుబడి ఉండడానికి హెచ్చుస్థాయిలో ధైర్యం కూడగట్టుకోవలసి ఉండింది. ''హిందువులలో తీవ్రమైన భావోద్వేగాలున్నాయని, అందువల్ల వారు తమ కోపం తీర్చుకోవడానికి అనుమతించడమే ఉచితమ"ని ఆ సమావేశంలో మోడీ అన్నాడని నువ్వు సిట్ ముందు, సుప్రీం కోర్టు ముందు చెప్పావు. ఈ 'హిందూ ఆగ్రహం' అనబడేది సకారణమైన ప్రతిస్పందన అని మోడీ అప్పుడే తన బహిరంగ ప్రకటనల్లో కూడ అని ఉన్నాడు. అయోధ్యలో రామాలయ నిర్మాణంలో సహకరించడానికి వెళ్లి తిరిగివస్తూ రైలు బోగీలో గోధ్రాలో 58 మంది తగులబడిపోవడానికి ప్రతిస్పందన అది అని ఆయన అన్నాడు.

ఆనాటి సమావేశంలో ''ఎంతో కాలంగా గుజరాత్‌లో మతకల్లోలాలతో వ్యవహరించేటప్పుడు గుజరాత్ పోలీసులు హిందువులకూ ముస్లింలకూ మధ్య సమతౌల్యం పాటించాలనే సూత్రాన్ని అనుసరిస్తున్నారని, ప్రస్తుతం మాత్రం ఇటువంటి ఘటనలు మళ్లీ జరగకుండా ఉండాలంటే ముస్లింలకు గుణపాఠం చెప్పవలసిందే"నని అక్కడివారిని ముఖ్యమంత్రి మోడీ ఉద్బోధించాడని నువ్వు సుప్రీంకోర్టు ముందు చెప్పావు. నీ ఆరోపణలను అంగీకరిస్తే, మోడీ మీద అతి తీవ్రమైన నేరారోపణలు చేయవలసి వచ్చేది. దేశంలో అత్యున్నత అధికార పీఠానికి అధిరోహించకుండా అది ఆటంకమయ్యేది.

సిట్‌లో ఉన్న నీ సహోద్యోగులు, ఐపిఎస్ అధికారులు, నీ ఆరోపణలను పూర్తిగా కొట్టివేశారు. నిన్ను అవిశ్వసనీయ సాక్షిగా ప్రకటించారు. అసలు ఆ సమావేశంలో నువ్వు పాల్గొననే లేదన్నారు. కాని, సుప్రీం కోర్టు సహాయకుడిగా పనిచేసిన రాజు రామచంద్రన్ నీ ఆరోపణలను సిట్ తోసివేయడాన్ని అంగీకరించలేదు. నువ్వు ఆ సమావేశంలో పాల్గొన్నావా లేదా అనేది నిజానికి న్యాయస్థానంలో తేల్చాలని, సమావేశంలో పాల్గొన్నామని చెప్పిన కొందరు అధికారుల సాక్ష్యాన్నికూడ సిట్ తోసిపుచ్చింది గనుక, నీ ఆరోపణలను కూడ పూర్తిగా కొట్టివేయడానికి తగిన సాక్ష్యాధారాలు లేవని అన్నారు. నీ మాటలను ఒక న్యాయస్థానంలో పరీక్షకు గురి చేయవలసిందేనని ఆయన అన్నారు. ఆయన సూచనను అంగీకరించి, నీ సాక్ష్యాన్ని న్యాయస్థానం ముందుకు తీసుకువచ్చి ఉంటే భారత చరిత్రే మరొక రకంగా ఉండేది. నీ జీవితం కూడ మరొక రకంగా ఉండేది.

సిట్‌కు అధినేతగా ఉండిన అధికారి ఆ తర్వాత మోడీ ప్రధానమంత్రిగా ఉండగానే ఒక అసాధారణ, గౌరవనీయ పదవికి ఎంపిక కావడం యాదృచ్ఛికం కావడానికి వీలు లేదు. ఆ పోలీసు అధికారికి పదవీ విరమణ తర్వాత విదేశంలో రాయబారి పదవి దక్కింది. మరొక పక్క నువ్వు యావజ్జీవితం జైలు శిక్షకు గురి చేయబడ్డావు.

దేశంలోకెల్లా అత్యంత శక్తిమంతమైన మనుషులు నీ మీద కోపం పెట్టుకోవడానికి తగిన కారణం ఉంది. కాని భారత రాజ్యాంగ సంస్థలు తమను తాము బలహీన పరచుకుని, ఆ వ్యక్తుల చౌకబారు ప్రతీకారవాంఛకు, రాజ్యాధికార దుర్వినియోగానికి వంతపాడి ఉండవలసింది కాదు.

ఇవాళ నీకు మద్దతుగా మాట్లాడుతున్నప్పుడు కొందరు నన్ను ప్రశ్నిస్తున్నారు, కస్టడీలో ఒక వ్యక్తి మరణించడానికి నీకు సంబంధం ఉన్నదని న్యాయస్థానం నిర్ధారించిన తర్వాత, నిన్ను నేనెట్లా సమర్థిస్తానని వాళ్లు అడుగుతున్నారు.

నేను సివిల్ సర్వీస్ అధికారిగా ఉన్నప్పుడూ, అది అయిపోయి బైట ఉన్నప్పుడూ కూడ కస్టడీ హింసనూ, చట్టవ్యతిరేక హత్యలనూ గట్టిగా వ్యతిరేకిస్తున్నాను. కాని, టైమ్స్ ఆఫ్ ఇండియాలో వచ్చిన ఒక వార్త ప్రకారం, నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో లెక్కలే గుజరాత్‌లో 2001 నుంచి 2016 వరకు 180 కస్టడీ మరణాలు సంభవించాయని, అన్ని మరణాలకుగాను ఒక్కరంటే ఒక్క పోలీసు అధికారికి కూడ శిక్ష పడలేదని

# నూతన జాతీయ విద్యా విధానం 2019

*నూతన విద్యా విధానం నివేదిక పైకి చూస్తే బాగుందనిపించేలా ఉన్నా లోతుగా పరిశీలిస్తే ప్రభుత్వ విద్యను నీరుగార్చి ప్రైవేట్ విద్యను ప్రోత్సహించేలా ఉందని అంటున్నారు* **బి. రామకృష్ణ**

బిజెపి 2014లో కేంద్రంలో అధికారం చేపట్టాక విద్యా విధాన రూపకల్పన కోసం 2015 నుండి ప్రయత్నాలు చేస్తూ వచ్చింది. జనవరి 2015 నుండి నూతన విధానంపై చర్చలు, సంప్రదింపులు జరిగాయి. 2015 అక్టోబర్ 31న టిఎస్ఆర్ సుబ్రహ్మణ్యం అధ్యక్షతన నూతన విద్యా విధానం పై కమిటీను వేశారు. ఈ కమిటీ 2016 ఏప్రిల్ 30న నివేదికను అందజేసింది. అయితే ఈ నివేదిక అధికారికంగా అందుబాటులోకి రాలేదు. దీని ఆధారంగా మానవ వనరుల మంత్రిత్వశాఖ జాతీయ విద్యా విధానం ముసాయిదా 2016 కొరకు కొన్ని దత్తాంశాలు అనే డాక్యుమెంటును విడుదల చేసింది. దీని ఆధారంగా ఎలాంటి నిర్ణయాలు జరుగలేదు. 2017 జూన్ 24న డా. కస్తూరి రంగన్ ఛైర్మన్‌గా జాతీయ విధానం కొరకు కమిటీని వేశారు. ఆరు నెలల్లో పని పూర్తి చేయవల్సిన ఈ కమిటీ 5 సార్లు పొడిగించబడి చివరకు రెండవసారి కేంద్రంలో బిజెపి ప్రభుత్వం ఏర్పడిన తరువాత మానవ వనరుల శాఖ మంత్రి రమేష్ పోక్రియాల్, సహాయమంత్రి సంజయ్ శ్యామ్‌రావ్ ధోత్రేలకు 2019 మే 31న తన నివేదికను అందజేసింది. అయితే 2018 డిసెంబర్ 15 తేదీతో నివేదికను అప్పటి మంత్రి ప్రకాశ్ జవదేకర్‌కు సమర్పించినట్లు కస్తూరి రంగన్ మరితర సభ్యుల సంతకాలతో కూడిన లెటర్‌ను నివేదిక తొలి పేజీల్లో చేర్చారు. అంటే ప్రస్తుత మంత్రి పోక్రియాల్‌కు అందించే కంటే ముందే ప్రకాశ్ జవదేకర్‌కు ఈ నివేదికను అందించారని అనుకోవాలి.

అందరికి ఉన్నతమైన, గుణాత్మక విద్యను అందించడం ద్వారా దేశాన్ని సుస్థిర సమానతతో కూడిన, ఉత్కృష్ట జ్ఞాన సమాజాలుగా పరివర్తన చెందించే ఇండియా కేంద్రీకృత విద్యా విధానం అనేది జాతీయ విద్యా విధానం 2019 దార్శనికతగా చెప్పారు. అందుబాటు, సమానత, గుణాత్మకత, భరించగలగడం, జవాబుదారీతనం అనే మార్గదర్శక లక్ష్యాలపై ఆధారపడి ఈ విధానం రూపొందించబడిందని కస్తూరి రంగన్, అప్పటి మంత్రి ప్రకాశ్ జవదేకర్‌లు తెలిపారు. ఈ నివేదికలో పాఠశాల విద్య, పై ఎనిమిది అధ్యాయాల ఉన్నత విద్యపై పది అధ్యాయాలు, కేంద్రీకరించవల్సిన అదనపు ముఖ్యమైన క్షేత్రాల పై నాలుగు అధ్యాయాలు విద్యా పరివర్తన పై ఒక అధ్యాయం మొత్తంగా ఇరవై మూడు అధ్యాయాలున్నాయి. వీటికి అధనంగా చివరగా ప్రతిపాదనలు సమీకృతం పేరుతో మరో రెండు అధ్యాయాలు చేర్చారు. ఈ వ్యాసంలో పాఠశాల విద్య గురించి చర్చించడం జరిగింది. ప్రతి ఒక్కరికి విద్యను పొందే హక్కు ఉందని, కనీసం ఎలిమెంటరీ వరకైనా నిర్బంధ ఉచిత విద్య అందించాలని, మానవ వ్యక్తిత్వ పూర్తి వికాసానికి దోహదపడే దిశగా మానవ హక్కులకు, ప్రాథమిక హక్కులకు సంబంధించి గౌరవాన్ని బలపరిచేలా విద్య ఉండాలని 1948లో ఐక్యరాజ్యసమితి చెప్పిన విషయాన్ని విద్యా విధాన దార్శనికతలో ప్రస్తావించారు.

ఇండియా వారసత్వం నుండి తీసుకోవడం గురించి వివరిస్తూ ఇండియా విద్యావిధానం చరకుడు, సుశ్రుతుడు, ఆర్యభట్ట, భాస్కరాచార్య, చాణక్య, పతంజలి, పాణిని వంటి మరెందరో స్కాలర్‌లను తయారు చేసిందని చెప్పారు. గణితం, ఖగోళశాస్త్రం, లోహశాస్త్రం, వైద్య శాస్త్రం, శస్త్రచికిత్స, సివిల్ ఇంజనీరింగ్, ఆర్కిటెక్చర్, ఓడల నిర్మాణం, సముద్రయానం, యోగా, ఫైన్ ఆర్ట్స్, చదరంగం మరెన్నో రంగాలలో విస్తృతమైన జ్ఞానాన్ని ప్రపంచానికి అందించడం జరిగిందని వివరించారు. సాంస్కృతికంగా గొప్ప వైవిధ్యత, ఎన్నో భాషలు, ఏడు సాంప్రదాయక ప్రాచీన నృత్య రూపాలు రెండు సంగీత రూపాలు మరెన్నో అభివృద్ధి చెందిన జానపద సాంప్రదాయ కళలు, సంగీతం, మట్టి పాత్రలు, శిల్పాల తయారీ, కంచువాదకం, గొప్ప వంటకాలు, వస్త్రాల తయారీ మరెన్నింటినో ప్రపంచానికి అందించిన ఘనత మన విద్యా వ్యవస్థదని

---

తెలుస్తున్నది. కనుక నీ మీద చర్య సక్రమంగా జరిగిందని నేను అంగీకరించలేను.

ఆ కస్టడీ మరణాలన్నీ లేదా కనీసం వాటిలో చాలభాగం దర్యాప్తు జరిగి ఉంటే, ఆ హత్యలకు కారకులైన చాలమంది పోలీసు అధికారులకు శిక్షలు పడి ఉంటే, ఇప్పుడు నీ మీద చర్యను కూడ నేను న్యాయమైనదని సమర్థించి ఉండేవాడిని. కాని, ముప్పై సంవత్సరాల కింద, కస్టడీ నుంచి విడుదల అయిన తొమ్మిది రోజుల తర్వాత మరణించిన ఒక వ్యక్తి విషయంలో నీకూ మరొక అధికారికీ శిక్ష పడడం నేను అంగీకరించలేను.

స్వతంత్ర భారతం చూసిన అత్యంత శక్తిమంతమైన నాయకుల్లో ఒకరి మీద, క్షమాగుణం అనేదే తెలియని వ్యక్తి మీద తీవ్రమైన ఆరోపణలు చేయడంలో నువు చూపిన అద్భుతమైన సాహసానికి నిన్ను అభిమానించే వాళ్లెందరో ఉన్నారని తెలుసుకోవడం జైలులో నీ ఇబ్బందులనూ, వేదననూ ఎంతమాత్రం తగ్గించదు. నీ ముందున్న న్యాయపోరాటం దీర్ఘకాలికమైనదనీ, అనిశ్చితమైనదనీ, ఎన్నెన్నో నిరాశలకూ, హృదయ వేదనలకూ దారి తీసేదనీ నీకూ, శ్వేతకూ, నీ పిల్లలకూ తెలిసినట్టుగానే నాకు కూడ తెలుసు.

కాని ధైర్యంగా నిలబడడానికి, తట్టుకోవడానికి, పోరాటం కొనసాగించడానికి, నువ్వు సత్యమనీ న్యాయమనీ విశ్వసించిన వాటికోసం దృఢంగా నిలబడడానికి కావలసిన శక్తీ, సహిష్ణుతా నీకున్నాయని నాకు తెలుసు. అలాగే ఏదో ఒక రోజు నువ్వు స్వేచ్ఛగా బైటికి వస్తావనీ నాకు తెలుసు. శ్వేతతో, పిల్లలతో, మన దేశపు అసంఖ్యాక స్త్రీ పురుషులతో నేను కూడ ఆరోజు కోసం ఎదురుచూస్తున్నాను.

– హర్ష్ మందర్

*(హర్ష్ మందర్ మాజీ ఐఎఎస్ అధికారి, సామాజిక కార్యకర్త, రచయిత)*

*https://thewire.in/rights/sanjiv-bhatt-sentenced-narendra-modi-gujarat-riots*

వీ

గొప్పగా చెప్పే ప్రయత్నం చేశారు. వీటన్నింటిని లిబరల్ ఆర్ట్స్ విద్యలో సమీకృతం చేసి విద్యార్థుల్లో సృజనాత్మకత, వాస్తవికతను పెంపొందిస్తూ వినూత్నంగా ఉండేలా ప్రోత్సహించాలని చెప్పారు.

వారు చెప్పిననాటి పరిస్థితుల్లో విద్య ఎన్నడూ సార్వత్రికం కాలేదు. కొందరి చేతుల్లోనే కేంద్రీకృతం అయింది. అశేష ప్రజలు అణచివేతకు గురయ్యారు. విద్యకు దూరం చేయబడ్డారు. కులవ్యవస్థ అత్యధిక ప్రజానికాన్ని విద్యా వ్యవస్థ నుండి దూరం పెట్టిందనే నిజాన్ని ఈ కమిటీ చెప్పలేదు. పెరియార్, జ్యోతిబా పూలే, నారాయణగురు, అంబేద్కర్ వంటి వారెందరో అణచివేయబడిన అట్టడుగు కులాల వారి విద్య గురించి చేసిన కృషిని గుర్తుచేసుకోలేదు. ఇండియా సంస్కృతి వారసత్వం గొప్పదని కీర్తించిన కమిటీ ఇక్కడి అమానవీయ సాంఘిక అణచివేత సాధనం అయిన కుల వ్యవస్థను నిరసించలేదు.

అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటనను ప్రస్తావించినట్లుగా, దార్శనికతతో చెప్పినట్లుగా, మార్గదర్శక లక్ష్యాలుగా చెప్పిన వాటి స్ఫూర్తి గాని ఆచరణలో అవి సాధించబడేలా నివేదికలో రూపొందించబడిందా అనేది పైపైన కాకుండా క్షుణ్ణంగా పరిశీలిస్తే తప్ప అర్థం కావు. అందులోని లోపాలు గాని ప్రమాదకర తిరోగమన సరళులు గాని తెలిసిరావు.

పూర్వ బాల్యదశ సంరక్షణ విద్య గురించి వివరిస్తూ 6 ఏళ్ల లోపే 85 శాతం మెదడు సంచిత వికాసం చెందుతుందని తెలుపుతూ ఈ దశలో అందించబడే చక్కటి సంరక్షణ, పోషకాహారం, శారీరక కృత్యాలు, మనో సాంఘిక వాతావరణం, జ్ఞానాత్మక, ఉద్వేగాత్మక ప్రేరణలు అనేవి బాలుర మెదడు వికాసానికి అలాగే మెరుగైన అభ్యసనానికి దోహదపడతాయని ప్రస్తావించారు. 3-6 సంవత్సరాల దశను ప్రీప్రైమరీ అని 6-8 సంవత్సరాలను 1,2 గ్రేడులు లేదా తరగతులుగా మొత్తంగా 3-8 సంవత్సరాల దశను పునాది దశగా చెప్పారు. మొదటి మూడు (0-3) సంవత్సరాలలో ఆ తరువాత 3-8 సంవత్సరాలు పునాది దశలో భాషలను పిల్లలు త్వరగా నేర్చుకుంటారని చెబుతూ 3-8 సంవత్సరాల కాలంలో బహుళ భాషా నైపుణ్యాలను అందించాలని తెలిపారు. అయితే ఆన్యువల్ స్కూల్ ఎడ్యుకేషన్ రిపోర్ట్ (ఎఎస్ఇఆర్) సర్వేలో 5వ తరగతి విద్యార్థుల్లో సగానికి పైగా చదవడం, రాయడం రావడం లేదని తేలింది. ఒక భాషను నేర్చుకోవడమే ఇబ్బందిగా ఉంటుంటే బహుళ భాషలు ఎలా నేర్చుకుంటారు? ఇంట్లో, నివాస పరిసరాలల్లో వాడే భాషను పిల్లలు సులభంగా నేర్చుకుంటారు. అలా కాని భాషను పాఠశాల ద్వారా నేర్చుకోవడం అంత సులభమైనది కాదు. ఒక భాషనే నేర్చుకోవడం లోనే ఎన్నో ఇబ్బందులు ఎదురవుతున్న సందర్భంలో బహుళ భాషలను నేర్పించడం, నేర్చుకోవడం కష్టంతో కూడుకున్న పని, అది పిల్లలపై భారాన్ని వేస్తుంది, వత్తిడిని కలిగిస్తుంది. ఈ దశలో ఆటపాటలతో ఆహ్లాదకరమైన వాతావరణంలో, రాబోయే ప్రాథమిక పాఠశాలకు సంసిద్ధులను చేయడం, సామాజిక నైపుణ్యాలను పెంపొందించడం ఎదగడానికి పోషకాహారం అందించడం, శారీరకంగా, మానసికంగా, ఉద్వేగాత్మకంగా, మేధోపరంగా ఉత్సాహకర వాతావరణాన్ని అందించాలి. ఇందుకోసం అంగన్‌వాడీ కేంద్రాలు, పూర్వ ప్రాథమిక పాఠశాలలను దగ్గర్లోని ప్రాథమిక పాఠశాలకు అనుసంధానం చేస్తారని, ప్రస్తుతం ఈ విద్య చాలా వరకు ప్రైవేట్ విద్యాసంస్థల ద్వారా అందించబడుతున్నదని పేర్కొన్న రిపోర్టు మొత్తంగా విద్య ప్రభుత్వ అధీనంలోనే ఉండాలని ప్రతిపాదించ లేదు. ప్రస్తుతం విద్యాహక్కు చట్టంలో 6-14 (1-8 తరగతులు) సంవత్సరాల వరకు ఉచిత నిర్బంధ విద్యను అందించాలని ఉంది. దీనికి 3-6 సంవత్సరాల పిల్లలకు ఉచిత నిర్బంధ, గుణాత్మక విద్యను అందించడాన్ని చేర్చాలని సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడిన పిల్లలకు అందించబడేలా ప్రత్యేకమైన దృష్టిని సారించాలని ప్రతిపాదించారు. ఇదొక మంచి ప్రతిపాదన. ఈ దశకు సంబంధించిన పాఠ్య ప్రణాళిక, బోధనాభ్యసన శాస్త్ర ప్రణాళికలను జాతీయ విద్యా శిక్షణ పరిశోధనా సంస్థ (ఎన్‌సిఇఆర్‌టి) తయారు చేయాలని, ప్రైవేట్, పబ్లిక్, దాతృత్వ సంస్థలల్లో విద్యకు సంబంధించిన నియంత్రణా వ్యవస్థను పటిష్ఠంగా ఏర్పాటు చేయాలన్నారు. గుణాత్మక పూర్వ బాల్య విద్యను సార్వత్రికంగా అందుబాటులోకి తేవడం అనేది తద్వారా పిల్లల, దేశ, భవిష్యత్‌కు మంచి పెట్టుబడి అని అన్నారు. పెట్టుబడి అనే పదమే వ్యతిరేక స్వభావాన్ని తెలుపుతుంది. ఇది లాభనష్టాల బేరీజును సూచిస్తుంది. ఆ బదులుగా పునాది అని అనవచ్చు. ప్రస్తుత అంగన్‌వాడీ కేంద్రాలను, పూర్వ ప్రాథమిక పాఠశాలలను కలిపేయడం, వాటిని ప్రాథమిక పాఠశాలతో అనుసంధానం చేయాలని వీటిల్లో వైద్య పరంగా, పోషకాహార సరఫరా పరంగా తగుచర్యలు తీసుకోవాలని వివరించారు.

పూర్వ బాల్యదశ సంరక్షణ విద్య(ఇసిసిఇ) కోసం ప్రొఫెషనల్‌గా ఉన్నత గుణాత్మక అధ్యాపకులను తయారు చేసుకోవాలని వారికి నిరంతర వృత్తిపర వికాసం కొరకు తగు వాతావరణం కల్పించాలని చెప్పిన రిపోర్ట్ అసమర్థవంతమైన పూర్వ బాల్య విద్యా బోధనాభ్యసనలను నిర్వహించ దానికి ప్రస్తుత అంగన్‌వాడీ వర్కర్స్‌కు ఆరు నెలల ప్రత్యేక శిక్షణలో పాల్గొనే అవకాశం ఇవ్వాలని చెప్పింది. పూర్తిస్థాయిలో పూర్వ బాల్యవిద్యకు సంబంధించిన ఉపాధ్యాయ శిక్షణ ఇవ్వాల్సి ఉంటుంది గాని ఆరు నెలల శిక్షణ ఇస్తామనడం సరైంది కాదు.

చదువగలిగే, రాయగలిగే, ప్రాథమిక గణిత ప్రక్రియలను చేయగలిగే సామర్థ్యాలను భవిష్యత్ పాఠశాల, జీవితాంతం అభ్యసనలో అనివార్యమైన ముందస్తు ప్రాథమిక అవసరంగా గుర్తించారు. వీటిని సాధించడం అనేది సత్వర జాతీయ మిషన్‌గా పరిణమించిందని అన్నారు. ప్రాథమిక పాఠశాల విద్యార్థుల్లో ఐదు కోట్ల మందికి ఈ సామర్థ్యాలు కొరవడ్డాయని ఫలితంగా సంవత్సరాల తరబడిగా అభ్యసనంలో కుంటుపడుతున్నారని దీనిపై తగు రీతిలో స్పందించకపోతే సమీప సంవత్సరాలలో 10 కోట్లకు పైగా విద్యార్థులు అభ్యసనా వ్యవస్థ నుండి దూరం చేయబడి నిరక్షరాస్యతకు దారితీస్తుందని హెచ్చరించారు. ఆరోగ్యస్థితి, పోషకాహారం అనేవి అభ్యసనంపై ప్రభావాన్ని కల్గిస్తాయి. అందుకోసం మధ్యాహ్న భోజనానికి అదనంగా ఉదయం అల్పాహారం అందివ్వాలని అదే విధంగా పేదరికం కూడా పిల్లలపై ప్రతికూల ప్రభావాన్ని కలుగజేస్తుందని దానిపై చర్యలు తీసుకోవాలని సరిగ్గానే ఈ కమిటీ గుర్తించింది. విద్యార్థి ఉపాధ్యాయ నిష్పత్తిని 30:1గా ఉండాలని ప్రస్తావిం చారు. కాని అది ఫౌండేషనల్ దశలో 10/15:1గా ఉండాలి. ఈ నిష్పత్తి తక్కువగా ఉండడం వలన ఉపాధ్యాయులు ప్రతి విద్యార్థిపై వ్యక్తిగత శ్రద్ధ పెట్టే పరిస్థితి ఏర్పడుతుంది. రాయడం, చదవడం కనీస గణిత ప్రక్రియలను చేయగలిగే, చేసే ప్రాథమిక సామర్థ్యాలను పిల్లల్లో పెంపొం దించడం కోసం నేషనల్ ట్యూటర్ ప్రోగ్రాం (ఎన్‌టిపి) రెమిడియల్ ఇన్‌స్ట్రక్షనల్ ఎయిడ్స్ ప్రోగ్రాం (ఆర్ఐఎపి), సోషల్ వర్కర్స్, కౌన్సిలర్లు, సహ విద్యార్థులతో ట్యూషన్ లాంటివి చెప్పించడం, ఈ కార్యక్రమంలో స్థానిక సమాజ వ్యక్తులు, ప్రత్యేకించి మహిళలు, సామాజికార్థికంగా ఇతరత్రా వెనుకబడిన వర్గాల నుండి స్వచ్ఛందంగా పాల్గొనే కార్యక్రమాన్ని ఈ రిపోర్ట్ తెలిపింది. ఈ కమిటీ సూచించిన పరిష్కారం తాత్కాలికంగా పనికి రావచ్చు గాని ఆచరణలో ఇది దాదాపుగా వైఫల్యం చెందే అవకాశమే ఎక్కువ. 10/15:1నిష్పత్తిలో సుశిక్షితులైన పూర్తిస్థాయి, శాశ్వత ఉపాధ్యాయ నియామకాలు జరపాలని పేర్కొనకపోవడం ఈ రిపోర్ట్ లోపంగా లేదా అసలు పరిష్కారాన్ని కావాలనే వదిలేశారేమోనని అనిపిస్తుంది.

ప్రాథమిక పాఠశాలలో చేరిన పిల్లలు 5వ తరగతి పూర్తయ్యే లోపు కొందరు, 9-10 తరగతులు పూర్తయ్యే లోపు మరికొందరు 11-12 తరగతులు పూర్తయ్యే లోపు మొత్తంగా సగం మంది డ్రాప్ అవుట్స్‌గా మిగిలిపోతున్నారని 2015లో 6.2 కోట్ల మంది పిల్లలు పాఠశాలకు అవల ఉన్నారని తెలిపారు. దీని కోసం 3-18 సంవత్సరాల పిల్లలందరికి నిర్బంధ ఉచిత గుణాత్మక పాఠశాల విద్యను 2030లోపు అందించాలనే లక్ష్యాన్ని ప్రకటించారు. అసలు ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లల సంఖ్య ఎందుకు పడిపోతున్నదో ఈ రిపోర్ట్ సరిగ్గా చర్చించలేదు. అభ్యసనలో వెనుకబడుట ద్వారా పాఠశాలలో కొనసాగడం వృథా అని, సెకండరీ విద్య అందుబాటులో లేకపోవడం, బాల్య వివాహాలు, బాల కార్మికత, చిన్న పిల్లలను ఇంటి వద్ద చూసుకోవడం వంటి సామాజికార్థిక సమస్యలు, పాఠశాలలో మౌలిక వసతుల కొరత, భద్రత లేమి వంటి కారణాలను కొన్నింటిని ప్రస్తావించారు. ఇక్కడ తెలిసీ కూడా విస్మరించబడిన ముఖ్యమైన విషయాలు ఉన్నాయి. దశాబ్దాలకు, దశాబ్దాలుగా ప్రభుత్వ పాఠశాలలో మౌలిక వసతులను కల్పించకుండా కనీసం తరగతికి ఒక గది, తరగతికి ఒక టీచర్‌ను ఎందుకు ఇవ్వలేదో వివరించలేదు. ఏకోపాధ్యాయ పాఠశాలలు ఒకప్పుడు ప్రభుత్వ విధానంగా ఉన్న విషయం దాస్తున్నారు. అలా మరెన్నో కారణాలతో సర్కారు బడులను మృత్యువుకు దగ్గరగా తీసుకుపోతూ మరోవైపు ప్రైవేట్ బడులకు విచ్చలవిడిగా అనుమతులిస్తూ కనీస ప్రమాణాలు పాటించకుండా ప్రభుత్వ నియమాలను ఉల్లంఘిస్తూ విస్తరిస్తున్న ప్రైవేట్ పాఠశాలలను ప్రోత్సహించిన వ్యవస్థాగత విధానాలను వివరించకుండా కుట్రపూరితంగా ఈ రిపోర్టులోని భాగస్వాములు వ్యవహరించారని చెప్పక తప్పదు.

ఎంతసేపటికి పాఠశాలలను విలీనం చేయడం గురించే ప్రస్తావిస్తున్నారు గాని ప్రభుత్వ బడులకు సమీపంలోనే ఉన్న ప్రైవేట్ వాటిని రద్దు చేయాలనో, కనీసం నియంత్రించాలనో చెప్పడానికి వారి మేధో సంపత్తి సరిపోవడం లేదు. విద్యా ప్రైవేటీకరణ, ప్రభుత్వాల సమాజ సంక్షేమ వ్యతిరేక విధానాల దుష్ఫలితమే ప్రభుత్వ బడుల్లో విద్యార్థుల సంఖ్య పడిపోవడానికి కారణాలనే ప్రాథమిక విషయాన్ని చాలా సౌకర్యవంతంగా దాట వేయడం జరుగుతున్నది. మరోవైపు ప్రభుత్వ బడులు దయనీయ స్థితిలో కొట్టుమిట్టాడుతున్నాయని ఎంతో బాధపడి పోతున్నట్లుగా వారి మనస్సులేవో కరిగిపోతున్నట్లుగా మాట్లాడుతుంటారు.

ఈ సందర్భంలో విద్యా హక్కుచట్టంలోని 6-14 సంవత్సరాలకు అదనంగా అటు ఇటు చివరలో 3-6, 14-18 సంవత్సరాల వరకు విద్యను అందించే విధంగా సవరణ తేవాలని సూచించడం ఒక మంచి పరిణామమే అయితే అదే సమయంలో గుర్తించవల్సిందేమంటే 6-14 సంవత్సరాల వయస్సు లేదా 8వ తరగతి వరకు ఉచిత నిర్బంద విద్యను ఇవ్వాలని చెప్పే రాజ్యాంగ నిబంధన 2010 నుండి ఎలా నిరుపయోగంగా మారుతున్నదో గమనించాల్సి ఉంది. ఈ నివేదికలో ఎక్కడ కూడా ప్రైవేట్ పాఠశాల విద్యను రద్దు చేయాలని లేదా నియంత్రించాలని పూర్తిగా ప్రభుత్వ అధీనంలోనే పాఠశాల విద్య కొనసాగాలని చెప్పలేదు. అక్కడే ఉంది అసలు సమస్య.

ఫౌండేషనల్ దశ నుండి ప్రత్యేకించి 9 నుండి 12 గ్రేడుల్లో 100 శాతం నమోదు ఉండడానికి సెక్షన్‌లు, పాఠశాలల సంఖ్యను పెంచాలని దీనిని 2030 లోపు సాధించాలని చెప్పారు. ఇందుకోసం ఎక్కడైతే బడి బయట పిల్లలు ఎక్కువమంది ఉన్నారో అక్కడి బడులలో ఎక్కువ మందిని చేర్చుకునే సామర్థ్యాన్ని పెంచాలని, బడులు లేని ప్రాంతాలలో లేదా సరిపోయే స్థాయిలో బడి సౌకర్యాలు ఉన్న ప్రాంతాలలో కొత్తగా విద్యా సౌకర్యాలను నిర్మించాలని, చెప్పిన రిపోర్ట్ తక్కువ మంది పిల్లలున్న ప్రాథమిక, ప్రాథమికోన్నత, సెకండరీ, హయ్యర్ సెకండరీ పాఠశాలలను కంపోజిట్ పాఠశాలలుగా/స్కూల్ కాంప్లెక్స్‌గా ఏకీకృతం/విలీనం చేయాలని ప్రతిపాదించారు. గతంలో నీతి అయోగ్ కూడా దీన్నే సూచించింది.

అయితే పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య పడిపోవడానికి కారణాలు వెతకాలని గాని చుట్టుపక్కల ప్రైవేట్ పాఠశాలల వలన గనుక తగ్గితే వాటిని నియంత్రించాలని గాని ఈ నివేదిక స్పష్టం చేయలేదు. నిజంగానే ఇక పాఠశాల స్థాయి పిల్లలు అసలే లేరని తేలితే అది వేరే విషయం. అలా తేల్చుకున్నాకే వారు చెప్పిన కన్సాలిడేషన్ ప్రక్రియకు అర్థం ఉంటుంది. రవాణా, హాస్టల్ సౌకర్యాలను కల్పించాలని, విద్యార్థులకు ప్రత్యేకించి బాలికలకు రక్షణ కల్పించాలని, ఉదయం అల్పాహారం, మధ్యాహ్నం భోజనం అందించాలని కొన్ని మంచి సూచనలు చేసింది. ప్రత్యేక అవసరాలున్న, వలసకార్మికుల పిల్లలతోపాటుగా అందరు విద్యార్థులకు చదువును అందించడం కోసం పాఠశాల విద్యా పరిధిని విస్తృతం చేయాలని అందుకోసం నియత, అనియత పద్ధతులు, ఓపెన్ డిస్టెన్స్ లర్నింగ్ ప్రోగ్రామ్, నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఓపెన్ స్కూలింగ్ విధానాలను పాటించాలని చెప్పింది రిపోర్ట్. వీటికంటే కూడా రెసిడెన్సియల్ పద్ధతిలో చక్కటి విద్యను అందించే కృషి గురించి ఆలోచించాలి.

పాఠశాలల్లో వసతుల గురించి విద్యాహక్కు చట్టం సూచించిన వాటిని సరళీకృతం చేయాలని వాటికంటే కూడా అభ్యసన ఫలితాలపై దృష్టి పెట్టాలని తెలిపింది రిపోర్ట్. ఇది సరిగ్గా నీతి అయోగ్ విద్యా విధానాన్ని గుర్తు తెస్తున్నది. ఈ వాదన సరిగ్గా వసతులు లేకున్నా ఫలితాలు రాబడుతున్నామని చెప్పే ప్రైవేట్ పాఠశాలల యాజమాన్యాలు చేస్తున్నదే. దీనికోసం కొన్ని సంవత్సరాల క్రితం ప్రైవేట్ పాఠశాలల యాజమాన్యాలు ఢిల్లీలో ర్యాలీ నిర్వహించారు. దీనికోసం ప్రభుత్వాలపై ఒత్తిడిని తెస్తున్నారు. అలాగని ప్రస్తుతం వీరు ప్రమాణాలను పాటిస్తున్నారని కాదు. విశాలమైన గదులు, లైబ్రరీ, లాబొరేటరీ, ఆటస్థలం, మొదలగు మౌలిక వసతులను సమకూర్చకుండా మరింతగా సరళీకృతం చేయాలన్నదే వీరి వాదన.

ప్రభుత్వ, ప్రభుత్వేతర ధాతృత్వ సంస్థలు బడులను నిర్మించడానికి సంస్కృతి, భౌగోళిక జనాభా ప్రాతిపదికన స్థానిక వైవిధ్యాలను ప్రోత్సహించడానికి గురుకులాలు, మదర్సాలు, ఇంట్లో నుంచి విద్య నేర్పించడం వంటి ప్రత్యామ్నాయ పద్ధతులను అనుమతించడానికి విద్యా హక్కు చట్టంలోని నిబంధనలను సరళం చేయాలని విద్యను అందించడానికి వివిధ పద్ధతుల పాఠశాలల మధ్య పోటీ ఉండడమనేది ఉన్నత గుణాత్మక ప్రభుత్వ, ప్రభుత్వేతర పాఠశాలలు అందుబాటులోకి రావడానికి దారి తీస్తుందని, మరొక నమూనాగా పబ్లిక్ ధాతృత్వ భాగస్వామ్యంతో నడిచే పాఠశాలలను కూడా ప్రయత్నించవచ్చని ఈ రిపోర్ట్ ఒక తిరోగమన ప్రతిపాదన చేసింది. దీన్ని ప్రభుత్వ పరిధిలోనే నాణ్యమైన సమాన విద్యను అందించకుండా చేసే ప్రయత్నంగా మరొకవైపు మత సంబంధ విద్యలను ప్రోత్సహించడంగా కూడా చూడవచ్చు. అలాగే రాజ్యాంగ ప్రమాణాలైన లౌకిక విలువకు విఘాతంగా కూడా చూడొచ్చు.

ఉచిత నిర్బంధ గుణాత్మక సెకండరీ విద్యను (9-12 గ్రేడులు/ తరగతులు, 14-18సంవత్సరాల వయస్సు) విద్యా హక్కు చట్టం పరిధిలోకి తేవాలని తెలపడం మంచి పరిణామంగా చూడొచ్చు. ఓ వైపు ఉచిత విద్య అంటూనే మరోవైపు వ్యాపార లాభార్జన ధోరణుల్లో నడిచే పాఠశాలలకు అనుమతులివ్వడం, ప్రోత్సహించడం ఒక వైరుధ్యంగా ఉంటుంది.

యాంత్రికంగా వల్లె వేస్తూ నేర్చుకోవడాన్ని కనీస స్థాయికి తగ్గించడానికి సంపూర్ణ వికాసాన్ని అలాగే ఇరవై ఒకటవ శతాబ్ద నైపుణ్యాలైన విమర్శనాత్మక ఆలోచన, సృజనాత్మకత, శాస్త్రీయ దృక్పథం కమ్యూనికేషన్,

పరస్పర సహకార జట్టు కృషికి, బహుళ భాషాతత్వం, సమస్య పరిష్కార సామర్థ్యం, నైతికత, సామాజిక బాధ్యత, డిజిటల్ అక్షరాస్యతలను ప్రోత్సహించుటకు పాఠ్య ప్రణాళిక, బోధనాభ్యసన శాస్త్రంను 2022లోపు పరివర్తన చెందించాలనే లక్ష్యాన్ని ప్రకటించింది. అయితే ఇక్కడ ప్రస్తావించిన నైపుణ్యాలు డిజిటల్ అక్షరాస్యత తప్ప ఎప్పటినుండో చెబుతున్నవే. ఇవేవో ప్రత్యేకమైన ఇంతకు ముందే లేనివి అన్న రీతిలో ప్రస్తావించారు. 10+2 నమూనకు బదులుగా 5+3+3+4 అనే దాన్ని ప్రతిపాదించారు. 5 ఏళ్ల ఫౌండేషనల్/పునాది దశలో 3 ఏళ్ల పూర్వ ప్రాథమిక పాఠశాల, 1,2 గ్రేడులు/తరగతులు, 3 ఏళ్ల ప్రిపరేటరీ/ సంసిద్ధతా దశలో 3,4,5 గ్రేడులు/ తరగతులు, 3 ఏళ్ల మిడిల్ /మాధ్యమిక/ ప్రాథమికోన్నత దశలో 6,7,8 గ్రేడులు/తరగతులు, 4 ఏళ్ల ఉన్నత/ సెకండరీ దశలో 9,10,11,12 గ్రేడులు/తరగతులు ఉంటాయని 5+3+3+4 అనే చట్రంను ప్రతిపాదించారు. ఇది మంచి సూచనే. జూనియర్ కాలేజి అనే దాన్ని ప్రత్యేకంగా కాకుండా పాఠశాల విద్యలో భాగంగా చూడడం మంచి పరిణామమే.

పునాది/ఫౌండేషన్ దశ గురించి ఆలోచించినప్పుడు ప్రీ ప్రైమరీకి సంబంధించిన ప్రభుత్వ పర ఉపాధ్యాయ శిక్షణలేవి లేవు. అలాగే 1,2 తరగతులకు బోధించడం గురించి కూడా ఖచ్చితమైన ఉపాధ్యాయ శిక్షణ లేదనే చెప్పాలి. ఎలిమెంటరీ విద్యకు సంబంధించిన డిప్లొమా ఇన్ ఎలిమెంటరీ ఎడ్యుకేషన్‌లో 1,2 తరగతులకు సంబంధించిన స్పష్టమైన బోధన శిక్షణ లేదు. 1,2 తరగతులు ప్రీ ప్రైమరీకి కొనసాగింపుగా ఒకే దశలో ఉండడం ద్వారా ఈ ఐదేళ్లకు సంబంధించిన ఉపాధ్యాయ శిక్షణను శాస్త్రీయంగా రూపొందించడం సులభం అవుతుంది.

అన్ని దశల్లో కూడా భారతీయ, స్థానిక సంప్రదాయాలను పెద్ద మొత్తంలో పొందు పర్చడంతో పాటు ఇంతకు ముందే ప్రస్తావించిన నైపుణ్యాలను పెంపొందించే ప్రయత్నం జరగాలని చెప్పారు. ప్రవేశికలో కూడా భారతీయ వారసత్వం గొప్పదని, ఇక్కడ గొప్ప మేధావులు, శాస్త్రవేత్తలు విద్యను సుసంపన్నం చేశారని, ప్రపంచానికి ఎంతో జ్ఞానాన్ని వారసత్వ సంపదను అందించారని చెబుతూ విద్యా భారతీయీకరణ గురించి నొక్కి చెప్పడం ద్వారా ఒకవైపు శాస్త్రీయ దృక్పథం, తార్కిక ఆలోచన, సమస్యా విశ్లేషణా పరిష్కార సామర్థ్యాల గురించి మాట్లాడిన రిపోర్ట్ వారసత్వం, సాంప్రదాయాల పేరుతో మత వాసనలతో అశాస్త్రీయతను ప్రోత్సహిస్తారనే అనుమానం నిజం కాకుండా పోదు. మరోవైపు విద్యార్థుల సంపూర్ణ వికాసం కొరకు పాఠ్య ప్రణాళిక, బోధనాభ్యసనను అన్ని దశల్లో కూడా మొత్తంగా పున: పరిశీలన, పునర్ నిర్మాణం జరగాలని చెప్పారు. ఈ పునర్నిర్మాణం పేరుతో మతతత్వీకరణను ముందుకు తెచ్చే ప్రయత్నాన్ని కాదనలేని పరిస్థితుల్లో ఉన్నాం. నిమ్న కులాల వారు వేదాలు వింటే చెవుల్లో సీసం పోశారని, చదివితే నాలుకలు కోసేశారని చారిత్రక నిజాలను అంబేద్కర్ వంటి సాంఘిక విప్లవ కారులు వెలికితీశారు. ఈ దుర్మార్గమైన వారసత్వం గురించి కస్తూరిరంగన్ కమిటీ మౌనంగా ఉన్నది.

కరిక్యులర్ అని, కో కరిక్యులర్ అనే విభజన లేకుండా రెండూ కూడా కరిక్యులర్ అంశాలు గానే పరిగణించాలని ప్రతిపాదన చేశారు. ఆర్ట్స్, హ్యూమానిటీస్, సైన్సెస్, క్రీడలు, వొకేషనల్ సబ్జెక్టులలో వేటినైన ఎంచుకునే వెసులుబాటు పిల్లలకు ఉంటుందని ఆర్ట్స్, సైన్స్ అనే స్పష్టమైన విభజన లేకుండా విద్యార్థులందరు ఆర్ట్స్, హ్యూమానిటీస్‌లతో పాటుగా సైన్స్, సోషల్ సైన్సెస్‌లను కూడా అభ్యసించే అవకాశముంటుందని చెప్పారు. వొకేషనల్, అకడమిక్ అనే విభాగాల విభజన లేకుండా ఉండే ప్రతిపాదన చేస్తూ విద్యార్థులందరూ వొకేషనల్ కోర్సులను అభ్యసించడం అనేది సాధారణ పాఠ్య ప్రణాళికతో పాటు కలిసే ఉంటుందని అందులో వ్యవసాయం, ఎలక్ట్రానిక్స్, స్థానిక వృత్తులు, క్రాఫ్టులు మొదలగునవి ఉంటాయని చెప్పారు. 6–8 తరగతుల పిల్లలకు ఒక సంవత్సర కాల వొకేషనల్ క్రాఫ్ట్ కోర్సు, ఒక సంవత్సర కాల నైతిక అంశాల కోర్సు ఉంటుందని , హైస్కూల్‌లో తత్వశాస్త్రం, నైతిక విషయాలకు సంబంధించి సెమిస్టర్ కోర్సులుంటాయని భారతీయ జ్ఞాన వ్యవస్థలపై ఒక కోర్సును సెకండరీ విద్యార్థులు ఎంచుకునే అవకాశముంటుందని తెలిపారు.

సంపూర్ణ, అనుభవపూర్వక, చర్చా ఆధారిత, విశ్లేషణ ఆధారిత, విమర్శనాత్మక ఆలోచన, శోధించి తెలుసుకునే, సృజనాత్మక అభ్యసనానికి చోటిచ్చేందుకు ప్రతి సబ్జెక్టులో సిలబస్ భారాన్ని తగ్గించాలని తెలిపారు. ఇది బాగానే ఉన్నట్లనిపిస్తున్నప్పటికి సిలబస్ భారం తగ్గించాలంటూ సబ్జెక్టులను పెంచే ప్రమాదం ఉన్నది. తద్వారా పిల్లలపై రిపోర్ట్ చెప్పిన భారం పూర్వం లాగానే తయారవుతుందేమో అనే అనుమానం కలుగుతున్నది. ప్రస్తుతం పాఠ్యాంశా(కరిక్యులర్), సహ పాఠ్యాంశ(కో కరిక్యులర్) లకు సమాన ప్రాధాన్యతను ఇవ్వాలని ఎంతగా చెబుతున్న ప్పటికీ పాఠ్యాంశాలకే అత్యధిక ప్రాధాన్యతనిస్తున్నారు. వ్యక్తిత్వ వికాసానికి, సామాజిక బాధ్యత గల వారలుగా ఎదగడానికి పనికివచ్చే సహ పాఠ్యాంశాలు దాదాపుగా నిరాదరణకు గురయ్యాయి. ఇది విద్యా వ్యవస్థలో తీవ్రమైన లోపమే. దీన్ని నిజమైన స్ఫూర్తితో అధిగమించడానికి ఈ రెండింటిని కలిపితే మంచిదే.

కనీసం 5వ తరగతి వరకు కాని కనీసం 8వ తరగతి వరకైతే మరీ మంచిది ఎక్కడ వీలైతే అక్కడ ఎప్పుడు సాధ్యపడితే అక్కడ ఇంటి భాష/ మాతృభాష/స్థానిక భాషలో బోధన జరగాలని సూచించారు. ఇది ఒక మంచి సూచనే. విద్యాహక్కు చట్టంలో మాతృభాషలో బోధన గురించి చెప్పినట్లుగానే ఉంది ఇది కూడా. ఒక సలహాగా సూచనగానే ఉంది తప్పిస్తే తప్పకుండా పాటించవల్సిన ప్రమాణంగా లేదు. ఫౌండేషన్ దశ నుండే అంటే 3 సంవత్సరాల వయస్సు నుండే పిల్లలకు మూడు లేదా అంత కంటే ఎక్కువ భాషలను పరిచయం చేస్తారు. పిల్లవాని పరిసరాలలో ఏ భాష వాడబడుతుందో ఆ భాషను నేర్చుకోవడం సులభం అవుతుంది. అంతేగాని కేవలం పాఠశాలలో నేర్పిస్తే వస్తుందనుకోవడం అదీ కూడా పునాది దశ నుండే అంటే మూడేళ్ల నుండే మూడు పైగా భాషలను నేర్పించాలనుకోవడం సరైంది కాదు. బహుళ భాషలను నేర్పించాలనే బలమైన ప్రతిపాదనలు చేశారు. బహుళ భాషలు నేర్చుకున్న వారు ఒకే భాషను నేర్చుకున్న వారికంటే ముందుంటారని, ఇది వారిని మేధోపరంగా, సాంస్కృతికంగా సంపన్నం చేస్తుందని తెలిపారు. దీనికి శాస్త్రీయ ఆధారాలేమున్నయో పరిశోధించ వల్సిందే. భావ వ్యక్తీకరణకు సంబంధించి ఇతర భాషల కంటే మిన్నగా ఇంగ్లీష్ ఏమీ లేదని చెబుతూ ఈ దేశంలో దురదృష్టకరంగా ఇంగ్లీష్ మాధ్యమాన్ని గాని ఇంగ్లీష్‌లో సంభాషించడాన్ని గాని గొప్పగా చూస్తున్నారని, బాగా అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవహారిక భాషలుగా ఇంగ్లీష్‌ను కాకుండా వారి స్థానిక భాషలను ఉపయోగిస్తారని చెబుతూ అలాగే ఇండియాలో కూడా స్థానిక భాషలనే ఉపయోగించాలని లేదంటే సంపన్నమైన భాషను, సాంస్కృతిక వారసత్వాన్ని, బలమైన భావవ్యక్తీకరణలు నెమ్మదిగా కోల్పోవడం జరుగుతుందని, అలా భారతీయ భాషలను భారీగా ప్రోత్సహించాలని వివరించింది. అయితే సైన్స్, టెక్నాలజీ పరిశోధన రంగాలలో ఇంగ్లీష్ అంతర్జాతీయ సాధారణ భాషగా మారిందని అందుకు గాను సైంటిఫిక్ సబ్జెక్టులను పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో చదివే వారికి సైన్స్‌ను ఇంటి/ స్థానిక భాష అలాగే ఇంగ్లీష్‌లో అనర్గళంగా వ్యక్తీకరించ గలిగేలా ద్విభాషా సామర్థ్యాలను కలిగి ఉండాల్సి వస్తుందని ఇది టెక్నాలజీ పరంగా అభివృద్ధి చెందిన అన్ని దేశాలలో జరుగుతున్నదని సముచితంగానే వివరించారు.

ఆంగ్లంతో పాటు హిందీని తప్పనిసరి చేసే త్రిభాషా సూత్రాన్ని అమలు చేయాలని సిఫారస్ చేశారు. హిందీని తప్పనిసరి చేయడాన్ని ప్రత్యేకించి తమిళనాడు, కర్నాటక వంటి దక్షిణాది రాష్ట్రాలు వ్యతిరేకించ డంతో హిందీని వెనక్కి తీసుకున్నారు. అయితే త్రిభాషా సూత్రానికి కట్టుబడి ఉన్నారు. హిందీని తప్పనిసరి చేయడం వెనుక దేశ వ్యాప్తంగా ఒకే భాష ఉండాలనే ఉద్దేశం ఉన్నది. ఇది ఒకే ప్రజ, ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే మతం అనే హిందుత్వవాదులకు అవసరంగా కూడా ఉన్నది. అలాగే సంస్కృతాన్ని ప్రోత్సహించాలని, భాషగా నేర్పించాలనే తీవ్రమైన తపన కూడా కన్పిస్తున్నది. ఇది కూడా హిందుత్వ వాదులకు అవసరంగా ఉన్నది. వారనుకుంటున్న హిందూ సనాతన ధర్మ భావనలు బలంగా సంస్కృత సాహిత్యంలో ఉన్నాయి. ఆ భావాలను వ్యాప్తి చేయడానికి సంస్కృత భాష అవసరం ఏర్పడింది. నిజానికి నేడు సంస్కృతం ఒక మృత భాష. కొంతమంది ఉన్నత ఆధిపత్య వర్గాల భాషగానే ఉన్నది తప్పిస్తే చరిత్రలో అదెప్పుడు కూడా ప్రజల భాషగా మనలేదు. ఒకవేళ సంపన్నమైన జ్ఞాన సంపద సంస్కృత భాషలో ఉన్నదని భావిస్తే దాన్ని ఇతర భాషల్లోకి అనువాదం చేయవచ్చు. అంతేగాని మరో భాషా భారాన్ని మోపే ప్రయత్నం మంచిదికాదు. సంక్లిష్టమైన విషయాలను ఇంటి/మాతృభాషలో సులభంగా వేగంగా అర్థం చేసుకుంటారని చెబుతూనే మరోవైపు బహుళ భాషలను పునాది స్థాయి నుండే (మూడేళ్ల నుండే) నేర్పించాలనుకోవడం పరస్పర వైరుధ్యాన్ని సూచిస్తుంది. 6-8 తరగతుల పిల్లలందరు కనీసం రెండు క్లాసికల్ భాషలు (సంస్కృతం, తమిళం, కన్నడ, తెలుగు, మళయాలం, ఒడియా, పాళీ, పర్షియన్, ప్రాకృతం) చదువుతారని వీటిని సెకండరీ పాఠశాల స్థాయిలో నుండి యూనివర్సిటీ వరకు కొనసాగించే అవకాశముంటుందని వివరించింది రిపోర్ట్. ఇది తప్పనిసరి చేస్తారా లేదా స్వచ్ఛందంగా విద్యార్థుల ఎంపికకు వదిలేస్తారా చెప్పలేదు కాని బహుశా తప్పనిసరి చేస్తారేమో. వీటికి తోడు పాఠశాల పునాది దశ నుండే త్రిభాషా సూత్రాన్ని అమలు చేయడం ద్వారా అసలైన జ్ఞానం కంటే కూడా భావ వ్యక్తీకరణా సాధనాలైన భాషలపై ఎక్కువ శ్రద్ధపెట్టడం భాషా భారాన్ని పిల్లలపై రుద్దడం సరైంది కాదు. వివిధ భాషా కేంద్రాల ద్వారా అవసరమైన వారికి అవసరమైన భాషలో శిక్షణ ఇచ్చే కేంద్రాలను ఏర్పాటు చేయాలి తప్పిస్తే బహుళ భాషా సామర్థ్యాల పేరుతో భాషల వత్తిడిని భారాన్ని పిల్లలపై మోపడం సరైంది కాదు. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ట్రాన్స్‌లేషన్ అండ్ ఇంటర్ ప్రిటేషన్ (ఐఐటిఐ)ను స్థాపిస్తారనే మంచి ప్రతిపాదనే చేశారు.

పాఠ్య పుస్తకాలను జాతీయ స్థాయిలో ఎన్‌సిఆర్‌టి వివిధ రాష్ట్రాల స్థాయిల్లో ఎస్‌సిఆర్‌టి లు తయారు చేస్తాయని ఎన్‌సిఆర్‌టి తయారు చేసిన పాఠ్య పుస్తకాలకు రాష్ట్రాల స్థానికతలకు అనుగుణంగా అదనపు మార్పులు చేసుకోవచ్చని, సూచిస్తూనే వినూత్నమైన పాఠ్య పుస్తకాలను అభివృద్ధి చేసే పబ్లిక్, ప్రైవేట్ స్కీంలను అభివృద్ధి చేస్తారని అటువంటి రచయితలకు ప్రోత్సహకాలు, బహుమతులు ఇవ్వబడుతాయని, ఉపాధ్యాయులకు వినూత్నమైన పాఠ్య పుస్తకాలను ఎంపిక చేసుకునే అవకాశం ఉంటుందని వివరించారు. ఆ పనేదో ఎన్‌సిఇఆర్‌టి, ఎస్‌సిఇఆర్‌టిలే చేయవచ్చు. ఉపాధ్యాయులు తమ బోధనను సుసంపన్నం చేసుకోవడానికి అనేక రిఫరెన్స్‌లను ఉపయోగించుకోవచ్చు, అధ్యయనం చేయవచ్చు అది వారి వృత్తి ధర్మం కూడా. అంతేకాని ప్రైవేట్ వారిని అధికారికంగానే ప్రోత్సహించడం సరైంది కాదు.

మూల్యాంకనం సంబంధించి రోట్ మెమోరైజేషన్ కాకుండా సంవత్సరం పొడుగునా అంచనా వేస్తూ అభ్యసనాన్ని నిరంతరం అభివృద్ధి చేసేలా ఉండాలనే మంచి ప్రతిపాదన చేశారు. పాఠశాల విద్యా వ్యవస్థ పనితీరును అంచనా వేయడానికి జాతీయ, రాష్ట్ర స్థాయిల్లో నేషనల్, స్టేట్ అచీవ్‌మెంట్ సర్వేలను (ఎన్‌ఎఎస్, ఎస్‌ఎఎస్) చేపట్టాలని సూచించారు. ఇవి పాఠశాలలను మెరుగుపరచడానికి, లోపాలను సవరించడానికి ఉపయోగపడితే మంచిదే.

ప్రస్తుతం ఉపాధ్యాయుల స్థాయి గౌరవం తగ్గిందని ఉపాధ్యాయ శిక్షణ సంస్థల్లో 92 శాతం ప్రైవేట్‌లే ఉన్నాయని, వాటిల్లో నాణ్యత లోపించిందని, అవి వాణిజ్య దుకాణాలుగా మారాయని, అటువంటి వాటిని మూసేయాలని మంచి ప్రతిపాదన చేసింది రిపోర్ట్. దేశవ్యాప్తంగా పది లక్షల ఉపాధ్యాయ ఖాళీలు ఉన్నాయని చాలా బడుల్లో మౌలిక వసతుల కొరత తీవ్రంగా ఉందని తన పరిశీలనలను వెల్లడించింది. టీచర్ ఎలిజిబిలిటీ టెస్ట్‌ను పటిష్టం చేయాలని సూచించింది. ఉపాధ్యాయ ఎంపిక కోసం టెట్ ఆ తరువాత రాతపరీక్ష, ఆ పైన ఇంటర్వ్యూ, మోడల్ టీచింగ్ వంటి వాటిని ప్రతిపాదించారు. ఉపాధ్యాయ శిక్షణ సంస్థలను బలోపేతం చేయడం వాటిలో గుణాత్మకతను సాధించడమే ప్రధానమైన అంశం, తద్వారా ఉపాధ్యాయ నియామకాలకు స్క్రీనింగ్ టెస్ట్ వంటిది పెడితే సరిపోతుంది.

టీచర్ల ప్రమోషన్లు గాని, వేతన పెంపుదల గాని మెరిట్ ఆధారంగా, పిల్లల, సహచరుల, అభిప్రాయాల హాజరు, అంకితభావం, స్కూల్ కాంప్లెక్స్, స్కూల్ మేనేజ్‌మెంటు కమిటీల అభిప్రాయాలు తదితర అంశాల ఆధారంగా ఉండాలని ప్రతిపాదించారు. ఇవన్నీ కూడా టీచర్లు సరిగ్గా పనిచేయడం లేదనే అవగాహనతో చేసినట్లుగా ఉన్నాయి. ఉన్నత గుణాత్మకమైన ఉపాధ్యాయ శిక్షణ అందించడం ద్వారా మంచి టీచర్లను సమకూర్చుకున్నాక స్క్రీనింగ్ టెస్ట్ లాంటిది పెట్టి సీనియారిటీ ఆధారంగానే ప్రమోషన్లు ఇవ్వాలి. పటిష్టమైన శాస్త్రీయమైన పర్యవేక్షణలను, అలాగే మండల స్థాయిలో రిసోర్స్ టీంను శాశ్వత ప్రాతిపదికన ఏర్పరిచి ఆ టీం తన పరిధిలోని ప్రతి పాఠశాలను రెండు వారాలకోసారైనా సందర్శించి ఆ రోజంతా అక్కడే ఉండి, అక్కడి అకడమిక్ సమస్యలను గుర్తించి వాటి పరిష్కారంలో తాము రోల్ మోడల్‌గా ఉండాలి. అలాగే మౌలిక వసతుల సమస్యలను వెంటవెంటనే సంబంధిత అధికారుల దృష్టికి తీసుకుపోయి సత్వర పరిష్కారంలో భాగస్వాములు కావాలి.

ఇక నుండి 5+3+3+4 చట్రంలో ఏ దశ కూడా మరో దశ కంటే ఎక్కువనే భేదం లేదని, అన్ని దశలు సమాన ప్రాధాన్యతను కల్గి ఉంటాయని, అన్ని దశల్లో పనిచేసే టీచర్లకు సమాన వేతనాలే ఇవ్వాలనే ఒక కొత్త సూచన చేసింది రిపోర్ట్. దీనిని మంచి ప్రతిపాదనగానే చూడొచ్చు. అన్ని స్థాయిలో గుణాత్మకమైన విద్య అందించడం కోసం ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను గుణాత్మకంగా ఉన్నత ప్రమాణాలతో రూపొందించాల్సి ఉంటుంది. పారా టీచర్ల పద్ధతిని ఆపేయాలని మంచి సూచన చేసింది రిపోర్ట్. రాష్ట్ర విద్యా పరిశోధనా శిక్షణ సంస్థ (ఎస్‌సిఇఆర్‌టి) జిల్లా విద్యా శిక్షణ సంస్థ (డిఐఇటి) ఇనిస్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఇన్ ఎడ్యుకేషన్, కాలేజ్ ఆఫ్ టీచర్ ఎడ్యుకేషన్ (సిటిఇ) మొదలగు సంస్థలను బలోపేతం చేయాలనే సూచన మంచిదే.

5+3+3+4 అనే దశలలో ప్రతి దశలోనే ఐదు స్థాయిల ప్రమోషన్లను ప్రతిపాదించారు. దాంతో పాటుగా వివిధ దశల్లోని టీచర్లు, విద్యా పాలన లో లేదా టీచర్ ఎడ్యుకేషన్‌లలోకి వెళ్లే అవకాశాలను ప్రతిపాదించారు. ఉపాధ్యాయ శిక్షణలో నాలుగు సంవత్సరాల బిఇడి ను ప్రతిపాదించారు. ఇది స్థిరీకరించబడేటంత వరకు దీంతో పాటుగా రెండేళ్ల బిఇడి కోర్సు కూడా కొనసాగించాలని చెప్పారు. నాలుగేళ్ల బిఇడి కోర్సుతో పాటుగా రెండేళ్ల బిఇడి కోర్సును కూడా సమాంతరంగా కొనసాగించాలి. ఇక డిఇడి కోర్సుంటుందా ఉండదా అంటే ఉండదనే అనుకోవాల్సి ఉంటుంది. ఫౌండేషనల్, ప్రిపరేటరీ, మిడిల్, సెకండరీ వంటి ప్రతి దశకు

సంబంధించి నిర్ధారిత నాలుగేళ్ల బిఇడి కోర్సును యూనివర్సిటీ స్థాయిలో అందించడం జరుగుతుందనే ప్రతిపాదన చేశారు. ఇవి మంచి సూచనలుగానే కనిపిస్తున్నప్పటికీ లోతుగా పరిశీలించవల్సి ఉన్నాయి.

సమాన, సమ్మిళిత విద్య గురించి ప్రస్తావిస్తూ అది సాధించబడక పోవడానికి కారణాలుగా పాఠశాలలు అందుబాటులో లేకపోవడం, సామాజిక, రాజకీయ, ఆర్థిక, చారిత్రాత్మక కారకాలు, ముఖ్య కారణంగా పేదరికం, మౌలిక వసతుల లేమి, వివక్షా పూరిత సాంఘిక ఆచార వ్యవహారాలను సరిగ్గానే గుర్తించింది రిపోర్టు. దీనికి పరిష్కారంగా ప్రత్యేక విద్యా మండళ్లను సూచించింది. నిజంగా భిన్న సామాజిక వర్గాలు విద్యకు దూరంగా ఉన్నాయని వివరంగా చెబుతూ గొప్పగా కనిపించే ప్రయత్నం చేసిన కమిటీ కంటితుడుపు పరిష్కారాలను చూపెట్టింది. ప్రస్తుతం నడుస్తున్న మదర్సాలు, మక్తాబ్‌లు, గురుకులాలు, హిందూ, సిక్కు, జైన, బౌద్ధ తదితర మత సాంప్రదాయాధారిత పాఠశాలలను వాటి సాంప్రదాయాలను, వాటి బోధనా అభ్యసన రీతులను ప్రోత్సహించాలని అయితే అవి జాతీయ పాఠ్య ప్రణాళికతో సమీకృతం చేయాలనే ప్రతిపాదన చేసింది రిపోర్టు. ఇది కాకుండా కామన్ స్కూల్ విద్యావ్యవస్థను ప్రతిపాదిస్తే సరిపోయేది. కామన్ స్కూల్ విద్యావ్యవస్థను పాటించడం ద్వారా ఈ రిపోర్టు చెబుతున్న అండర్ రిప్రజెంటెడ్ గ్రూప్స్ వారికి విద్యా సమస్యల పరిష్కారం లభించే అవకాశం ఉండేది. ప్రైవేట్ బడులలో వైవిధ్య భరిత ప్రజా సెక్షన్‌ల పిల్లలు లేరని ఆర్థికంగా ఎంతో కొంత వెసులుబాటున్న ఒకే రకం వర్గాల వారే ఉన్నారని ఆవేదన పడుతూ అంతేకాకుండా అన్ని వర్గాల వారికి వాటిల్లో వెసులుబాటు ఉండాలని ప్రతిపాదన చేశారు. అయితే మొత్తంగానే ప్రభుత్వ నిధులతో, ప్రభుత్వ ఆధీనంలో నాణ్యమైన సమాన విద్యను ఉచితంగా నిర్బంధంగా అందించే కామన్ స్కూల్ విద్యా వ్యవస్థను విస్మరించడం ఈ కమిటీ లోపంగానే చూడాలి. అంతకంటే కూడా ప్రైవేట్ విద్యా వ్యవస్థను ప్రోత్సహించే కుట్రగా కూడా అర్థం చేసుకోవచ్చు. కామన్ స్కూల్ విద్యా వ్యవస్థతో పాటు అవసరమైన వర్గాలకు రెసిడెన్షియల్ పద్ధతిలో నాణ్యమైన వసతులతో ఉచిత గుణాత్మక విద్యను అందించడాన్ని సూచించలేదు ఈ రిపోర్టు.

ప్రతి కిలోమీటర్ లోపు ఒక ప్రాథమిక పాఠశాల ఉండాలనే సూత్రీకరణ ఆధారంగా పాఠశాలల సంఖ్య పెరిగిందని కాని విద్యార్థుల సంఖ్య తగ్గిందని అభిప్రాయపడ్డారు. 2016-17 సమాచారం మేరకు 28 శాతం ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలల్లో, 14.8 శాతం ప్రాథమికోన్నత పాఠశాలల్లో 30 మంది కంటే తక్కువ విద్యార్థులున్నారు. అలాగే 1,19,303 ఏకోపాధ్యాయ పాఠశాలలున్నాయని అందులో ఎక్కువగా 94,028 ప్రాథమిక పాఠశాలలేనని 80శాతం ప్రాథమిక పాఠశాలలో 3 లేదా ఇంకా తక్కువగా ఉపాధ్యాయులున్నారని వివరించారు. దీనికి ఇంకా పరిష్కారంగా స్కూల్ కాంప్లెక్స్ అనే భావనను ముందుకు తెచ్చింది రిపోర్ట్. రేషనలైజేషన్, కన్సాలిడేషన్, విలీనాలు, చిన్న పాఠశాలలు, మిగులు పాఠశాలలు పాఠశాలల పేరుతో ప్రభుత్వ బడులను మూసేసి వస్తున్నారు. ఇవి దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలో జరుగుతున్నదే ఏటా కొన్ని లక్షల పాఠశాలలు మూత పడుతుండడం అనుభవంలో ఉన్నదే. విద్యార్థుల సంఖ్య తక్కువగా ఉండడం వలన అన్ని వసతులను, తరగతికోగది, తరగతికో టీచరును ఇవ్వడం సాధ్యం కాదని అందుకే చిన్నచిన్న పాఠశాలలను కలిపి ఒక స్కూల్‌గా మార్చడాన్ని పరిష్కారంగా చూపారు. అందులో భాగంగానే స్కూల్ కాంప్లెక్స్ భావనను ముందుకు తెచ్చింది ఈ రిపోర్టు.

స్కూల్ కాంప్లెక్సుల ద్వారా ఏకోపాధ్యాయ, చిన్న లేదా మిగులు పాఠశాలల్లో తరగతికో టీచరు తరగతికో గది, ఆటస్థలాలు, లైబ్రరీలు, లాబొరేటరీలున్న పాఠశాలలుగా మారవు. స్కూల్ కాంప్లెక్స్ భావనను కొఠారి కమీషన్ 1964లోనే చేసిందని తమ వాదనకు బలాన్ని అరువు తెచ్చుకునే ప్రయత్నం చేసింది రిపోర్ట్. అదే సమయంలో కొఠారి కమిషన్ సూచించిన కామన్ స్కూల్ వ్యవస్థను ప్రతిపాదించడానికి కమిటీకి మనసొప్పలేదు. కావల్సింది స్కూల్ కాంప్లెక్స్‌లు కాదు విద్యా ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ, వ్యాపారీకరణల రద్దుతో పాటు ఒక ప్రాంతంలో ఒకే పాఠశాలను నెలకొల్పి స్కూల్ కాంప్లెక్స్‌లలో సూచిస్తున్న అన్ని వనరులు, వసతులతో పాటు వాటికి అదనంగా మరింత మెరుగైన సౌకర్యాలతో ఉన్నత ప్రమాణాలతో, విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధిని సాధించేలా విద్యను అందించే సూచనలు చేయడానికి ఈ కమిటీ సాహసం చేయలేకపోయింది.

విద్య, బడులు అమ్ముకునే కొనుక్కునే వస్తువులు కాదన్న జాతీయ విద్యా విధాన నివేదిక పబ్లిక్, ప్రైవేట్ విద్యారంగాలను సమానంగానే చూడాలని అభిప్రాయపడింది. మరీ దారుణమైన విషయమేమంటే ప్రైవేట్ సంస్థలు ఫీజులను తమ ఇష్ట ప్రకారం నిర్ణయించుకోవచ్చుని అయితే యథేచ్ఛగా పెద్ద మొత్తంలో పెంచవద్దని, న్యాయమైన రీతిలో పెంచుకోవచ్చని అభిప్రాయపడింది. మరోవైపు ధాతృత్వ స్వభావం ఉన్న పాఠశాలలను ప్రోత్సహించాలని చెప్పారు. అయితే అలా ముందుకు వచ్చే సంస్థలు చాలా అరుదు. అసలు లేవనే చెప్పాల్సి ఉంటుంది. ప్రైవేట్ పాఠశాలల పేరులో పబ్లిక్ అనే పదం వాడొద్దని కేవలం ప్రభుత్వ, ఎయిడెడ్‌వి మాత్రమే 'పబ్లిక్' స్కూల్స్ అనబడతాయని ఇదేదో పెద్ద ఘనకార్యం చేసినట్లుగా చెప్పుకొచ్చారు. దీంతో ప్రజలకు ఒరిగే మేలేమి లేదు.

విద్యా హక్కు చట్టం సూచించిన ప్రైవేట్ బడుల్లో 25 శాతం ప్రవేశాలు సమాజంలో సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన బలహీన వర్గాలకు కేటాయించాలన్న స్ఫూర్తి దుర్వినియోగం అవుతున్నదని చెప్పారు. ఈ 25 శాతం ప్రవేశాలకు సంబంధించి ప్రభుత్వం ఫీజులు చెల్లిస్తుంది. పిల్లలను చేర్చుకోకుండానే చేర్చుకున్నట్లు చెప్పి లేదా అలా చేర్చుకున్న వారిని వివక్షతలతో చూడడం జరుగుతున్నదని వివరించారు. అసలు ప్రైవేట్ విద్యా వ్యవస్థనే ఉండొద్దు. ఒకవేళ అవి ఉండే సందర్భాలలో వాటిల్లో 25 శాతం ప్రవేశాలు ఉచితంగానే ఇవ్వాలి గాని ప్రభుత్వం చెల్లించకూడదు. ఇలా చెల్లించడం ఒక రకంగా పబ్లిక్ ధనాన్ని ప్రైవేట్ వారికి అప్పజెప్పే దళారీతనం అవుతుంది తప్ప మరోటి కాదు.

నిరంతర సమగ్ర మూల్యాంకనం, నో డిటెన్షన్ పాలసీలను సవరిస్తూ విద్యా హక్కు చట్టానికి ఇటీవల చేసిన సవరణలను సమీక్షించాలని చెప్పడం ద్వారా మంచి సూచనే చేసినట్లయింది. పిల్లలు వయస్సుకు తగిన అభ్యసనా స్థాయిలను సాధించేలా పాఠశాలలు బాధ్యత పడేలా దానికి తగిన యంత్రాంగాన్ని ఏర్పరిచేలా చూడాలని మంచి సూచననే చేసింది రిపోర్టు.

అక్కడక్కడా గంభీరమైన మంచిమాటలు, సూత్రీకరణలు, గుణాత్మకత, నాణ్యమైన విద్య, పిల్లల సర్వతో ముఖాభివృద్ధి, మౌలిక వసతులను కల్పించడం, ఉపాధ్యాయుల నియామకాలను చేపట్టడం, విద్య వ్యాపార సరుకుకాదని చెప్పడం, గుణాత్మక ఉపాధ్యాయ విద్యను పెంపొందించడం, ప్రైవేట్ వ్యాపార ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను రద్దు చేయడం, సామాజికార్థికంగా వెనుకబడిన వర్గాల విద్య గురించి మాట్లాడడం ద్వారా గొప్పగా కనిపించే ప్రయత్నం చేసింది ఈ కమిటీ. లోతుల్లోకి వెళ్లి పరిశీలిస్తే ప్రభుత్వ పాఠశాలలను మరింతగా దిగజార్చేలా ఉన్నది. అందరికి సమానమైన గుణాత్మక ఉన్నత ప్రమాణాలతో కూడిన ఉచిత విద్యను గ్యారంటీ చేయడానికి సిఫార్సు చేయలేదు. ఈ రిపోర్టు విద్యా ప్రైవేటీకరణను మత సాంప్రదాయక విద్యను ప్రోత్సహించేదిగా ఉన్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# రంగు మారనున్న రాష్ట్ర రెవెన్యూ చట్టం

*అధికార యంత్రాంగం ప్రజలకు జవాబుదారీగా ఉంటూ ఉద్యోగుల్లో సానుకూల ఆలోచనలు తేవాలనీ, ముఖ్యంగా రైతాంగ సమస్యలను వెంటనే పరిష్కరించే దిశగా అడుగులు వేయాలనీ మొత్తంగా ప్రభుత్వం రెవెన్యూ వ్యవస్థపై ప్రజలకు నమ్మకం కల్పించేలా చేయాలనీ అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

వ్యవసాయమే ప్రధాన ఆర్థిక వనరుగా ఉన్న భూస్వామ్య సమాజంలో బ్రిటిష్‌వారు ఈ దేశంలో ప్రజల గోళ్లూడగొట్టి భూమి శిస్తు వసూలు చేయడానికి ఏర్పాటు చేసుకున్న రెవెన్యూ వ్యవస్థకు సుదీర్ఘమైన చరిత్ర కలదు. భూస్వామ్య, పెత్తందారీ వ్యవస్థతో రూపుదిద్దుకున్న నిజాం హైదరాబాద్ రాష్ట్రం భారతదేశంలో విలీనమైన తర్వాత అప్పటి పాలకులు 'దున్నేవానిదే భూమి' అన్న నినాదంతో రూపొందించిన చట్టాల అమలును ప్రధానంగా జాగీర్దార్ల వ్యవస్థ రద్దు మొదులుకొని రక్షిత కౌలు చట్టం లాంటి సంస్కరణలను ఆచరణాత్మకంగా అమలు చేసి భూస్వామ్య, భూ సంబంధాలలో మౌలిక మార్పును తీసుకొచ్చింది ఈ రెవెన్యూ వ్యవస్థనే. అనంతర కాలంలో దీని పరిధి మరింతగా విస్తరించి లోపభూయిష్టమైన వ్యవసాయ భూ సంస్కరణ చట్టాన్ని అమలు చేసే క్రమంలో కోర్టు కేసులను కూడా ఎదుర్కొంటోంది.

ఇటీవల రాష్ట్రంలో ఈ వ్యవస్థ వీటితో పాటు పట్టణ భూ గరిష్ట పరిమితి చట్టాన్ని అమలు చేసి పేదలకు ఇంటి స్థలాల పంపిణీ, రేషన్ కార్డులు, అసరా పెన్షన్‌లు, కంటి వెలుగు, గొర్రెల, బర్రెల పంపిణీ, కళ్యాణ లక్ష్మి, షాదీ ముభారక్, ఆపద్బంధువు లాంటి తదితర అర్హులను గుర్తిస్తుంది. ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు, శాంతి భద్రతల పరిరక్షణ, ఎన్నికలు ప్రశాంతంగా నిర్వహించడంలో రెవెన్యూ శాఖే కీలకమైంది. మనిషి పుట్టుకను ధృవీకరించే పత్రం మొదలు మరణ ధృవీకరణ పత్రం జారీ వరకు అవసరమైన అన్ని సందర్భాలోను, ప్రాజెక్టులకు, రోడ్ల విస్తరణకు భూసేకరణ కూడా ఈ శాఖే పరిశీలిస్తుంది.

తెలంగాణలో నిజాం పాలనలో, గ్రామ పరిపాలన, చెరువుల నిర్వహణ ఏ గ్రామానికి ఆ గ్రామం పటేల్ పట్వారీ వ్యవస్థ ద్వారా జరిగేవి. ఆ రోజుల్లో భూమి శిస్తు ఉండేది. కరువు కాటకాలు వస్తే భూమి శిస్తు రద్దుచేసి రైతులను ఆదుకునే సంప్రదాయముండేది. దీనితో పాటు కరువు పనులు చేపట్టి భూగర్భ జలాలు పెంచుకోవడానికి ఎక్కడికక్కడ ఖుష్కి పొలాల్లో కట్టవేసి పనిలేని కూలీలకు ఉపాధి కల్పించేవారు. భూమి హక్కులు కల్పించడానికి పావుత్తి బుక్కులు ఇచ్చేవారు. అవి నేటి పట్టాదారు పాసు పుస్తకాలతో సమానం.

### సంచలనం సృష్టించిన సామాజిక మాధ్యమం

ఈ మధ్య శరత్ అనే యువకుడు తన భూ సమస్యను వీడియో రూపంలో చిత్రీకరించి సామాజిక మాధ్యమాల్లో పోస్టు చేస్తే అది రాష్ట్ర ముఖ్యమంత్రి దృష్టికెళ్లడం, ఆయన వెంటనే స్పందించి జిల్లా యంత్రాంగాన్ని పరుగు పెట్టించి సమస్య సాధనకు చర్యలు తీసుకోవడంతో రెవెన్యూ వ్యవస్థతో పాటు యావత్ రాష్ట్రమంత సంచలనం సృష్టించింది. ఆ సమస్య సాధన పారదర్శకంగా జరగలేదని మరుసటి రోజు మీడియా ద్వారా తెలిసింది. ఏ మారుమూల గ్రామానికి వెళ్లినా ఇలాంటి సమస్యలు లెక్కకు మించి కన్పిస్తాయి. దీనికి ప్రధాన కారణం గత దశాబ్ద కాలం నుండి భూముల ధరలు ఆకాశాన్నంటాయి. ఒక్కసారిగా ఊహించలేని విధంగా ధరలు పెరగడంతో ఇలాంటి సమస్యలు మరిన్ని ఎక్కువయ్యాయి.

గతంలో అత్యధికంగా భూముల కొనుగోలు అమ్మకాలు కేవలం పెద్ద మనుషుల సమక్షంలో సాదా పేపర్లపై రాసుకొని కాస్తు చేసుకునేవారు. అనంతరం రెవెన్యూవారు రికార్డుల్లో మార్పు చేసుకునే వారు. ఏ కొద్దిమందో డబ్బున్నవారు, బాగా తెలిసినవారు మండల కేంద్రాలకు వెళ్లి రిజిస్ట్రీ చేయించుకునేవారు.

భూముల ధరలు విపరీతంగా పెరగడంతో గతంలో కొనుగోలు చేసిన భూములు సైతం సరైన సంతకాలు లేవనే కారణంతో కబ్జాచేసి లాక్కుంటున్న సందర్భాలను అనేకం చూస్తున్నాం. దీనికితోడు రెవెన్యూ వ్యవస్థలో వచ్చిన సాంకేతిక సమస్యలను ఆసరాగా చేసుకొని రెవెన్యూ సిబ్బంది భారీగా అవినీతికి పాల్పడుతుంది. ఎన్ని కఠిన చట్టాలు తెచ్చినా, ఎంతో పారదర్శకంగా సాంకేతిక రంగం అభివృద్ధి చెందినా వ్యవస్థలో లంచాలను నియంత్రించడంలో ఈ ప్రభుత్వాలు సఫలం కాలేదు. సిబ్బంది కొత్త కొత్త మార్గాలను అన్వేషించుకొని వాటి ద్వారా లంచాలు స్వీకరిస్తున్నారని ఆరోపణలున్నాయి.

ఈ నేపథ్యంలో అన్ని కూలంకషంగా చర్చించి రెవెన్యూ వ్యవస్థను సమర్థవంతంగా పనిచేయడానికి నూతన నియమావళిని ఏర్పాటు చేస్తే ఎవరికి అభ్యంతరం ఉండదు. కాని కేవలం సంచలనాలు సృష్టించే మాటలకే పరిమితమైతే తెలంగాణ భూ సమగ్ర సర్వేను దేశానికి గర్వకారణమని ఆకాశానికెత్తి పొగిడి ఒక నెల జీతాన్ని (బోనస్) ప్రోత్సాహకంగా ప్రకటించిన మూడు నెలలకే నిందించడమంటే ముందు పొగడ్తలు కేవలం రాజకీయ ప్రయోజనం కొరకేనని, బలమైన సామాజికాంశాన్ని పరిష్కరించడం కోసం కాదని అర్థమవుతుంది.

### రెవెన్యూ వ్యవస్థ ద్వారా యాజమాన్య హక్కులకు ప్రభుత్వ చర్యలు

1987లోనే ప్లానింగ్ కమిషన్ డిప్యూటీ చైర్మన్ ప్రొ. మన్మోహన్‌సింగ్ భూములకు యాజమాన్య హక్కులకై ప్రొ. డి.సి. వాద్వాతో ఏకసభ్య కమిషన్ ఏర్పాటు చేసినారు. ఈ కమిషన్ రెండు సంవత్సరాల్లో నివేదిక ఇచ్చింది. ఈ నివేదికలోని ప్రధానాంశాలు, భారతదేశంలో భూ దస్తావేజులు చాలా బలహీనంగా ఉన్నాయని, గ్రామాలతో పాటు పట్టణాల్లో కూడా అనేకమైన ఆటంకాల మధ్యన భూ యాజమాన్యపు హక్కులను కలిగినారని, దీని ద్వారా ఆర్థికాభివృద్ధికి ఆటంకం కలుగుతుంది. కావున ఈ భూ యాజమాన్యపు హక్కులను సరళతరం చేసి క్రమబద్దీకరణ చేయడం అత్యంత ఆవశ్యకమని కమిషన్ నివేదికలో పేర్కొన్నారు. నివేదిక సమర్పించిన అనంతరం ఆశించిన చర్యలు గత

ప్రభుత్వాల్లో జరగలేవు.

తిరిగి కేంద్ర ప్రభుత్వం 2002లో ప్రొ. డి.సి. వాద్వా కమిషన్ రిపోర్టుపై విస్తృతంగా చర్చించింది. 2008లో కేంద్ర జాతీయ భూ రికార్డుల నవీకరణ పథకం (స్ట్రేటజీ ల్యాండ్ అండ్ రిసోర్స్ మేనేజ్‌మెంట్ ప్లాన్)ను కూడా ప్రకటించింది. దీని ప్రకారం దేశంలోని అన్ని రాష్ట్రాల్లో భూములు సమగ్ర సర్వే చేసి రికార్డులను ఆన్-లైన్‌లో ప్రజలందరికీ అందుబాటులో ఉంచాలనే నిర్ణయం జరిగింది. 2021 కల్లా ఈ కార్యక్రమాన్ని పూర్తి చేయాలనుకున్నారు. కాని ఆచరణలో కార్యరూపం దాల్చలేదు. పైలెట్ ప్రాజెక్టుగా దేశ వ్యాప్తంగా మూడు ప్రాంతాల్లో సమగ్ర సర్వేను ప్రతిపాదించారు. అందులో తెలంగాణలో నిజామాబాద్ జిల్లా ఒక్కటి. నిజామాబాద్ జిల్లాలో భూ భారతి ప్రాజెక్టు కొనసాగుతుంది. నిజామాబాద్ జిల్లాలో 911 గ్రామాల్లో 400 గ్రామాల్లో భూములకు సంబంధించిన అన్ని ప్రక్రియలు పూర్తి కాగా, 511 గ్రామాల్లో భూ సర్వే చేయాల్సి ఉంది. ఇది ఇంకా రెవెన్యూ వ్యవస్థలో సాగుతూనే ఉంది. ఈ నేపథ్యాన్ని పరిశీలించినప్పుడు తెలంగాణలో భూ ప్రక్షాళనకు 2002లోనే కేంద్ర ప్రభుత్వ ఆలోచనతో మొదలయింది.

కాగా భూమి శిస్తు రద్దు తర్వాత గత పాలకులు రెవెన్యూ వ్యవస్థలోని గ్రామ స్థాయి అధికారులైన పటేల్ - పట్వారీ వ్యవస్థను రద్దు చేశాక ప్రత్యామ్నాయ వ్యవస్థ లేకపోవడంతో భూ రికార్డులను కొద్దికాలం పంచాయతీ సెక్రెటరీలకు అప్పజెప్పారు. అనంతరం విలేజ్ రెవెన్యూ వ్యవస్థను ఏర్పాటు చేసి గ్రామానికి ఒకరు కాకుండా, క్లస్టర్ విధానంలో కొన్ని గ్రామాలను కలిపి ఒక్కరే విఆర్ఒను నియమించారు. వీరికి కూడా తగు శిక్షణ ఇవ్వలేదు.

2001లో చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో గ్రామ రెవెన్యూ వ్యవస్థను నడిపే గ్రామాధికారులకే పంచాయితీ శాఖను అప్పజెప్పాడు. దీంతో పాటు గ్రామ పహణి పత్రికను గ్రామ పంచాయితీల వారిగా ముక్కలు ముక్కలుగా విభజించినారు. గ్రామ రెవెన్యూ విధుల పట్ల సుశిక్షితులైన వారు లేని కారణంగా రెవెన్యూ పరిజ్ఞానం లోపించడం వలన రికార్డుల్లో అనేక తప్పులు చోటు చేసుకున్నాయి. తిరిగి 2007లో మొత్తం గ్రామ వ్యవస్థ నిర్ధారణ రెవెన్యూ శాఖ ఆధీనంలోకి వచ్చింది. దీని పరిధి విస్తరించడం వలన రెవెన్యూ పనులతో పాటు కుటుంబ నియంత్రణ, ప్రోటోకాల్ గుర్తింపు అన్ని రకాల సర్వేలు వివిధ విభాగాల పథకాల అమలు వంటి పనులను ఉరుకులు పరుగులతో చేయాల్సి వచ్చింది. ఈ క్రమంలో ప్రధానమైన భూ రికార్డుల తయారీలో వెనుకబడ్డారు. సరైన శిక్షణ, పర్యవేక్షణ లేని కారణంగా ఈ క్రమంలో చేసిన కంప్యూటరీకరణతో భూ రికార్డులు గందరగోళంగా తయారు అయినాయి. ఈ మొత్తం వ్యవస్థలోని అధికారుల అలసత్వం ఉదాసీనత కన్నా లోపభూయిష్టమైన ప్రభుత్వ విధాన నిర్ణయాలు కారణమని తెలుస్తుంది.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా 2017 సెప్టెంబర్ 15 నుండి భూముల ప్రక్షాళన చేపట్టింది. సుమారు 2.28 కోట్ల ఎకరాల భూ విస్తీర్ణంగా దాదాపు 1.63 కోట్ల సర్వే నెంబర్స్‌తో భూమి ఉన్నట్లు రికార్డుల్లో నమోదు అయింది. దీనికి తోడుగా అవినీతి రెవెన్యూ అధికారులు కాలక్రమంలో ఉప సంఖ్యలు వేసి పట్టాలు జారీ చేసినారు. సరిహద్దులు అధికారికంగా గుర్తించని కారణంగా కోర్టుల్లో వివాదాలు సంవత్సరాలుగా పెండింగ్‌లో ఉన్నాయి. ఈ క్రమంలో క్షేత్రస్థాయిలో లెక్కకు మించిన గందరగోళాలున్నాయి.

ఈ గందరగోళాలను పరిష్కరించే దిశగా పారదర్శకంగా భూ సర్వే చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. భూ సర్వే జరిపేందుకు శాటిలైట్, లైడార్, డిజిపియస్ అనే మూడు పద్ధతులను చర్చించినారు. శాటిలైట్ ద్వారా జరిగే సర్వేలో ఫోటో కొలుతల్లో 30 సెంటిమీటర్లు వ్యత్యాసం వస్తుంది. లైడార్ సర్వేలో 5 సెంటిమీటర్లు వ్యత్యాసమే కాని రక్షణ శాఖ అనుమతి అవసరం. దీంతో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం డిజిపియస్ విధానం ద్వారా సర్వే చేయించాలని నిర్ణయించింది. దీనికి కోట్ల రూపాయల ఖర్చు అంచనా వేసింది.

భవిష్యత్ తెలంగాణ భౌగోళిక స్వరూపానికి బాటలు వేస్తున్నట్లు ప్రచార ఆర్భాటం పెంచింది. భూ నవీకరణ జరుగుతుందని, ఇక నుండి రైతులకు ఎలాంటి ఇబ్బందులుండవని, పైసా ఖర్చు లేకుండా పాస్ పుస్తకాలు వెబ్‌సైట్‌లోకి వస్తాయని ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలో కథనాలను ప్రచారం చేసినారు. విశ్లేషకులు అద్భుతంగా విశ్లేషించారు. మన పాలకుల విధానాల దార్శనికత్వం శిఖర భాగానికి చేరిందని ప్రజలందరిని నమ్మించారు. కాని ఆచరణలో ప్రజలు ఆశించింది జరగలేదు. కొన్ని అక్రమంగా ఉన్నవి సక్రమం చేసినారు. అధికంగా పాత పట్టాల స్థానంలో కొత్త పట్టాలు 1(బి) రికార్డులో నమోదు చేసినారు. అనేక అవాంతరాలు, ఆందోళనల మధ్య 2018 మే నెలలో అసంపూర్తిగానే పాసు పుస్తకాలు పంపిణీ చేశారు. అనుకున్న లక్ష్యం నెరవేరలేదని రైతులు, రైతు సంఘాలు ఆందోళనలు చేపట్టినారు. కాని ప్రభుత్వం అనుకున్న లక్ష్యం నెరవేరింది. ఎన్నికల ముందు రైతుబంధు పథకం పేరా ప్రతి ఎకరానికి ఒక పంట కాలానికి రు. 4 వేలు ఇవ్వడం కూడా ప్రారంభమైంది. నేటికి జరిగిన అన్ని ఎన్నికల్లో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వాన్ని సంక్షేమ పథకాలు, రైతుబంధు పథకాలే విజయ తీరాలకు చేర్చినాయనేది బహిరంగ రహస్యం..

**భూ రికార్డుల అభివృద్ధి పథకం - సమీకృత భూ రికార్డు నిర్వహణ**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం భూ నవీకరణలో భాగంగా ధరణి వెబ్‌సైట్‌లో రికార్డుల నమోదు, పర్యవేక్షణ మండల రెవెన్యూ సిబ్బందికి అప్పజెప్పింది. కాని సరిచేసే బాధ్యతలను మాత్రం జాయింట్ కలెక్టర్, జిల్లా కలెక్టర్లకు కేటాయించింది. దీంతో మండల స్థాయి అధికారులు అవాక్కయ్యారు. తొలుత భూ నవీకరణ ప్రక్రియలో తహసీల్దారులకు సానుకూలమైన ఆదేశాలతో ఆప్షన్ ఉండేది. ధరణి ప్రాజెక్ట్ అప్‌లోడ్‌కు ప్రతి చిన్న సవరణలు కంప్యూటర్ ముందు కూర్చుని పలు రకాల కంప్యూటర్ కమాండ్స్‌తో సరిచేయాలి. కాని పెరిగిన పని ఒత్తిడి దృష్ట్యా తహసీల్దారు విఆర్ఒలకు అప్పగించినారు.

ఒక్కొక్క విఆర్ఒకు 5 నుండి 8 గ్రామాలకు బాధ్యత ఉండడం, వారికి ఎలాంటి శిక్షణ ఇవ్వకపోవడం మొత్తం వ్యవస్థ కుంటుపడింది. ధరణి వెబ్‌సైట్ సర్వర్ స్పీడ్ సామర్థ్యం తక్కువగా ఉండడం వలన సమాచారాన్ని కూర్చడానికి అధిక సమయం పట్టింది.

ఈ ప్రక్రియలో ఒక పట్టదారుకు, డిజిటల్ సైన్ చేసిన వెంటనే 'లాగ్ అవుట్' అవుతుంది. ప్రతి పట్టాదారుకు లాగిన్ అవ్వాలి. సగటున రోజుకు 100 మంది పట్టాదారుల సమాచారాన్ని అప్‌లోడ్ చేస్తే 100 సార్లు లాగిన్ అవ్వాల్సిందే. డిజిటల్ సంతకం చేస్తే సుమారు 5 నిమిషాలు బఫర్ రౌండ్‌గా తిరుగుతుంది. పొరపాటున ఏదైనా కరక్షన్ గాని మార్పు గాని చేయాలంటే జాయింట్ కలెక్టర్ సైట్‌లో జాయింట్ లాగిన్ రివీల్ అయి రావాలి. ఈ సాంకేతికమైన సమస్యలు కాలయాపనకు దారితీసినాయి. దీనికి తోడుగా కొత్తగా ఏర్పడిన జిల్లా, డివిజన్ మండల కార్యాలయాల్లో సరిపోను సిబ్బంది, మౌలిక సదుపాయాలు లేవు.

ఏడు దశాబ్దాల క్రితం నిర్ధారించిన కేడర్ స్ట్రెంత్‌తోనే ఈ శాఖ పనిచేస్తుంది. పెరిగిన జనాభా అవసరాలకనుగుణంగా సిబ్బంది పెరగలేదు. హేతుబద్ధమైన కారణాలున్నప్పటికీ ఎంతో సదుద్దేశంతో సాదా బైనామా భూ రికార్డుల ప్రక్షాళనతో పాస్ పుస్తకాల పంపకం విస్మయం కలిగించే అనేక విషయాలను బహిర్గతం చేసింది.

ఈ శాఖలో కొందరు ఉద్యోగులు, అధికారులు ఎకరానికి రేట్లు నిర్ధారించి రైతుల నుండి డబ్బులు వసూలు చేశారని ఆరోపణలున్నాయి. దీనితో ఆగకుండా ఈ దందా డబ్బులు తీసుకొని సక్రమంగా ఉన్న రికార్డులను అక్రమంగా మార్చినారని, లిటిగేషన్ పేరుతో భూ రికార్డులను టాంపరింగ్ చేయడం లాంటి పనుల మూలంగా మొత్తం రెవెన్యూ వ్యవస్థ పనితీరే మసకబారింది.

**రెవెన్యూ శాఖ పేరు మార్చే దిశగా అడుగులు**

రాష్ట్రంలో విభిన్న రంగాల్లో సమర్థవంతంగా ముందుకు సాగాలంటే రాబోయే జూలై లేదా ఆగస్టులో కొత్త రెవెన్యూ చట్టాన్ని అమల్లోకి తేవాలని ప్రభుత్వం ప్రకటించింది. ఈ నేపథ్యంలో అవినీతికి అస్కారం లేని విధంగా ప్రజలకు మరింత దగ్గరగా సేవలు అందించేందుకు వీలుగా కొత్త రెవెన్యూ చట్టం రూపొందించాలని అధికారులను ముఖ్యమంత్రి ఆదేశించారు. భూ పరిపాలన విభాగంలో సమగ్ర మార్పులు తేవడానికి, వ్యవసాయ భూములపై సంపూర్ణ అధికారాలను స్వతంత్ర సంస్థలకు అప్పగించేలా కొత్త రెవెన్యూ చట్టాన్ని ప్రతిపాధించేందుకు సన్నాహాలను ఏర్పాటు చేస్తోంది. ఈ క్రమంలో రెవెన్యూ శాఖ పేరు మార్చే దిశగా అడుగులు వేస్తోంది. రాష్ట్ర స్థాయిలో దీనిని సాధారణ పరిపాలన శాఖ (జిఎడి) లో విలీనం చేయాలని, జిల్లా స్థాయిలో రెవెన్యూ పేరును సాధారణ పరిపాలనగా మార్చాలనే ఆలోచనలో ఉంది. ఈ మార్పుతో వ్యవసాయ భూములు, రిజిస్ట్రేషన్, మ్యూటేషన్, వ్యవహారాలను ధరణి వెబ్‌సైట్ ద్వారా చూడనుంది.

కాగా వ్యవసాయ భూములకు సంపూర్ణ యాజమాన్య హక్కులు దాఖలు పరుస్తామని పాలకులు పలు దఫాలుగా హామీలిచ్చినారే గాని ఆచరించలేదు. పైగా భూ పరిపాలనను పూర్తిగా రెవెన్యూ వ్యవస్థ నుంచి తప్పించి కొత్త రెవెన్యూ చట్టాన్ని తీసుకురావాలని ప్రభుత్వం యోచిస్తుంది. దీని ద్వారా ఎక్కడికక్కడ చట్టబద్ధ అధికారాలు కలిగిన స్వతంత్ర సంస్థలు భూములను రిజిస్ట్రేషన్ చేసి రికార్డుల్లో యజమానుల పేర్లను మ్యూటేషన్ చేయనున్నాయి. అన్ని సవ్యంగా జరిగితే రిజిస్ట్రేషన్ పూర్తి కాగానే పట్టదారు పాస్ పుస్తకాలు రైతు ఇంటికే పోస్టు ద్వారా చేరనున్నాయని ప్రకటించింది. పైకి ఈ ప్రకటన ఎంతో గొప్పగా, చారిత్రాత్మకమైనదిగా కనిపిస్తున్నా, పాలన ఎంతో రుజువర్తన కలిగి ఉంటే తప్ప ఇది సాధ్యం కాదు. గత అనుభవాల దృష్ట్యా మన పాలకుల చిత్తశుద్ధి కేవలం ప్రకటనల వరకే పరిమితం కావడం విషాదకరం.

**కొత్త రెవెన్యూ చట్టం ముసాయిదా**

ఆంధ్రప్రదేశ్ పునర్విభజన చట్టం ప్రకారం ఉమ్మడి రాష్ట్రంలోని చట్టాలనే మన ప్రభుత్వం అన్వయించుకుంది. నేడు రాష్ట్రంలో కొత్తగా రూపొందించనున్న రెవెన్యూ చట్టం పూర్తిగా తెలంగాణ భూముల పరిస్థితులకు అనుగుణంగా రూపొందించాలి. ఈ మేరకు ప్రస్తుతం ఉన్న చట్టాల్లో మార్పులు తీసుకురావాలి. తెలంగాణ ప్రభుత్వం రాష్ట్రం ఏర్పడిన తొలినాళ్లలోనే కొత్త చట్టాలను రూపొందించి అమలు చేయాలని తీర్మాణించింది. ఆ మేరకు తెలంగాణ పరిస్థితులకు ఎలాంటి చట్టం అవసరమో అధ్యయనం చేసి నివేదిక ఇవ్వాలని 2015 అక్టోబర్‌లో జిఒ ఆర్‌టి నెం 470 కింద నల్సార్ న్యాయ విశ్వవిద్యాలయానికి బాధ్యత అప్పగించారు. ఈ విశ్వవిద్యాలయం రాష్ట్రంలో అప్పటి వరకు అమల్లో ఉన్న చట్టాలతో పాటు పలు రాష్ట్రాల చట్టాలపై సమగ్రంగా అధ్యయనం చేసి 2016 మే నెలలో 300 పేజీల సమగ్ర నివేదికను ప్రభుత్వానికి అందించింది. ఈ నివేదికలో రాష్ట్రంలో ఉన్న చట్టంలో ఎలాంటి మార్పులు చేర్పులు చేయాలో సూచించింది. అత్యంత ప్రధానంగా భూములను సర్వే చేయాలని, రికార్డ్ ఆఫ్ రైట్ చట్టం (ఆర్ఒఆర్) లో మార్పులు చేయాలని పేర్కొన్నారు. కొత్త సర్వే బౌండరీ చట్టం రూపొందించుకొని భౌగోళిక సరిహద్దులను గుర్తించుకోవాలనే పలు కీలక అంశాలతో కొత్త చట్టం రూపొందించడానికి వీలుగా సిఫార్సులున్నాయి. తెలంగాణలో ఉన్న 127 భూమి పట్టాలన్నింటినీ ఒకే రెవెన్యూ కోడ్ కిందకు తీసుకురావాలి. రాష్ట్రంతో పాటుగా ప్రతి జిల్లాకు ఒక భూ వివాదాల న్యాయ స్థానాలు ఏర్పాటు చేయాలి. రెవెన్యూ యంత్రాంగానికి శిక్షణ ఏర్పాటు చేయాలి. ముసాయిదాను తెలుగులో పొందుపరిచి ప్రజలకు అందుబాటులోకి తేవాలి. భూ దస్త్రాల ఆధునీకరణ చేపట్టి ప్రజల భాగస్వామ్యంతో రికార్డులు డిజిటలీకరణ చేయాలి. భూ సంస్కరణల్లో భాగంగా లింగబేధం లేకుండా మహిళా హక్కులు కాపాడాలని పై సిఫారసుల ఆధారంతో బలమైన రెవెన్యూ చట్టానికి సరళీకృతమైన, వ్యవస్థీకృత మార్పుకు బలమైన పునాదులు వేయాల్సిన అవసరం ఉంది. ఇది కాక ప్రభుత్వం మార్పు పేరుతో కలెక్టర్ వ్యవస్థపై కన్ను వేసింది.

**కలెక్టర్ వ్యవస్థ మార్పుపై ప్రభుత్వ ఆలోచన**

247 సంవత్సరాల క్రితం అనగా 1772లో బెంగాల్ గవర్నర్ జనరల్‌గా ఉన్న వారన్ హెస్టింగ్స్ తొలుతగా కలెక్టర్ వ్యవస్థను ప్రవేశ పెట్టినాడు. కాలక్రమంలో బ్రిటిష్ సామ్రాజ్యం విస్తరించేకొద్ది కలెక్టర్ల వ్యవస్థ విస్తరించింది. పన్నుల వసూల్లు, శాంతి భద్రతల పరిరక్షణ కలెక్టర్ల ప్రధాన విధులుగా ఉండేవి. అప్పట్లో భూమి పన్ను ప్రధాన వనరుగా ఉండడంతో పన్నులు వసూలు చేయడమే కలెక్టర్ల ప్రధాన విధిగా ఉండేది. శతాబ్దాల క్రితం వలస పాలకులు జిల్లా స్థాయిలో వసూలుదారు అనే అర్థంలో కలెక్టర్ అనే పదం ప్రవేశపెడితే స్వాతంత్ర్యం వచ్చి 73 ఏళ్లు గడిచినా అదే పదాన్ని జిల్లా స్థాయిలో అత్యున్నత హోదాలో ఉన్న అధికారికి వాడుతున్న మాట వాస్తవం. భూమి శిస్తు, నీటి రకాలు వసూలు చేసినప్పుడు కలెక్టర్ అనే పదం పుడితే శిస్తు వసూలు కనుమరుగైన తర్వాత కూడా అదే పేరును కొనసాగించాలా లేదా జిల్లా పాలనాధికారి అని పేరు పెట్టాలా అనే కొత్త ఆలోచనలతో వైఫల్యాల పట్ల ప్రజల ఆలోచన దిశను మార్చడానికి కొత్త ఎత్తును ప్రారంభించింది. నిజానికి ప్రస్తుతం కలెక్టర్ విధులు మరింతగా పెరిగినాయి. జిల్లా మొదటి శ్రేణి మెజిస్ట్రేట్‌గా, రెవెన్యూ పాలన, శాంతి భద్రతలు, జాతీయ విపత్తుల నివారణ చర్యలు, పౌర సరఫరాలు, ఎక్సైజ్‌తో పాటు అత్యంత కీలకమైన ఎన్నికల నిర్వహణ, జనాభా లెక్కలు, రవాణా సౌకర్యాలు ప్రోటోకాల్ నిర్ణయం తదితర అనేక బాధ్యతలు కలెక్టర్‌గా నిర్వహించాల్సి ఉంటుందనేది వాస్తవం. పేరు మార్పుతో ఒరిగేదేముంటుంది. వ్యవస్థను నిష్పక్షపాతంగా, నిజాయితీగా నడిచేలా చేస్తే అదే గొప్ప మార్పు కాగలదు.

పాలకులు నైతిక విలువలను పెంచాలి. న్యాయానికి ప్రతీకగా నిలవాలి. ఉన్నతాధికారి ప్రవర్తనా విధానానికి కొన్ని నియమ నిబంధనలు విధిస్తూ కింది ఉద్యోగులు పాటించే విధంగా సూచనలుండాలి. నిజంగా

# వ్యక్తి పూజల్లోకి పరిణమించిన ఎన్నికలు

***ప్రజల మౌలిక సమస్యలు అప్రధానమై, భావోద్వేగాలు మాత్రమే ప్రధానమై మీడియా మద్దతుతో వ్యక్తుల చుట్టూ తిరిగిన ఎన్నికల తీరు గురించి వివరిస్తున్నారు* కేశవ్**

ఎన్నికలనేవి బూర్జువా ప్రభుత్వాలు ఐదు సంవత్సరాలకొకసారి చేసుకునే పండుగలు. రానున్న అయిదు సంవత్సరాల్లో దేశ సంపదను పెట్టుబడిదారులు దోచుకునే అవకాశం ఎలా ఇవ్వాలి? వ్యవస్థను, వ్యాపార వాతావరణాన్ని కార్పొరేట్లకు అనుగుణంగా ఎలా మార్చాలి? దేశ ప్రజల్ని ఎలా చట్టాల ద్వారా బలహీనం చెయ్యాలి? శ్రమ దోపిడీని నిరాటంకంగా ఉద్యమాలు లేకుండా ఎలా కొనసాగించాలి? మొదలైన విషయాల మీద ప్రణాళికలు చేపట్టడానికి ఎన్నికల పండుగలు చేసుకుంటారు. వాడి వేడి ఉపన్యాసాలిస్తారు. డెబ్బై సంవత్సరాల్లో చెయ్యలేనిది ఈ ఐదు సంవత్సరాల్లో చేసేస్తామంటారు. దేశం రూపురేఖల్ని మార్చేస్తామంటారు. పేదరికాన్ని డెబ్బై సంవత్సరాల్లో రూపుమార్చకపోయినా ఓటు వేసి గెలిపిస్తే ఈ ఐదు సంవత్సరాల్లో మాయం చేసేస్తామంటారు. దాదాపు అన్నిపార్టీలు ఇదే నినాదం కింద తలదాచుకుంటాయి. ప్రజల్ని భ్రమల్లో పెడతాయి. గెలిచిన తర్వాత అయిదు సంవత్సరాలు ఎలా గడిచిపోతాయో ఎవరికీ తెలీదు. దోపిడీ తీవ్రత మాత్రం మరింత పెరిగిపోతుంది. ఆర్థిక అసమానత మాత్రం మరింత పెరుగుతుంది. శత కోటీశ్వరులు పెరుగుతారు. సంపద కేంద్రీకరణ మాత్రం అద్భుతంగా కొనసాగుతుంది. కొంతమంది చేతుల్లో విపరీతమైన సంపద పేరుకుపోతుంది. పేదలు ఎప్పట్లానే నిరుపేదలుగా మిగులుతారు. అక్కడక్కడా అడపా దడపా చిన్న స్కీముల మాయలూ, వేలమంది రైతుల ఆత్మహత్యల తర్వాత రైతుల ఖాతాల్లో దయతో చిన్న చిన్న మొత్తాలు తప్ప మౌలిక ఆర్థిక విషయాల్లో ఏ మార్పునూ సూచించని ఎన్నికలు. కొంతవరకైనా ప్రజలకోసం పనిచేశాం మరలా వస్తే ఇంకాస్తా మిగిలిపోయిన ప్రజా సంక్షేమ కార్యక్రమాలు కొనసాగిస్తామని మరలా ఎన్నికల పండుగలు. వేల కోట్ల ప్రజాధనం ఈ పేరుమీద ఖర్చు. ప్రజలు మాత్రం అప్పటికీ, ఇప్పటికీ కటిక దారిద్ర్యంలోనూ, దోచుకునే వాడు మరింత పకడ్బందీగా దోచుకోవడం, రైతు, శ్రామికుడు మరింత బలహీనం కావడం, ఉద్యమాల ద్వారా చేజిక్కించుకున్న శ్రామిక చట్టాలు ఒక్కొక్కటి ప్రణాళికాబద్ధంగా బలహీనం కావడం సాధారణంగా కనిపిస్తున్న విషయం.

**ఆధిపత్య నాయకత్వం మీద భ్రమలు**

ప్రపంచీకరణ తర్వాత ఎన్నికలు మరింత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. అందులోను, 2014 నుండి ఎన్నికల రూపురేఖలు మారిపోయాయి. 2014 కు ముందు ఎన్నికలకీ, ఇప్పటి ఎన్నికలకీ చాలా తేడా ఉంది. ఓటర్లను నోట్లతో మభ్య పెట్టడంలోనూ, డిజిటల్

---

పాలకులకు ఉన్నతమైన లక్ష్యాలు, లక్షణాలుంటే నిజాయితీతో కింది ఉద్యోగులను ప్రభావితం చేయాలి. పాలకులు సమర్థవంతులైతే ఉన్నత విలువలకు ప్రాముఖ్యతనిచ్చి అనుభవం ఉన్న ప్రభుత్వ అధికారులను ప్రోత్సహించాలి. వారి ఆలోచనలకు, విధానాలకు గౌరవమిచ్చి పాలించాలి. ప్రజల అవసరాలను గుర్తించాలి. ప్రజల నుండి వచ్చే ప్రతిఘటన సారాంశాన్ని దార్శనికంగా క్రోడీకరించి పాలనలో తక్షణమే మార్పులు తీసుకురావాలి. నిఘా వ్యవస్థను పటిష్టంగా పనిచేయించి, ప్రజల మౌలిక ఆకాంక్షలను గుర్తించాలి. రాష్ట్ర స్థాయిలో ప్రధాన కార్యదర్శి నాయకత్వంలో ముఖ్యమైన రెవెన్యూ అధికారుల వ్యవస్థ ఏర్పడాలి. ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో అధనపు కార్యదర్శిలను నియమించాలి. వారికి వివిధ రెవెన్యూ శాఖలను అప్పగించాలి. జిల్లా స్థాయిలో ఐఎఎస్ అధికారి నాయకత్వంలో పనిచేసే బృందం పనితీరును ప్రధాన కార్యదర్శి బృందం పర్యవేక్షించాలి.

ప్రజలకు జవాబుదారీగా అధికార యంత్రాంగం ఉండాలి. రైతాంగం సమస్యల పట్ల రెవెన్యూ ఉద్యోగుల్లో సానుకూల ఆలోచనలు రావాలి. సమస్యను వెంటనే పరిష్కరించే దిశగా అడుగులు వేయాలి. ప్రభుత్వం సిసిఎల్ఎను నియమించాలి. రాష్ట్రంలో పోలీసు వ్యవస్థలో డిజిపి ఎంత ముఖ్యమో భూ పరిపాలనకు రెవెన్యూ సిసిఎల్ఎ అంతే ముఖ్యమని గుర్తించాలి.. భూ పట్టాకోసం దున్నేవాడికి భూమికోసం మొదలైన ఇంద్రవెల్లి ఉద్యమం అడవి హక్కుకై చాలా పోరాటాలు చేసింది. ఆ పోరాటాల్లో భాగంగానే 2006లో అడవి హక్కుల చట్టం వచ్చింది. అడవి ప్రాంతాల్లో హక్కు ఆదివాసులకే ఉంటుందని 1997లో సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఇలాంటి అనేక చట్టాలను అమలు చేయాలి. ఈ దశలోనే రెవెన్యూ వ్యవస్థను ప్రగతి పథంలోకి తీసుకురావడానికి కిందిస్థాయి నుండి చర్చలు మొదలై విషయ నిపుణులు, మేధావి వర్గం, అఖిల పక్షంతో సమావేశాలు, చర్చలు నిర్వహించిన అనంతరం మెజారిటీ అభిప్రాయాలను గౌరవిస్తూ చట్టాలలో మార్పులు చేర్పులనుంచాలి. ప్రజల ముందు ముసాయిదాను పెడితే ప్రజలకు ఆ చట్టంతో మేలు జరిగితే ప్రతి ఒక్కరు సహకరిస్తారు. అలా కాకుండా సంచలనాల కోసమే చట్టాలను తీసుకువస్తే సమాజం హర్షించదు కాదుకదా తిరుగుబాటు చేస్తుంది.

ఈ నేపథ్యంలో మరిన్ని మంచి లక్ష్యాలతో కొత్త రెవెన్యూ చట్టాన్ని ఆహ్వానించాల్సి వస్తే మొదటగా భూ సమగ్ర సర్వే ప్రభుత్వ నిధులతో చేపట్టాలి. ప్రతి గుంట భూమిని సర్వే చేయించి రికార్డులను పారదర్శకంగా తయారు చేయించాలి. తెలంగాణ రాష్ట్రంలో ఉన్న భూ సమస్యలను దృష్టిలో ఉంచుకొని సమగ్రంగా, కూలంకషంగా చర్చించి సంపూర్ణ భూ హక్కుల చట్టాన్ని తీసుకురావాలి. అది ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా కావాలి. ప్రకటనలతో కాకుండా కార్యక్రమ ఆచరణలో భూ వివాద రహిత రాష్ట్రంగా తెలంగాణను తీర్చిదిద్దాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

మీడియా వాడకంలోనూ, ప్రాపగండాను నిరాటంకంగా కొనసాగించడం లోనూ, అబద్ధాల మధ్య, అవాస్తవాల మధ్య నిజాన్ని భూస్థాపితం చేసెయ్యడంలోనూ, పన్నాగంలోనూ, వ్యూహంలోనూ, మతాన్నీ, దేశభక్తినీ ప్రణాళికాబద్ధంగా ఉపయోగించడంలోనూ మొదటి ఎన్నికలకీ ఇప్పటి 2019 ఎన్నికలకీ చాలా తేడా ఉంది. ప్రపంచంలో నేడు కొత్త ట్రెండ్ కనిపిస్తోంది. గత ఐదు సంవత్సరాల్లో రష్యా, టర్కీ అమెరికా, ఫిలిప్పీన్స్, బ్రెజిల్, హంగేరి, పోలెండ్ ఎన్నికల్ని చూస్తే, ఆధిపత్య నాయకత్వాన్ని ఎన్నుకునే విధానం కనిపిస్తోంది. ప్రజలు ఒక శక్తివంతమైన నాయకుణ్ణి కోరుకుంటున్నారని తెలుస్తోంది. ఈ నాయకుడు కూడా ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికవుతున్నాడు. పదవిలోకి వచ్చిన తర్వాత ప్రజాస్వామ్యాన్ని కేంద్రీకరించే ఆరాటంలోఉంటున్నాడు. అధికారాన్ని ఎంతగా కేంద్రీకరించుకుంటే దోపిడీ మార్గం అంత సుగమం అవుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ, నయా ఉదారవాదం ఎంచుకున్న కొత్త కొత్త మార్గాలు ఇవి. భారత దేశ ఎన్నికలని చూస్తే ఇలాంటి లక్షణమే కనిపిస్తోంది. ఓట్లు పార్టీ బట్టి కాకుండా, ఒక ప్రత్యేక నాయకుడి మీద నమ్మకంతో పడినట్టు ఉన్నాయి. గాడ్ ఫాదర్ లా ఒక నాయకుడు తమ సమస్యలకు పరిష్కారం అందివ్వగలడని, మరోసారి ఈ నాయకునికి అవకాశం ఇవ్వాలని ఓటర్లు భావించినట్టు ఉన్నారు. టెలివిజన్లు కూడా అదే భావాన్ని మెదళ్లలో వేశారు. శ్రామిక వర్గం శ్రమ దోపిడీని అర్థం చేసుకోవడం, జాతీయ, అంతర్జాతీయ శక్తులతో పోరాడడం అనే స్థాయి నుండి పైదొలిగి ఒక ప్రత్యేక నాయకుడ్ని, ఒక ప్రత్యేక మెజారిటీ మతానికి చెందిన నాయకుడ్ని తమ మనిషిగా, తమ చాయ్ వాలాగా, చౌకీదార్ గా తమలాంటి సొంత మనిషిగా భావించి మమేకమై సూపర్ హీరోని చేసి గెలిపించారు. దేశ ఆర్థిక విధానం ఒక వ్యక్తి చేతిలో ఉండదనీ, దేశ సంపదంతా కొంత మంది కార్పొరేట్లు పంచేసుకుంటూ ఉంటే, ఒక్క నాయకుడు తెలుగు సినిమా హీరోలా ఒక్క చిటికెలో సమస్యలు పరిష్కరించడానికి ఇది సినిమా కాదని, నిజ జీవితం అని, ఈ నమ్మకాల ద్వారా శ్రామిక వర్గానికి ప్రయోజనం మిగలదని కాలక్రమంలో తెలుసుకుంటారు. ఒక్క భారతీయ జనతా పార్టీ 303 సీట్లను కైవసం చేసుకుంది. 2014లో 31 శాతం ఓట్ల నుండి నేడు 37.5 శాతం ఓట్లను గెలుచుకుంది. కమ్యూనిస్టు భావాలకు వేగుచుక్కగా అభివర్ణించదగ్గ పశ్చిమ బెంగాల్‌లో కూడా బిజెపి రెండు సీట్ల నుండి 18 సీట్లను కైవసం చేసుకోవడం ఆషామాషీ విషయం కాదు. 34 సంవత్సరాల సుదీర్ఘ వామపక్ష పార్టీల చేతి నుండి పశ్చిమ బెంగాల్ గతంలో మమతా బెనర్జీ తృణమూల్ పార్టీ చేతిలోకి వెళ్లింది. వామపక్ష పార్టీల్ని చాకచక్యంగా వెనక్కి తోసేసిన తృణమూల్ ప్రభుత్వం బిజెపి చేతిలో ఇంత అధిక స్థాయిలో అపజయం చెందుతుందని తృణమూల్ పార్టీ ఊహలోకి రాకపోయి ఉండొచ్చు. దేశం మొత్తం మీద బిజెపి భారీ మద్దతుని సంపాదించుకుంది. 1971 తర్వాత ఇదే ప్రథమం. ఆరో క్లాసు విద్యార్థి నుండి ఎనభై సంవత్సరాల వృద్ధుడి వరకు ఒకే పదం.. మోదీ... మోదీ... మోదీ...దేశ సమస్యలని పరిష్కరించడానికి ఒక వ్యక్తి అహర్నిశలు పరిశ్రమిస్తున్నాడని, ఆయనకు సపోర్టు చేసి కళ్లు మూసుకుంటే సమస్యలు మటుమాయమవుతాయని ప్రజల్ని నమ్మించే బాధ్యత ఎలక్ట్రానిక్ మీడియా తీసుకుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య ఎన్నికల్ని, అమెరికా తరహా అధ్యక్షుల ఎన్నికల్లా ప్రాజెక్టు చేశాయి. చివరికి అదే పార్టీలో అభ్యర్థికి ఓటు వేసినా అది ఒక ప్రత్యేక నాయకునికే ఓటు వేస్తున్నట్టు మెదడును చాలా ప్రణాళికాబద్ధంగా ట్యూన్ చేశాయి. 2014 పార్లమెంటరీ ఎన్నికల్లో ఈ చోద్యం కనిపించినా 2019 ఎన్నికల్లో ఇది మరింత ప్రస్ఫుటమైంది.

2014 ఎన్నికల్లో అభివృద్ధి, ఉద్యోగాలు, నల్ల ధనం ఓట్లకు ఎజెండాగా నిలిచాయి. ఈ ఐదు సంవత్సరాల్లో ప్రజల మేలు కోసం అభివృద్ధి జరగలేదు. వాగ్దానం చేసిన విధంగా ఉద్యోగాలు లేవు. నల్లధనం స్విస్ బ్యాంకుల నుండి రాలేదు. అకౌంట్‌లలో లక్షల మాట తర్వాత విషయం. వందలు కూడా స్విస్ బ్యాంకుల నుండి ఎగురుకుంటూ రాలేదు. నల్లధనం అన్న పెద్ద యజ్ఞంలో క్యూలలో ఓ రెండు నోట్ల కోసం నిల్చొని భారతీయ సోదరులు ఒక వందమంది అయినా ప్రాణాలు కోల్పోయినా, ఎన్నో వేలకోట్ల నల్లధనం ఇలా పట్టుబడుతుందని అమ్ముడుపోయిన ఎలక్ట్రానిక్ మీడియా చిలువలు పలువలు చేసి మెదడును వాష్ చేసినా, దాదాపు అన్ని నోట్లు వెనక్కి వచ్చేశాయనీ, నల్లధనం కనిపించలేదనీ రిజర్వ్ బ్యాంకు స్పష్టం చేసినా భారతీయులు అదే పార్టీకి ఓట్లు వేశారు. ఓటరు మనస్తత్వాన్ని బిజెపికి అనుగుణంగా ట్యూన్ చేసిన ఈ ఎన్నికలు అందుకే విశ్లేషణ కోరుతున్న ప్రత్యేక ఎన్నికలు. నోట్ల రద్దు కార్యక్రమంలో 1.04 శాతం కరెన్సీ మాత్రమే ఆర్.బి.ఐ.కి తిరిగి రాలేదు. ఇన్ని వందల ఫారాలు, తనిఖీల డ్రామాల తర్వాత కూడా 99 శాతం కరెన్సీ తిరిగి వచ్చింది. ఈ ఒక్క ఉదాహరణ ద్వారానే, భారతదేశ చరిత్రలో ఇదొక వ్యర్థ ప్రయత్నం అని చెప్పొచ్చు. స్విస్ బ్యాంకుల్లో మూలుగుతున్న అసలు సిసలు నల్ల ధనం తెచ్చే ప్రయత్నం ఇంతవరకూ జరగనే లేదు. మరి ప్రజలు, యువత అదే ప్రభుత్వాన్ని కోరుకోవడమేమిటి?

**ఎన్నికల వ్యూహాలు**

ఎన్నికలు నేడు ప్రజాక్షేమాన్ని పక్కనపెట్టి వ్యూహ రచనతో ముందుకు నడుస్తున్నాయి. కంపెనీలకు సిఇఒలు ఉన్నట్టే, కంపెనీ వ్యవహారాల్ని వీరు చూసుకున్నట్టే, ఎన్నికల వ్యూహ వ్యూహాలకోసమే ప్రత్యేకంగా నియామకమైన సిఇఒలు ఒక పార్టీ గెలవడానికి ఎలాంటి వ్యూహం పన్నాలి అనే దిశలో సలహాలు ఇస్తున్నారు. సలహాలు మాత్రమే కాదు. మొత్తం వ్యూహ రచననీ, ప్రణాళికనీ, స్వయంగా నిర్వహిస్తున్నాయి. చాలా పార్టీలు నేడు ఈ కొత్త దిశలో పని చేస్తున్నాయి. సోషల్ మీడియా నేడు వినోదాత్మక పాత్ర నుండి ఇంకాస్త ముందుకు వెళ్లి ప్రజల మెదళ్లను ప్రభావితం చేసేలా, ఒక్కోసారి వాష్ చేసేలా ఉపయోగపడుతున్నాయి. ప్రస్తుత ఎన్నికల్లో వాట్సప్‌లు, ట్విట్టర్లు, ఫేస్‌బుక్‌లు గణనీయమైన పాత్రను పోషించాయి. ఒక్క బిజెపి పార్టీకే కొన్ని వేల మంది వాట్సప్ అడ్మిన్‌లు ఉన్నారు. రాఫెల్ ప్రశ్నలతోను, పరిశోధనలతోను ఇబ్బందికి గురైన బిజెపి కి బాలాకోట్, పుల్వామా ఎపిసోడ్ లు అద్భుతంగా పనిచేశాయి. నిజమైన సమస్యలని పక్కకి తోసేసి దేశం రక్షణని ముందుకు తెచ్చాయి. పుల్వామా లాంటి సంఘటనలు పునరావృతం కాకుండా ఉండాలంటే, పక్క దేశాల నుండి దేశాన్ని రక్షించాలంటే, దేశానికి ఇప్పటి మోదీ మరోసారి అవసరం, ప్రతిసారి అవసరం. లేకపోతే పక్క దేశం వాడు మనల్ని అతి సునాయాసంగా ఆక్రమించేస్తాడు అనే తప్పుడు తర్కాన్ని భారతీయుల మెదళ్లలో దేశభక్తి ఇంజెక్షన్ ద్వారా వేసేశారు. ఫలితంగా 2019 ఎన్నికల్లో ఓటు వేసిన భారతీయుడికి దేశాన్ని రక్షించగలిగే ఒక రాజులాంటి ప్రధాన మంత్రి కావాలి. ఒక సూపర్ హ్యూమన్ బీయింగ్ కావాలి.

బాలాకోట్ చర్యను చాలా చాకచక్యంగా ఎన్నికల వ్యూహంగా మలచగలిగే పార్టీకి ప్రజల ఓట్లు సహజంగానే పడ్డాయి. ఇది ప్రజా తీర్పుఎలా అవుతుంది? సాధారణ వాస్తవ విషయాలు అందని అసంఖ్యాకమైన ప్రజల ఓటు తీర్పు ప్రజల తీర్పు సహజంగానే కాదు. బ్యాలట్ యూనిట్ దగ్గరకి వచ్చి ఏం చెయ్యాలో తెలియని ప్రజలు

కోకొల్లలు. దేశం కోసం ఏ అభ్యర్థి ప్రణాళికలు ఎలాంటివి? ఎవరివి ఉన్నతమైనవి? గత అయిదు సంవత్సరాల్లో ఈ ప్రభుత్వం ఎన్నికల ముందు ఎలాంటి వాగ్దానాలు చేసింది? వాటిని ఎంతవరకు నిర్వర్తించింది? డబ్బులిచ్చి ఓటు వేయించుకునే అభ్యర్థికి దేశం పట్ల నిజాయితీ ఎంతవరకు ఉంటుంది? తీసుకుని ఓటు వేసే వ్యక్తి నిజాయితీ ఏ మేరకు ఉంటుంది? అసలు వీళ్లంతా దేశ శ్రామిక వర్గం భవిత కోసం ఏం చెయ్యాలనుకుంటున్నారు? మొదలైన విషయాలను విశ్లేషణ చేసి వోటు వేసేవారు ఎంతమంది? ఇలాంటి చైతన్యంతో ఓటు వెయ్యకపోయినప్పుడు అది ప్రజా తీర్పు ఎలా అవుతుంది? కాబట్టి ఈ ఎన్నికల తీర్పు ప్రజల తీర్పు అనడం ఎంతవరకు సమంజసం? ఒక కంపెనీ ఏ ప్రోడక్ట్ టెలివిజన్‌లో మాటిమాటికీ చూపిస్తుందో కొనుగోలు దారుడు దుకాణానికి వచ్చి ఆ పేరు ఉన్నదే అడుగుతాడు. ఏ నాయకుడి పేరు టెలివిజన్ వారు మాటి మాటికి చూపించి నరాల్లో ఎక్కిస్తారో ఎన్నికల్లో అదే పేరు లేదా అదే గుర్తు వెదికేలా ప్రజల ప్రవర్తనలను నియంత్రించే పరిస్థితి ఇప్పటి ఎన్నికల్లో కనిపిస్తోంది. ఒక బలమైన నాయకుని నిరంకుశ పాలనను ఈ దేశంలో ఎంతమంది బలపరుస్తున్నారు? అనే విషయం మీద 2017లో జరిగిన సర్వేలో భారత ప్రజలు 55 శాతం మంది సానుకూలంగా స్పందించారు. .

**మతం, దేశభక్తి ప్రాతిపదిక మీద ఓట్లు**

2014 నుండి ఈ ఎన్నికల కోసం వ్యూహం తయారయింది. ఒక ప్రత్యేక మత ప్రాతిపదికన ఓట్లు తీసుకునే ప్రక్రియ బిజెపికి కొత్త కాదు. అత్యధిక సంఖ్యాకుల మతమైన హిందూ మతస్తుల రాజ్యంగా భారత దేశాన్ని చిత్రీకరించే ప్రక్రియ ఏనాడో ఆరంభమయింది. హిందూ మతానికి రాజ్యంతో ముడి పెట్టి, దాన్ని పెంచి, పోషించే నాయకులు దేశానికి అవసరమైన నాయకుల్లా చిత్రీకరించే ప్రక్రియ ఏనాడో ఆరంభమైంది. అది ఈ ఎన్నికల్లో మరింత బలపడింది. హిందూమతాన్ని భారత జాతికి అధికారిక పర్యాయపదంగా చాకచక్యంగా మార్చారు. హిందూ మతానికీ, భారతీయతకీ, రాజ్యానికీ, దాన్ని పోషించే నాయకులకూ ఒక అవినాభావ సంబంధాన్ని ఏర్పరచారు. ఇందులో ఇమడని వారు భారతీయులే కారు అనే తప్పుడు భావాన్ని అందించారు. రాజ్యం చేసే తప్పుల్ని విమర్శించినా, రాఫెల్ ని విమర్శించినా, రైతుల ఆత్మ హత్యల్ని ప్రశ్నించినా, నోట్ల రద్దుని ప్రశ్నించినా రాజ్యం చేసే ఏ తప్పుని దేశ పౌరుడు రాజ్యాంగం ఇచ్చిన హక్కుల్ని వినియోగించుకొని ప్రశ్నించినా సరే, ఈ హక్కు రాజ్యాంగమే ఇచ్చినప్పటికీ, దీన్ని హిందూ మతాన్ని ధిక్కరించే చర్యగా, లేదా దేశ ద్రోహ చర్యగా తీసుకొని వ్యక్తిత్వాన్ని కించపరచడమో, లేదా కటకటాల వెనక్కి పంపించడమో గత అయిదేళ్లలో చూశాం. కార్పొరేట్ల చేతుల్లో ఉన్న ఎలక్ట్రానిక్ మీడియా అగ్నిలో ఆజ్యం పొయ్యడంలో మరింత చేతులు కలిపింది. మతానికి తోడు దేశభక్తి మిక్స్ అయింది. ఎన్నికల ముందు బాలాకోట్ చర్యను ఒక గొప్ప దేశ భక్తి చర్యగా ప్రాజెక్ట్ చేశారు. ఈ ప్రాపగండా ఎలక్ట్రానిక్ సోషల్ మీడియాను పూర్తిగా ఆక్రమించింది.

2014 ఎన్నికల్లో ఉద్యోగాలను ఇస్తామని వాగ్దానం చేసిన ప్రభుత్వం ఎన్ని ఉద్యోగాలను ప్రసాదించింది అని రోడ్ల మీద అడగాల్సిన యువత పుల్వామా సంఘటన తర్వాత పాకిస్తాన్ డౌన్ డౌన్ అని బయటికి వచ్చింది. మరి నోట్ల రద్దు తర్వాత పది రోజుల్లో దాదాపు వంద మంది తమ భారతీయ సహోదరులు రెండు మూడు నోట్ల కోసం క్యూ కట్టి చనిపోతే నిలబడలేకనో, ఆయాసం వల్లనో, గుండెపోటు వల్లనో చనిపోతే ఇలా ఎందుకు జరిగింది అని ఇదే యువత ప్రశ్నించి తమ దేశ భక్తిని చూపించుకోలేదు. ఇక్కడ కూడా బాధ్యతలేని ఎలక్ట్రానిక్ మీడియా చూపించిన నెగెటివ్ రోల్ కాదనలేం. మైక్రో చిప్పులున్న నోట్లు అతి త్వరలో వచ్చేస్తున్నాయని, దొంగ నోట్లు ఎక్కడున్నా ఇట్టే పట్టేసుకుంటామని అబద్ధాలను బాధ్యతారహితంగా ప్రసారం చేసిన మీడియా పాత్ర ఉంది. గతంలో కూడా అమెరికా అధ్యక్షుని ఎన్నికల్లో ఒక పెద్ద సోషల్ మీడియా కంపెనీ పాత్ర ఉందనే వాదనలు ఉన్నాయి. ఎలక్ట్రానిక్ మీడియా, సోషల్ మీడియా, కొంచెం తేడాలో అమ్ముడు పోయిన ప్రింట్ మీడియా సరుకుల్ని అమ్మే స్థాయి నుండి ప్రజల ఆలోచనలను కూడా ప్రభావితం చేసే స్థాయికి చేరుకున్నాయి.

ప్రపంచీకరణలో ప్రజలు ఏం కొనాలో ఇవే చెబుతాయి. ప్రజలు ఏం ఆలోచించాలో ఇవే చెబుతాయి. ప్రజలు ఏ విషయంలో బయటికి వచ్చి ఉద్యమం చెయ్యాలి, ఏ విషయంలో నోరు కుట్టేసుకోవాలి ఇవే నేర్పుతాయి? ఏ పార్టీలకు ఓట్లు వెయ్యాలో ఇవే ప్రభావితం చేస్తాయి. వేల కోట్ల రూపాయలు ఈ పని కోసమే ఖర్చు అవుతున్నాయి. జాతీయ, అంతర్జాతీయ కార్పొరేషన్లు దీని వెనుక ఉన్నాయి. ప్రపంచీకరణలో సామ్రాజ్యవాద దేశాలకు తమ పెట్టుబడుల స్వైర విహారం కోసం, లాభాల దోపిడీ నిరాటంకంగా కొనసాగించడం కోసం బలమైన తమకనుకూలమైన ప్రభుత్వాలు కావాలి. నయానో భయానో తమకనుకూలమైన ప్రభుత్వాలే కావాలి. నేటి ఎన్నికల్లో ఒక రాఫెల్, రైతు ఆత్మ హత్యలు, నోట్ల రద్దు చీకటి దినాలు, నిరుద్యోగం, అందరికి అందని ఆరోగ్యం మొదలైన సజీవ అంశాలు ఓటరును ప్రభావితం చెయ్యలేదని సర్వేలు చెబుతున్నాయంటే భవిష్యత్తులో పరిస్థితులు ఇంకెంత దారుణంగా ఉంటాయో?

**డిజిటల్ గాలంలో పడిన యువత**

ఎన్నికల గెలుపులో యువతరం పాత్ర చాలా ఉందనే విషయం బిజెపి ఏనాడో పసిగట్టింది. ఎన్నికల పర్వం తర్వాత హిందూ పత్రిక, లోక్‌నీతి, సిఎస్‌డి ఎస్ చేసిన సర్వే ప్రకారం ఈ విషయం తెలుస్తోంది. 15 ఆగస్ట్ 2017లో ప్రధాని ఉపన్యాసంలో ఈ విషయం వక్కాణించారు. ఈ శతాబ్దంలో పుట్టిన వారికి 2018 కీలక సంవత్సరమనీ, ఎందుకంటే ఇదే సంవత్సరంలో వీరికి 18 సంవత్సరాలు నిండి ఓటు హక్కు దొరుకుతుందని అన్నారు. బిజెపి ఎన్నికల వ్యూహం ఎంత ముందు చూపుతో ఉంటుందో ఈ ఒక్క ఉదాహరణ చాలు. అనుకున్నట్టుగానే, యువతను బాగానే ఆకట్టుకున్నారు. ఎన్నికల ముందు గొప్ప ప్రణాళికా బద్ధంగా 'యువతతో మోదీ' (మోదీ విత్ యూత్) అనే డిజిటల్ ప్రచారం చేశారు. బిజెపి యువ విభాగం భారతీయ జన యువ మోర్చా 'మోదీ యువశక్తి' అనే మరో డిజిటల్ ప్రచారం ఆరంభించింది. ఈ కార్యక్రమంలో బిజెపి అధికారంలో గత అయిదు సంవత్సరాల్లో ఏ విజయాలు సాధించిందో నిరాటంకంగా ప్రచారం చేశారు. ముఖ్యంగా ఈ ప్రచారంలో కాలేజి విద్యార్థులపై దృష్టి నిలిపారు. ఫలితంగా లోక్ నీతి సర్వే ప్రకారం, ఎన్నికల్లో 18-21 సంవత్సరాల యువత 41 శాతం మోదీకి ఓటు వేసింది. బిజెపి అనేది అగ్ర కులాల పార్టీగా మొదట అనుకునేవారు. కానీ, నేడు, అగ్ర కులాల తో పాటు అన్ని కులాల వారు వోటు వేశారు. పశ్చిమ బెంగాల్లో 2/5 వంతుల వామ పక్ష ఓటర్ల ఓట్లను కూడా బిజెపి కైవసం చేసుకుందని లోక్‌నీతి సర్వే చెబుతోంది. సమస్య ఎంత జటిలమయిందో అర్థమవుతుంది

**పెరుగుతున్న అసమానత**

నయా ఉదారవాదంలో పీకల వరకు కూరుకుపోయిన భారతదేశంలో ఆర్థిక సరళీకరణలు మరో విడత ఆరంభం కావాలి. అందుకోసం తమకు అనుకూలమైన, బలమైన స్థిరత్వంతో కూడిన ప్రభుత్వం కావాలి. అందుకే ఈ సరంజామా అంతా. కానీ, ఇంతకు ముందు ప్రభుత్వాలు ఫెయిలయినట్టే ఈ ప్రభుత్వం కూడా ఫెయిల్ అవుతుంది. ఆక్స్ ఫాం ఇంటర్నేషనల్ సర్వే ప్రకారం, భారత దేశంలోని పది శాతం ఉన్నత జనాభా చేతిలో 77.4 శాతం సంపద ఉంది. ఒక శాతం జనాభా చేతిలో 51.53 శాతం సంపద ఉంది. దిగువ 60 శాతం చేతిలో 4.8 శాతం మాత్రమే సంపద ఉంది. పేదరికం ఇంత భయంకరంగా ఉంటే, మరోవైపు శత కోటీశ్వరులు ఇంతింతై వటుడింతై అన్న చందంగా పెరిగిపోతున్నారు. భారతదేశంలో శత కోటీశ్వరుల ఆదాయం రోజుకి 2200 కోట్ల రూపాయలు గత సంవత్సరం పెరిగింది. 18 మంది శత కోటీశ్వరులు గత సంవత్సరం పెరిగారు. మొత్తం శత కోటీశ్వరులు 119 మంది. వీరి ఆస్తి 28 లక్షల కోట్లకు చేరుకుంది. ప్రపంచంలోని 50 శాతం ప్రజల దగ్గర ఎంత సంపద ఉందో కేవలం 26 మంది దగ్గర అంతే సంపద ఉంది. ప్రపంచంలో ఉన్న 2200 మంది శత కోటీశ్వరులు రోజుకు 17750 కోట్లు సంపాదిస్తున్నారు.

**కార్పొరేట్ల కబంధ హస్తాల్లో వ్యవసాయం**

కార్పొరేట్ల కబంధ హస్తాల్లో చిక్కుకున్న వ్యవసాయాన్ని కొన్ని స్కీములు ప్రకటించినంత మాత్రాన రైతుల ఆత్మ హత్యలు తగ్గుతాయా? విత్తనాల వ్యాపారంలో నేడు బహుళ జాతి సంస్థలే రాజ్యమేలుతున్నాయి. మోన్సాంటో, డ్యుపాంట్, సిన్జెంట ప్రపంచంలోని విత్తనాల మార్కెట్లోని 40 శాతం వ్యాపారాన్ని కైవసం చేసుకున్నాయి. ప్రపంచం ప్యాకేజీఫుడ్‌లోని మూడొంతుల వ్యాపారాన్ని 100 కంపెనీలే కైవసం చేసుకున్నాయి. ఆహార ధాన్యాల్లో 40 శాతం వ్యాపారాన్ని కేవలం మేటి పది కంపెనీలే కొనసాగిస్తున్నాయి. ప్రపంచీకరణ ఫలితంగా వ్యవసాయంలో కొత్త ధోరణులు చోటు చేసుకున్నాయి. భారత దేశం లాంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో వ్యవసాయం పురాతన పంటల నుండి ఎగుమతుల పంటల వైపుగా పరిణమించింది. స్వేచ్ఛా వాణిజ్యం అంటూ, ఎగుమతి పంటలు పండిస్తేనే ప్రయోజనం ఎక్కువగా ఉంటుందని నేర్పారు. కానీ, ఈ వాదన తప్పుడు వాదన అని ఉషా పట్నాయక్ అంటున్నారు. నాడు, హరిత విప్లవం అంటూ మన వ్యవసాయాన్ని పురుగుల మందు భూములుగా మార్చేశారు. నేడు, జన్యు మార్పిడి పంటలంటూ, అధిక ప్రయోజనం అధిక దిగుబడి అంటూ, పురుగులే సోకని పంటలంటూ మన వ్యవసాయ భూముల్ని మరింత మరు భూములుగా మార్చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. కలుపు నాశిని మందుగా అతి భయంకరమైన గ్లైఫోసాస్పెట్ ని వ్యవసాయంలో వాడుతున్నారు. మోన్సాంటో 1970లో ఈ మందుని తయారుచేసి పేటెంటు తీసుకుంది. 'రౌండ్ అప్' పేరుతో మార్కెట్లో విడుదల చేసింది. ఈ మందు కలుపు మొక్కలతో పాటు నేలకు ప్రయోజనం అందించే బాక్టీరియాలను కూడా చంపేస్తుంది.

ప్రపంచీకరణలో, రైతులు తమకంటూ ఒక ప్రత్యేకతను కోల్పోతున్నారు. రైతు నేడు పంట పండించే రైతన్న కాదు. కార్పొరేట్లకు ఒక కొనుగోలుదారుడు. కార్పొరేట్ల కబంద హస్తాల్లో ఇరుక్కున్న ఒక బందీ. 2010లో అలయెన్స్ ఫర్ సస్టెనేబుల్ అగ్రికల్చర్ ఆధ్వర్యంలో ఆహారం, రైతులు, స్వేక్ష' నినాదంతో దేశ వ్యాప్తంగా నడిచిన కిషాన్ స్వరాజ్ యాత్ర హైదరాబాద్ వచ్చిన సందర్భంగా ఏర్పాటు చేసిన బహిరంగ సభలో పదిహేడేళ్ల అమ్మాయి అక్కడున్న పెద్దల్ని నిలదీస్తూ ఇలా అంది 'మా నాయన లాంటి రైతులు ఆత్మహత్య చేసుకోవడానికి మీ ప్రభుత్వాలే కారణం. చాతనయితే రైతు ఆత్మహత్యలకు దారితీసే మార్గాలను మార్చండి. మాకు మీ సానుభూతి మాటలు అవసరం లేదు'.

**భారత శ్రామిక వర్గం పరిస్థితి**

ఎన్నికల ముందు విడుదల చెయ్యకుండా నిలిపేసిన ప్రభుత్వ డేటా ప్రకారం నిరుద్యోగం రేటు 2017-18 కి గాను 6.1 శాతానికి చేరుకుంది గత 45 సంవత్సరాల్లో ఇది అత్యధికం అని అధికారికంగా వెల్లడయింది. గతంలో లీక్ అయిన డేటా నిజమే అని నిర్ధారణ అయింది. బిఎస్ఎన్ఎల్ లాంటి వేల కొలది పబ్లిక్ సెక్టార్‌లు అత్యంత నష్టాల్లోకి కూరుకుపోయిన తర్వాత ప్రభుత్వం యువతకి ఉద్యోగాలను ఎలా సృష్టించగలదు? పబ్లిక్ సెక్టార్ బ్యాంకుల మొండి బాకీలు ఆకాశాన్ని అంటుతున్నాయి. పంజాబ్ నేషనల్ బ్యాంకు నీరవ్ మోదీ వేల కోట్ల స్వాహా ఉదంతం అందరికీ తెలిసిందే. ఆరోగ్యం, విద్య మొత్తం ప్రైవేటు, కార్పొరేటు సెక్టార్ ఆక్రమించి ఉంది. వేల కోట్ల వ్యాపారం నడుస్తోంది. మెడిక్లయిముల పేర్లతో, వివిధ రకాల జబ్బులకు వివిధ రకాల క్లయిముల పేర్లతో వేల కోట్ల రూపాయల వ్యాపారం నడుస్తోంది. ఆరోగ్యం విషయంలో ఇంగ్లండ్, ఆస్ట్రేలియా లాంటి పెట్టుబడిదారీ దేశాలు కూడా ప్రజల కోసం తీసుకున్న జాగ్రత్తలు భారతదేశం గత డెబ్బై సంవత్సరాల నుండి తీసుకున్న దాఖలాలు లేవు. శ్రమ దోపిడీ మరింత పెరిగింది. పర్మనెంటు ఉద్యోగులు తగ్గి కాంట్రాక్టు ఉద్యోగులు పెరిగారు. వీరికి ఏ సదుపాయాలు లేవు. అలానే కార్మిక చట్టాల్లో కార్పొరేట్లకు అనుకూలంగా మార్పు చెయ్యడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ట్రేడ్ యూనియన్ల పాత్ర, ప్రమేయం తగ్గి, యాజమాన్యం అధికారాలు పెరిగే సూచనలు కనిపిస్తున్నాయి. హక్కుల కోసం సమ్మె చేస్తుంటే, ఆ సమ్మెల్ని అణచివేసే ప్రయత్నాలు గత అయిదు సంవత్సరాల్లో కనిపించాయి. బూర్జువా మీడియాలు ఈ సమ్మెలు దేశ అభివృద్ధికి నష్టం అని ప్రొజెక్టు చేశాయి. మరి, శ్రామికుల సమస్యలకు పరిష్కారం ఎలా అనేది ఈ మీడియాలు చూపించలేదు. ఇలాంటి సమ్మెల్ని గత అయిదు సంవత్సరాల్లో ఉద్యమాలకు మారు పేరైన పశ్చిమ బెంగాల్లో కూడా అణచివేసే ప్రయత్నాలు కనిపించాయి. ఆర్‌బిఐ, సుప్రీం కోర్టు, ఎలక్షన్ కమిషన్, సిబిఐ మొదలైన సంస్థల స్వాతంత్ర్యం తగ్గుతోంది. విభిన్న రంగాల్లో ఉద్యోగ నియామకాలు కావడం లేదు. కాంట్రాక్టు ఉద్యోగులు విపరీతంగా పెరుగుతున్నారు. వీరికి ఎలాంటి సదుపాయాలు లేవు. ఉద్యోగ భద్రత లేదు. జిఎస్‌టి వల్ల చిన్న వ్యాపారస్తులు ఇబ్బందులకు గురయ్యారు. చర్చలతోనూ, ఉద్యమాలతోనూ సమస్యలను పరిష్కారం చేసుకోవాల్సిన ప్రజలు, యువత వ్యక్తి పూజకు అలవాటు పడ్డారు. ఆర్థిక పరిస్థితులు ఒక ప్రత్యేక నాయకుడి మీద ఆధారపడి ఉండవనీ, ధరలూ, ద్రవ్యోల్బణాలూ ఒక ప్రత్యేక నాయకుని చేతిలో ఉండవనీ, ఒక ప్రత్యేక ఆర్థిక విధానం వీటిని ప్రభావం చేస్తుందని, పెట్టుబడిదారీ వ్యవస్థ, ప్రపంచీకరణ, నయా ఉదారవాదం, స్వేచ్ఛా వాణిజ్యం వీటిని ప్రభావం చేస్తుందని, వీటిలో మార్పు రానంతవరకు ప్రజల సమస్యలకు, శ్రామికుల సమస్యలకు, రైతుల సమస్యలకు ఒక్క మోదీ దగ్గర పరిష్కారం లేదనీ, వ్యక్తి పూజతో కాకుండా వర్గ చైతన్యంతోనే ఇది సాధ్యమనీ ప్రజలు అనుభవంతో తెలుసుకుంటారు.

*(రచయిత ఉపాధ్యాయులు,*
*'జాగృతి సమీక్ష' త్రైమాసిక పత్రిక సంపాదకులు)* వీ

# బిఎస్ఎన్ఎల్ దీనావస్థకు కారకులెవరు?

***పాలకులు ప్రభుత్వ రంగ టెలికాం వ్యవస్థను ప్రణాళికా బద్ధంగా బలహీనపరిచి ప్రైవేట్ టెలికాం సంస్థలకు అప్పగించే విధంగా వ్యవహరిస్తున్నారని అంటున్నారు* ఎం. శ్రీనివాస్**

**2019** ఏప్రిల్ మూడవ వారంలో బిఎస్ఎన్ఎల్ పరిరక్షణ కోసం ఉద్యోగులు, కార్మికులు 72 గంటల పాటు సమ్మె నిర్వహించారు. 'సంక్షోభిత' ఈ ప్రభుత్వ రంగ సంస్థ పునరుద్ధరణకు కేంద్ర ప్రభుత్వం ఒక నిర్మాణాత్మక జోక్యం తక్షణ అవసరమన్నది సమ్మెలో ఉన్న కీలకమైన డిమాండ్. వాస్తవానికి ప్రభుత్వం, నీతి ఆయోగ్, డైరెక్టర్ ఆఫ్ టెలికం (డిఒటి)ల త్వయం బిఎస్ఎన్ఎల్ సంస్థ భౌతిక హననానికి పూనుకున్నాయి. లేదా నిర్మూలించడానికి కుట్రలు చేస్తున్నాయి. ఇందుకు అవసరమైన నిర్దిష్ట చర్యలను ప్రణాళికబద్ధంగా చేపడుతున్నాయి. ఈ చర్యలు తొలుత ఉద్యోగుల ఉద్వాసన, తర్వాత పెట్టుబడుల ఉపసంహరణ, తదుపరి ఆస్తుల విక్రయం, ఆ తర్వాత అసలు ప్రభుత్వ టెలికం వ్యవస్థనే పూర్వపక్షం చేస్తూ క్రమంగా నిర్మూలించడానికి పథకం రచించబడింది. దీనిలో భాగమే 54 వేల (మొత్తం ఉద్యోగుల్లో 30 శాతం) మంది ఉద్యోగులను సిఆర్ఎస్ ద్వారా ఉద్వాసనగా పలకాలని ప్రయత్నాలను మొదలుపెట్టింది. ప్రజా నేస్తంగా నిలిచి కొనసాగుతున్న ఇంటిఫోన్ శాశ్వతంగా ప్రజలకు దూరం కానున్నది. సుమారు మూడు దశాబ్దాల క్రితం వరకు టెలిఫోన్ ఒక సామాజిక హోదా మాత్రమే కాదు, పరస్పరం సమాచారం చేరవేసుకునే కీలక సాధనంగా ఉంటూ వచ్చింది. ఆ విధంగా కొనసాగిన సంస్థ బిఎస్ఎన్ఎల్ ఇటీవల కాలంలో భారీ నష్టాలతో తీవ్ర సంక్షోభంలో ఉన్నదని గత రెండు నెలలుగా (ఫిబ్రవరి, మార్చ్) ఉద్యోగులకు జీతాలు ఇవ్వలేని పరిస్థితి సంస్థలో ఉన్నదని, మార్కెట్‌లో ఈ సంస్థ ప్రజలకు నాణ్యమైన సేవలను అందించే స్థితిలో లేదని, తద్వారా ప్రైవేట్ టెలికం సంస్థలతో పోటీలో నిల్వలేని పరిస్థితి కొనసాగుతుందని, అందువల్ల భారత్ సంచార్ నిగమ్ లిమిటెడ్ (బిఎస్ఎన్ఎల్) సంస్థ మూసివేత అనివార్యమని కేంద్ర పాలకులు చెప్పకనే చెపుతున్నారు. బిఎస్ఎన్ఎల్ ఏర్పాటు సమయంలో ఈ సంస్థ ఆర్థిక సమృద్ధికి తీసుకున్న నిర్ణయం (కేంద్ర ప్రభుత్వ హామీ) రెండు దశాబ్దాలు కావస్తున్నా అమలు కాలేదు. కేంద్ర ప్రభుత్వం నుండి తాజా సాంకేతిక పరిజ్ఞానం వినియోగానికి (4జి స్పెక్ట్రం), బ్యాంకులో నుండి రుణాలు పొందడానికి అనుమతి లేదు. ఖాళీగా ఉన్న డైరెక్టర్ల బోర్డులోని ఖాళీలను భర్తీ చేయడం లేదు. తమ నికర ఆస్తులకు సంబంధించి బిఎస్ఎన్ఎల్‌కు భూ-యాజమాన్యం విధానానికి ఆమోదాలు తెలపడం లేదు. ఈ ప్రక్రియంతా బిఎస్ఎన్ఎల్‌ను ప్రైవేటీకరించడం కోసమే. ఇటీవల టెలికం కార్యదర్శి అరుణా సుందర్ రాజన్తో బిఎస్ఎన్ఎల్ ఉద్యోగుల సమావేశం జరిగింది. ఆ సమావేశం అనంతరం సంస్థ మూసివేత సహా అన్ని అవకాశాలను కంపెనీ పరిశీలించవలసిందిగా కేంద్ర ప్రభుత్వం కోరినట్లు సంస్థ యాజమాన్యం ప్రకటించినట్లుగా టైం ఆఫ్ ఇండియా పత్రిక పేర్కొన్నది. బిఎస్ఎన్ఎల్ మార్కెట్ పోటీలో నిల్వలేకపోవడమూ, భారీ నష్టాలతో తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కోవడమూ కారణాలుగా కేంద్ర ప్రభుత్వం, దాన్ని సమర్థించే సంస్థలు చూపుతున్నాయి. కాని ఈ పరిస్థితికి దోహదం చేసిన నిర్దిష్ట కారణాలను మాత్రం చెప్పడం లేదు. మరో వైపున ఢిల్లీలోని టెలికం కేంద్ర కార్యాలయం ఒక ప్రకటన చేస్తూ డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికం (డిఓటి) బిఎస్ఎన్ఎల్ సంస్థ పునరుద్ధరణ ప్రతిపాదనకు తుదిరూపం ఇచ్చే క్రమంలో ఉందని, దానిని డిజిటల్ కమ్యూనికేషన్స్ కమీషన్ (డిసిసి) త్వరలోనే ఆమోదించాల్సి ఉంటుందని తెలియజేసింది. ఈ విధమైన విరుద్ధ ప్రకటనలు, లేదా సమాచారం సహజంగానే ఉద్యోగులను కార్మికులను తీవ్ర కలవరపాటుకు గురిచేస్తుంది. చరిత్ర నేపథ్యంలో

భారత దేశవ్యాప్తంగా టెలికమ్యూనికేషన్ సేవలందిస్తున్న భారత సంచార నిగమ్ లిమిటెడ్ (బిఎస్ఎన్ఎల్) పూర్తిగా ప్రభుత్వాధీన కార్పోరేట్ సంస్థ. 2000, సెప్టెంబర్ 15న స్థాపించిన ఈ సంస్థ ప్రధాన కార్యాలయం న్యూఢిల్లీలో ఉన్నది. దేశంలోని టెలికం వ్యవస్థకు బ్రిటిష్ కాలంలోనే అంటే 19వ శతాబ్దం నుండి చారిత్రక నేపథ్యం ఉంది. వలస పాలకులు తమ ఆర్థిక, రాజకీయ పాలనా ప్రయోజనాల కోణంలో ఈ వ్యవస్థను ఏర్పాటు చేస్తారన్నది యదార్థ విషయం. వలస పాలకులకు వ్యతిరేకంగా దేశస్వాతంత్ర్యం కోసం సాగుతున్న ప్రజా ఉద్యమాలను, తిరుగుబాట్లను అణచివేత కోసం కావచ్చు, దేశ వనరులను కొల్లగొట్టడానికి కావచ్చు. ఈ వ్యవస్థ ఏర్పాటుకు బ్రిటీష్ పాలకులకు అనివార్యతను కల్పించింది. అయితే, ఇక్కడొక చారిత్రక సత్యాన్ని చెప్పుకోవడం సందర్భోచిమని భావిస్తున్నాను. 18వ శతాబ్దం పూర్వార్థంలో భాగంలో టెలిఫోన్ వ్యవస్థను భారత్‌లో ప్రారంభించడం కోసం రెండు బ్రిటీష్ కంపెనీలు పోటీ పడుతూ ఆ సంస్థలు బ్రిటీష్ ఇండియా ప్రభుత్వాన్ని అభ్యర్థించినప్పుడు అప్పటి బ్రిటీష్ పాలకులు ఈ అభ్యర్థనను నిర్ద్వంద్వంగా తిరస్కరించడమే కాక ఆ పనిని భారత్‌లోనే చేసుకుందామని నిర్ణయించి అమలులోకి తెచ్చారు. మన పాలకులు మాత్రం ప్రజావనరులతో నిర్మితమై ఉన్న ఈ వ్యవస్థను బడా కార్పొరేట్ ఆర్థిక సంస్థలకు కట్టబెట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. బ్రిటీష్ కాలంలో 1851లో టెలిగ్రాఫ్ లైన్‌లో భాగంగా ఇది మొదలైంది. టెలిగ్రాఫ్, తపాలా (పోస్టల్) శాఖలో భాగంగా మొదలైన టెలికం సంస్థ 1854 నుంచి సాధారణ పౌరులకు కూడా సేవలందించేదిగా ప్రారంభింబడింది. 1885లో భారత టెలిగ్రాఫ్ చట్టాన్ని బ్రిటీష్ శాసన మండలి ఆమోదించింది. 1900లో టెలిగ్రాఫ్ సేవలను విస్తరించే లక్ష్యంతో టెలిగ్రాఫ్ శాఖను విరగ్గొట్టారు. 1975లో పోస్టల్ టెలిగ్రాఫ్ విభాగాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేసారు. 2000 అక్టోబర్‌లో భారత ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్ పేరుతో ప్రభుత్వ రంగంలో టెలికాం, టెలిగ్రాఫ్ సేవలను కార్పొరేటీకరణ చేయడానికి ప్రయత్నం చేస్తుంది. 2015 జూలై

నుండి బిఎస్ఎన్ఎల్ టెలిగ్రాఫ్ సేవలను నిలిపివేసింది. 2018 నవంబర్ 30 నాటికి ఈ సంస్థలో 1,72,411 మంది ఉద్యోగులు వివిధ విభాగాల్లో పని చేస్తున్నారు. వీరిలో ఎగ్జిక్యూటివ్‌లు 47,753 మంది (28 శాతం), నాన్ ఎగ్జిక్యూటివ్లు 1,24,658 (72 శాతం). 2000-10 మధ్యకాలంలో ఈ సంస్థ సిబ్బంది సంఖ్య ప్రస్తుత సంఖ్యకు రెట్టింపుగా అంటే 3.62 లక్షలుగా ఉండేది. గ్రూప్-ఏలో 5,440 మంది, గ్రూప్-బిలో 18000 మంది, గ్రూప్-సిలో 2.66 లక్షల మంది, గ్రూప్-డిలో 0.73 లక్షలుగా విధులు నిర్వహిస్తున్నారు. నష్టాలకు మూలాలెక్కడ? బిఎస్ఎన్ఎల్ సంస్థలో ప్రస్తుతం వివిధ విభాగాల్లో పనిచేస్తున్న 1.72 లక్షల మంది ఉద్యోగుల భయాన్ని నిజం చేస్తూ ఆ సంస్థలో మోదీ కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ అనుకూల విధానాలు చరవేగంగా రూపుదిద్దుకుంటున్నాయి. ఈ క్రమానుగతమే కేంద్ర ప్రభుత్వ సలహా మండలి 'నీతి అయోగ్' (భారతదేశ పరివర్తనకు జాతీయ సంస్థ) నష్టాలు తెచ్చి పెట్టే పిఎస్‌యుల జాబితాలో బిఎస్ఎన్ఎల్ సంస్థను చేర్చింది. నష్టాలతో నడుస్తున్న ఈ ప్రభుత్వ రంగ సంస్థను పునరుద్ధరించడానికి బదులుగా మూసివేయాలని ప్రతిపాదించింది. బిఎస్ఎన్ఎల్ సంస్థ 2000-2010 మధ్యకాలం వరకు లాభాలర్జించింది అంటే 2004 - 05లో సంస్థ లాభం రూ. 10 వేల కోట్లకుపై చిలుకు. ఇది ఒఎన్‌జిసి సంస్థ తర్వాత అంతగా లాభాలు ఆర్జించిన సంస్థగా నిలిచింది. 2005-10 మధ్య కాలంలో ఈ సంస్థ సుమారు రూ.30 వేల కోట్లు లాభాలు అర్జించింది. 2004 సంవత్సరం వరకు రూ.10,500 కోట్లు లాభాలను పొందుతూ రూ.40 వేల కోట్లు బ్యాంకు బ్యాలెన్స్ కలిగి ఉన్న బిఎస్ఎన్ఎల్ సంస్థ రూ.1,04,000 కోట్లు విలువ చేసే నికరాస్తులు కలిగి ఉన్నది. అటువంటి సంస్థ ఎందుకు అకస్మికంగా నష్టాల్లోకి నెట్టబడి సంక్షోభాన్ని ఎదుర్కొంటుందో నీతి ఆయోగ్ వివరించలేదు. ప్రస్తుతం సంస్థ సుమారు రూ. 50 వేల కోట్లు నష్టాల్లో ఉన్నట్లు, చివరకు 2019 ఫిబ్రవరి, మార్చ్ నెలలకు ఉద్యోగులకు జీతాలు చెల్లించలేని స్థితికి చేరుకున్నదని సంస్థ పాలకవర్గం పేర్కొన్నది. ఆ సంస్థ వెల్లడించిన వివరాల ప్రకారం 2016-17లో సంస్థకు వచ్చిన నష్టం రూ.4,791 కోట్లు కాగా 2017-18లో వచ్చిన వార్షిక నష్టం రూ.7,992 కోట్లు. అయితే ఈ కాలంలో కేవలం బిఎస్ఎన్ఎల్ సంస్థకు మాత్రమే నష్టాలు రాలేదు. ప్రైవేట్ టెలికం సంస్థలకు కూడా నష్టాలు వచ్చాయన్నది గమనంలో ఉంచుకోవాలి. బిఎస్ఎన్ఎల్ కు తన మొబైల్ నెట్వర్క్ను విస్తరించుకునేందుకు తగిన సాధన సామాగ్రిని సమకూర్చుకునేందుకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించ లేదు. అనవసరమైన, సంబంధం లేని అభ్యంతరాలను లేవనెత్తి సుదీర్ఘ కాలం పాటు అంటే 2007 - 2012 వరకు అనుమతిని నిరాకరిస్తూ వచ్చింది. ప్రైవేట్ టెలికం సర్వీస్లు భారత టెలికం వ్యవస్థలో మార్కెట్ (సెల్యూలర్ ఫోన్)పై చేయి సాధించిన తర్వాత మాత్రమే బిఎస్ఎన్ఎల్ కు కేంద్ర ప్రభుత్వం నుండి అనుమతి లభించింది. వాస్తవానికి 2001-02లో ఆనాటి ఎన్‌డిఎ వాజ్‌పేయి ప్రభుత్వం, పబ్లిక్ రంగ టెలికం సంస్థలకు సమాంతరంగా వివిధ టెలికం సర్వీసులను ప్రైవేటీకరించడం మొదలు పెట్టింది. దీనిలో భాగంగానే నాటి టెలికం శాఖామాత్యులుగా ఉన్న జగ్మోహన్ ఆధ్వర్యంలో భారత టెలికం మొబైల్ రంగంలో టెండర్లను పిలిచింది. ఈ టెండర్లలో పాల్గొనడానికి, టెండర్లు వేయడానికి బిఎస్ఎన్ఎల్ కు అనుమతి లభించలేదు. ఉద్దేశపూర్వకంగానే మొబైల్ రంగం నుండి ఈ సంస్థను తొలగించింది. 2002లో ఢిల్లీ హైకోర్టును ఆశ్రయించిన తర్వాతనే బిఎస్ఎన్ఎల్‌కు మొబైల్ రంగంలో ప్రవేశానికి లైసెన్స్ ఇవ్వడం జరిగింది. అదే విధంగా 2009లో బిఎస్ఎన్ఎల్ కు టెండర్లను రద్దు చేశారు. నాటి నుండే సంస్థ క్రమంగా నష్టాల్లోకి నెట్టబడింది.

90వ దశకంలో మొదలైన నయా ఉదారవాద ఆర్థిక విధానాల అమలు నేపథ్యంలో పారిశ్రామిక రంగంలో వచ్చిన పరిణామాల వల్ల టెలికం రంగంలో ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణకు పెద్ద పీట వేశారు. ప్రధానంగా 90వ దశకం తర్వాత భారత టెలికం రంగంలో ప్రతికూల పరిణామాలు మొదలయ్యాయి. ఈ క్రమంలో కేంద్ర ప్రభుత్వం చేపట్టిన విధానపరమైన వైఖరి, చర్యల వలనే భారత టెలికం రంగంలోకి రిలయన్స్ జియో చాలా దూకుడుగా ప్రవేశించింది. ఫలితంగా ఇతర ప్రైవేట్ ఆపరేటర్లలాగే బిఎస్ఎన్ఎల్ కూడా సంక్షోభంలోకి నెట్టబడింది. రిలయన్స్ జియో మార్కెట్లోకి రాగానే చేపట్టిన తొలి చర్య డేటా, కాల్ ఛార్జీలను ఘననీయంగా తగ్గించింది. దీనితో ఇతర ప్రైవేట్, ప్రభుత్వ ఆపరేటర్లు కూడా తమ డేటా, కాల్ ఛార్జీలను అనివార్యంగా తగ్గించుకోవాల్సి వచ్చింది.

జియో దెబ్బకు అప్పటి వరకు టెలికం దిగ్గజాలుగా ఉన్న వొడాఫోన్, ఐడియాలు విలీనం కావల్సి వచ్చింది. ఇన్వెస్టిమెంట్ గ్రూప్ సిఎల్ఎస్ఎ వెల్లడించిన వివరాల ప్రకారం భారత టెలికం కంపెనీలు వార్షికాదాయం 2008-09 నుండి క్రమంగా తగ్గుతూ వచ్చింది. 2015-16లో వార్షికాదాయం రూ. 106.93 కోట్లు కాగా 2016-17లో 100.88 కోట్లకు తగ్గిపోయింది. తాజా సమాచారం ప్రకారం 2018-19లో వొడాఫోన్ - ఐడియా సంస్థకు రెండవ, మూడవ త్రైమాశకంలో వరుసగా రూ. 4,950 కోట్లు, రూ. 5,005.7 కోట్లు నష్టాలు వచ్చాయి. 2018-19లో ఈ సంస్థ మూడవ త్రైమాశకంలో 3.5 కోట్ల మంది వినియోగదారులను కోల్పోయింది. ఈ సంస్థ ఆర్థిక పరిస్థితి భారత టెలికం రంగంలోని సంక్షోభ తీవ్రతకు అద్దం పడుతుంది. కేంద్ర పాలకులు ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలకు వేలకోట్లు రుణాలివ్వడం, లక్షల కోట్లు రాయితీలు ఇవ్వడం జరుగుతుంది. ప్రభుత్వ ప్రజా వ్యతిరేక వైఖరిని అర్థం చేసుకోడానికి ఇక్కడొక విషయాన్ని గమనించండి. 2012-13 నాటికి బిఎస్ఎన్ఎల్ సంస్థ రూపాయిలో 47 పైసలు లాభాలు అర్జిస్తున్న విషయాన్ని పూర్వపక్షం చేస్తూ ప్రైవేట్ ఆపరేటర్లు రూపాయికి 10 పైసలే జీతాలకు ఖర్చు పెడుతున్నప్పుడు ఈ సంస్థ 53 పైసలు ఖర్చు పెడుతుందని చెప్పడం క్షేత్రస్థాయి వాస్తవ విషయాలను చూడనిరాక రించడమే అవుతుంది. బిఎస్ఎన్ఎల్ సంస్థ స్థితిగతులు భవిష్యత్ ప్రగతిపై దృష్టి సారించాలంటూ కేంద్ర మంత్రులతో కూడిన ప్రతినిధి బృందానికి సంస్థ అధికార యంత్రాంగం పవర్ పాయింట్ ప్రెజెంటేషన్ ఇచ్చింది. ఆ సందర్భంగా బిఎస్ఎన్ఎల్ సంస్థకు రూ. 15 వేల కోట్లు ఇస్తే 2018 నాటికి సంస్థ ఎదుర్కొంటున్న సంక్షోభ పరిస్థితిని మెరుగుపరుస్తానని సంస్థ యాజమాన్యం కోరింది. నిజానికి రూ.15 వేల కోట్లలో రూ. 6225 కోట్లు బ్రాడ్ బ్యాండ్ వైర్‌లెస్ అక్సెస్‌ను కేంద్ర ప్రభుత్వానికి అప్పగించినందుకు ఇవ్వాల్సి మొత్తమే. అదనంగా అడిగింది కేవలం రూ.8725 కోట్లు మాత్రమే. ప్రజా ధనాన్ని ఈ విధంగా ఇవ్వడం సరైనది కాదంటూ కేంద్ర ప్రభుత్వం నిరాకరించింది. అదే సమయంలో లక్షల కోట్లు ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలకు రాయితీల పేరుతో ప్రజాధనాన్ని

దోసిపెడుతోంది. బ్యాంకులో నుండి వేల కోట్ల రుణాలు పొందిన ప్రైవేట్ సంస్థలు తిరిగి చెల్లించకుండా పారిపోతున్న ఉదంతాలు మన ముందున్నాయి. టెలికం రంగంలో బిఎస్ఎన్ఎల్ వంటి ప్రభుత్వ రంగ సంస్థను ఆదుకోవడానికి బ్యాంకులో నుండి రుణసదుపాయం పొందడానికి అనుమతులివ్వని పరిస్థితి మరోవైపున కొనసాగుతుంది. ఈ రంగంలో అన్ని సంస్థల కన్నా అతి తక్కువ రుణ సదుపాయం ఉన్న సంస్థ బిఎస్ఎన్ఎల్ ఒకటి మాత్రమే. దీని రుణం మొత్తం 13,900 కోట్లు కాగా ఎయిర్టెల్ రుణం రూ.1.13 లక్షల కోట్లు, ఒడాఫోన్ రుణం రూ. 1.2 లక్షల కోట్లు, ఇక రిలయన్స్ జియో రుణాలు రూ.2 లక్షల కోట్లు. అయినా అతి తక్కువ అప్పు కలిగి ఉన్న బిఎస్ఎన్ఎల్‌కు రుణాలు పొందడానికి అవకాశాలు ఇవ్వకపోగా లక్షల కోట్లు అప్పులు కలిగి ఉన్న ప్రైవేట్ సంస్థలకు రుణాలు పొందడానికి అవకాశాలను కల్పిస్తుంది.

ఈ పరిస్థితుల్లో బిఎస్ఎన్ఎల్ కు నష్టాలు రావడానికి కారణాలు లేకపోలేదు. కేంద్ర ప్రభుత్వ పాలసీలే ఇందుకు ప్రధానమైన ప్రాథమిక కారణంగా ఉన్నాయి. నష్టాలకు నిర్దిష్ట కారణాలను గమనిస్తే అసలు విషయం బోధపడుతుంది. 1) 2000, అక్టోబర్ 1న బిఎస్ఎన్ఎల్ ఏర్పాటు అయిన సమయంలో ఈ సంస్థ ఆర్థిక పరిపుష్టికి తీసుకున్న నిర్ణయాన్ని కేంద్ర ప్రభుత్వం అమలు చేయకపోవడం. 2) టెలికం రంగంలో రిలయన్స్, జియో దూకుడుగా ప్రవేశించి తదుపరి ఆ సంస్థ తీసుకున్న విధానపరమైన నిర్ణయాల ప్రభావం. 3) తాజా సాంకేతిక పరిజ్ఞానాన్ని (బిఎస్ఎన్ఎల్ కు 3జి స్పెక్ట్రం సకాలంలో అనుమతించక పోవడం, 4జి స్పెక్ట్రం కేటాయింపు ఊసే లేకపోవడం) వినియోగానికి కేంద్ర ప్రభుత్వం నుండి, సంబంధిత అధికార సంస్థల నుండి అనుమతులు లభించకపోవడం. 4) గ్రామీణ ప్రాంతాల్లో ల్యాండ్ కనెక్షన్స్ ఇవ్వడం ద్వారా. కనుక లాభాలే రాని గ్రామీణ ప్రాంతాల్లో తన సేవలను విస్తరించి, అందిస్తున్న బిఎస్ఎన్ఎల్ కు అదనపు ఆర్థిక భారం పడుతుంది. ఇందుకు గానూ కేంద్ర ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్ సంస్థపై పెడుతున్న అదనపు భారాన్ని నష్టపరిహారంగా చెల్లించవలసి ఉంటుంది. ఈ చెల్లింపుల ప్రక్రియ 2011 నుండి కేంద్ర ప్రభుత్వం పూర్తిగా నిలిపివేసింది. అదే విధంగా బిఎస్ఎన్ఎల్ నిర్మించిన 65 వేల టవర్స్ ద్వారా సేవలు ఉపయోగించు కుంటున్న ప్రైవేట్ కంపెనీలు చెల్లించవల్సిన పరిహారాన్ని కూడా ఆపివేయడం జరిగింది. అదే విధంగా 2000 సంవత్సరం అక్టోబర్ లో ప్రత్యేకంగా బిఎస్ఎన్ఎల్ ఏర్పాటు సందర్భంగా కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన హామీకి విరుద్ధంగా ఈ సంస్థలో కేంద్ర ప్రభుత్వం పెట్టిన 7,500 కోట్ల మూలధనాన్ని తిరిగి ఇవ్వాలని, 14 శాతం వడ్డీని చేర్చి ఈ మొత్తాన్ని తిరిగి తీసుకున్నది. ఆ విధంగా బిఎస్ఎన్ఎల్ సంస్థ ఖజానా (బ్యాంక్ బ్యాలెన్స్)ను నుండి రూ.40 వేల కోట్లను ఖాళీ చేసింది. ఈ పరిస్థితి కూడా బిఎస్ఎన్ఎల్ నష్టాలు ఎదుర్కోవడానికి దోహదం చేసింది. మరొక విషయమేమిటంటే పోటీ ప్రపంచంలో నైపుణ్యం పెంచుకోవాలంటే తాజా సాంకేతిక పరిజ్ఞానాన్ని సమకూర్చుకోవాలి. ఇందుకు బిఎస్ఎన్ఎల్ సంస్థకు కేంద్ర ప్రభుత్వం ఏ విధమైన కనీస సాకారాన్ని కూడా ఇవ్వకపోగా, 'కార్' తన నివేదికలో 'జియోకు కేంద్ర ప్రభుత్వం అపారమైన మేలు చేసింద'ని పేర్కొన్నది. ఇంత నగ్నంగా ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలకు అనుకూల విధానాలు రూపొందించి అమలు చేస్తున్న కేంద్ర పాలకులు నిస్సిగ్గుగా బిఎస్ఎన్ఎల్ పని అయిపోయినట్టుగా ప్రచారం చేయడం దేనికి నిదర్శనం? ప్రస్తుతం టెలికం రంగంలో 5జీ స్పెక్ట్రమ్ సేవలు అందించడానికి సిద్ధమై ఉన్న ఈ పరిస్థితుల్లో బిఎస్ఎన్ఎల్ ఇంకా 4జి స్పెక్ట్రమ్ కేటాయింపుల కోసం ఎదురు చూస్తుందంటే ఈ సంస్థ పట్ల పాలకుల నిర్లక్ష్య, నిరాకరణ వైఖరిని అర్థం చేసుకోవచ్చు.

భారత టెలికం పరిశ్రమ 5జీ సేవలు అందించేందుకు సంసిద్ధంగా ఉంది. అది 2019 ద్వితీయార్థంలో వచ్చే అవకాశం కూడా ఉన్నది. ఈ పరిస్థితుల్లో బిఎస్ఎన్ఎల్ 4జి స్పెక్ట్రం కేటాయింపు కోసం ఎదురు చేస్తుంది. కేంద్ర ప్రభుత్వం బిఎస్ఎన్ఎల్ కు 3జి స్పెక్ట్రం కేటాయింపుకు చాలా ఆలస్యం చేయడమూ, 4జి స్పెక్ట్రం కేటాయింపు నేటికీ చేయకపోవడానికి ప్రైవేట్ టెలికం ఆపరేటర్ల ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయి. నీతి అయోగ్ ప్రస్తుతం ప్రైవేట్ ఆపరేటర్లందరికీ 4జి స్పెక్ట్రం ఉన్నందున, బిఎస్ఎన్ఎల్ కు లేకపోయినా నష్టం లేదని చెపుతుంది. ఒకవేల 4జి స్పెక్ట్రం బిఎస్ఎన్ఎల్ సంస్థకు కేటాయించిన లాభాలు సంపాదించే సత్తా సంస్థకు లేదని స్పష్టం చేస్తుంది. అంటే, ప్రభుత్వ సంస్థలకు 4జి స్పెక్ట్రం అవసరం లేదన్నదే దీని సారాంశం. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే గతంలో బిఎస్ఎన్ఎల్ కు 4జి స్పెక్ట్రం కేటాయించే అంశం పరిశీలనలో ఉన్నదని పార్లమెంట్ కు తెలియజేసిన కేంద్ర ప్రభుత్వం నేడు నీతి ఆయోగ్ ద్వారా 4జి సేవల కేటాయింపు అవసరం లేదని చెప్పిస్తున్నది. వాస్తవానికి 4జి స్పెక్ట్రం కేటాయించకపోవడం వల్ల బిఎస్ఎన్ఎల్ మార్కెట్లో తన వాటాను మరింత కోల్పోతుంది. రెవెన్యూలో నష్టం రావడమే కాక ఉద్యోగుల్లో నైతిక ధైర్యం దెబ్బ తింటుంది. బిఎస్ఎన్ఎల్ పునరుద్ధరణ కోసం ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్మెంట్ (అహ్మదాబాద్) సంస్థ జరిపిన అధ్యయనం ఆధారంగా రూపొందించిన తన తాత్కాలిక నివేదికలో పేర్కొన్నది. ప్రైవేట్ ఆపరేటర్లు అవసరమై నంతగా విస్తరించని ప్రాంతాల్లో ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లోకి విస్తరించి సేవలందిస్తున్న బిఎస్ఎన్ఎల్ ప్రాధాన్యతను తన నివేదికలో నొక్కి చెప్పింది. అంతే కాదు, ఇంతటి సంక్షోభిత పరిస్థితులను ఎదుర్కొంటున్న బిఎస్ఎన్ఎల్ దేశంలోని నాలుగవ అతి పెద్ద సర్వీసను అందజేసే సంస్థగా ఉండటం గమనార్హం. బిఎస్ఎన్ఎల్ కనుక మార్కెట్లో లేనిపక్షంలో ప్రజలపై ఆర్థిక భారం పెరుగుదల తీవ్ర స్థాయిలో ఉంటుంది. ప్రైవేట్ ఆర్పరేటర్ల గుత్తాధిపత్యం పెరుగుతుంది. అంతిమంగా రిలయన్స్, జియో మాత్రమే మార్కెట్లో ఉంటుంది. అదే విధంగా ఉద్యోగులకు మూడవ వేతన సంఘం సిఫారసులలో భాగంగా 15 శాతం ఫిట్మెంట్‌తో వేతన సవరణ చేయవలసి ఉన్నది. వేతన సవరణతో వేరుచేస్తూ బిఎస్ఎన్ఎల్ విశ్రాంత ఉద్యోగుల పెన్షన్ సవరణ చేస్తామన్న కేంద్ర ప్రభుత్వ హామీ అమలు కాలేదు. ప్రభుత్వ నిబంధనల మేరకు బిఎస్ఎన్ఎల్ నుండి ఫెన్షన్ కంట్రిబ్యూషన్ చెల్లింపులుండాలన్న డిమాండ్, 2వ వేతన సవరణ కమిటీ అపరిష్కృత సమస్యల పరిష్కారం వంటివి ఉద్యోగులకు అత్యావశ్యకమైన కీలక అంశాలే. అయితే, పాలకులు ప్రభుత్వ రంగ సంస్థలను వాటి కాళ్లపై అవి నిలబడేటట్లు చేయకపోగా ప్రభుత్వ రంగ సంస్థలను భౌతికంగా పూర్వపక్షం చేయడానికి చేయవలసిన కృషి అంతా చేసి తదుపరి వాటిని ప్రైవేట్ కార్పొరేట్లకు కారుచౌకగా కట్టబెట్టే వ్యూహాత్మక విధానాన్ని అనుసరిస్తున్నారు. ఈ ప్రక్రియలో మరో అడుగు ముందుకేసిన మోదీ ప్రభుత్వం ఈ 'పవిత్ర' కర్తవ్యంలో శరవేగంగా సాగిపోతున్నది. కొత్త పిఎస్‌యు, ఐపిఒలు,

# బానిస భావజాల వలలో రేపటితరం

*సమాజంలోని ప్రస్తుత విద్యా విధానం పౌరులను చైతన్యవంతులుగా కాకుండా విశ్వాసాలకు పరిమితం చేసి, బానిసత్వ ఆలోచనాపరులుగా మారుస్తోందనీ, దీన్ని అరికట్టకుంటే సమాజం పతనావస్థకు చేరుకుంటుందనీ అంటున్నారు* **తక్కళ్లపల్లి సూరి**

విద్య నేడు విలువలకు దూరం చేయబడింది. విద్య, గుణాత్మక అభివృద్ధి సంస్కరణ పేరుతో, నూతన ఒరవడి పేరుతో, సామ్రాజ్యవాద భావజాలంలోకి నెట్టివేయబడి, పూర్తి వ్యాపార రంగంగా రూపు దిద్దుకుంది. పాలకులు తమ స్వార్థ రాజకీయ అధికార మనుగడకోసం, ప్రభుత్వ విద్యను పూర్తి విధ్వంసంలోకి విసిరిపారేసారు. ప్రజాస్వామిక స్వేచ్ఛ వాతావరణంలో, భవిష్యత్ తరాలకు, ఆదర్శంలా, సమాజాన్ని ఉన్నతంగా సంస్కరించేందుకు ఉపయోగపడవలసిన విద్య, సామ్రాజ్యవాద శక్తులకు, బడా పెట్టుబడిదారుల కంపెనీల వ్యాపారాభి వృద్ధికి ఉడిగం చేసే, మేథో యువతను ఉత్పత్తిచేసే సాఫ్ట్‌వేర్‌లా ఎప్పుడో మారింది. దీనిని భవిష్యత్ తరాలకు పెనుముప్పుగా పరిగణించాలి.

భారతదేశ విద్యా వ్యవస్థ పాలకుల కుట్రలకు తాకట్టు పడుతూనే, బానిస ఆలోచనలను ప్రేరేపించే కేంద్రంగా రూపుదిద్దుకుంది. అందువల్లనే స్వాతంత్ర్యం (1947) వచ్చిన నాటి నుండి అక్షరాస్యత పెరుగుతూనే ఉన్నా, మోసాలు, కుట్రలు, స్వార్థ రాజకీయ పాలన ఎత్తుగడులు, అక్రమాలు, దోపిడీలు, నేర ప్రవృతి, అమానుష ప్రవర్తన, అన్యాయం, అవినీతి దేశంలో అంతరించడం లేదు, కనీసం తగ్గడం లేదు. ఇలాంటి విద్యా వ్యవస్థలో సంపూర్ణంగా, మంచి మనిషిని నిర్మించుకొనే అవకాశాలు తక్కువ, విద్య వ్యవస్థ మానవ సంపూర్ణ వికాసానికి దోహదపడాలి. విద్య దోపిడిలేని సమాజ అభివృద్ధికి ఉపయోగపడాలి. విద్య పేద, ధనిక, లింగ బేధంలేని సమాజ నిర్మాణానికి ఉపయోగపడాలి. విద్యవల్ల ఉన్నత సమాజం రూపుదిద్దుకోవాలి. కాని నేటి విద్య, అసమానతలను పతాక స్థాయిలో ప్రచారం చేసే వ్యాపార వస్తువులా, మారుటకు పాలకులు, పాలకవర్గ పాలసీలు ముఖ్య కారణం. ఎందుకంటే భారతదేశం స్వాతంత్ర్య దేశంలా మారి 70 యేళ్లకు పైగా గడిచిపోయిన, విద్య వల్ల సమాజం ఉన్నతంగా తీర్చిదిద్దుకోకపోగా, వ్యక్తులను పూర్తి స్వార్థపూరిత, వ్యక్తి వాదులుగా మార్చింది. ప్రజాస్వామ్య దేశంగా పత్రికల్లో మాత్రమే బతుకుతూ, తమ విలువైన ఓటును, పచ్చనోట్ల రేటుగా నేటికి మార్చబడుతూనే ఉంది. నేటికి పేద, బీద ప్రజలతో పాటు, అక్షరాస్యులు ఎన్నికలంటే ఒక ఆర్థిక ఉత్సాహంలా, ఒక ఆల్కహాల్ జాతరలా, ఐదేండ్లకు ఒకసారి వచ్చే ఒక మహా ఉత్సవ వైభవంగా, అద్భుత పండుగలా, ఎదురుచూస్తూనే ఉన్నారు. అంటే విద్యవల్ల ఎవరి ఆలోచన, స్వరూప స్వభావాలు మారలేదు. అవినీతి సొంతం హద్దు లేకుండా పెరుగుతూనే ఉంది. లంచగొండితనం సర్వాంతరయామియై బుసలు కొడుతూనే ఉంది. దేశంలో ఎప్పుడు ఎన్నికలు వచ్చినా, వేల కోట్లు అనధికారికంగా ఖర్చు పెడుతూనే ఉన్నారు. ఈ విద్య వల్ల నిజంగా సమాజవృద్ధి జరిగి, మంచి పౌరులుగా మారితే, ఎందుకు ఎన్నికలల్లో విపరీత డబ్బు, ఆల్కహాల్, చీర, ఉంగరం లాంటి ఆకర్షణతోనే పాలకులు గెలువాలనుకుంటున్నారు. అవినీతి, లంచగొండితనం, ఓటను అమ్ముకోవడం లాంటి అంశాలు సర్వసాధారణ అంశాలుగానే పరిగణించేలా ఎందుకు ప్రచారం చేస్తున్నారు. విద్యవల్ల కలిగిన ఆలోచన, జ్ఞానం, విజ్ఞానం, నైతికత, హేతూకీకరణ, న్యాయన్యాయాలు రోజు రోజుకి కుంచించుకుపోతూనే ఉన్నాయి. ముదిరిన మనువాదంతో మూఢభక్తికి దాసులై, మూఢ నమ్మకాలను గాఢంగా నమ్మే ఉన్మాదంలోనే దేశ ప్రగతిని నిర్వచించే సంకుచిత వాదమే ఆదర్శవాదమనే ముసుగులోకి నెట్టివేయబడింది నేటి యువత.

దీనికి తోడు అటు కేంద్రంలోనూ, ఇటు తెలంగాణ నూతన రాష్ట్రంలోనూ మనువాదాన్ని ఉద్రిక్త పరిచే యాగాలు, పూజలు, మొక్కులు, అభిషేకాలు, అర్చనలు, దినదినం వృద్ధి చెందుతూనే ఉన్నాయి. మనిషిని మనిషిగా చూడని మనువాదం, మనిషిని అమానుషంగా అంటరాని వాడిగా మలచిన మనువాదం, కుక్క, పంది, తాబేలు, పశువు, చేప, ఆఖరికి జంతువులను వేటాడే అడవి మృగం కూడా పూజనీయమే కాని, శూద్రులు మాత్రం అంటరానివారని బోధించిన మనువాదం, నేడు మళ్లీ నూతన రాష్ట్రంలో పాలకపక్ష, వాంఛిత ప్రోత్సాహంతో తిరిగి అధికార పునర్జీవనోద్యమంలా వర్ధిల్లుతోంది. ప్రభుత్వ బడులకన్న, గుడుల ప్రాముఖ్యత ఉధృతంగా పెంచి పోషింపబడుతోంది. కులాల పేరుతో

---

మ్యూచువల్ ఫండ్ ద్వారా పెట్టుబడుల ఉపసంహరణ షేర్లను తిరిగి కొనుగోలు చేసేందుకు పిఎస్‌యులపై ఒత్తిడి తేవడం ప్రభుత్వానికి అధిక రేటులో డివిడెండ్ చెల్లించేటట్లు చేయడం తదితర పద్ధతుల్లో మోదీ ప్రభుత్వం, ప్రభుత్వ రంగంలో ఉన్న నగదును లాక్కునేందుకు మార్గాలుగా ఎంచుకున్నది. తొలుత తన ప్రభుత్వ హయాంలో మొదటి నాలుగున్నరేండ్ల కాల వ్యవధిలో ప్రభుత్వ రంగ సంస్థల స్టాక్స్‌ను అమ్మివేశారు. దీని విలువ 1991 నుండి 2018 మధ్య కాలంలో జరిగిన మొత్తం పెట్టుబడిల ఉపసంహరణలో 58 శాతం దీనితో పాటు ప్రభుత్వరంగ సంస్థలయిన బిఎస్ఎన్ఎల్ భూముల అమ్మకానికి రంగం సిద్ధం చేసింది. ఫలితంగా, ఈ విషపూరిత వ్యూహాత్మక విధానానికి ప్రస్తుతం బిఎస్ఎన్ఎల్ బలిపశువు కాబోతున్నది. కనుక, తొలుత ఉద్యోగుల జీవనాధారమైన ప్రాథమిక అంశం బిఎస్ఎన్ఎల్ సంస్థ అస్తిత్వం, దాని కొనసాగింపు మాత్రమే. కనుక, అందుకోసం బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులు తమ ఉద్యమ కేంద్రీకరణ, పోరాటం క్రమానుగతంగా బలమైన ప్రజా ఉద్యమ నిర్మాణ దిశగా నిర్మాణాత్మకమైన కార్యచరణతో ముందుకు సాగాలి. తద్వారా మాత్రమే బిఎస్ఎన్ఎల్ సంస్థను రక్షించుకోగలుగుతాం. తదుపరి ఉద్యోగులు తమ డిమాండ్లను సాకారం చేసుకోగలుగుతారు.

*(రచయిత ఐఎఫ్‌టియు రాష్ట్ర కార్యదర్శి)* వీ

గురుకుల పాఠశాలలను స్థాపించి, కుల రక్కసిని బలోపేతం చేస్తున్నారు. కుల నిర్మూలన జరుగాలన్న డా. బాబాసాహెబ్ అంబేద్కర్‌ను నిమ్న కులాల వారికే చెందిన వాడిగ ప్రచారం చేస్తూ, కులవ్యాప్తికి విస్తృతంగా ఉపయోగించుకుంటున్నారు. దేశంలోనూ, రాష్ట్రంలోనూ పెరుగుతున్న మను సంస్కృతిలో భాగంగానే హైద్రాబాద్ మహానగరంలో 14 ఏప్రిల్ అంబేద్కర్ జయంతిని కనుమరుగు చేసే ప్రయత్నంలో బాబాసాహెబ్ అంబేద్కర్ విగ్రహాన్ని చెత్తకుప్పలో విసిరి వేయడాన్ని అర్థం చేసుకోవాలి. డిసెంబర్ 6 అంబేద్కర్ వర్ధంతిని బ్లాక్ డే గా మార్చిన మతశక్తులు, అంబేద్కర్ జయంతిని కూడ బహిష్కరించే కుట్రపూరిత అంతర కోణాన్ని గమనించాలి.

తెలంగాణ నూతన రాష్ట్రంలో దళితుడే తొలి ముఖ్యమంత్రి అని ప్రకటించి, మాట మార్చారు. అంబేద్కర్ విగ్రహాన్ని 125 అడుగుల ఎత్తులో ప్రతిష్టిస్తానని, దళిత, బహుజన వాదాన్ని ఏకంగా మూసినది అడుగున పాతరవేశారు.

దళితులకు మూడు ఎకరాల భూమి ఇంకా ఎన్ని ఎన్నికల నినాదమై కొనసాగుతుందో ఎవరికీ తెలియదు. రైతుబంధు పథకం భూమిలేని దళితులకు అక్కరకు రానిదే అయింది. దళితులకు ఉన్న కొద్దిపాటి భూములకు పట్టాలు రాలేదు, ప్రభుత్వం ఇప్పటివరకు ఇవ్వలేదు. రైతుబంధు పథకం బడా భూస్వాములు, పెత్తందారులు ఇంకా గ్రామాల్లో కొనసాగుతున్న దొరలకు ఉపయోగపడే అగ్రవర్ణ విలాస ఉపాధి పథకంగా మారిపోయింది.

ప్రభుత్వ భూములు, (అసైన్డ్, పంచరాయి, పోరంబోకు, శిఖం, ఖరీదు ఖాతా, సీలింగ్, బల్వతా ఇనాం, దేవాలయ) మొదలగు భూములు తెలంగాణ రాష్ట్రంలో నూతన భూ సంస్కరణ పేరుతో వచ్చిన సాదా బైనామా పేరుతో అగ్రవర్ణాలు, గ్రామాల్లో భూస్వాముల భూములు తిరిగి వారికే చెందినట్లుగా అధికారుల అండదండలతో, డబ్బులతో భూములను తిరిగి ఆక్రమించుకున్నారు.

1954 కాస్రా ఆక్ట్ నుండి నేటి వరకు గల ప్రభుత్వ భూములపై పాలకులకు చిత్తశుద్ధి ఉంటే ఓ స్వతంత్ర కమీషన్‌ను ఏర్పాటు చేసి సమగ్ర పరిశీలనతో దర్యాప్తు చేస్తే కొన్ని లక్షల ఎకరాల పట్టా భూమి ప్రభుత్వానికి చెందుతుంది. హైదరాబాద్‌లో నిజాం పట్టా భూములే, కొన్ని లక్షల ఎకరాలు లెక్క తేలవలసి ఉన్నా, ప్రభుత్వాలు, పాలకులు లెక్కలు బహిర్గతం చేయడం లేదు.

రెవెన్యూ శాఖను మార్చి అవినీతిని అంతం చేస్తానని పంతంతో ముఖ్యమంత్రే స్వయంగా ప్రకటనలిచ్చి వార్తలోకెక్కారు. అవినీతి ఒక రెవెన్యూ శాఖలోనే ఉందా? వ్యవసాయ శాఖలో లేదా? అవినీతి అన్ని శాఖల్లోనూ విస్తరించి ఉంది. అన్నింటికంటే ప్రమాదకరంగా రాజకీయ అవినీతి పెరిగి జుగుప్సాకరంగా జెడలు విప్పి వికృత నాట్యం చేస్తుంది. నూతన రాష్ట్రం అభివృద్ధి నినాదంతో కాకుండా, డబ్బుల సంచుల పంపిణీయే ప్రాధాన్యంగా ఎన్నికల మూలకేంద్రమైందని, ప్రపంచ చరిత్రలో ఎక్కడ జరగనిది, భారతదేశ చరిత్రలో కూడ ఎప్పుడు జరగని రాజకీయ అవినీతి, తెలంగాణ రాష్ట్రంలో మాత్రమే జరిగింది. మొత్తం 119 నియోజకవర్గ అభ్యర్థులకు అధికార రాజకీయ పార్టీయే డబ్బులు విచ్చలవిడిగా పంపిణి చేసిందని, ఒక్కో నియోజక వర్గానికి 30 కోట్లకు మించి, కొన్ని నియోజకవర్గాల్లో వందల కోట్లు గుప్పించి, రాజకీయ అవినీతికి పతాక స్థాయిలో పాల్పడి, ప్రజాస్వామ్యాన్ని ప్రజల ఓట్లను అఖండ ధనబలంతో కొనుకున్నారనే చర్చ కొనసాగుతుంది.

నిజంగా ఇలా జరిగితే, నిజాయితి గల పాలకులు, అవినీతిని నిర్మూలించే ప్రభుత్వాలు ఇలాంటి తీవ్రమైన అవినీతిపై స్పందించాలి, చర్చించాలి. నిరోధించాలి. నిజంగా భారతదేశ వ్యాప్తంగా ఓటు, ప్రజాస్వామ్యం వేలానికి ఖరీదు చేయబడితే, అది తప్పకుండ ఈ దేశ విద్య వ్యవస్థలో ఉన్న లోపాన్ని ఆధారం చేసుకొని పాలకులు అధికార పీఠంపై విసిరే పాచికల వ్యూహ పాలనాకాంక్ష క్రీడలా భావించాలి.

ఉన్నత విద్యావంతులు, అక్షరాస్యులు, నాగరికత తెలిసినవారు, బాధ్యతగల పౌరులుగా విద్య వల్ల మారిపోవాలి. కాని ఆశ్చర్యంగా నేటి విద్యా విధానం వల్ల విద్యావంతులే నిరక్షరాస్యుల కన్నా ప్రమాదంగా వ్యవహరిస్తున్నారు. మోసాలు, కుట్రలు, అవినీతి, అక్రమం, లంచగొండి తనం, లక్షల కోట్లు బ్యాంకుల నుండి, ప్రజల డబ్బులు అక్రమ లోన్ రూపంలో తీసుకొని, అప్పులు ఎగవేసి, పాలకుల ప్రభుత్వాల అండదండ లతో విలాసాలతో, జల్సాలతో, తమ జీవితాలను గడిపేవారు కూడ, విద్యాధికులే కావడం శోచనీయం. ప్రజల డబ్బులను, విచ్చలవిడిగా హద్దులు మీరి, రాజకీయ అవినీతిలో భాగంగానే, నకిలీ కంపెనీల పేర అప్పులిస్తూ, ఈ దేశాన్నే అప్పుల పాలు చేస్తున్నారు.

నేటికి భారతదేశ అప్పు 84 లక్షల కోట్లను దాటింది, తెలంగాణ రాష్ట్ర అప్పు 2 లక్షల కోట్లను దాటింది. అప్పు ఏనాటికైన తీవ్రమైన ముప్పు అని, అప్పులతో అభివృద్ధి జరగదని తెలిసినా, అప్పులే అభివృద్ధి అని, పాలకులు నీటిమూటల మాటలు వల్లిస్తూనే ఉన్నారు.

విద్య వల్ల మనిషిలో నిర్మాణాత్మక మార్పువస్తే అవినీతికి అవకాశమే లేదు. విలువలు లేని విద్యవల్ల, నైతికత లేని అక్షరాస్యత వల్ల నష్టమే ఎక్కువగా ఉంది. అందుకే విద్యను మలినం లేని, నాణ్యతగల, సమాన భావం గల, కామన్ విద్యా విధానం, పెట్టుబడిదారుల, సామ్రాజ్యవాదుల కేంద్రంగా కాక, ప్రజల కేంద్రంగా, ప్రజా సంక్షేమ కేంద్రంగా విద్య కరిక్యులం తయారీ జరుగాలి. విద్యను, వైద్యాన్ని ప్రైవేటు వ్యాపారం నుండి, నిర్బంధంగా తప్పించి, ప్రభుత్వం మాత్రమే విద్యను, వైద్యాన్ని అన్ని వర్గాల వారికి, కుల, మత, లింగ, ఆర్థిక, సామాజిక, బేధం లేకుండా అందరికి సమాన ప్రమాణాలతో నాణ్యతగల విద్య మరియు వైద్యం అందించాలి.

భారత రాజ్యాంగంలో సేవారంగాలైన విద్య, వైద్యాన్ని వ్యాపారం చేసే అన్ని అవకాశాలను సమూలంగా నిర్మూలించాలి. విద్యను పూర్తి నైతికతో, విలువలతో, సమాన భావాలు గల సమాజ అభివృద్ధిలో, స్వేచ్ఛాయుత వాతావరణంలో, విద్యార్థుల అంతర్గత సృజన శక్తులను వెతికి ప్రోత్సహించే, సమాజ శ్రేయస్సుకు నిజంగా ఉపయోగపడే నిస్వార్థ అక్షర జ్ఞానం గల పౌరుడిగా మారడానికి విద్య ఉపయోగపడినప్పుడే ఈ సమాజంలో పెనవేసుకుపోయిన అసమానతలు, కులాలు, మతాలు, ధనవంతులు, పేదలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక బేధాలు అంతరించిపోతాయి. లేదంటే బానిస ఆలోచనల భావజాలంలో పెరిగిన రేపటి తరం పౌరులు, ప్రజలు, సమాజం, సేవ, స్వతంత్రం, స్వేచ్ఛ, హక్కులు, ప్రశ్నించడం, పోరాడడం, ఉద్యమించడం వంటివి అంశాలు మరచిపోతారు. స్వార్థ వ్యాపార, ఉగ్రరూప ఆర్థికవాదులై మానవ ఆత్మీయ బంధాలు లేని, వింత సంచార సంత జీవులై, ఈ భూగ్రహం మీద ప్రయోజనం లేని సంతానోత్పత్తి చేసే, అనవసర జీవులుగా మిగిలిపోయే ప్రమాదం పొంచి ఉంది. నిజమైన ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణతో కూడిన విద్య ద్వారా మాత్రమే సమసమాజ నిర్మాణం జరుగుతుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

# ముంచుకొస్తున్న పర్యావరణ ముప్పు

***ప్రకృతి వనరుల దోపిడీ వల్లనే పర్యావరణానికి ముప్పు ఏర్పడుతోందనీ, ఈ దోపిడినీ నివారించకుంటే మానవ మనుగడకే ప్రమాదమనీ అంటున్నారు* బోరెడ్డి మధుసూదన్ రెడ్డి**

వాతావరణ వైపరీత్యాల వల్ల, భూమి వేడెక్కడం వల్ల మానవాళి పెను ముప్పును ఎదుర్కొంటుంది. గత కొన్ని సంవత్సరాల నుండి వాతావరణ మార్పులను గమనించినట్లయితే ఈ విషయం స్పష్టంగా తెలుస్తుంది. అయినా కూడా ప్రపంచ దేశాలు పర్యావరణ పరిరక్షణ చర్యలు చేపట్టకుండా కాలయాపన చేస్తున్నాయి. ముందు చూపుతో వ్యవహరించి దిద్దుబాటు చర్యలు చేపడితే తప్ప పొంచి ఉన్న ప్రమాదం నుండి మానవాళిని కాపాడుకోలేం. కొన్ని ప్రమాదాలు, సంఘటనలు, ప్రకృతి పర్యావరణ విపత్తులు జరిగిన తర్వాత నివారణ చర్యలు చేపట్టేకంటే ఆ విపత్తులను, వాతావరణ వైపరీత్యాలను గ్రహించి, ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఒక భారీ నౌకను ఎడమవైపు గాని, కుడివైపు గాని తిప్పాలంటే దానిని అప్పటికప్పుడు తిప్పడం సాధ్యం కాదు. దానిని కొన్ని కిలోమీటర్ల దూరం నుండే ఆ భారీ నౌక గతిని మెల్ల మెల్లగా మార్చుకుంటూ, జాగ్రత్తపడుతూ సాగితే తప్ప అది సాధ్యం కాదు. ఈ సూత్రం పర్యావరణ విపత్తులకు, భూతాపం పెరుగుదలకు, వాతావరణ వైపరీత్యాలకు కూడా వర్తిస్తుంది. ఇవి డ్యూక్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రఖ్యాత పర్యావరణ వేత్త డ్రూంషిండెల్ చేసిన వాఖ్యలు.

గత కొన్ని సంవత్సరాల నుండి పెరుగుతున్న భూతాపం ప్రపంచాన్ని వణికిస్తుంది. వాతావరణంలో బొగ్గు పులుసు వాయువు (కార్బన్ డై ఆక్సైడ్) పరిమాణం క్రమక్రమంగా పెరుగుతుంది. 50 సంవత్సరాల క్రితం 315 పిపిఎం (పది లక్షల దూళికణాలకు గాను) గా ఉన్న కార్బన్ డై ఆక్సైడ్ (సిఒ2) పరిమాణం 2019 నాటికి 413 పిపిఎంగా నమోదు అయింది. ఇదే పెరుగుదల ఇలాగే కొనసాగితే ఈ శతాబ్ది చివరి నాటికి ఈ పరిమాణం 500 పిపిఎంకు పెరగవచ్చన్న అంచనాలు ఆందోళన కలిగించేదిగా కనిపిస్తుంది. 'నాసా' జరిపిన అధ్యయనం ప్రకారం గత పదిహేనేళ్లలోని ఉష్ణోగ్రతను పరిశీలించినట్లయితే 2015-18 ఈ సంవత్సరాలలోనే క్రమక్రమంగా అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదైనట్లు వెల్లడైంది. ఈ భూతాపం క్రమంగా పెరుగుతున్నట్లు తెలుస్తుంది.

వాతావరణంలో బొగ్గు పులుసు వాయువు పరిమాణం పెరిగేకొద్దీ ప్రాణ వాయువు తగ్గుతుంది. తద్వార జీవులలో శ్వాసక్రియకు అవసరమైనటువంటి ప్రాణ వాయువు – ఆక్సీజన్ గాలిలోకి సక్రమంగా సరఫరా కాకపోవడం వల్ల దాని శాతం తగ్గి జీవజాతి మొత్తం అనారోగ్యం భారిన పడే ప్రమాదం ఉంది. భూతాపం పెరిగేకొద్దీ మంచు కొండలు వేగంగా కరగడం ప్రారంభమవుతాయి. 1950 నుండి ఇప్పటి వరకు భూమి మీద మొత్తంగా ప్రమాదకరమైన స్థాయిలో కొన్ని చదరపు కిలోమీటర్ల వరకు మంచు పలకలు కరిగినట్లు శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు. దానివల్ల రాబోయే కాలంలో ఈ శతాబ్ది చివరి నాటికి సముద్ర మట్టాలు ఇప్పుడున్న మట్టాలకంటే సుమారు 65 సెంటిమీటర్లు పెరిగే అవకాశం ఉంది అని, దీని ఫలితంగా ప్రపంచా వ్యాప్తంగా సముద్ర తీర ప్రాంతాలు ముంపుకు గురయ్యే ప్రమాదం ఉందని వాతావరణ శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. దీనివల్ల తీర ప్రాంత ప్రజల జీవితాలు, వారి జీవన విధానాలు, అక్కడి స్థిర, చర ఆస్తులు, వనరులు, వాతావరణ సమతుల్యత దెబ్బతిని ప్రకృతి విపత్తులకు గురయ్యే పరిస్థితి ఉంది. ఇంతటి వాతావరణ వైపరీత్యాలు మన కళ్లముందు కనపడుతున్నా కూడా నివారణ చర్యలు చేపట్టకుండా ఇంకా తప్పుల మీద తప్పులు చేస్తున్న తీరు ఆందోళన కలిగిస్తుంది.

బొగ్గు, చమురు, సహజ వాయువులు, ప్రకృతి వనరుల వినియోగం అత్యధిక స్థాయిలో ఉండడం వల్లనే వాతావరణంలోకి కార్బన్ డై ఆక్సైడ్‌తో పాటు ఇతర హానికర వాయువులు విడుదల అవడం వల్లనే గాలి కాలుశ్యానికి కారణం అవుతున్నది. దీనివల్ల గాలిలో ఆక్సీజన్ శాతం తగ్గి మనుషులలో శ్వాసక్రియ, హృదయ స్పందన రేటు పెరిగి దాని ప్రభావం వల్ల ప్రజలు నాడీ, హృదయ సంబంధ వ్యాధులకు గురవుతున్న వారి సంఖ్య రోజు రోజుకు పెరగడం కూడా ఇది ఒక కారణంగా కనిపిస్తుంది. కార్బన్ డై ఆక్సైడ్‌ను అధిక స్థాయిలో విడుదల చేస్తున్న దేశాలలో 'చైనా' మొదటి స్థానంలో ఉండగా, మనదేశం ఐదవ స్థానంలో ఉంది. భూతాపాన్ని, వాతావరణ కాలుష్యాన్ని సాధ్యమైనంత వరకు తగ్గించే దిశలో అడవుల విస్తీర్ణాన్ని పెంచి, నగరాల్లో, పట్టణాలలో పచ్చదనాన్ని పెంపొందించే కార్యక్రమాలను యుద్ధ ప్రాతిపదికన ప్రవేశ పెట్టినట్లయితే భూతాపాన్ని, బొగ్గు పులుసు వాయువు పరిమాణాన్ని నియంత్రించవచ్చు. ఇదే విషయాన్ని 2015 నాటి 'పారిస్' ఒప్పందం స్పష్టం చేస్తుంది. పర్యావరణ సమతుల్యతపై ప్రభుత్వాలు దృష్టి పెడితేనే రాబోయే 2030 నాటికి కొన్ని కోట్ల టన్నుల బొగ్గు పులుసు వాయువుల ఉద్గారాలను విడుదల కాకుండా అడ్డుకోవచ్చునని అధ్యయనాలు వెల్లడి చేస్తున్నాయి. దేశాలు అన్ని కలిసికట్టుగా కదిలితే జీవ వైవిధ్యాన్ని, పర్యావరణాన్ని పరిరక్షించుకొనే అవకాశం ఉంటుంది. కాని 2015 నాటి 'పారిస్' ఒప్పందం నుండి అమెరికా బయటకు రావడంతో ఆ అవకాశం, ఆశలు సన్నగిల్లాయి. పెరుగుతున్న భూతాపం వల్లనే ప్రపంచ వ్యాప్తంగా కరువు, నీటి కొరత, తుఫాన్లు, కొండచరియలు విరిగిపడడం, హరికేన్ల తాకిడి, వర్షపాతాలలో అనుకోని అనూహ్యమైన మార్పులు చోటుచేసుకుంటున్నాయనడంలో ఎలాంటి సందేహం లేదు. గడచిన కొన్ని సంవత్సరాల నుండి సముద్ర జల ఉష్ణోగ్రతలు మితిమీరి పెరగడం వల్ల భూమిపై ఉన్న పర్యావరణ వ్యవస్థల సమతుల్యతను దారుణంగా దెబ్బతీస్తోంది.

పంచ భూతాలు అయినటువంటి నింగి, నేల, నీరు, నిప్పు, గాలిని ప్రపంచ ప్రజలు అందరు కాపాడుకోవలసిన అవసరం ఎంతో ఉంది. ఈ అంశీ భూతాలను పరిరక్షించుకోవలసిన బాధ్యత ప్రపంచ దేశాలపైన, పాలకులపైన ఉంది. కాని దురదృష్టవశాత్తు కొంత మంది పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థలు వారి వ్యాపార అభివృద్ధిలో భాగంగా, లాభాలు అర్జించడమే లక్ష్యంగా పాలకుల కనుసన్నలలో

మెదులుతూ నేలపైన ఉన్న వనరులను, నేలలోని ఖనిజ సంపదను, నీరును, వీటితో పాటు పర్యావరణంలోని అన్ని ప్రకృతి వనరులను ధ్వంసం చేస్తూ, దోపిడీ చేస్తూ, వ్యాపార అభివృద్ధే లక్ష్యంగా వ్యవహరిస్తున్న పరిస్థితి వల్లనే పర్యావరణంలో జరిగే విపత్తులకు కారణం అని గమనించవచ్చు. ఇలాంటి ప్రకృతి వ్యతిరేక కార్యకలాపాలు దేశాలలో కొనసాగుతున్నంత కాలం పర్యావరణ విపత్తులు, విపరీత పరిణామాలు జరుగుతూ ఉంటాయని మనం అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది.

పర్యావరణంలో ప్రమాదకర మార్పులను అడ్డుకోవాలంటే పచ్చదనం విస్తరించడానికి పెద్ద ఎత్తున ఉద్యమించి యుద్ధ ప్రాతిపదికన చెట్లను రక్షించి, హరిత వనాలను పెంచడం ఏకైక మార్గమని అంతర్జాతీయ స్థాయి శాస్త్రవేత్తలు అందరు ఏనాడో తీర్మానించారు. శాస్త్రీయంగా ఆలోచించినట్లయితే మొక్కలు కూడా ప్రాణం ఉన్న చలనం లేని సజీవులు. ఇవి స్వయం పోషకాలుగా జీవిస్తాయి. మిగతా జీవరాశులలో జరిగే విధంగానే జీవక్రియలు జరుగుతాయి. మొక్కలలో నిరంతరం జరిగే వివిధ రకాల జీవక్రియల ద్వారానే పర్యావరణం పరిరక్షింప బడుతుంది. వాతావరణంలోని కార్బన్ డై ఆక్సైడ్‌ను శ్వాసక్రియ ద్వారా మొక్కలు గ్రహించి మనకు కావలసిన ఆక్సీజన్‌ను విడుదల చేస్తాయి. అదే మాదిరిగా మొక్కలలో భాష్పోత్సేక క్రియ జరగడం ద్వారా పత్ర రంధ్రాల ద్వారా నీరు, నీటి ఆవిరి రూపంలో విడుదలై వాతావరణంలోకి చేరడం ద్వారా గాలిలోని ఊష్ణోగ్రత నియంత్రించబడి భూతాపం పెరగకుండా చేస్తాయి. మానవ ప్రమేయం లేకుండా చెట్లు జీవించగలుగుతాయి. కాని చెట్లు లేకుండా భూమి మీద ఏ జీవజాతి కూడా జీవించలేదు. ప్రకృతిలో మొక్కలు ఉత్పత్తి దారులుగా, జీవులు వినియోగదారులుగాను జీవిస్తాయి. కాబట్టి ఉత్పత్తి దారులు లేకుండా వినియోగదారులైన సకల జీవ జాతులు జీవించలేవు. మానవ ఆవిర్భావానికి ముందే అడవులు ఏర్పడ్డాయి. తర్వాత కాల క్రమేన మనిషి తన మనుగడ కోసం అడవుల మీద ఆధారపడి, ఆహారం కోసం, అవసరాల కోసం మాత్రమే వాడుకున్నంత కాలం ఎలాంటి ప్రకృతి విపత్తులు సంభవించలేవు. ఏనాడైతే మనిషి వ్యాపార వేత్తగా, పెట్టుబడిదారునిగా, లాభార్జనే లక్ష్యంగా తన ఆలోచనా విధానాన్ని మార్చుకున్న తర్వాత ప్రకృతి వనరులను, సహజ సంపదను విచ్చలవిడిగా వినియోగంలోకి తేవడం ద్వారానే పర్యావరణ విధ్వంసం మొదలైందని, అదే ఈనాటి ప్రకృతి విపత్తులకు కారణం అని శాస్త్రవేత్తలు అంటున్నారు.

ప్రకృతిలో ఉత్పత్తి దారులకు, వినియోగదారులకు మధ్య సమన్వయం ఉన్నంత కాలం సకల జీవజాతి జీవనం సాఫీగానే జరుగుతుంది. ఎప్పుడైతే ఈ రెండింటి మధ్య సంబంధం, సహజీవనం లోపిస్తుందో అప్పుడే పర్యావరణం ద్వారా మానవాళికి ముప్పు ముంచుకొస్తుంది. ఈ ముప్పు నుండి తప్పించుకోవాలంటే తక్షణ చర్యలు చేపట్టడమే ఏకైక మార్గం. అందులో భాగంగా పచ్చదనాన్ని విస్తరించడంలో చెట్లను విస్తృతంగా నాటడం, పర్యావరణ సమతుల్యతను కాపాడుకునేందుకు అడవుల శాతాన్ని పెంచడం, మిగులు భూమిని హరిత వనాలుగా మార్చడం, కార్పొరేట్ కంపెనీలు సహజ వనరులను, ఖనిజ సంపదను కొల్లగొట్టకుండా వాటిని కాపాడడంతో పాటు బొగ్గు, చమురు, సహజ వాయువుల వినియోగాన్ని తగ్గించి, వాటికి బదులుగా ప్రత్యామ్నాయ వనరుల వినియోగం గురించి పరిశోధనలు కొనసాగిస్తూనే, కొద్ది మంది అభివృద్ధి కోసం జరుగుతున్న వనరుల దోపిడీని అరికట్టడం లాంటి తక్షణ చర్యలు చేపట్టడం ద్వారానే భవిష్యత్ తరాల బాగుకోసం, మానవాళికి ముంచుకొస్తున్న ముప్పును అరికట్టగలుగుతాం. దానికోసం దేశాలు అన్ని ఆ దిశలో ఆలోచించవలసిన అవసరం ఉంది.

*(రచయిత రిటైర్డ్ ప్రధానోపాధ్యాయుడు)* వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*తొమ్మిది నెలలు ముందుగానే, ముందస్తు ఎన్నికలకెళ్లడం కెసిఆర్ తన రాజకీయ ప్రయోజనాలను మాత్రమే ఆలోచించుకుని చేసిన పని. ప్రజా ప్రయోజనాల ఊసే రాదు. ప్రజాధనం వృథా అవ్వడం తప్ప. సరే గెలిచారు. బంగారు తెలంగాణ ఆశలు ప్రజల్ని వదల్లేదు. ప్రతిపక్షాలు ఏ మాత్రమూ బాధ్యతాయుతంగా ప్రవర్తించలేదు. ప్రజల సమస్యల కోసం పోరాడిన ప్రతిపక్ష నాయకుడు ఒక్కరూ లేరు. అందుకే ప్రజలు టిఆర్ఎస్‌కే మళ్లీ పట్టం కట్టారు. అందుకు ప్రతిఫలంగా ముఖ్యమంత్రి కెసిఆర్ ఏకపక్షంగా తీసుకున్న నిర్ణయాలేంటి? పూర్తికాని ప్రాజెక్టుకు ప్రారంభోత్సవాలు, యాగాలు, యజ్ఞాలు, పార్టీ కార్యాలయాల నిర్మాణానికి శంకుస్థాపనలు. అందుకోసం మొత్తం మంత్రివర్గమూ, శాసనసభ్యులూ, మిగతా వందిమాగధ బృందాలూ – వెరశి బొచ్చెడు ఖర్చూ, కాలయాపనా. రాష్ట్ర సచివాలయాన్నే సందర్శించని ముఖ్యమంత్రికి మరో సెక్రటేరియట్ కట్టడం ఆయనకు కనిపించిన ప్రాధాన్యం! ఇందులో కూడా మతాధిపతుల వంటి వారి సలహాలే ఉండి ఉంటాయి కానీ, ఏమాత్రం ప్రజా ప్రయోజనాలూ ఉండవన్నది సత్యం. ఉమ్మడి రాష్ట్రం లోని ఎనిమిదిన్నర కోట్లమందిని పరిపాలించడానికి/ మభ్యపెట్టడానికి చాలిన ప్రాంగణం ఇప్పుడు నాలుగు కోట్లమందికి ఎందుకు సరిపోదు? అభివృద్ధి అంటే పాలకుల జీతాలూ, సౌకర్యాలూ, షోకులూ పెరగడమా? దానికి ప్రజలపై రుణభారం పెరగడమా!*

*ఇక ఆంధ్రప్రదేశ్ సంగతి చూడండి. ప్రజావేదిక కూలగొట్టడం – ఇప్పటికిప్పుడు వందల కోట్ల నష్టమేమీ వచ్చెయ్యదు కానీ మనం నిశితంగా చూడవలసిన అంశం – సాక్షాత్తూ శాసనకర్తలూ, ప్రభుత్వాలూ శాసనోల్లంఘన ఎలా చేస్తున్నారూ అన్న విషయం నివ్వెరపరిచే ఒక పార్శ్వం. అయితే దాన్ని ఆపాల్సింది అప్పట్లో ఎవరు? అన్నది అసలైన పార్శ్వం. ఆ బాధ్యత మొట్టమొదటగా ప్రతిపక్షానిది. తరువాత ఆయా స్థానాల్లో ఉన్న అధికారులది.*

*అయ్యా కొత్త ముఖ్యమంత్రి గారూ! అప్పటి మీ శాసనసభ్యుల బలమెంత? ప్రజలు మీకు ఇచ్చిన ఓట్లెన్ని? కేవలం ఒకటిన్నర శాతం మాత్రమే అధికార పార్టీ కంటే తక్కువొచ్చాయి మీకు ఓట్లు. ప్రజలు మీమీద అంత విశ్వాసం పెడితే, వారి సొమ్మును కాపాడాల్సిన మీరు బాధ్యతాయుత ప్రతిపక్షంగాకాక, తదుపరి పర్యాయం అధికారంలోకి రావడానికి మాత్రమే కృషి చేసుకున్నారు తప్ప, ప్రభుత్వంలో జరుగుతున్న ఇలాంటి అవకతవకల్ని నిలదీయలేదు. 67 మంది శాసనసభ్యుల్ని గెలిపించుకున్న ప్రజలపట్ల ఎంత కార్యశూన్యత్వం చూపారు! అప్పటి ముఖ్యమంత్రిపై ఉండే వ్యక్తిగత ఉడుకుమోత్తనం కొద్దీ శాసనసభకే దూరంగా ఉన్నారు కదా, అది భావ్యమేనా? ఆదిలోనే తుంచేసి ఉంటే, లేదా న్యాయపోరాటం చేసుంటే ఇప్పుడు ఇంత విధ్వంసం అవసరమయ్యేదా! మళ్లీ వారో, మరొకరో అధికారంలోకి వస్తే, మీరు కట్టినవన్నీ ఏదో ఒక వంకబెట్టి కూలగొట్టరన్న నమ్మకం ఏవుంది? చట్టాలలో లొసుగులుండబట్టే కదా ఈ అవ్యవస్థ అంతా! చట్టాలలో లోపాలున్నట్టే కట్టడాలలోనూ ఏవో అతిక్రమణలుండడం అతి సహజమైన విషయాలు కదా మన దేశంలో! మరి మరొకరు లోటస్ పాండు, ఇడుపులపాయ వంకా చూడకుండా ఉంటారా? సరే అవి మీ సొంత వ్యవహారాలు అనుకోండి. ఎలా చక్కబెట్టుకోవాలో మీకు రాజకీయాలతో పెట్టిన విద్య.*

*మరి ఈ ప్రభుత్వ భవనాల మాటేంటి? అది స్వయంగా ప్రజల సొమ్ము కదా! మీ తండ్రిగారి హయాంలోనేకదా ఎల్ఆర్ఎస్, బిఆర్ఎస్ వంటి వెసులుబాట్లిచ్చి పరిమితులు లేని లేఅవుట్లకూ, నిర్మాణాల అతిక్రమణలకూ కొంత అపరాధ రుసుం వసూలు చేసి క్రమబద్ధీకరించారే! ప్రజావేదిక విషయంలో అలాంటి వెసులుబాట్లు ఏవీ దొరకలేదా? అయినా శిక్షించాల్సింది అతిక్రమణకు పాల్పడినవారిని గానీ ప్రజల్నీ, ప్రజా వనరులనా? మధ్యస్తంగా వచ్చే కుల పార్టీలూ, గ్లామర్ పార్టీలూ ఏమాత్రం ఆశాజనకం కాదు. అందుకే వాటినీ తిరస్కరించారు కదా! ఎర్రజెండా ఎప్పటినుండో వెలిసిపోతూ వస్తోంది. కాషాయం మరోరకం ఎరుపును సంతరించుకుంటోంది. ఇంకేవిటి కింకర్తవ్యం?*

**– జికెఎస్ రాజా**
హైదరాబాద్

# కశ్మీర్ లోయలో రక్తపాత సంగీత శ్రుతి

***జమ్మూ కశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికార ఆకాంక్షను భారత ప్రభుత్వం ఎలా భంగం కలిగిస్తుందో 'అదృశ్యమైపోయిన వ్యక్తుల తల్లితండ్రుల వేదిక', 'జమ్మూ కశ్మీర్ పౌరసమాజ ఐక్యసంఘటన'ల నివేదిక వెల్లడించిందని అంటున్నారు* అర్విణి రాజేంద్రబాబు**

చిత్రహింసల ద్వారా జమ్మూ కశ్మీర్ రాష్ట్రాన్ని నియంత్రిస్తున్న భారత ప్రభుత్వం అనేది 'కనిపించకుండా పోయిన వ్యక్తుల తల్లితండ్రుల వేదిక', 'జమ్మూ కశ్మీర్ పౌర సమాజ ఐక్య సంఘటన'లు సంయుక్తంగా వెల్లడించిన నివేదిక సారాంశం.

1990ల నుండి భారత ప్రభుత్వం జమ్మూ కశ్మీర్ ప్రజలపై సాగిస్తున్న నిర్బంధకాండపై మొట్టమొదటి సమగ్ర నివేదిక 2019 ఫిబ్రవరి నెలలో వెల్లడయింది. అధ్యయనం, పరిశోధన క్షేత్రస్థాయి పరిశీలన పునాదిగా, 'భయం ఎప్పుడూ జయించకూడదు' అన్న సూక్తి స్ఫూర్తిగా కార్యాచరణలో ఉన్న రెండు ప్రజాసంఘాలు, 'కనిపించకుండా పోయిన వ్యక్తుల తల్లితండ్రుల వేదిక', 'జమ్మూ కశ్మీర్ పౌర సమాజ ఐక్య సంఘటన'లు కలిసి సంయుక్తంగా ఈ నివేదికను వెల్లడించాయి. పోలీసుల చిత్రహింసల మూలంగా రెండు కాళ్లు పోగొట్టుకున్న వికలాంగుడు ఖలేందర్ ఖటానా ముఖచిత్రంగా ఈ నివేదిక వెలుగు చూసింది. 'నేను సజీవంగా ఉన్నంత వరకు న్యాయం కోసం పోరాడుతూనే ఉంటాను, నిజాలను వ్యక్తపరిచే శక్తిని పొందుతూనే ఉంటాను' అన్న ఓ కశ్మీరీ యువకుని మాట – పలురకాల హింసలను తట్టుకొని, అయినా ఇంకా తలెత్తుకొని ధీమాగా, ధైర్యంగా నిల్చున్న ఆ కశ్మీరీ యువకుని మాట – ప్రేరణగా 553 పేరాలున్న ఈ నివేదిక తయారయ్యింది. ఈ నివేదికకు ఐక్యరాజ్య సమితిలో హింసా ప్రయోగంపై ప్రత్యేక అనుసంధానకర్తగా పూర్వం పనిచేసి ప్రస్తుతం అమెరికాలో 'వాషింగ్టన్ కాలేజి ఆఫ్ లా'లో మానవ హక్కుల శాఖ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న జువాన్ ఇ. మెండెజ్ 'నాందీ ప్రస్తావన'గా ముందుమాట రాశారు.

నివేదికలో పేర్కొన్న విషయాలను తెలుగు పాఠకుల కోసం సంక్షిప్తంగా, సంగ్రమంగా ఈ కింద పేర్కొంటున్నాను :

ఒక పద్ధతిగా, విచ్చలవిడిగా జమ్మూ కశ్మీర్ ప్రజలపై 1947 నుండి భారత రాజ్యం కొనసాగిస్తున్న హింసాకాండ స్వతంత్ర నిర్ణయాధికార హక్కు మాకుండాలని 1980లలో పోరాటం ప్రారంభమయిన నాటి నుండి తీవ్రతరం అయ్యింది. అక్కడ జరుగుతున్న మానవ హక్కుల ఉల్లంఘన చాలా ఎక్కువ స్థాయిలో ఉన్నప్పటికీ, చాలా తక్కువగా బయటి ప్రపంచానికి తెలుస్తున్నది, హింసా ప్రయోగానికి కారకులయిన వారు మాత్రం బలాదూర్‌గా తిరుగుతున్నారు. ఇంతవరకు ఎవరిమీద ఏ ఒక్క కేసూ నమోదు కాలేదు. కశ్మీర్‌లో సాయుధ పోరు జరుగుతున్నది. నిజమే, కాని భారత ప్రభుత్వం రూపొందించిన సైనిక చర్యలు మొత్తం ప్రజలను కష్ట పెట్టే విధంగా, ఇబ్బందులపాలు చేసే విధంగా రూపుదిద్దుకున్నాయి. ప్రజలందరినీ శత్రువులుగా పరిగణిస్తూ వ్యూహాలు రూపొందిస్తున్నాయి. ప్రజల మీద పైచేయి సాధించే లక్ష్యంతో భారత ప్రభుత్వం 6,50,000 నుండి 7,50,000 మంది సాయుధ బలగాలను, సైనిక బలగాలను ఆ రాష్ట్రంలో నియమించింది. అక్కడి ప్రజల మనోభీష్టాన్ని విచ్ఛిన్నం చేసే ఉద్దేశ్యంతో పెచ్చరిల్లిన స్థాయిలో మానవ హక్కుల ఉల్లంఘన, మితిమీరిన హింసాప్రయోగం జరుగుతున్నవి. సాంప్రదాయికమయిన హింసాప్రయోగం కంటే భిన్నంగా అతి నీచమయిన పద్ధతులు ఎలా అవలంభించాలో తెలియపరిచే భారత సైన్యం వారి సిద్ధాంత పత్రంలో ఈ విధంగా రాశారు: 'ప్రభుత్వంతో పెట్టుకుంటే మనం గెలువలేము అని ప్రజలు అనుకునే విధంగా, సాధారణ పరిస్థితులు నెలకొనాలంటే ప్రభుత్వ వ్యతిరేకత విడనాడాలి అని ప్రజలు గ్రహించే విధంగా వారిపై అణిచివేత చర్యలు కొనసాగించాలి'.

2016 జూలై బుర్హాన్ వని హత్య తరువాత కశ్మీర్‌లో కనీవినీ ఎరుగని హింస, మానవ హక్కుల ఉల్లంఘన చోటు చేసుకుంది. గత రెండు సంవత్సరాలలో కశ్మీరీలు చట్టానికి అతీతంగా శిక్షల అమలు, దెబ్బలు, చట్ట విరుద్ధంగా నిర్బంధాలు, తీవ్రమైన హింస, లైంగిక వేధింపులు, కనిపించకుండా పోవటాలు, దోపిడీలు, ఆస్తుల విధ్వంసం, మతపరమయిన సమాజ సంబంధ సమావేశాలపై ఆంక్షలు, ప్రసార మాధ్యమాల నోరు కట్టివేత, వార్తలపై అంతర్జాలం పైనా నిషేధం చవిచూశారు. పెల్లెట్ గన్‌లచే యాతనల పాలయ్యేవారు. వాటి వల్ల ఎవరైనా వెంటనే చనిపోతేనే పత్రికలలో వార్త వచ్చేది. గాయాల వల్ల, సంభవించే మరణాలు వెంటనే జరగవు. కొన్ని సంవత్సరాలు, ఒక్కోసారి కొన్ని దశాబ్దాలు కూడా పట్టవచ్చు. అలా సంభవించే మరణాలు, వ్యాధుల పాలవడం ఏ సంఖ్యలో ఉన్నాయో అంచనా వేయడం చాలా కష్టమయిన పని. ఈ రెండు సంఘాలకు చెందిన అధ్యయన బృందం 432 దృష్టాంతాలను ఉదాహరణగా తీసుకొని వాటిల్లో హింస జరిగిన తీరు, ధోరణి, నమూనా, ఎవరిపై గురి పెట్టారు, దుశ్చర్యలకు పాల్పడిన వారెవ్వరు, సందర్భం ఏమిటి, కశ్మీర్‌పై హింసా ప్రభావం ఎలా ఉందో సుదీర్ఘంగా పరిశీలించి ఈ నివేదికను తయారు చేశారు. న్యాయబద్ధమయిన తమ ఉనికిని కశ్మీరీలు సవాలు చేస్తున్నారన్న భావం భారత ప్రభుత్వంలో ఉందని ఆ నివేదికలో వ్యక్తపరిచారు. ఈ దృష్టాంతాల ఆధారంగా భారతదేశం – కశ్మీరీలు వేరువేరని – 'వాళ్లు' 'మేము' అన్న బేధభావాన్ని పాటిస్తూ కశ్మీరీలకు వ్యతిరేకంగా చిత్రహింసలను ప్రయోగించడం ద్వారా వారి పట్ల ప్రతీకారం తీర్చుకుంటున్నట్లుగా ఉంది వారి ధోరణి అని తమ అభిప్రాయాన్ని ఆ నివేదికలో పొందుపరిచారు.

ఐక్యరాజ్యసమితి వారు ఒక రిపోర్ట్‌లో మనుషులను శారీరక, మానసిక క్షోభకు గురిచేసే క్రూర, అమానవీయ, అధమస్థాయి హింసా పద్ధతులను గురించి చెప్పారు. చాలా ఇతర నివేదికలలో సూచించినట్లుగానే ఈ నివేదికలో కూడా ఆ హింసా పద్ధతులలో చాలా వరకు భారత ప్రభుత్వం జమ్మూ కశ్మీర్‌లో ప్రయోగించిందని

సోదాహరణంగా వివరించారు. అవి: నిర్బందితులను నగ్నంగా (లేదా అతి తక్కువ బట్టలతో అర్ధనగ్నంగా) ఉంచడం, కర్రలతో ఇనుప కడ్డీలతో తోలు బెల్టులతో కొట్టడం, బరువయిన దుంగ లేదా ఇనుపకడ్డీని బందీకాళ్లపై ఉంచి అటు ఇటు తిప్పడం, దుంగకు లేదా ఇనుప కడ్డీకి బలమయిన వ్యక్తులు ఇరువైపులా కూర్చుని బలమంతా ఉపయోగించి అణిగిపోయేలా చేయడం, కరెంటు షాకులివ్వడం, పై కప్పుకు వేలాడదీయడం, కారం కలిపిన నీళ్లలో తలముంచడం, ఇనుప చువ్వలతో సిగరెట్ పీకలతో కాల్చడం, ఏకాంతంగా సెల్‌లో నిర్బంధించడం, నిద్ర లేకుండా చేయడం, హింసాత్మకమయిన సెక్స్, రేప్ లేదా అసహజ పురుష మైదునం లాంటివి సైనికులు, పోలీసులు చేస్తున్న అమానుష చర్యలు. 432 దృష్టాంతాలలో వివిధ రకాలయిన శారీరక, మానసిక చిత్రహింసలకు గురయిన వారి సంఖ్య ఈ కింద ఇవ్వబడింది:

అత్యంత కాంతివంతమయిన కరెంట్ బల్బ్ వైపు కన్నార్పకుండా చూసే శిక్ష – 3 గురు, బెదిరించడం – 10, కఠినమయిన వాతావరణ పరిస్థితులకు గురిచేయడం – 11, జైలులో ఏకాంతవాస శిక్ష – 11, పదునైన వస్తువులతో కోత, గాటపెట్టడం, కత్తిరించడం – 12, కుక్కలు, ఎలుకలు, పందులు, పాములు లాంటి వాటితో రుద్దడం – 15, గాయాలపై/కళ్లల్లో/మర్మాయవాలపై ఉప్పు/కారం/పెట్రోల్ చల్లడం – 15, చీకటి గదుల్లో/నేల మాళిగలలో/ఏమాత్రం గాలి వెలుతురు లేని గదుల్లో నిర్బంధించడం – 17, నిద్రలేమితనం కల్పించడం – 21, ఇళ్లపై దాడి చేసి చిన్నాభినం చేయడం/తగులబెట్టడం – 23, పదునైన వస్తువులను గుదంలో జొప్పించడం –23, నీటిలో ముంచడం – 24, ఆకలితో మాడ్చడం/కలుషితాహారం ఇవ్వడం/చాలా పరిమితంగా ఆహారం ఇవ్వడం – 29, దుర్భాషలాడడం – 31, ప్రతికూలమయిన వాటిని బలవంతంగా తినిపించడం/తాగిపించడం – 33, కండను కత్తిరించడం/గోళ్లు ఊడ బెరకడం/గడ్డం వెంట్రుకలను పెరకడం – 35, కాళ్లతో తొక్కడం – 37, కారం కలిపిన నీళ్లు బలవంతంగా తాపించడం – 37, నిర్బంధంలో బలవంతపు చాకిరీ చేయించడం – 43, కళ్లకు గంతలు కట్టడం – 48, కాళ్లను విస్తరించడం – 56, శరీర భాగాలను కాల్చడం – 70, లాగడం/చాచికొట్టడం/గుద్దడం/శరీరంపై సీసాలను పగలగొట్టడం – 93, కారం కలిపిన నీళ్లలో తలముంచడం – 101, చేతులు కాళ్లు కట్టిపడేయడం – 105, తలకిందులుగా వేలాడదీయడం – 121, మర్మావయవాలకు కరెంట్ షాక్ ఇవ్వడం – 127, రోలర్ ట్రీట్‌మెంట్ – 169, నగ్నంగా తిప్పడం – 190, కరెంటు షాక్‌లు – 231, బాదడం, కొట్టడం – 326.

432 మంది బాధితులలో 222 (అంటే 51.4 శాతం) మంది చిత్రహింసల తర్వాత కొద్దికాలంలోనే తీవ్రమైన ఆరోగ్య సమస్యలను ఎదుర్కొన్నారు. ఈ 222 మందిలో 209 (94.1 శాతం) మంది చిత్రహింసల వల్ల దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడుతున్నారు. వారిలో 49 (23.4 శాతం) మందికి గుండెకు సంబంధించిన వ్యాధులు, కిడ్నీ సమస్యలు, పూర్తిగా లేదా పాక్షికంగా కంటి, వినికిడి సమస్యలు సంక్రమించాయి. వారిలో చాలా మంది చిత్రహింసల బారిన పడినప్పటి నుండి క్రమం తప్పకుండా మందులు వాడే స్థితికి నెట్టబడ్డారు. 1990లలో చిత్రహింసల పాలయిన కశ్మీరీలు రోబ్డోమిలాసిస్ అన్న వ్యాధి బారిన పడి తత్ఫలితంగా కిడ్నీలు పనిచేయడం మానివేసాయని అప్పటి అధ్యయనాలు తెలిపాయి. బాధితులు వారి శరీరాలపై గాయాలు మానిన తర్వాత కూడా మానసిక రుగ్మతలతో చాలా కాలం బాధకు గురి అవుతున్నారు. 2015లో మెడిసిన్స్ సాన్స్ ఫ్రాంటియర్స్ అన్న సంస్థ వారు విస్తృతమయిన అధ్యయనం తర్వాత ప్రచురించిన పత్రంలో కశ్మీరీ ప్రజలలో 19 శాతం మంది మానసిక గాయాల ఫలితంగా ఏర్పడే వత్తిడి వల్ల తీవ్రమయిన రుగ్మతతో బాధ పడ్తున్నారని విశ్లేషించారు.

భారత సాయుధ బలగాలు, పోలీసులు రాజకీయ అనుభంధంతో నిమిత్తం లేకుండా, వయోబేధం లేకుండా, లింగ బేధం లేకుండా హింసను ప్రయోగించారు. పరిశీలించిన 432 హింసా బాధితులలో 301 మంది సాధారణ పౌరులు, 119 మంది మిలిటెంట్లు, 5గురు మాజీ మిలిటెంట్లు (హింసా ప్రయోగం జరిగినప్పుడు వారు కూడా సాధారణ పౌరులే), ఇద్దరు (2) జమ్మూ కశ్మీర్ పోలీసు శాఖకు చెందిన వారు (432 బాధితులలో 5 గురి వివరాలు లభ్యం కాలేదు). బాధితులయిన సాధారణ పౌరులలో రాజకీయ పార్టీల కార్యకర్తలు, మానవ హక్కుల సంఘాలలో పని చేసేవాళ్లు, పాత్రికేయులు, విద్యార్థులు ఉన్నారు. ఈ 432 మందిలో 27 మంది చిత్ర హింసలకు గురయినప్పుడు మైనర్లు. 1990ల నుండి క్రమం తప్పకుండా వేధింపులకు గురవుతున్న వాళ్లలో డాక్టర్లు, వృత్తి నిపుణులు, జర్నలిస్టులు ఉన్నారు.

జమ్మూ కశ్మీర్‌లో చిత్రహింసలకు గురయిన వాళ్లు, వ్యవస్థ మీద నమ్మకం లేక న్యాయాన్ని కోరుతూ ఏ కోర్టునూ ఆశ్రయించలేదు. 432 మంది బాధితులలో కేవలం 27 మంది మాత్రమే రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ దగ్గర మొరపెట్టుకున్నారు. అందులో 20 మందికి అనుకూలంగా కమిషన్ సిఫారస్ చేసింది. ఇక్కడ ఇంకో విషయం చెప్పుకోవాలి. 2017వ సంవత్సరంలో మానవ హక్కుల కమిషన్ సిఫారసులలో 75 శాతం తీర్పులను రాష్ట్ర ప్రభుత్వం తిరస్కరించింది. అంగీకరించిన వాటిల్లో కూడా ఆర్థిక పరమయిన అంశాన్ని మాత్రమే అంగీకరించి, హింసకు కారకులను శిక్షించే పనిని వదిలిపెట్టింది. 2009 నుండి మానవ హక్కుల కమిషన్ ఇచ్చిన తీర్పులు 229 అయితే, కేవలం 59 మాత్రమే ప్రభుత్వం అంగీకరించింది. ఇంతవరకు ఏ పోలీసు ఆఫీసర్ గానీ, మిలిటరీ అధికారి గాని శిక్షకు గురి కాలేదు.

అవమానకరమయిన పద్ధతులతో పాటు, కళ్లకు గంతలు కట్టడం, కొట్టడం, విపరీతమయిన వత్తిడికి గురిచెయ్యడం, ఇనుప కడ్డీలతో కాల్చడం, వేడివేడి ఆలు ముక్కలను నోట్లో కుక్కడం లాంటి సాంప్రదాయకమయిన రీతులను 'విచారణ'లో ఉపయోగించి 'భారత్ వ్యతిరేక', 'పాకిస్తాన్ అనుకూల' లేదా 'వ్యవస్థను వ్యతిరేకిస్తున్న రాజకీయ కార్యాచరణ'కు సంబంధించిన 'నేరాల ఒప్పుదల'ను బాధితుల నుండి పొందుతారు.

జమ్మూ కశ్మీర్ పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన పరిశీలకులు 1987లో జరిగిన కశ్మీర్ ఎన్నికలలో మోసం, దగా, రిగ్గింగ్ భారీ ఎత్తున చోటు చేసుకున్న ఫలితంగా రాజకీయ ప్రముఖులు కొంతమంది జమ్మూ కశ్మీర్‌లో భారత ప్రభుత్వ నియంత్రణకు వ్యతిరేకంగా ఆయుధాలు ధరించాలన్న నిర్ణయానికి వచ్చారని తేల్చి చెప్పారు. అంతకుముందు కశ్మీరీలు ప్రభుత్వంతో సంప్రదింపులు, చర్చలు, శాంతియుత ర్యాలీల ద్వారా ప్రతిఘటన తెలపటం, ఎన్నికల ద్వారా తమ ఇష్టాయిష్టాలను ప్రకటించడం లాంటి రాజ్యాంగ పద్ధతులను అవలంభించారు. కొన్ని దశాబ్దాలుగా రాజ్యాంగ పద్ధతులు పాటిస్తున్న కశ్మీరు ఉద్యమకారులపై దమనకాండ పెచ్చరిల్లడంతో వారు సాయుధ పోరాటం వైపు మొగ్గు చూపారని పరిశీలకులు భావిస్తున్నారు.

జమ్మూ కశ్మీర్ సాయుధ బలగాల ప్రత్యేక అధికారాల చట్టం 1990,

భారత సైన్యానికి, పోలీసులకు అపరిమితమయిన అధికారాలను కట్టబెట్టింది. ఆ చట్టం ప్రకారం సరిఅయిన కారణం చూపకుండానే సాధారణ పౌరులను కూడా అరెస్టు చేయవచ్చు, శాంతిభద్రతల పేరుతో ఎక్కడయినా సరే గుమిగూడిన ప్రజలపై ప్రాణాంతకమయిన ఆయుధాలను ఉపయోగించవచ్చు. మానవహక్కుల సంఘాల వారు పేర్కొన్న దాని ప్రకారం 1990లో అప్పటి అంచనాల ప్రకారం చురుకుగా ఉన్న 300 మంది మిలిటెంట్లను ఎదుర్కోవడానికి భారత ప్రభుత్వం 36000 మంది సాయుధ బలగాలను నియమించింది. 1991 కల్లా ఆ సంఖ్య పెరిగిపోయి 2 లక్షల మంది రంగంలోకి దిగారు. అదే సమయంలో మిలిటెంట్ల సంఖ్య కూడా వేల సంఖ్యకు చేరింది. 1990 మే నెలలో ప్రభుత్వ వ్యతిరేకతను ఎదుర్కోవటానికి రాష్ట్రీయ రైఫిల్స్ అనే కొత్త సైనిక సంస్థను ఏర్పాటు చేసింది ప్రభుత్వం. 1991లో ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి), కమిటీ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్ (సిపిడిఆర్), లోక్‌సాహి హక్ సంఘటన (ఎల్‌ఎచ్‌ఎస్), ఆర్గనైజేషన్ ఫర్ ప్రొటక్షన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్ (ఒపిడిఆర్) లాంటి వివిధ పౌరహక్కుల సంస్థలు ఏర్పాటు చేసిన నిజనిర్ధారణ కమిటీ 'పోలీసుల కస్టడీలో చిత్రహింసలకు గురయి మరణించిన వారిలో చాలామంది యువతీ యువకులేనని, వారంతా గాలింపు చర్యలలో భాగంగా గ్రామాలలో దొరికిన అమాయకులేనని' ప్రకటించింది. అలా చనిపోయిన వారిలో మిలిటెంట్లుగా పోలీసులు అనుమానిస్తున్న వారు కూడా ఉన్నారని నిజనిర్ధారణ కమిటీ తెలిపింది.

1990వ దశకం మధ్యకాలంలో 'ప్రభుత్వ అనుకూల మిలిటెంట్లు' కూడా ఆవిర్భవించారు. వారు భారత సైన్యం తరఫున అసలు మిలిటెంట్లకు వ్యతిరేకంగా ప్రతీఘాతక పోరాటం రహస్యంగా చేసే ప్రయత్నం చేశారు. వారు బహిరంగంగా నేరాలకు పాల్పడ్డారు. ఇరుగుపొరుగు వారిని భయకంపితులయ్యే విధంగా ప్రవర్తించారు. వారు చట్టం నుండి పూర్తి రక్షణతో ప్రజా వ్యతిరేక చర్యలకు పాల్పడ్డారు. 1994 'స్పెషల్ టాస్క్ ఫోర్స్' అన్న కొత్త పోలీసు విభాగం కూడా ఏర్పడింది. వారు చేసిన విపరీత చర్యలు అనేకం ఉన్నాయి.

హ్యూమన్ రైట్స్ వాచ్ (1993), ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ సంస్థలు తమ నివేదికలలో భారత సాయుధ బలగాలు ప్రజలపై సాగించిన హింసాకాండ వలననే కశ్మీర్‌లో అశాంతి పెరిగిపోయిందని, ప్రజాజీవనం అస్థవ్యస్థమయి పోయిందని పేర్కొన్నారు. సంయుక్త విచారణ కేంద్రాలను ఏర్పాటు చేసారు(జాయింట్ ఇంటరాగేషన్ సెంటర్స్–జెఐసి). అవి అనుమానితులను విచారించడానికి ఏర్పాటు చేసామని ప్రభుత్వం ప్రకటించినా, వాస్తవానికి అవి హింసా ప్రయోగ కేంద్రాలు. హింసా ప్రయోగం వాటికి మాత్రమే పరిమితం కాలేదు. పోలీస్ స్టేషన్లు, మిలిటరీ క్యాంపులు, ప్రత్యేక పోలీసు దళ కేంద్రాలు, ఎవరూ నివసించని భవనాలు కూడా ప్రజలను చిత్రహింసలపాలు చేయటానికి పనికి వచ్చే స్థలాలుగా మారిపోయాయి. ప్రభుత్వ భవనాలు (స్కూళ్లు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, గ్రామీణ అభివృద్ధి కేంద్రాల లాంటివి) కూడా కొన్ని ప్రాంతాలలో ఇందుకు ఉపయోగపడ్డాయి.

నేషనల్ కాన్ఫరెన్స్ అధికారంలోకి వచ్చిన 1996 జమ్మూ కశ్మీర్ అసెంబ్లీ ఎన్నికలలో భారత సైన్యం ప్రజలచే బలవంతంగా ఓట్లు వేయించింది. పాశవిక చర్యలకు ప్రసిద్ధిగాంచిన అవినీతిమయ ప్రత్యేక పోలీసు దళాన్ని (ఎస్‌ఒజి) రద్దు చేస్తానని, కశ్మీర్ లోయలో సైన్యం లేకుండా చేస్తానని, పట్టణ ప్రాంతాల సుందరీకరణ చేపడతానని వాగ్దానం చేసి 2002 ఎన్నికలలో అధికారంలోకి వచ్చిన పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ (పిడిపి), ప్రత్యేక పోలీసు దళాన్ని రద్దు చేయకపోగా దాన్ని జమ్మూ కశ్మీర్ పోలీసు శాఖలో విలీనం చేసింది. దాని ఫలితంగా జమ్మూ కశ్మీర్ పోలీసు శాఖ మొత్తం మిలిటరీ మయం అయిపోయింది.

ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేసిన చిత్రహింసల వ్యతిరేక కమిటీలో భారతదేశం 1997 నుండి నేటివరకు కూడా భాగస్వామి. 2008, 2012, 2017లలో జరిగిన ఈ కూటమి సమావేశాలలో కూటమి రూపొందించిన సూత్రాలను పాటించామని అన్ని సభ్యదేశాలు తీర్మానం చేశాయి. అందుకనుగుణంగా 'చిత్రహింసల నివారణ బిల్లు'ను భారత పార్లమెంటులో 2010లో ప్రవేశపెట్టారు. కాని అది చర్చకు రాక, ఆమోదించబడక అలాగే ఉండిపోయింది. 2014లో దాని కాలం తీరిపోయింది. 2017లో భారత లా కమిషన్ 'చిత్రహింసల నివారణ' బిల్లును చట్టంగా అమలు చేసే చర్యలు తీసుకొమ్మని భారత ప్రభుత్వాన్ని మళ్లీ కోరింది. ఎలాంటి చట్టం లేని ఈ పరిస్థితిలో జమ్మూ కశ్మీర్ చిత్రహింసల నిలయంగా మారిపోయింది. అక్కడి యువకులు 'రాళ్లను విసిరే వారి'గా ముద్రవేయబడి చిత్రహింసల పాలవుతున్నారు. వారికి భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది. మానవ హక్కుల ఉల్లంఘనలకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రచారంలో భాగంగా ప్రత్యేకంగా జమ్మూ కశ్మీర్‌లో జరుగుతున్న హింసాకాండను ప్రపంచం దృష్టికి తీసుకురావాలన్న ఉద్దేశంతో ఈ నివేదిక రూపొందించబడ్డది.

*(రచయిత రిటైర్డ్ జూనియర్ కళాశాల ప్రిన్సిపల్)* వీ

### యలమంచి శేఖర్ మృతి

సీనియర్ జర్నలిస్టు, రచయిత యలమంచి శేఖర్(80) హైదరాబాద్ లో బంజారాహిల్స్‌లోని స్వగృహంలో గుండెపోటుతో జూన్ 7న మృతి చెందారు. శేఖర్ కృష్ణా జిల్లా రామాపురంలో జన్మించారు. 'ఆంధ్ర జనత' నుంచి శేఖర్ పాత్రికేయ వృత్తి ప్రారంభమైంది. ఆ తర్వాత ఆంధ్రభూమి, ఈనాడు పత్రికల్లో చీఫ్ రిపోర్టర్‌గా పనిచేశారు. న్యూస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియాలోనూ కొంత కాలం పనిచేశారు. ఏపియుడబ్ల్యుజెకి 30 ఏళ్లపాటు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. తెలుగుదేశం పార్టీ ప్రారంభ సమయంలో ఎన్‌టిఆర్‌కి ప్రత్యేక మీడియా సలహాదారుగా పనిచేశారు. శేఖర్ జోగిని వ్యవస్థకు వ్యతిరేకంగా 'గంగ' సినిమాను తీసి, తానే దర్శకత్వం వహించారు. 'గోవులు గర్జించాయి', 'ఇంక్విలాబ్' తదితర పుస్తకాలు రాశారు.

### మహాస్వప్న కన్నుమూత

దిగంబర కవుల్లో ఒకరు, ప్రముఖ సాహితీవేత్త మహాస్వప్న జూన్ 25న ప్రకాశం జిల్లా లింగసముద్రంలో మృతిచెందారు. ఆయన గత కొంతకాలంగా పక్షవాతంతో బాధపడుతున్నారు. మహాస్వప్న ప్రకాశం జిల్లా లింగసముద్రంలో జన్మించారు. తెలుగు సాహిత్యాన్ని 1960ల్లో పెను కంపానికి గురిచేసిన ఆరుగురు కవుల్లో మహాస్వప్న ఒకరు. 'నేను వస్తున్నాను దిగంబర కవిని' అంటూ తన అద్భుత కవితాశక్తితో ఒక తరాన్ని కదిలించారు. ఆయన తన 18 ఏళ్ల వయస్సులోనే 'చందమామ' పేరుతో కవితా సంపుటిని వెలువరించారు. 1964లో 'అగ్నిశిఖలు–మంచు జడలు', 'స్వర్ణధూళి' కవితా సంపుటాలను ప్రచురించారు. దిగంబర కవులు సొంత పేర్లతో రాయకూడదనే నియమం. దీంతో కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు మహాస్వప్నగా మారారు.

# దళిత బహుజన ద్వేషంలో మోడీ

***మోడీ అధికారంలోకి వచ్చిన తరువాత దళిత, ముస్లిం, క్రిస్టియన్, ఆదివాసులు, స్త్రీలపై దాడులు తీవ్రమయ్యాయనీ, అణచివేతకు గురవుతున్న శక్తులన్నీ దీనికి వ్యతిరేకంగా తమ హక్కుల కోసం పోరాడాలనీ అంటున్నారు* డా. కత్తి పద్మారావు**

**భా**రతదేశం నానాటికీ ఆర్థికంగా, సామాజికంగా, సాంస్కృతికంగా దిగజారడానికి కారణం అవిద్య, అరాచకత్వం, మతతత్వం, స్త్రీ అణచివేత, కులతత్వం, అస్పృశ్యత ఆచరణ కొనసాగడమే. మత కులాధిపత్యం నానాటికీ పెరుగుతోంది. అసహనం, అవినీతి, ఆత్మ న్యూనత రాజ్యమేలు తోంది. మోడీ మాటల్లో అంకెలు పలుకుతున్నంతగా అభివృద్ధి లేదు. విపరీతమైన ముస్లిం ద్వేషం, అస్పృశ్యుల మీద దాడులు, రాజ్యాంగ నిరసన ప్రజాస్వామ్య లౌకికవాద భావజాలానికి గొడ్డలిపెట్టుగా మారాయి.

నరేంద్రమోడీ 40 మంది ఆర్థిక నిపుణులతో సమావేశమైనా ఆయన అనుకున్న హిందూ భావజాల ధోరణిలోనే ముందుకు నడుస్తున్నాడు కానీ, సామాజిక శ్రేణుల్ని పరిగణనలోకి తీసుకొని ఉత్పత్తిని పెంచే మార్గాన్ని ఆలోచించడం లేదు. ఆయన అతిశయోక్తుల్లో భాగంగా 2024 నాటికి 5 లక్షల కోట్ల డాలర్లకు మన ఆర్థిక వ్యవస్థని పెంచుతానని అంటున్నాడు. అంటే 350 లక్షల కోట్లుగా మార్చాలనే ఆయన ఉద్దేశం. 190 లక్షల కోట్లు మాత్రమే ఉన్నాయి.

దేశంలో మానవ వనరులకు, ప్రకృతి వనరులకు, వ్యవసాయ భూములకు, విద్యా వేత్తలకు, విద్యార్జనాపరులకు కొదువలేదు. అయితే ప్రధాన మంత్రికే సామాజిక, ఆర్థిక రంగాన్ని అభివృద్ధి చేసే దిక్సూచి లేదు. తనకు సహజంగా వృత్తికారులు, దళితులు, ఆదివాసులు, ముస్లింలు, ఉత్పత్తి కారకులు వీరిని కులమత భావాలతో నిర్లక్ష్యం చేయడం వల్ల రాను రాను నిరాశ నిస్పృహలు కలుగుతున్నాయి. అలా కలిగించడమే ప్రభుత్వ ధ్యేయంగా మనకు కనిపిస్తుంది. ధనాధిపతుల చేతుల్లో నలిగిపోతున్న మోడీ దేశంలో కుటీర పరిశ్రమల్ని అందులో ఉత్పత్తి అయ్యే వస్తువులకు మార్కెట్ సంతరించలేకపోతున్నారు. ఆది భారతీయులైన ఆదివాసులు భారతదేశ ఉత్పత్తి రంగానికి పట్టుకొమ్మలు. అయితే భారత ప్రభుత్వం, ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు వారి జీవన వ్యవస్థల మీద గొడ్డలి వేటు వేస్తున్నారు. అభివృద్ధి పేరుతో బహుళజాతి కంపెనీలకు ఆదివాసులు తరాలుగా చేసుకొంటున్న భూములను, ఆవాసాలను ధారాదత్తం చేస్తున్నారు.

బ్రిటిష్ వాళ్లు భారతదేశానికి రాకపూర్వం ఆదివాసులు స్వతంత్రులుగా ఉండే వారు. వారి భూములను, ఆవాసాలను బ్రిటిష్‌వాళ్లు, ఆ తరువాత నల్లదొరలు కొల్లగొట్టడం ప్రారంభించారు. కొండలను, నదులను రక్షించే సంస్కృతి వారిది. కొండలను తవ్వి పడేసి, నదులను కల్మషం చేసే సంస్కృతి హిందూ సంస్కృతి, ఈనాడు గంగా, యమునా నదులన్నీ కల్మషమైపోయి ఉన్నాయి. ఆదివాసుల జీవన హక్కుల పునరుద్ధరించడం ద్వారే భారతదేశ పునరుజ్జీవన శక్తి ఆధారపడి ఉందని మోడీ తెలుసుకోలేక పోతున్నాడు. డా. బి.ఆర్.అంబేద్కర్ ప్రధానంగా రాజ్యాంగ నిర్మాణ సభ్యుడైన జైపాల్‌సింగ్ ముండా కృషివలన ఆదివాసుల హక్కులు, వాటి రక్షణకు సంబంధించిన నిబంధనలన్నింటిని రాజ్యాంగంలోని 5వ షెడ్యూలులో చేర్చి, కట్టుదిట్టం చేశారు. అయితే రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటికీ 1965-66 వరకు భారత పాలక వర్గాలు ఈ విషయాన్ని పట్టించుకోకపోగా, ఆదివాసుల పట్ల బాధ్యతా రాహిత్యాన్ని నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూ వచ్చారు.

నిజానికి ఆదివాసులు భారతదేశానికి మూలమైన నదీ నాగరికత నుండి సృష్టించడంలో ప్రధాన పాత్ర వహించారు. పర్యావరణ పరిరక్షణలో అద్వితీయమైన కార్యాచరణ రూపొందించారని అటువంటి ఆదివాసుల్ని మోడీ ప్రభుత్వం వచ్చిన తరువాత మరింతగా అణగదొక్కడమే గాక వారిని హిందూకరించడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇప్పటికే దేశంలో అలసత్వ జాతులు పెరిగిపోతున్నాయి. లక్షలమంది స్వాములు, యోగులు, సన్యాసులు, పురోహితులు, నిశ్రమతో జీవిస్తున్నారు. రాళ్లను రప్పలను ఆధారం చేసుకొని జీవించే వారి సంఖ్య పెరిగిపోతూ ఉంది.

మొత్తం దేశంలో ఉపాధి కూలీలుగా ఉన్న దళితులకు భూమి హక్కు ఇవ్వడం లేదు. ఇక దళితుల విషయానికి వస్తే మోడీ ప్రభుత్వంలో దళితులకు ఒక్క ఎకరం భూమి కూడా పంచకపోగా, లక్షలాది ఎకరాల భూమిని భూస్వాములు, పారిశ్రామికవేత్తలు కొల్లగొట్టారు.

ఇకపోతే అన్ని విశ్వవిద్యాలయాల్లో దళిత, ఆదివాసు, ముస్లిం విద్యార్థుల మీద తీవ్రమైన దమనకాండ జరుగుతుంది. భావజాల పరంగా, భౌతికంగా విశ్వహిందూ పరిషత్‌వారు దళిత విద్యార్థులను హింసిస్తు న్నారు. చరిత్ర పాఠ్య భాగాలను తోసిపుచ్చి, రాముణ్ణి, కృష్ణుణ్ణి, పరశు రాముళ్ల కథలు వినిపించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ పేరుతో దళితులు పూర్వ కాలపు రాక్షసులని, వారిని హింసించడం వల్ల గాని వారిని చంపడం కానీ ఏమి తప్పులేదని ప్రచారం చేస్తున్నారు. దళితుల హక్కుల్ని కాలరేసే క్రమంలో హిందువుకాని వారు భారతీయులు కాదని రెచ్చగొట్టి అగ్రవర్ణ విద్యార్థుల్లో హింసా ప్రవృత్తిని ప్రచారం చేస్తున్నారు. భారతదేశానికి పట్టుగొమ్మలు గ్రామాల్లో జీవిస్తూ, వ్యవసాయం మీద ఆధారపడిన వాళ్లు దళితులు, వారిని అణచివేయడమంటే భారతదేశం గుండెల మీద ఇనుప పాదం పెట్టడమే కాదా! ఉత్పత్తికారకులను దెబ్బతీసి భారతదేశ ఆర్థిక జీవన పరిణామాలను ఎలా పెంచుతారు.

ఇటీవల దళిత విద్యార్థులు సివిల్స్ రాత పరీక్షల్లో అత్యధిక మార్కులు సంపాదించినా వారిని ఇంటర్వ్యూల్లో తప్పించే అగ్రవర్ణ ప్యానల్స్‌ను రూపొందిస్తున్నారు. దళిత విద్యార్థులను ఇంటర్వ్యూల్లో తప్పించి, మీరు అత్యున్నత అధికార పదవులకు పనికి రారు అనే మనుస్మృతి సూత్రాలను ఆచరణలో పెడుతున్నారు. ఈ విషయాన్ని అఖిల భారతీయ దళిత్

# పశ్చిమాసియాలో అమెరికా బరి తెగింపు

***చమురు నిల్వలున్న దేశాల్లో తన తైనాతీలను అధికారంలోకి తేవడానికి అమెరికా ఆయా దేశాలపై యురేనియం ఇంధనాన్ని నిల్వ చేస్తున్నాయనే నెపంతో ఆంక్షలు విధించి, తన దారికి తెచ్చుకొని, చమురు నిల్వలను కొల్లగొట్టాలని చూస్తోందని అంటున్నారు*** **ఎ. నర్సింహా రెడ్డి**

అఫ్ఘనిస్తాన్, ఇరాన్, లిబియా, సిరియా తదితర దేశాలపై దాడులు సాగించి విధ్వంసం సృష్టించిన అమెరికా ఇప్పుడు ఇరాన్‌పై యుద్ధానికి సన్నదం అవుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదం దృష్టి ప్రస్తుతం మధ్యప్రాచ్యంలో ఇరాన్ ఇస్లామిక్ రిపబ్లిక్‌పై పడింది. దాన్ని ఆర్థికంగా దెబ్బతీయాలని అది కుట్ర చేస్తోంది. ఇరాన్‌కు ఆదాయం సమకూర్చి పెట్టే మూడు ప్రధాన రంగాలు చమురు, పెట్రో కెమికల్స్, ఇనుము, అల్యూమీనియం, ఉక్కు రాగి ఎగుమతులపై ఆంక్షలు విధిస్తూ అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ 2019 మే 9న ఆదేశాలు జారీ చేశారు. ఆంక్షల మూలానా, చమురు ఎగుమతులు తగ్గడం వలన ఇరాన్‌లో ఉపాధి క్షీణత, కరెన్సీ విలువ పడిపోవడం, ద్రవ్యోల్బణం వంటి సమస్యలు ఎదుర్కొంటోంది.

ఇరాన్ సహజముడి చమురు సంపదతోపాటు ఆసియా, సెంట్రల్ ఆసియా, యూరప్ ఖండాలకు వ్యూహాత్మకంగానూ, భౌగోళికంగా విశిష్ఠ స్థానాన్ని కలిగివున్నది. ఇరాన్ నుంచి తమ మిత్రదేశాలు చమురు కొనకూడదని అమెరికా హుకుం జారీ చేసింది. అమెరికా, ఇరాన్‌ల మధ్య వైషమ్యాలు రోజురోజుకు తీవ్రం కావడం ఆందోళన కలిగించే పరిణామం. చమురు ఆధారంగా నడుస్తున్న ఇరాన్ ఆర్థిక వ్యవస్థ ఈ చర్యతో దెబ్బతింది. ప్రతిస్పందన చర్యగా న్యూక్లియర్ ఒప్పందంలోని రెండు ప్రధాన అంశాల నుండి తప్పుకోనున్నట్లు ఇరాన్ ప్రకటించింది. 60 రోజులలోపు ఇరాన్‌పై ఆంక్షలు ఎత్తివేయకపోతే యురేనియం ఇంధనాన్ని నిల్వ చేసుకుంటామని ఇరాన్ ప్రకటించింది. ఈలోగా ఇయు దేశాలు మాత్రం మేము ఇరాన్‌తో ఒప్పందానికి ఇప్పటికీ కట్టుబడి ఉన్నామని తెలిపాయి. అయితే, ఇప్పటికీ సమయం మించిపోలేదని, అమెరికా ఆంక్షల నుంచి యురోపియన్ దేశాలు తమకు రక్షణ కల్పించవచ్చని ఇరాన్ పేర్కొంది.

మధ్య ప్రాచ్యంలో తమ మిత్రదేశమైన ఇజ్రాయిల్‌ను మించి ఇరాన్ ఎదగకూడదనేది అమెరికా వ్యూహం. 2008 నుంచి ఆర్థికంగా దిగజారిపోతున్న అమెరికా తన సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని నిలుపుకోడానికి దుందుడుకు చర్యలతో ప్రపంచాన్ని మరోసారి యుద్ధ వాతావరణంలోకి నెడుతోంది. ఇటీవలి కాలంలో అమెరికా జోక్యంతో ప్రపంచ వ్యాపితంగా తలెత్తిన ఉద్రిక్తతలు గమనిస్తే అమెరికా దుస్సాహసానికి పాల్పడుతున్నట్లు విధితమవుతున్నది. వెనిజులా, క్యూబాలపై అమెరికా ఆంక్షలు విధించింది. వెనిజులాలో ప్రజలచే ఎన్నుకోబడిన మదురో ప్రభుత్వాన్ని మార్చడానికి కుట్రలు, హింసాకాండ, చివరికి యుద్ధ సన్నాహాలు ప్రారంభించింది. ప్రపంచ చమురు నిల్వల్లో అగ్రగామిగా ఉన్న వెనిజులా నేడు ట్రంప్ ప్రభుత్వ కుట్రల వల్ల తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడింది.

మధ్య ప్రాచ్యంలో మరో మారు యుద్ధాన్ని రగిలించడం కోసం ఇజ్రాయిల్–పాలస్తీనాల మధ్య అమెరికా రాజేసిన అగ్గి అక్కడ మళ్లీ ఉద్రిక్తతను రగిలించింది. ఇప్పటి వరకు తటస్థంగా ఉన్న జెరుసలేంను ఇజ్రాయిల్ రాజదానిగా చేసుకోడానికి ట్రంప్ అనుమతివ్వడమే కాకుండా అక్కడకు అమెరికా రాయబార కార్యాలయాన్ని తరలించింది. దాంతో ఇజ్రాయిల్‌కూ, పాలస్తీనా ప్రజలకూ మధ్య నిత్యం ఘర్షణలు పెరిగి ఇజ్రాయిల్ బాంబు దాడుల్లో నిత్యం వందల మంది పాలస్తీనియన్లు మరణిస్తున్నారు. మధ్యప్రాచ్యంలో ప్రస్తుతం లెబనాన్, సిరియా, ఇరాన్‌లలో అంతర్యుద్ధానికి సౌదీ అరేబియాతో కలిసి అమెరికా మద్దతిస్తోంది. ఇంకోవైపు సిరియా ప్రభుత్వ దళాలకు ఇరాన్–రష్యాలు మద్దతిస్తున్నాయి. ఎమెన్ అంతర్యుద్ధంలో విమాన దాడుల్లో వేలాది మంది పౌరులను చంపేస్తున్న సౌదీ అరేబియాకు అమెరికా వెనుక నుండి కథ నడుపుతోంది.

1979లో అమెరికా కీలుబొమ్మ అయాతుల్లా ఖోమేనీ ప్రభుత్వాన్ని

---

అండ్ ముస్లీం ఫ్రంట్ యు.పి.యస్.సి. అధికారుల దృష్టికి తీసుకెళ్లింది. అత్యధిక మార్కులు సంపాదించిన ఎస్‌టి, ఎస్‌సి, ముస్లీం విద్యార్థులను కుల ద్వేషంతో వర్ణ ద్వేషంతో ఎలా తప్పించిందో ఆ వివరాలన్నీ సమాజం ముందుకు తెచ్చింది.

కొన్ని భావోద్వేగాలు రెచ్చగొట్టడం వల్ల ఈ రోజు ప్రభుత్వాలకు రావచ్చు. అంత మాత్రాన దళిత, గిరిజన, ముస్లీమ్‌లను అణగద్రొక్కడం రాజ్యాంగ విరుద్ధం కదా! ఈ విధమైన పాలనలో నరేంద్ర మోడీ భారతదేశ జి.డి.పి.ని ఎలా పెంచగలుగుతారు. భారతదేశంలో ప్రజలందరిని, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక విద్యారంగాల్లో సమపాళ్లతో చూడవలసిన అవసరం ఉంది. ఉత్పత్తి శక్తులైన బహుజనులను నిర్లక్ష్యం చేయడం వలన భారతదేశం అభివృద్ధి చెందదు. ఈ క్రమంలో భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోని ప్రభుత్వాలను అస్తవ్యస్తం చేయాలనే వ్యూహం నడుస్తుంది. నిన్నటి వరకు సుజనా చౌదరి, రమేష్‌ల మీద సి.బి.ఐ. దాడులు నిర్వహించి, ఈ రోజున వారిని బి.జె.పి.లోకి తీసుకోవడంతో బి.జె.పి. అవినీతి రాజకీయాలకు పతాకలెత్తుతున్నట్టు అర్థం అవుతుంది.

ఇలా అవినీతి కులాధిపత్య కోణంలో కులాధిపత్యంలో ఫిరాయింపుల ప్రోత్సాహంలో కూరుకుపోయిన చంద్రబాబు పరిస్థితి ఈనాడు ఏమిటో అదే రేపు అవినీతి దళిత వ్యతిరేక పాలక వర్గాలకు గుణపాఠం అవుతుంది. ఈ సందర్భంగా లౌకిక దేశీయ సామాజిక శక్తులన్నీ ఏకమై తమ హక్కుల కోసం దేశ ఆర్థిక అభివృద్ధి కోసం పోరాడాల్సిన సందర్భం. అప్పుడే అంబేద్కర్ ఆశయాలు నెరవేరతాయి.

*(రచయిత సామాజిక తత్త్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షులు నవ్యాంధ్రపార్టీ)* వీ

కూలదోసినప్పటి నుండి ఇరాన్ ప్రభుత్వంపై అమెరికా ఆంక్షలను విధించి తన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవడానికి చేయని ప్రయత్నమంటూలేదు. ప్రపంచ చమురు రిజర్వులతో వెనిజులా, సౌదీ అరేబియా, కెనడాల తర్వాత నాల్గవస్థానాన్ని ఇరాన్ ఆక్రమించి 16 వేల కోట్ల బారెల్ల చమురు నిల్వను కల్గివున్నది. ప్రపంచ చమురు నిల్వలలో ఇరాన్ వద్ద 10 శాతంపైగా ఉన్నాయి. చమురుపై ఆధిపత్యం కల్గివుంటే ప్రపంచంపై ఆధిపత్యం చెలాయించవచ్చునన్నది అమెరికా విదేశాంగ విధానంలో ముఖ్య భాగం. ముఖ్యంగా ఇక్కడి హార్ముజ్ జలసంధి 100 కి.మీ. వెడల్పుతో రవాణాకు కీలక ప్రాధాన్యతను కల్గి ఒమాన్–ఇరాక్‌ల మధ్య ఉన్నది. ఉత్తరాన టర్కీ, ఇరాక్, అర్మేనియా, అజర్‌బైజాన్, తుర్కుమనిస్థాన్, తూర్పున ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌లు ఉన్నాయి. దీనినిబట్టి ఇరాన్ భౌగోళిక విశిష్టత మనకు అర్థమవుతుంది.

అమెరికాకు, అనుంగు మిత్రదేశమైన సౌదీ అరేబియా, ఇరాన్‌ల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనే పరిస్థితి నెలకొంది. పశ్చిమాసియాలో తన మిత్ర దేశాల ప్రయోజనాల ముఖ్య లక్ష్యంగా భావిస్తోంది. సున్నీ దేశమైన సౌదీ, షియా దేశమైన ఇరాన్ మధ్య వైరం ఈనాటిది కాదు. దీంతో ఈ ప్రాంతంలో ఇరాన్‌ను లక్ష్యంగా చేసుకుని 'వాషింగ్టన్' పని చేస్తోంది. ఇరాక్, అఫ్ఘనిస్థాన్, సిరియా తరవాత ఇప్పుడు ఇరాన్‌పై అమెరికా దృష్టి సారించింది. గతంలో తనను ఎదిరించిన ఆ దేశాధినేత అహమ్మద్ నెజాదీ, ప్రస్తుత అధినేత రౌహానీ అంటే అమెరికాకు చెప్పలేనంత ఆగ్రహం. అందుకే ఏ చిన్న అవకాశం వచ్చినా చెలరేగి పోతుంటుంది.

### అమెరికా–ఇరాన్‌ల మధ్య ఉద్రిక్తతలకు కారణాలు

అణు విద్యుత్తుకుగాక, ఇరాన్ అణు బాంబులు తయారు చేయడానికి అణు పరిజ్ఞానాన్ని ఉపయోగిస్తుందనే నెపంతో ఇరాన్‌పై ఐ.రా.స, ఇయు దేశాలు అమెరికా ఒత్తిడితో ఆర్థిక ఆంక్షలను విధించాయి. సుమారు దశాబ్దకాలం పాటు ఇరాన్, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా, చైనాలతో జరిపిన చర్చలు ఫలప్రదమై ఒబామా, పుతిన్‌ల చొరవతో 2015 ఏప్రిల్‌లో అణు ఒప్పందాన్ని 5+1 దేశాలు చేసుకొన్నాయి. అణ్వాయుధాలతోపాటు అణు విద్యుత్ ఉత్పత్తిలో వినియోగించే శుద్ధి చేసిన యురేనియం నిల్వలపై పరిమితులు పాటిస్తామని అంగీకరించింది. దీనికి బదులుగా ఇరాన్‌పై విధించిన ఆంక్షలను ఆయా దేశాలు ఎత్తివేశాయి. తదనుగుణంగా విదేశాల్లో స్థంబింపజేసి ఉన్న 1000 కోట్ల డాలర్లు విడుదల కావడంతో ఇరాన్ అభివృద్ధి చెందసాగింది.

ఆంక్షలు ఎత్తివేసిన నేపథ్యంలో చమురు ఉత్పత్తి పెరిగింది. అణు ఒప్పందంకు ముందు రోజున 29 లక్షల బారెల్ల చమురు ఉత్పత్తి ఉండగా 2018 మార్చి నాటికి 39 లక్షల బారెల్లకు పెరిగింది. 2015 నాటికి 34 శాతం ఉన్న ద్రవ్యోల్బణం 2018 నాటికి 10 శాతానికి తగ్గింది. సగటు కుటుంబ ఆదాయం 9500 డాలర్ల నుండి 2018 నాటికి 10500 డాలర్లకు పెరిగింది. 2015లో జిడిపి వృద్ధిరేటు మైనసు 2 శాతం ఉండగా అది 2016 నాటికి 12 శాతం పెరిగింది. ఈ అభివృద్ధిరేట్లు చూసి బెంబేలెత్తిన ట్రంప్ 2018 మే 8న ఇరాన్‌తో కుదుర్చుకున్న అణు ఒప్పందం నుండి బయటకు వచ్చాడు. కానీ అప్పటికే అనేక వాణిజ్య ఒప్పందాలు ఇరాన్‌తో కుదుర్చుకొన్న జర్మనీ, ఫ్రాన్స్, చైనా, రష్యా వంటి దేశాలు మాత్రం అణు ఒప్పందం నుండి బయటకు రామని స్పష్టం చేశాయి. అణు ఒప్పందం నుండి నిష్క్రమించిన ట్రంప్ ఇరాన్‌పై ద్వేషం పగలతో సర్వనాశనం చేయడానికి మళ్లీ ఆంక్షలు విధించారు.

ఇరాన్ క్షిపణులు తయారు చేయకూడదని, ఇరుగుపొరుగు దేశాలతో యుద్ధజోక్యాలు చేసుకోకూడదని, సిరియాకు ఆర్థిక సైనిక సహాయం అందించగూడదని, అమెరికా సిరియాలో పెంచి పోషించిన టెర్రరిస్టుల జోలికి పోకూడదని హుకుం జారీ చేసింది. సిరియాలో ఇరాన్, రష్యా, టర్కీ సైనికులు ప్రవేశిస్తే మధ్య ప్రాచ్యంలో అమెరికా ఆధిపత్యం పోతుందని తన అంచనా. ఇరాక్‌లో అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో అక్కడి షియాలకు మద్దతునీయ కూడదు. ఇజ్రాయిల్ ఆక్రమించిన సిరియాకు చెందిన గోల్డెన్‌హైట్స్ విముక్తికై సిరియాకు సహాయం చేయకూడదని షరతులు విధించాడు. మధ్య ప్రాచ్యంలో ఇజ్రాయిల్‌ను మించి ఇరాన్ ఎదుగగూడదనేది అమెరికా సామ్రాజ్యవాదుల వాంఛ.

### ఇరాన్ చుట్టు మోహరిస్తున్న అమెరికా యుద్ధనౌకలు

ఇరాక్‌లో షియా మిలిటరీ శక్తులకు, యెమెన్‌లో హౌతీదళాలకు, పాలస్తీనాలో హమాస్‌లకు, లెబనాన్‌లో హిజబొల్లా గ్రూపులకు ఇరాన్ సహాయం చేస్తే యుద్ధంతో బదులిస్తామని అమెరికా విదేశాంగ సెక్రటరీ ఒకవైపు బెదిరిస్తుంటుంటే, మరొకవైపు యు.ఎస్. భద్రతా సలహాదారుడైన జాన్ బోల్టన్ చేసిన ప్రకటనలో అమెరికా ఆశయాలకు ఎదురుతిరిగితే ఇరాన్‌పై తీవ్ర పర్యవసానాలుంటాయని హెచ్చరించి యుద్ధ విమానాలు, యుద్ధ క్షిపణులతో కూడిన యుద్ధనౌక అబ్రహాంలింకన్‌ను గల్ఫ్ సముద్రంలోని హార్ముజ్ సముద్ర జలసంధికి పంపిస్తున్నట్లు తెలిపాడు. మరొక యుద్ధనౌక యుఎస్ఎస్ ఆర్లింగ్‌టన్‌ను పంపగా యుఎస్ బి–52 బాంబర్లు కతార్‌లోని అమెరికా స్థావరాలకు వచ్చాయి. ఇప్పటికే ఇరాక్‌లో 5200 సైనికులను ఉంచారు. అదనంగా 15000 సైనికుల్ని మధ్య ప్రాచ్యానికి ట్రంప్ పంపించాడు. ఆర్లింగ్‌టన్ పేట్రియాట్ క్షిపణుల రక్షణ వ్యవస్థను క్షిపణులను కల్గివున్నది. బెహ్రాన్‌లో అమెరికా సప్తమనౌకాదళ స్థావరాలున్నాయి. అక్కడి నుండి ఇరాన్‌ను ముట్టడి చేయడానికి ఈ యుద్ధనౌకని పంపాడు. ఈ యుద్ధనౌకకు రక్షణగా జలాంతర్గాములు, 12 జెట్ విమానాలు, చిన్న యుద్ధ నౌకలు కూడా ఉన్నాయి. అవసరాన్ని బట్టి లక్షాయాభై వేల మంది అమెరికా సైనికుల్ని మధ్య ప్రాచ్యానికి పంపిస్తామని ట్రంప్ ప్రకటించాడు.

### యుద్ధం కోసం గోబెల్స్ ప్రచారం

సామ్రాజ్యవాదం ఏ దేశంపైనైనా యుద్ధం చేయాలంటే ప్రపంచ కార్పొరేట్ మీడియా ద్వారా పథకం ప్రకారం ముందుగా గోబెల్స్ ప్రచారం చేస్తుంది. ప్రజలను ఆ ప్రచారం ద్వారా అమెరికా యుద్ధం చేయాలనుకొన్న దేశాన్ని ముందుగా బోనులో నిలుచోబెడుతుంది. అంతర్యుద్ధాన్ని ప్రోత్సహిస్తుంది. అప్పుడు వాయుదళాలు, నౌకలు రంగంలోకి దిగుతాయి. తన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని తెచ్చుకొంటుంది. ఇక ఆ దేశాన్ని వదిలిపెట్టి వెళ్లదు. సైనిక స్థావరాల్ని దించి తిష్టవేస్తుంది. అక్కడ నుండి తనకు కావల్సిన ఖనిజ సంపదను దోచుకొని దేశ ప్రజలను భయభ్రాంతులను చేస్తుంది. 9/11 ఘటనలను ఆధారంగా అఫ్ఘనిస్తాన్‌లో 'టెర్రరిజంపై యుద్ధం' పేరుతోనూ, సద్దాం రసాయన బాంబులు పేరిట ఇరాక్‌పై 2003లో యుద్ధం, 'మానవ హక్కుల ఉల్లంఘన' నెపంతో లిబియాపైనా, 'అరబ్ వసంతం' పేరిట ఈజిప్టు, జోర్డాన్, సిరియాలలోనూ అమెరికా తన సేనలు పంపించి యుద్ధాలు చేసింది.

హార్మూజ్ జలసంధి గుండా ప్రపంచంలోని ఐదవ వంతు క్రూడాయిల్ రవాణా అవుతుంది. రోజుకి దాదాపు 17.2 మిలియన్ బ్యారెళ్ల చమురును ట్యాంకర్లు మోసుకెళ్తుంటాయి. ఎక్కువగా సౌదీ అరేబియా, ఇరాన్, యునైటెడ్ అరబిక్ ఎమిరేట్స్, కువైట్, ఇరాక్‌లు తమ ఆయిల్‌ను ఎగుమతి చేస్తాయి. ద్రవరూప సహజ వాయువును ప్రపంచంలో అతి ఎక్కువగా ఎగుమతి చేసే కతార్ తన మొత్తం సరుకును ఈ జలసంధి ద్వారానే పంపిస్తుంది. ఈ వాణిజ్య నౌకల రక్షణ పేరిట అమెరికాకు చెందిన ఐదవ యుద్ధనౌక ఇక్కడ తిష్టవేసుకుంది. రుజువుగానీ సాకులు చూపించి ఇరాన్‌పై అమెరికా యుద్ధానికి వెళ్లవచ్చనే అనుమానాలు బలపడుతున్నాయి. యుద్ధమే జరుగుతే ప్రపంచానికి మరో ప్రళయ హేతువవుతుంది.

ఇరాన్ సమీపంలోని హార్మూజ్ జలసంధిలో అయిల్ ట్యాంకర్లపై జరుగుతున్న దాడులను సాకుగా తీసుకొని అమెరికా దానిపై యుద్ధానికి సమకట్టే సూచనలు కనిపిస్తున్నాయి. మే 12న, జూన్ 13వ తేదీనాడు ఆ జలాల్లో ప్రయాణిస్తున్న ట్యాంకర్లపై దాడులు జరిగాయి. మే నెలలో నాలుగు ట్యాంకర్లలో రెండింటి మీద జరిగిన దాడులకు బాధ్యతను అమెరికా అధ్యక్షుడు ట్రంప్ ఇరాన్ మీదికి నెట్టివేశాడు. సరైన ఆధారాలు చూపకుండానే ఇరాన్‌ను వేలెత్తి చూపడంలో మరో యుద్ధ కుట్ర దాగి ఉందని అర్థమౌవుతుంది. దాడులకు తాను కారణం కాదని ఇరాన్ స్పష్టంగా ప్రకటించింది. ఈ దాడుల వెనుక ఇజ్రాయిల్ హస్తం ఉండవచ్చునని కూడా అది గతంలో అనుమానం వ్యక్తం చేసింది.

జూన్ 13 నాటి దాడుల్లో నార్వే, జపాన్‌లకు చెందిన ట్యాంకర్లు దెబ్బతిన్నాయి. నార్వే నౌక నుంచి జ్వాలలు బయలుదేరి దట్టమైన పొగలు చిమ్మడంతోనే అందులోని సిబ్బందిని ఆ దారిగుండా వెళ్తున్న మరో నౌక సిబ్బంది కాపాడి ఇరాన్‌కు చెందిన రక్షణ పడవకు అప్పగించారు. జపాన్ ట్యాంకర్ సిబ్బందిని కూడా ఈ విధంగానే కాపాడారు. ఈ పరిస్థితుల్లో జపాన్ ప్రధాని షింజో అబే టెహరాన్‌కు వెళ్లి ఇరాన్ పాలకులతో చర్చలు జరిపారు. అయితే అబే రాయబార యత్నాలకు ట్రంప్ తూట్లు పొడిచాడు. ప్రస్తుతం ఇరాన్‌పై జరుపుతున్న యుద్ధ సన్నాహాలో భాగంగా అమెరికా యుద్ధ నౌకలను గల్ఫ్ సముద్ర జలాలకు పంపించాడు ట్రంప్. ప్రపంచ ముడిచమురు రవాణాకు రక్షణలేదు అని ఇరాన్‌ను బూచిగా చూపించి అమెరికా యుద్ధ సన్నాహాలు చేస్తున్నది.

**హార్మూజ్ జలసంధి వద్ద ఉద్రిక్తత**

హార్మూజ్ జలసంధిని అందరూ కలిసి వాడుకోవాలి. లేదంటే ఎవరూ వాడుకోకూడదు. ఇది ఇరాన్ రివల్యూషనరీ గార్డ్స్ కార్పస్ (ఐఆర్‌జిసి) సాయుధ దళాధిపతి మహమ్మద్ అల్ జాఫ్రీ ఆ దేశ యువ పాత్రికేయులకు డిసెంబర్‌లో చెప్పిన మాట. హార్మూజ్‌ను మూసివేయడమంటే ఓ రకంగా ఆసియా, పసిఫిక్ దేశాలకు ఊపిరాడకుండా చేయడమే. ఈ జలసంధి ప్రపంచానికి జీవనాడి. ఒక సైనిక దళాధిపతి ప్రపంచానికి జీవనాడి లాంటి జలసంధిపై ఇంత అజమాయిషీగా మాట్లాడుతున్నారని ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. ఇరాన్‌పై రివల్యూషనరీ గార్డ్స్‌కు ఉన్న పట్టు అలాంటిది. ఈ దళానికి ఇరాన్ సైన్యం కంటే ఎక్కువగా అధికారాలు దఖలు పడ్డాయి. ఐఆర్‌జిసికి పదాతి, నావికా, వైమానిక దళ విభాగాలు క్షిపణులు ఉన్నాయి. బలమైన గూఢచార యంత్రాంగం ఉంది. ఐఆర్‌జిసి నావికాదళ విభాగమే ఇప్పుడు హార్మూజ్ జలసంధి రక్షణ బాధ్యతలను చూస్తోంది.

అమెరికా అధ్యక్షుడు ట్రంప్ ఇరాన్ రివల్యూషనరీ గార్డ్ కార్ప్స్ (ఐఆర్‌జిసి)ని ఉగ్రవాద మూకగా గుర్తించారు. ఈ నిర్ణయంతో మధ్య ప్రాచ్యంలో విధులు నిర్వహిస్తున్న అమెరికా దళాల పరిస్థితి మరింత దిగజారుతుందని పెంటగాన్, సిఐఎలు ఆందోళన చెందుతున్నాయి. మరోపక్క ట్రంప్ ప్రకటనకు ప్రతిచర్యగా అమెరికా 'సెంట్రల్ కమాండ్'ను ఇరాన్ ఉగ్రవాద సంస్థగా ప్రకటించింది. ఈ సెంట్రల్ కమాండే మధ్య ప్రాచ్యంలో అమెరికా దళాలకు బాధ్యత వహిస్తోంది. హార్మూజ్ వద్ద ఐఆర్‌జిసి, ఇరాన్ సైన్యం భారీ సంఖ్యలో చిన్న బోట్లు వినియోగిస్తున్నాయి. దాంతోపాటు అధునాతన ఆయుధ సామాగ్రిని, నౌకలను ధ్వంసం చేయగల క్షిపణులను హార్మూజ్ పరిసరాల్లో మోహరించారు. గల్ఫ్ దేశాలకు ఈ మార్గం నుంచే నిత్యావసరాలు వెళ్లాలి. ఇక్కడ ఉద్రిక్తతలు చెలరేగితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అతలాకుతలం కావడం ఖాయం.

**చైనా ఉత్పత్తులపై అమెరికా పన్ను పెంపు**

అమెరికా ఆర్థిక వ్యవస్థను చైనా నుంచి వస్తున్న చౌక ఉత్పత్తులు దెబ్బతీస్తున్నాయని, ఇక్కడి పరిశ్రమల మనుగడను ప్రశ్నార్థకం చేస్తున్నాయని, పౌరుల నిరుద్యోగానికి కారణమవుతున్నాయని ఆరోపిస్తూ ఆ దేశాధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ చైనా ఉత్పత్తులపై సుంకాలను పెంచారు. ఫలితంగా అమెరికాలోకి దిగుమతయ్యే 200 బిలియన్ డాలర్ల (సుమారు రు. 14 లక్షల కోట్లు) విలువైన చైనా ఉత్పత్తులపై సుంకం 10 శాతం నుంచి 25 శాతానికి పెరిగింది. ఈ పెంపు మే 10 నుంచి అమల్లోకి వచ్చింది. ఎరోస్పేస్, ఇన్ఫర్మేషన్, కమ్యూనికేషన్ టెక్నాలజీ, రోబోటిక్స్, మెషినరీ వంటి పరిశ్రమల ఉత్పత్తులపై టారీఫ్‌ను మోపారు. గత 10 నెలల నుంచి 50 బిలియన్ డాలర్ల విలువైన సాంకేతిక వస్తువులపై 10 శాతం సుంకాన్ని అమెరికాకు చైనా చెల్లిస్తోంది. ట్రంప్ తాజా నిర్ణయంతో ఇతర ఉత్పత్తులపై చైనా చెల్లిస్తున్న 10 శాతం పన్ను మే 10 నుంచి 25 శాతమైంది. అమెరికాకు సుంకాలు చెల్లించడం వల్ల, ఉత్పత్తి వ్యయాలపై స్వల్ప భారం మాత్రమే పడుతుంది. అమెరికా తాజా ప్రతిపాదన వల్ల రసాయనాల నుంచి వస్త్రాల వరకు చైనాకు చెందిన 5000 రకాల ఉత్పత్తులపై సుంకాలు అధికమవుతాయి.

**అమెరికా ఉత్పత్తులపై చైనా ప్రతీకార సుంకం**

తమ ఉత్పత్తులపై అమెరికా సుంకాల పెంపునకు ధీటుగా చైనా స్పందించింది. తాము కూడా 60 బిలియన్ డాలర్ల అమెరికా దిగుమతులపై 10 నుంచి 25 శాతం వరకు పన్ను విధిస్తామని పేర్కొంది. ఇప్పటికే అమెరికా నుంచి దిగుమతి అవుతున్న పంది మాంసం, వైన్ తదితర 128 రకాల ఉత్పత్తులపై 3 బిలియన్ డాలర్ల విలువైన సుంకాలను వేసిన డ్రాగన్, తాజాగా మరో 106 ఉత్పత్తులపై 60 బిలియన్ డాలర్ల విలువైన పన్నులేస్తున్నట్లు ప్రకటించింది. వీటిలో సోయా, చిన్నపాటి విమానాలు, కార్లు, విస్కీ, రసాయనాలు, మొక్కజొన్న, ఎద్దు మాంసం, బత్తాయి రసం, పొగాకు తదితర 14 విభాగాల్లోని ఉత్పత్తులున్నాయి. గతంలో ఐదు శాతంగా ఉన్న సుంకాల్లో మార్పులేదని, మిగిలిన ఉత్పత్తులపై 25, 20, 10 శాతానికి పెంచినట్లు చైనా ఆర్థిక మంత్రిత్వ శాఖ మే 13న ప్రకటించింది. ఇవి జూన్ 1 నుంచి అమల్లోకి వస్తాయని తెలిపింది.

చైనా తన కరెన్సీ యూనిట్ యువాన్ విలువను డాలర్‌తో పోలిస్తే 0.6 శాతం తగ్గించింది. చైనా సెంట్రల్ బ్యాంక్ మే 13న ఈ నిర్ణయం

తీసుకొంది. దీంతో డాలర్ విలువ 6.8365 యువాన్లకు సమానమైంది. అమెరికాకు ఎగుమతి చేసే వస్తువులపై సుంకాలు పడుతుండడంతో వాటి ధరలు సహజంగానే పెరిగిపోతాయి. ఈ నేపథ్యంలో వాటికి డిమాండ్ తగ్గుతుంది. ఇది చైనా ఎగుమతులపై ప్రతికూల ప్రభావం చూపుతుంది. దీనిని దృష్టిలో పెట్టుకొని చైనా డాలర్‌తో పోలిస్తే యువాన్ విలువను తగ్గించింది. ఫలితంగా అంతర్జాతీయంగా తక్కువ డాలర్లతోనే ఎక్కువ చైనా వస్తువులు లభించే పరిస్థితి నెలకొంటుంది. ఇది డిమాండ్‌ను పడిపోనివ్వదు. దీంతోపాటు మిగిలిన మార్కెట్లలో కూడా చైనా వస్తువులు చౌకగా లభిస్తాయి. ఫలితంగా అక్కడ కూడా డిమాండ్ పెరుగుతుంది. చైనా, ఇండియా, ఇరాన్, క్యూబా తదితర దేశాల వస్తువుల దిగుమతిపై సుంకాలు పెంచడం అమెరికాకు ఏ విధమైన లబ్ది చేకూర్చదు.

ఒకవైపు వాణిజ్య యుద్ధం జరుగుతుండగానే అమెరికా తన యుద్ధాగారంలోని రెండు యుద్ధ నౌకలను చైనాకు దగ్గరలోని నాన్సా దీవులకు పంపింది. వాణిజ్య నౌకల స్వేచ్ఛా ప్రయాణాన్ని రక్షించేందుకే తను ఈ చర్య తీసుకున్నట్లు అమెరికా చెబుతున్నప్పటికీ నేటి ప్రపంచ రాజకీయ పరిస్థితుల్లో చైనాను సైనికంగా కవ్వించేందుకే అమెరికా ఈ దుందుడుకు చర్యకు పాల్పడినట్లు విధితమవుతుంది. కఠినమైన ఆంక్షలతో వాణిజ్యాన్ని దెబ్బతీస్తే ఎవరైనా దిగి వస్తారన్న భ్రమల్లోనే అమెరికా ఉంది. చైనాను కూడా ఇలాగే భయపెట్టాలని ప్రయత్నిస్తోంది. అటు చైనా కాని, ఇటు ఇరాన్ కాని అమెరికా బెదిరింపులను లక్ష్య పెట్టడం లేదు.

**ఇరాన్‌పై ఆంక్షల నేపథ్యంలో భారత్‌పై ప్రభావం**

ఇరాన్‌లో అణు ఒప్పందం నుంచి బయటకు వచ్చిన అమెరికా ఆదేశంపై ఆంక్షలు విధించడంతో భారత్ పరిస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లుగా తయారైంది. అమెరికా ఆర్థిక ప్రయోజనాల కోసం ఏమాత్రం వెనుకడుగు వేయని ట్రంప్ భారత్ విషయంలో కూడ అదే విధానాన్ని అవలంభించాడు. 2018 నవంబర్ నుండి ఇరాన్ చమురును ఏ దేశం కూడా దిగుమతి చేసుకోకూడదని షరతు పెట్టి, ఏ దేశమైనా దిగుమతి చేసుకొంటే అట్టి దేశంపైన కూడా ఆంక్షలు విధిస్తానన్నాడు. తన హుకుంను చైనా లెక్కచేయలేదు. కానీ మన దేశం సందిగ్ధంలో పడింది. 2019 మే 2 వరకూ మనపై ఆంక్షలను (దయతో మన విదేశీ వాణిజ్య విధానం ఏమన్నా అమెరికా వాణిజ్య విధానమా?) సడలించాడు. దీనినే తాత్కాలిక ఉపశమనం (వైవర్)గా పిలిచాడు. ఇరాన్ చమురు విషయంలో భారతదేశం చాలా వరకు అమెరికాకు అనుకూలంగానే వ్యవహరించింది. ఇరాన్ నుంచి చమురు దిగుమతి చాలా వరకు తగ్గించుకుంది. అత్యంత కీలకమైన చాబహార్ పోర్టులో భారీ పెట్టుబడులు పెట్టినప్పటికీ తప్పుకుంది. ఇరాన్‌తో భారత్ సంబంధాలు దిగజారాయనే చెప్పాలి. అమెరికా దుశ్చర్యల విషయంలో భారత ప్రభుత్వ వైఖరి దారుణంగా, మనదేశ ప్రజల ప్రయోజనాలను ఫణంగా పెట్టే విధంగా ఉంది.

ఇరాన్ చమురుపై అత్యధికంగా ఆధారపడ్డ దేశాల్లో మనదీ ఒకటి. ఇరాన్ చమురు, సహజ వాయువులు మనకు బహిరంగ మార్కెట్లో కొనే దానికన్నా 40 శాతం తక్కువ ధరకు లభిస్తుంది. అటువంటిది ట్రంప్ ఇరాన్‌పై ఆంక్షలు పెట్టగానే భారతదేశం కనీసం నిరసన కూడా తెలుపడం లేదు. కాని అమెరికా మాత్రం ఇండియాపై ఇంకా ఒత్తిడి తీసుకువచ్చే ప్రయత్నాలు చేస్తోంది. భారత్‌కు ఇన్నాళ్లూ కల్పించిన వాణిజ్య ప్రాధాన్యత హోదా రద్దు చేస్తున్నట్లు అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ప్రకటించారు. ఈ నెల 5వ తేదీ నుంచి అది అమలులోకి వస్తుంది. ఇన్నాళ్లూ భారత వస్తువులకు అమెరికాలో ప్రత్యేక పన్నులు ఉండేవి కావు. తమ వస్తువులకు సమాన హోదా ఇచ్చే అంశంపై భారత్ ఇంతవరకు ఎటువంటి హామీ ఇవ్వలేదని, అందుకే జూన్ 5వ తేదీ నుంచి ప్రిఫరెన్సియల్ బెనిఫిషియరీ హోదాను రద్దు చేస్తున్నట్లు ట్రంప్ తెలిపారు. ఆర్థిక, వాణిజ్య ఆంక్షల వలన మన ఆర్థిక వ్యవస్థపై తీవ్ర ప్రభావం పడే ప్రమాదముంది.

ట్రంప్ విదేశీ వ్యవహారాల సలహాదారు జాన్‌బోల్టన్ ఉన్మాదమే ఈ స్థితికి కారణమని అమెరికన్ మీడియా స్పష్టం చేస్తోంది. ఆయన ఈ పదవిలోకి వచ్చిన నెలరోజుల్లోనే ట్రంప్ ఇరాన్ ఒప్పందాన్ని ఏకపక్షంగా రద్దుచేశారు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటూ, బృందంగా అమెరికా ప్రకటించింది. ఇజ్రాయిల్ అధ్యక్షుడు నెతన్యాహూ కోసం ఇరాన్‌మీద విరుచుకుపడుతూ దేశ ప్రయోజనాలను ట్రంప్ ప్రమాదంలో పడేస్తున్నారని అక్కడి మీడియా విమర్శిస్తున్నది. అణుబాంబు తయారీ సహా ఇరాన్ మీద ట్రంప్ బృందం చేస్తున్న ఏ ఆరోపణలోనూ నిజం లేదని ఇప్పటికే అమెరికన్ ఇంటలిజెన్స్ విభాగం తేల్చింది. అణు ఒప్పందంలోని అంశాలన్నింటినీ ఇరాన్ తూచ తప్పకుండా పాటిస్తున్నదని కూడా కితాబు ఇచ్చింది. ఆంక్షల పేరిట ఇరాన్‌ను శక్తిహీనంగా మార్చివేసి, అక్కడ అధికార మార్పిడి జరపాలని బోల్టన్ కలలు కంటున్నారు. ఐఆర్‌జిసిని ఉగ్రవాద బృందంగా అమెరికా ప్రకటించినందునే, అమెరికన్ సైనికులను ఇరాన్ టెర్రరిస్టులుగా ప్రకటించింది.

ఈ రోజు ట్రంప్ తెంపరితనాన్ని ఎదిరించి నిలబడే శక్తులు కూడా పెరుగుతున్నాయి. ఇరాన్‌పై ఆంక్షలను తాము అంగీకరించబోమని టర్కీ, చైనా, రష్యాలు ప్రకటించాయి. ఇరాన్ నుండి చమురు దిగుమతి చేసుకునే పెద్ద దేశాల్లో చైనా, భారత్‌లు ఉన్నాయి. అమెరికా ఆంక్షలు పెట్టినా తాను ఇరాన్ నుండి చమురు కొనుగోలు చేస్తానని చైనా కరాఖండిగా చెప్పింది. విశేషమేమంటే అమెరికా నేతృత్వంలోని నాటో సైనిక కూటమిలో భాగస్వామిగా ఉన్న టర్కీ కూడా ఇరాన్‌పై ఆంక్షలకు ధిక్కార స్వరం వినిపించింది. ఒకరకంగా అమెరికా దుందుడుకు చర్యలను ఎదిరించడంలో చైనా, రష్యాలు వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నాయి. సామ్రాజ్యవాద దోపిడీలో అమెరికా భాగస్వాములైన ఐరోపా కూటమి కూడా ఊగిసలాట ప్రదర్శిస్తోంది. వెనిజులా, ఉత్తర కొరియా వంటి వాటి విషయంలో అమెరికాతో పయనించే ఈ దేశాలు ఇరాన్, పర్యావరణం వంటి ఇతర అంశాల్లో దాన్ని ఎదిరిస్తున్నాయి.

అసలే 2008 సంక్షోభం నుండి తేరుకోడానికి యాతన పడుతున్న ప్రపంచ ఆర్థిక వ్యవస్థను ట్రంప్ సర్కారు సామ్రాజ్యవాద దుందుడుకు చర్యలు మరింత సంక్షోభంలోకి నెడుతున్నాయి. ఇరాన్ ఒప్పందం నుండి తప్పుకుని దాని చమురు ఎగుమతులపై అమెరికా విధించిన ఆంక్షలు చమురు మార్కెట్లను కల్లోలంలోకి నెట్టాయి. చైనాతో వాణిజ్య యుద్ధం మొత్తం ప్రపంచ మార్కెట్లనే కుదిపేస్తున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో కార్పొరేట్ లాభాలు కొనసాగించడానికి పెట్టుబడిదారీ ప్రభుత్వాలు ప్రజలపై భారాలు వేయడమే కాకుండా ద్రవ్య మార్కెట్లలో చట్టా వ్యాపారాన్ని మరింతగా ప్రోత్సహిస్తున్నాయి. దీనివల్ల మరోమారు కృత్రిమ బుడగ పగిలిపోయి తీవ్రమైన ఆర్థిక పతనం జరిగే ప్రమాదం ఉందని నిపుణులు హెచ్చరిస్తున్నారు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# జారిజంపై బష్కీర్ల రైతాంగ పోరాటం

*బష్కీర్లపై జారిజం చేసిన దోపిడీ అణచివేతలను, దాన్ని ఎదిరిస్తూ వచ్చిన రైతాంగ పోటాన్ని, దాని నాయకుడు సలావత్ వీరోచిత పోరాట గాథను వివరిస్తున్నారు* **ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

**నా** ప్రజల అదృష్టమే నా అదృష్టందృఢ స్వరంతో పలుకుతాడు సలావత్ తన గుర్రాన్ని దౌడు తీయిస్తూ, శత్రువుల పాలిట తిరుగులేని తన భయపెట్టే ఖడ్గాన్ని ఎత్తిపట్టి. ఆ కత్తి ఒక మాయాజాలం చేసే కత్తి. శత్రు సంహారంలో తిరుగులేని ఆ ఖడ్గాన్ని అతడికి బహుకరించినవారు అక్సకల్'లు (ఈ మాటకు సూటైన అర్థం తెల్ల ఎలుగ్గొడ్డని, కజఖ్ భాషలో ధ్వన్యర్థంలో ఆ పదానికర్థం జాతి పెద్దలని!) వారా కత్తిని సలావత్‌కు ఇచ్చి, తిరుగుబాటు మార్గాన్ని చూపారు - అంటాడు 1773-75ల మధ్య జరిగిన, పుగాచోల్ రైతాంగ తిరుగుబాటులో భాగంగా బష్కీర్లు జరిపిన తిరుగుబాటు గురించిన చారిత్రక వ్యాసాన్ని రాసిన చరిత్రకారుడు నాజిర్ కుల్‌బక్తిన్.

సలావత్ యులాయేవ్ (యులాయేవ్‌ను యులయ్ అని కూడా అంటారు), రైతాంగ జార్ అయిన యెమల్యాన్ పుగాచేవ్ (జారిజానికి వ్యతిరేకంగా జరిగిన ఈ రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించిన పుగాచేవ్, తనకు తాను, రష్యన్ సామ్రాజ్యాన్ని కేవలం ఆరు నెలలు మాత్రమే పాలించిన జార్ పీటర్ 3 నని ప్రకటించుకున్నాడు. ఈ పీటర్ 3, ఇతర జార్‌లకు భిన్నంగా ప్రజారంజకంగా పాలించాడు. రైతాంగానికి అనుకూల, ప్రజానుకూల శాసనాలెన్నింటినో ప్రవేశపెట్టాడు. అయితే, ఇతడి భార్య కేథరిన్ ఇతణ్ని చంపించి, సింహాసనాన్ని ఆక్రమించి, తన పేరు కేథరిన్ 2గా ప్రకటించుకోవడంతో పాటు, అత్యంత నిరంకుశంగా పాలించింది. ఈమెపై తిరుగుబాటుగా దాదాపు 160కి పైగా చిన్నా, పెద్దా రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. వాటిలో పుగాచేవ్ తిరుగుబాటు అతిపెద్దదే గాక, ఒక క్రమ పద్ధతిలో జరిగి, జారిజానికి నిద్రలేని రాత్రులెన్నింటికో కారణమైంది - రచ)కు అతి సన్నిహితమైన సహచర పోరాట యోధుడూ, మద్దతుదారుడూ, ఆ పోరాటంలో పాల్గొన్న బష్కీర్ సైన్యానికి సేనాపతీ.

సలావత్ యులాయ్ తనకుతాను ఒక సేన నాయకునిగా తన ప్రతిభను నిరూపించుకున్నవాడు. కేవలం 19 సంవత్సరాల వయస్సుకే విశాల ప్రాంతాలలో జరిగిన పలు తిరుగుబాటు యుద్ధాలకు నాయకత్వం వహించాడు. తిరుగుబాటు జరిగిన ప్రాంతాలన్నిటా పుగాచేవ్ ప్రణాళిక (పుగాచేవ్ తన తిరుగుబాటుకి బాసటగా నిలిచిన ప్రజలకు తాను ఏయే సౌకర్యాలను కల్పించేదీ, ఎలాంటి ప్రజానుకూల విధానాలను అమలు జరిపేదీ తెలియజేస్తూ ఒక ప్రణాళికను ప్రకటించాడు. ఆ ప్రణాళికను తన తిరుగుబాటు జరుగుతున్న ప్రాంతాలలో ప్రజలలో విస్తృతంగా ప్రచారం చేయించాడు - రచ) ప్రతుల్ని పంచి పెట్టాడు. అంతేగాక పుగాచేవ్ సేవలకు అవసరమైన డబ్బును సేకరించి ఇచ్చాడు. ఆ సైన్యాలకు ఆహారాన్ని అందించడంలోనూ, అవసరమైన ఇతర వసతులూ, పరికరాలూ సమకూర్చడంలోనూ చొరవ చూపించి, సమర్థవంతంగా ఆ పనులన్నింటినీ నిర్వహించాడు. అంతేగాక, సైన్యాలను నిర్వహించడంలోనూ, వాటిని పోరాటానికి సంసిద్ధం చేయడంలోనూ, జారిస్టు సైన్యాలపై దాడులను విజయవంతంగా చేయడంలోనూ అపూర్వమైన ధైర్య సాహసాలను ప్రదర్శించాడు.

జార్ ప్రభుత్వం తనకున్న అపార ఆయుధ బలగంతో, రైతాంగ యోధులపై దాడులు చేసింది. అలాగే రైతాంగ తిరుగుబాటు దారులను దుర్మార్గులు'గా ముద్రవేసి, ఆ తిరుగుబాటులో పాల్గొన్నవారంతా నేరస్థులనీ, దోపిడీ దొంగలనీ ప్రకటించింది. అంటే, వారితో ఎలాంటి సంబంధాలను నెరపినా వారిని తీవ్రంగా శిక్షిస్తారన్నమాట!

అయితే తిరుగుబాటుదారుల్ని జారిజం ఏమని పేరు పెట్టినా గాని, ప్రజానీకంలో ఉన్న కథలు మాత్రం వారిని అణచివేతకు గురైన ప్రజానీకానికి రక్షకులని కీర్తించడమే గాక, న్యాయం కోసం పోరాడుతున్న మహోన్నత వ్యక్తులని ప్రశంసించాయి. ఆ యోధులు జరుపుతున్న యుద్ధాన్ని స్వతంత్ర పోరాటమని కొనియాడాయి.

సలావత్ యులాయేవ్ పుట్టింది తెకెయేవో గ్రామంలో (1754వ సంవత్సరం జూన్ 16న జననం, మరణం 1800 సంవత్సరం సెప్టెంబర్ 26న జైలులో). ఈ గ్రామం షైతాన్-కుదీవ్‌స్కీ వోలోస్ట్, ఊఫాప్రావిన్స్, ఓరెన్‌బర్గ్ గవర్నరేట్‌లో ఉంది. ఈ గవర్నరేట్‌ను ఇప్పుడు సలావత్‌స్కీ జిల్లా అంటారు. ఇది బష్కోర్తోస్థాన్ రిపబ్లిక్ రష్యాలో ఉంది. అయితే ఈ తెకెయేవో గ్రామం ఎంతోకాలం మనలేదు, 1775లో విప్లవం ఓడిపోగానే, ఆ గ్రామాన్ని జారిజం నామరూపాలు లేకుండా తగలబెట్టింది.

బష్కీర్లు యురేషియాలోని ప్రాచీన జాతుల్లో ఒక జాతివారు. చారిత్రకంగా చూస్తే బష్కీర్లు స్వతంత్రంగా జీవిస్తూ, ఉరాల్ పర్వతశ్రేణికి రెండు వైపులా గల పర్వత సానువుల్లో వోల్గా, కామా, తొబొల్ నదుల మధ్యగల ప్రాంతాల్ని యావెక్ నదికిగల ఎగువ ప్రవాహం వరకూ ఆక్రమించుకుని నివసిస్తున్నారు. అత్యంత వెనుకబడిన జీవన విధానం గల బష్కీర్లు పశువుల మందలను మేపుకుంటూ, సంచార జీవనం సాగిస్తుంటారు. 1552 తర్వాత, తతార్‌ఖానేట్ (తతార్ రాజ్యం) ఓటమి చెందిన పిదప, బష్కీర్లు రష్యన్ సార్వభౌమత్వం కిందికి వచ్చారు. అప్పుడు రష్యన్ జారిజం పలు హామీలను ఇచ్చింది.

జారిజం బష్కీర్ల స్వతంత్ర జీవనానికి పలు హామీలిచ్చినప్పటికీ, ఆచరణలో వారిని అనేక ఇబ్బందులు పెట్టసాగింది. దీన్ని సహించలేని బష్కీర్లు 17, 18 శతాబ్దాలలో జారిజంపై పలు తిరుగుబాట్లకు పూనుకున్నారు. దాంతో జారిజం బష్కీర్లతో స్నేహంగా ఉన్నట్లు అధికారికంగా నటిస్తూనే, ఆచరణలో మాత్రం అందుకు విరుద్ధంగా ఉండేవారు. 17వ శతాబ్దం మధ్య నుంచీ జార్లు బష్కీర్ల భూముల్ని గుంజుకోవడం మొదలు పెట్టారు. బస్కోర్తోస్తాన్‌లో పలు కోటల్ని పటిష్ఠంగా నిర్మించడం సాగించారు. ఇక 18వ శతాబ్దం ప్రారంభం నుంచీ విశాల భూముల్లో రష్యన్ సెటిల్మెంట్లను అక్కడక్కడా ఏర్పాటు చేసి, అందులోకి రష్యన్ భూస్వాముల్నీ, ఉన్నత వంశాల వారినీ ఆహ్వానించి, వారికి పెద్ద మొత్తాల్లో భూములిచ్చి సాగుకోసం

ప్రోత్సహించారు. ఆ భూస్వాములు ఆ భూముల్లో సాగు చేసేందుకు గాను తమ బానిస రైతుల్ని తీసుకువచ్చి పంటలు పండించడం మొదలెట్టారు. అంతేగాక వర్తకుల్ని రప్పించి ఆ సెటిల్ ప్రాంతాల్లో ఫ్యాక్టరీల్ని నిర్మించి ఉత్పత్తి చేసే విధంగా ప్రోత్సహించారు. ఈ విధమైన సెటిల్మెంట్ల కోసం గణనీయమైన బష్కీర్ల భూములు కైంకర్యమైపోయాయి. దీనికితోడు ఆ ఫ్యాక్టరీల వల్ల ప్రవహించే వ్యర్థాల వల్ల సమీప ప్రాంతాలన్నీ కలుషితం అయ్యాయి. పై చర్యలకు అదనంగా 18వ శతాబ్దం ప్రారంభం నాటికే 31 భారీ రక్షణ కుడ్యాలను నిర్మించారు.

పై చర్యలతో బష్కీర్ల పశువుల మందల్ని స్వేచ్ఛగా మేపుకొనే ప్రాంతాలపై ఒత్తిడి విపరీతంగా పెరిగిపోయింది. ఈ చర్యలన్నీ వారికి జారిజం పైన, సెటిల్మెంట్ల పైన ఆగ్రహం రగులుకోవడానికి కారణమయ్యాయి. బష్కీర్లను రెచ్చగొట్టే పై చర్యలకు తోడుగా, జారిజం వారి మతంలో జోక్యం చేసుకోవడం మొదలెట్టింది. 17, 18 శతాబ్దాలలో వరుసగా ముస్లిం మతానికి చెందిన బష్కీర్లపై క్రిష్టియన్ మతాంతరీకరణ ప్రయత్నాలను పెద్ద పెట్టున జారిజం ప్రోత్సహించింది. మరోపక్కన సామ్రాజ్యం విస్తరణ కాంక్షను తీర్చుకునేందుకు జార్ పాలకులు సైన్యాలను ఆధునీకరించడం కోసం, పాశ్చాత్యీకరణలో భాగంగా నాగరికత పేరుతో పెరిగే ఖర్చుల్ని తట్టుకునే రీతిగా సామ్రాజ్యాదాయం లేకపోవడం వలన, ప్రజలపై పన్ను భారం విపరీతంగా పెంచివేయడం సాగించారు. ఇది బష్కీర్ల పాలిట మోయలేని భారమైంది. వారి ఆదాయాలు అసలే తక్కువ. ఏమాత్రపు అదనపు ఖర్చునూ తట్టుకునే పరిస్థితుల్లో వారు లేరు.

దీంతో బష్కీర్లు తమ భూముల్నీ, స్వాతంత్ర్యాన్నీ పరిరక్షించుకోవడం కోసం, మొదట జారిజానికి మహజర్లపై మహజర్లు సమర్పించారు. వాటివల్ల ఏమీ ప్రయోజనం కనిపించకపోయేసరికి, తిరుగుబాటు బాట పట్టారు. 1616లో, 1662-64 మధ్య, తిరిగి 1704-11 సంవత్సరాల మధ్య పలు సాయుధ తిరుగుబాట్లు జరిపారు. ఈ పోరాటాలన్నీ - రష్యన్ సామ్రాజ్యంలో బష్కోర్తోస్తాన్ విలీనమైనప్పుడు, జారిజానికీ, బష్కీర్లకూ మధ్య జరిగిన ఒడంబడికను పరిరక్షించుకోవడం పేరుమీద జరగడం గమనార్హం!

పైన జరిగిన తిరుగుబాటు యుద్ధాలకన్నా అధిక స్థాయిలో బష్కీర్లు 1773-75ల మధ్య యెమెల్యాన్ పుగాచేవ్ నాయకత్వంలో జరిగిన రైతాంగ యుద్ధంలో అత్యధిక చురుకుదనంతో పాల్గొన్నారు. ఈ తిరుగుబాటు యుద్ధం రెండో దశ పోరాటం 1774లో ఏప్రిల్ నుండి జూలై మధ్యదాకా కేవలం బష్కోర్తోస్తాన్ భూభాగంలోనే కేంద్రీకరించబడి జరిగిందంటే, బష్కీర్లు ఈ రైతాంగం తిరుగుబాటును ఎంత తీవ్రంగా తీసుకున్నారో అర్థం చేసుకోవచ్చు. ఈ రెండో దశ యుద్ధం గాక, మరి రెండుసార్లు కూడా ఈ తిరుగుబాటు యుద్ధాలు జరిగినా కూడా, అవి అంత తీవ్ర స్థాయిలో జరగలేదని చెప్పవచ్చు. ఊఫా నగరానికి దగ్గరగా జరిగిన ఈ రెండు పోరాటాలూ కూడా ఉధృత స్థాయినందుకోలేక పోయాయి.

ఈ రోజుకి కూడా సలావత్ యులాయేవ్ గురించి ఎక్కువగా తెలియదు. పుగాచేవ్ నాయకత్వంలో జరిగిన అతిపెద్ద రైతాంగ పోరాటంలో భారీ సంఖ్యలో పాల్గొన్న బష్కీర్ల దళాలకు నాయకత్వం వహించిన ఈ 19 సంవత్సరాల యువసేనాని వ్యక్తిగత జీవిత విశేషాలు వివరంగా తెలియవు. అయితే అతడి పేరు జానపద కథల్లోనూ, అనూచానంగా వస్తున్న చారిత్రక కథల్లోనూ ప్రముఖంగా వినబడడమే గాక, అతడి పరాక్రమం విశేషంగా కొనియాడబడింది. అంతేగాక, కొన్ని అధికారిక పత్రాల్లో కూడా అతడి పేరు విశేషంగా కనబడుతుంది. ఈ రెండిటి ద్వారా సలావత్ జీవిత విశేషాలు కొన్ని తెలియవస్తున్నాయి. వాటి ద్వారానే బష్కీర్ ప్రజల చరిత్ర గురించీ, బష్కీర్ల జాతీయ నాయకుడైన సలావత్ విశేష గుణగణాల గురించీ కొన్ని విషయాలు తెలుసుకునే అవకాశం కలుగుతోంది.

సాధారణంగా జానపద కథల్లో అత్యధిక భాగంలో, కథానాయకునిగా ఉండే వ్యక్తి స్థానిక వ్యక్తే అయి ఉంటాడు. ప్రసిద్ధికెక్కిన వీరుడూ, కవీ, పోరాట కారుడూ అయిన సలావత్ గురించిన గుణ విశేషాల గురించి బష్కోర్తోస్తాన్‌లోని వేర్వేరు ప్రాంతాలలో ప్రాచుర్యంలో ఉన్నాయి. ఎక్కువగా అతడి జన్మభూమి ప్రాంతంలో ఆ కథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. ఇది బష్కోర్తోస్తాన్‌లోని సలావత్ ప్రాంతం. సోవియట్ రష్యా ఏర్పడ్డాక, ఆ ప్రాంతాని(రీజియన్)కి ఆ పేరు పెట్టారు.

జానపద కథల్లో కనిపించే కథానాయకులు ఎప్పుడూ ప్రజల్లో ఒక భాగంగానే ఉంటారు. వారు ముఖ్యమైన పలు చారిత్రక ఘటనల్లో భాగమై ఉంటారు. అలాంటి వారికోవలోకే సలావత్ యులాయేవ్, యెమెల్యాన్ పుగాచేవ్‌లు కూడా వస్తారు. ఇలాంటి కథానాయకులు చరిత్రలో తమ ముద్రల్ని వదిలి వెడతారు. వీరు కొన్ని నిర్దిష్ట స్థలాల్లో అంకిత భావంతో సాగించిన చర్యల ద్వారా ప్రసిద్ధికెక్కుతారు. అయితే ఆ చర్యలు నాటకీయంగా వారి భాగ్యవిధాతలుగా ఉండడం కూడా మనం గమనించవచ్చు. ఈ అంశాన్ని వర్ణించే విధంగా ఒక చారిత్రక కథ సలావత్ పోరాటంఅనేది అతడు జారిజంతో జరిపిన పోరాటం గురించి తెలియజేస్తుంది. ఈ కథలో ఇతివృత్తం - సంప్రదాయికంగా వినిపించే విషయంతో ప్రారంభమవుతుంది - గొడ్లపాకంత స్థలం చేతులు మారడం గురించి. సలావత్ తమ జాతికి చెందిన అక్సకల్‌లతో (జాతి పెద్దలు) సమావేశం సందర్భంగా ఉద్వేగం వ్యక్తమయ్యే కంఠంతో, అప్పటికే వీరునిగా ప్రసిద్ధికెక్కిన అతడితో, సలావత్... ఇది సహించరానిది, తప్పకుండా మనం మన భూముల్ని రక్షించుకోవాలి... నీ మీదే మా ఆశలన్నింటినీ నిలుపుకున్నాం...అన్నారు.

రైతాంగ యుద్ధానికి సంబంధించిన జానపద కథల్లో సృజనాత్మక అద్భుతాలు ఏవీ కనబడవు. వాటిలో సలావత్ వీరత్వాన్ని చాటిచెప్పే వీర గాథలు మరింత ఉన్నతంగా పునరావృతం చేయబడ్డాయి అంతే. అవి అతడి అసాధారణ ప్రజ్ఞను కీర్తించే సుదీర్ఘ జానపద గీతాలలో కూడా కథానాయకున్ని చేశాయి. సుదీర్ఘ కాలం పాటు సాగిన అతడి వీరకృత్యాల వల్ల, సలావత్ పేరు స్వాతంత్ర్య పోరాటంలో అతడి పాత్రను స్మరించుకోక తప్పనిసరి చేశాయి.

అతికొద్దిగా మాత్రమే తెలుస్తున్న సలావత్ వ్యక్తిగత వివరాల ప్రకారం, అతడి తండ్రి యులాయ్ అజ్నలీన్ ఒక చిన్న ఎస్టేట్‌కు అధినేత. అప్పుడప్పుడే స్థిర జీవనానికి అలవాటు పడుతున్న బష్కీర్లలో ఒకడు. బష్కీర్లలో ధనికుడు. ఆ జిల్లాలో బష్కీర్లకు పెద్ద. గొప్ప మేధావి, పలుకుబడి కలిగిన వ్యక్తి. బష్కీర్లలో ప్రతి ఒక్కరిచేత ఎంతగానో గౌరవ మన్ననలు పొందే వ్యక్తి. అంతేగాక, అతడు జిల్లాలోని బష్కీర్లందరికీ పంచాయితీలు తీర్చే పెద్ద మనిషి, వారి నాయకుడు. స్థానిక ప్రభుత్వాధికారులు అతడి మాటకెంతో విలువిస్తారు. రష్యన్ ప్రభుత్వానికి అతడి విధేయత సందేహాతీతం. 1768లో ఓరెన్‌బర్గ్ గవర్నరైన రాకుమారుడు పుత్యాతిన్ యులాయ్‌ని, బష్కీర్ సైనిక దళానికి పంచాయితీ దారునిగా చేశాడు. అంటే సైనిక న్యాయ స్థానానికి జడ్జీగా నియమించాడన్నమాట!

అయితే ఆ తర్వాత కొద్ది కాలానికే, బడా వర్తకుడైన త్వెర్దిషేవ్‌కు ప్రభుత్వం బట్టలకవసరమయ్యే ఇతర అలంకార వస్తువుల తయారీ కోసం ఫ్యాక్టరీలు నిర్మించుకోవడానికి లైసెన్సు ఇచ్చింది. దాంతో త్వెర్దిషేవ్ పెద్ద ఎత్తున ఫ్యాక్టరీల సముదాయాన్ని నిర్మించాడు. వాటికి అనుబంధ పరిశ్రమల్ని కూడా నిర్మించాడు. ఆ ఫ్యాక్టరీల సముదాయం నుండి

విడుదలయ్యే రసాయనిక వ్యర్థాలతో యులాయ్ భూమి అంతా నిండిపోయి, వినియోగించడానికి పనికిరాకుండా పోయింది. యులాయ్ వ్యవసాయం అంతా మూలనబెట్టి ఆగచాట్లు పడవలసి వచ్చింది. ఆ భూమి ద్వారా వచ్చే ఆదాయమే అతడి జీవనానికి ప్రధాన వనరు కావడంతో తనకు జరిగిన అన్యాయంపై యులాయ్ ప్రభుత్వ పెద్దలెందర్నో కలిశాడు. అయినా ఫలితం లేకుండా పోయింది. ప్రభుత్వం ఒక విధానంగా బష్కీర్లను దెబ్బకొట్టే చర్యల్ని తీసుకొంటుండడంతో, యులాయ్ వేదన అరణ్యరోదనే అయింది. తనలాంటి పలుకుబడి కలిగిన వ్యక్తికే ఇలా జరిగితే, మిగిలినవారి సంగతేమిటి? యులాయ్ ఆలోచనల్లో పడిపోయాడు. అయితే బష్కీర్లు ఇలాంటి ఎన్నో అనుభవాలతో అప్పటికే మొదలైన పుగాచేవ్ నాయకత్వంలో జరుగుతున్న రైతాంగ విప్లవంలో చేరిపోయారు. తను కూడా ఆ దారిలోనే వెళ్లాలని యులాయ్ నిశ్చయించాడు. పుగాచేవ్ నాయకులైన వారందరినీ కలిశాడు. తననీ కలిశాడు. ఆలోచించి చెబుతానన్నాడు. ఇక ఒకటే ఆలోచన... తన 19 సంవత్సరాల పెద్ద కొడుకు సలావత్ యులాయేవ్‌తో పాటు, అజ్నలీన్ తిరుగుబాటులో చేరిపోయాడు.

పుగాచేవ్ నాయకత్వంలో జరిగిన ఈ తిరుగుబాటులో సలావత్ మొదట లెఫ్టినెంట్ హోదాలో పనిచేశాడు. అయితే క్రమంగా సైన్యాలను నడపడంలో, దానికి సంబంధించిన అనేక విధులు నిర్వర్తించడంలో సలావత్ ప్రతిభ కొద్ది కాలంలోనే నిరూపితం కావడంతో అతడికి బ్రిగేడియర్ హోదా లభించింది. యుద్ధంలో సలావత్ పలు కీలక ఘట్టాలలో సైన్యాలను పర్యవేక్షించాడు, పలు తిరుగుబాట్లను నిర్వహించాడు. అంతేకాక, ఒక యుద్ధంలో దళాల సంఖ్య తరిగిపోతే కొద్ది రోజులకే తిరిగి కొత్త దళాలను నిర్మించాడు. ప్రభుత్వ దళాలకు చుక్కలు చూపించాడు. అతడి పోరాట పటిమకూ, నైపుణ్యానికీ, సేనా నిర్వహణ సామర్థ్యానికీ జార్ సైన్యాలకు నాయకత్వం వహించిన అత్యంత అనుభవం కలిగిన జనరల్లే ఆశ్చర్యపోయి, పొగడ్తల వర్షం కురిపించారంటే అతడి అసాధారణ సామర్థ్యం ఎలాంటిదో అంచనా వేయవచ్చు. రైతాంగ పోరాటాలను అణచివేసేందుకు కృషి చేసిన జారిష్టు సైనిక జనరల్లయిన పొత్యోమ్కిన్, పానిన్‌లు కేథరిన్ IIకు రాతపూర్వకంగా పంపిన రిపోర్టులు ఇప్పటికీ భద్రంగా ఉన్నాయి. వాటిల్లో వీరు సలావత్ యులాయేవ్‌ను ముగిసిన ఆ తిరుగుబాటు పోరాటానికి ప్రధాన నాయకుడనీ', మహోన్నతుడు సలాయేవ్‌అనీ వారు ప్రశంసలు కురిపించారు.

సలావత్ తన దాడులతో ఎన్నో కోటలను చుట్టుముట్టాడు. వాటిని పనిచెయ్యకుండా మూసివేయించాడు. అంతేకాదు పలు జారిస్టు సెటిల్‌మెంట్లనూ మూసేయించాడు. ఇవి మాత్రమే గాక, ప్రభుత్వ పాలన స్థిరపడని, చొరపడని పలు మారుమూల ప్రాంతాలలో విప్లవ ప్రభుత్వాన్ని నడిపేందుకు ఏర్పాట్లు చేసి, కొత్త పాలనా సంస్థలను ఏర్పరచాడు. 20కి పైగా యుద్ధాలలో తన పోరాట పటిమను శత్రువులకు రుచి చూపించిన సలావత్, ఆ పోరాట ప్రాంతాలలో చట్టపరమైన కార్యక్రమాల నిర్వహణ సాగించినట్లు (పన్నులు వసూలు చేయడం, తగువులు పరిష్కరించడం, యుద్ధ ఖైదీలుగా తెచ్చిన శత్రువులను (భూస్వాములూ, జారిస్టు అధికారులూ, ఉన్నత వంశీకులూ అయిన వారిని పోరాట ప్రాంతాలలో రైతాంగ దళాలు బంధించి తెచ్చి నేరవిచారణ కోసం పుగాచేవ్ కోర్టులో ప్రవేశపెట్టేవారు. వారిని పుగాచేవ్ తీవ్రంగా శిక్షించేవాడు. తరచు మరణశిక్ష విధించేవాడు. అతడు పాల్గొనని సందర్భాలలో సలావత్ లాంటి వాళ్లు ఖైదీల్ని విచారించేవారు -రచ) విచారించడం, పాలనా బాధ్యతలు స్థానికంగా విప్లవానుకూలురకు అప్పగించడం వగైరా) కూడా తెలుస్తోంది.

జారిజంపై పలు రైతాంగ పోరాటాలు జరిగినా, వాటిలో పుగాచేవ్ ఆధ్వర్యంలో జరిగిన పోరాటమే అతిపెద్దదీ, అతి దీర్ఘకాలం కొనసాగినదీ. 1773 జూన్‌లో అతికొద్ది మంది కొసక్కు అనుచరులతో ఓల్గా నదీ తీరంలో తాను పీటర్ IIIనని ప్రకటించుకుని, తన వాగ్దానాలతో, ప్రచారంతో, సైనిక దళాలు నడపడంలో వ్యూహరచనా పాటవంతో, కేవలం తన జాతివారైన కొసక్కులే గాక, ఇటు రష్యన్ భానిస రైతాంగాన్నీ, అటు పలు అల్పసంఖ్యాక రష్యనేతర వివిధ జాతుల ప్రజల్నీ ఆకట్టుకుంటూ, తన సైనిక పాటవాన్ని తొలుత 25,000 మంది సైనికులతో పెద్ద సైన్యాన్నే నిర్మించి, నిరంకుశురాలైన కేథరిన్ II సైనిక దళాలపై తన తొలి దాడిని 1773 సెప్టెంబర్‌లో జరిపాడు. తొలుత ఇతడి తిరుగుబాటును ఆషామాషీగా తీసుకున్న కేథరిన్ ఆ తర్వాత అందుకు పశ్చాత్తాపం చెందక తప్పలేదు. ఎన్నో విజయాలు సాధించిన పుగాచేవ్ తన తిరుగుబాటు మధ్యకాలంలో దాదాపు 40,000 మంది సైన్యాలతో పలు యుద్ధాలు చేశాడు. ఒకానొక దశలో అతడి సైన్యాలు ఒక లక్ష దాకా చేరాయని కొందరు చరిత్రకారులు పరిశోధించి రికార్డుల ఆధారంగా లెక్కలు చెప్పారు. పుగాచేవ్ తన విజయాలతో ఓల్గానదీ తీరం నుంచి ఉరాల్స్ పర్వతం దాకా మధ్యనున్న సువిశాల మైదానంపై ఆధిపత్యాన్ని సాధించి, ప్రజలపై పన్నులు విధించాడు. సొంత పాలనా వ్యవస్థను స్థాపించాడు. సైనిక శిక్షణాలయాన్ని కూడా తనదైన పద్ధతుల్లో నెలకొల్పాడు. రష్యా అంతటా జారిజం వల్ల అణచివేతకు గురైన ప్రజానీకంలో అభిమానాన్ని సంపాదించాడు. తన జాతికి చెందిన కొసక్కుల, రైతాంగ బానిసల, అల్ప సంఖ్యాక మతం మద్దతు కూడా సంపాదించాడు. పలుసార్లు ఓటమికి గురైకూడా తప్పించుకుపోయి, కొద్ది రోజులలోనే తను కోల్పోయిన సైన్యానికన్నా ఎక్కువ సంఖ్యలో సైన్యాన్ని నిర్మించుకోవడాన్ని బట్టి చూస్తే కేథరిన్ IIపై గత కసి ఎంతో, అంతకు మించి తన ప్రాణాల్ని అర్పించైనా పుగాచేవ్ తిరుగుబాటుకు తోడ్పడాలన్న ప్రజల ఆకాంక్ష ఎంతో అర్థమవుతుంది.

చివరికి కజాన్ యుద్ధం (జూలై 12-15, 1774)లో మొదటి దశ విజయపథంలో సాగినా, బయటి నుంచి శత్రు సేనలు చుట్టుముట్టడంలో ఘోరపరాజయం కలిగింది. 25,000 మంది సైన్యంతో పోరాడిన పుగాచేవ్ సేనల్లో తుపాకులున్నవి కేవలం కొసుక్కు యోధుల వద్దే. బష్కీర్ల వద్ద కత్తులూ, విల్లంబుల వంటి సంప్రదాయక ఆయుధాలు తప్ప తుపాకులు లేవు. ఇక బానిస రైతు దళాల వద్ద ఉన్నవి కర్రలు, బరిసెలు వంటి సాధనాలేనంటే, పుగాచేవ్ వద్దగల సైన్యం సంఖ్య బాగానే ఉన్నట్లు కనబడుతున్నా ఆయుధాలు గాని, వాటి శిక్షణ గాని అంతగా ఏమీ లేవు. జార్ సైన్యం కేవలం అందుకు విరుద్ధం. దీంతో పుగాచేవ్‌కు నష్టం తీవ్రంగా జరిగింది. 10 వేల మంది సైనికులు బందీలుగా చిక్కారు. వారందరినీ ఆ తర్వాత ఉరితీశారు. మిగిలినవారు చనిపోయారు. అయితే పుగాచేవ్ 500 మంది సైనికులతో ఓల్గా నది దాటి పారిపోయాడు. తిరిగి కొసక్కుల వద్దకు చేరి సైన్యాలను సమకూర్చుకుని యుద్ధం చేశాడు. కాని, చివరకు ఆగస్టు 23 ఓటమి చెందాడు. కొద్దిరోజుల తర్వాత అతడి సొంత సైన్యంలో జిజీ కొసక్కులు కొంతమంది అతన్ని పట్టుకొని జార్ సైన్యాలకు అప్పగించడం అతి విషాదకరం. ఈ సంఘటన 1774 సెప్టెంబర్ 15న జరిగింది. వెంటనే అతణ్ని చెక్క పంజరంలో కాళ్లకూ, చేతులకూ సంకెళ్లు వేసి విచారణ నిమిత్తం అత్యంత బలమైన రక్షణ మధ్య మాస్కోకు పంపించారు. సుదీర్ఘమైన విచారణ తర్వాత జనవరి (పాత కాలెండర్ ప్రకారం) 10న, 1775వ సంవత్సరంలో మాస్కోలో బొలోత్నయా చౌరస్తాలో బహిరంగంగా మొదట శిరచ్ఛేదనం చేసి, ఆపై నాలుగు ముక్కలుగా నరికి, ఆ భాగాల్ని వేర్వేరు ప్రదేశాల్లో బల్లేలకు

గుచ్చి, భవిష్యత్తులో జారిజంపై తిరగబడేవారిని భయపెట్టేందుకు ప్రజల సందర్శనార్థం ఉంచారు. అయితే పుగాచేవ్ మరణించినప్పటికీ, 1775లో కూడా అతడి అనుచరులు కొద్ది నెలలు పోరాటం నిర్వహించినా, అది క్రమంగా అణిగిపోయింది.

ఏమైనా పుగాచేవ్ ఆధ్వర్యంలో సాగిన రైతాంగ పోరాటం కేథరిన్ 2ని ఎంతగా వణికించిందంటే, ఎక్కడ అతని సైన్యాలు తనమీద దాడి చేస్తాయోనని ఆమె తన నివాస భవనాన్ని దాటి బయటకు రాకుండా ఈ పోరాటం ముగిసేదాకా లోపలే ఉండిపోయింది. అంతేగాక, రాజధాని నగరాన్ని 40,000 మంది సైనికులతో పహారాకాయించింది.

పుగాచేవ్‌ని అరెస్టు చేసిన సెప్టెంబర్‌లోనే సలావత్ యులాయేవ్‌ను అరెస్టు చేశారు. అంతకుముందే అతడి తండ్రి యులాయ్ అజ్నలీన్‌ను అరెస్టు చేశారు. ఆ తర్వాత పది నెలల అనంతరం అనగా 1775 జూలైలో ఆ ఇద్దరినీ బహిరంగంగా తీవ్రంగా కొట్టారు. తిరుగుబాటు జరిగిన ప్రాంతాలన్నీ వారిని తిప్పుతూ అలా హింసించారు. అదే నెలలో వారిద్దరి ముక్కు రంధ్రాలను పట్టి బలవంతంగా లాగి, నుదుటిపైన, మొహం పైన నేరస్తులని ముద్రలు కాల్చి వాతలు పెట్టారు. అక్టోబర్ 2న కాళ్లకు, చేతులకు సంకెళ్లు తగిలించారు.

అనంతరం వారిద్దరినీ రెండు బళ్లలో ఎక్కించి సంకెళ్లతోనే వేల మైళ్ల దూరంలో గల బాల్టిక్‌కోట రోగర్‌వీక్‌'లో (ఇప్పుడు ఎస్తోనియా దేశంలో పల్‌దిస్క్‌పట్టణంలో ఉంది) జీవితఖైదు శిక్ష అనుభవించడానికి పంపారు. మెంజలిన్‌స్క్, కజాన్, నీర్ను నొవాగొరోద్, మాస్కోల గుండా త్వేర్ ప్రాంతానికి నవంబర్ 14న ఆ బళ్లుచేరాయి. అక్కడి నుండి నొవాగొరోద్, స్కోవ్, రెవెల్ వెళ్లి చిట్టచివరికి రోగర్‌వీక్‌కు ఆ బళ్లు నవంబర్ 29కి చేరాయి. అంటే వారు ఏకధాటిగా అక్టోబర్ 2 నుండి నవంబర్ 29 దాకా, 57 రోజులు ప్రయాణించాల్సి వచ్చిందన్నమాట!

బాల్టిక్ సముద్రతీరంలో ఉన్న రోగర్‌విక్ కోటను, ఓడ రేవును కూడా పీటర్ ది గ్రేట్ నిర్మించాడు. అయితే తిరుగుబాటులో పాల్గొన్న బష్కీర్ల యోధులు సలావత్, అతడి తండ్రి అజ్నలిన్‌లు యావజ్జీవిత శిక్షలు అనుభవించేందుకు ఆ కోటకి వచ్చేసరికి, ఆ కోటా చాలావరకు నిర్మానుష్యంగా ఉంది. అక్కడ సైనికులు కొద్దిమంది మాత్రమే ఉండగా, అతి తక్కువ సంఖ్యలో ఖైదీలు ఉన్నారు. ఆ ఖైదీలు కూడా పుగాచేవ్ తిరుగుబాటులో పాల్గొన్నవారే. పుగాచేవ్ సైన్యంలో కల్నల్‌గా పనిచేసిన ఐ.ఎస్. అరిస్తోవ్, కల్నల్ కంజాఫర్ ఉసాయేవ్ ప్రభృతులు వారు. వారికిప్పుడు సలావత్, అతడి తండ్రి తోడయ్యారు. మిగిలిన వారితో పాటు ఈ ఇద్దరు శేషజీవితమంతా ఈ కోటలోనే బందీలుగా గడిపారు.

కేథరిన్ 2 మరణించి, ఆమె కొడుకు పాల్ 1 జార్‌గా పట్టాభిషిక్తుడైన తర్వాత (కేథరిన్ 2 1796లో మరణించింది. అయితే ఆమె కొడుకు పాల్ ఆమెకు ఎడంగానే పెరిగాడు. కొడుకును పట్టించుకోని కేథరిన్‌కు దూరంగా నాడు జారినాగా ఉన్న ఎలిజబెత్, పాల్‌ని వేరే సంరక్షణలో ఉంచి, తల్లి నీడకూడా ఆ పిల్లాడిపై పడనివ్వకుండా పెంచింది. కొడుకుని చూడాలన్నా ఆమెకు ఎలిజబెత్ అనుజ్ఞ కావలసిందేనంటే, కేథరిన్ స్వభావం ఎలాంటిదో అంచనా వేయవచ్చును. అసలు పాల్ కేథరిన్ సంతానమే అయినా, ఆ పిల్లవాడి తండ్రి ఆమె భర్త పీటర్ కాదు. ఆమె ప్రియుల్లో ఒకడు.) పాల్1 తనతల్లి అమలు చేసిన కొన్ని విధానాలను మార్చాడు కాని, ఖైదీల శిక్షల విషయంలో మాత్రం జోక్యం చేసుకోలేదు. రోగర్‌విక్ కోటకు కమాండెంట్ అయిన లాంగెల్, ఖైదీలుగా ఉన్న తిరుగుబాటు దారులను తగన్‌రోగ్'కు గాని, ఇర్‌కుత్‌స్క్'కు గాని తరలించడం మంచిదని ఒక విచారణను నిర్వహించి, రిపోర్టును సమర్పించాడు. ఆ రిపోర్టుపై సెనేట్‌లో చర్చించి ఒక నిర్ణయం తీసుకున్నారు. ఆ నిర్ణయం ప్రకారం ఇంతకు ముందే చెప్పినట్లు ఖైదీలు చేసిన నేరం వల్ల సామ్రాజ్యాధిపతులు వారిని శిక్షించడం జరిగిందనీ, అందువల్ల అదే కోటలో వారి నిర్బంధాన్ని కొనసాగించాలనీ, వారు తప్పించుకు పారిపోకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలనీ జవాబు వచ్చింది. 1775 మార్చి 17న నాటి జారినా అయిన కేథరిన్2 ఒక ప్రత్యేక ఆజ్ఞను ప్రకటించింది. ఆ ఆజ్ఞ ప్రకారం పుగాచేవ్ తిరుగుబాటులో పనిచేసిన అందరినీ జైలులో వేయాలి, అంతేగాక వారి పేర్లు తలవకూడదు, వారు చేసిన పనిని (ప్రజల సమక్షంలో) తప్పు పట్టాలి. ఈ ఆజ్ఞ ప్రకారం స్థానిక అధికారులు నడుచుకోలి. ఎవరి పేర్లయితే ప్రకటించబడ్డాయో నేరస్తులుగా వారిని జైళ్లలో (సంకెళ్లతో) బంధించాలి.

సలావత్ యులాయేవ్‌కు సంబంధించిన సమాచారం 1800 సంవత్సరం దాకానే తెలుస్తోంది. ఆ సంవత్సరంలోనే అనగా 1800, సెప్టెంబర్ 26న ఆ ఖైదీ మరణించాడని ఆ కోట కమాండెంటుగా ఉన్న మేజర్ దిత్‌మర్ స్థానిక ఎస్ట్‌లాండ్ గ్రామీణ బోర్డుకు తెలియబరిచిన ఉత్తరం లభించింది. మిగిలిన వారంతా క్షేమంగా ఉన్నారని ఆ ఉత్తరంలో ఉంది. అయితే సలావత్ తండ్రి అజ్నలీన్ అంతకు ముందే మరణించినట్లు తెలుస్తోంది. ఆ విధంగా సలావత్ యులాయేవ్ మరణించిన తేదీ అధికారికంగా నిర్ధారించబడింది.

సలావత్ యులాయేవ్ అసాధారణ ప్రజ్ఞగల బష్కీర్ల జాతీయ వీరుడే కాదు, అతడిలో మరో కోణం కూడా దాగి ఉంది. ఆ కోణం అతడిలో జాలువారే కవితా శక్తి. అతడో ఆశుకవి. సుమారు 500 దాకా అతడి కలం నుండి కవితలు జాలువారినట్లు తెలుస్తోంది. ఇవన్నీ అణచివేత దారులకు వ్యతిరేకంగా పలు కోణాల్నుంచి అల్లిన కవితలే! ఆ కోణాల్లో జన్మభూమి, బష్కీర్ ప్రజలు, స్త్రీ ప్రేమలు ఉన్నాయి. 25 సంవత్సరాల పాటు జైలులో ఉండి, చివరకు జైలులోనే మరణించిన యులాయేవ్ ఈ కవితలన్నింటినీ జైలులోనే రాసినట్లుగా తెలుస్తోంది. ఈ కింది కవిత, తాను జైలు నుండి తప్పక బయటికొచ్చి పిత్రు దేశం సందర్శిస్తానన్న నమ్మకాన్ని వ్యక్తం చేస్తూ తనజాతి ప్రజలకు ధైర్యాన్ని నూరిపోసే కవిత... చూడండి –

*నా పితృ దేశమా.. ఉన్నావు కదా నువ్వు దూరాన.. అయినా తప్పక తిరిగొస్తా ఇంటికి... కానీ, అయ్యో, సంకెళ్లతోనే ఉన్నా కూడా... నా బష్కీర్ ప్రజానీకమా... మా ఇంటివేపు దారంతా... మంచుతో కప్పబడి ఉందికదా!... అయినా, వసంతం తప్పక త్వరలో... వస్తుంది నిజం... దాన్నంతా పూర్తిగా కరిగించడం తథ్యం!... చనిపోలేదు నేనింకా నా... బష్కీర్ ప్రజలారా.... వస్తా తప్పక ఎన్నటికైనా!!!'*

పై కవితా వాక్యాలు సలావత్ అంటే ఏమిటో చెబుతాయి. అవి ఇంకా చెబుతాయి, ఘోరంగా సంకెళ్లు వేసిమరీ జైల్లో ఉంచేంతగా, అతడు చేసిన నేరాన్ని గురించిన ఆనవాళ్లని, ఆ నేరం ఎలాంటిదో, తన ప్రజలకు చెప్పదలచుకున్నది ఏమిటో, అంతేగాక అతడెలా జాతీయ వీరుడయ్యాడో కూడా! చిత్రహింసలూ, దశాబ్దాల తరబడి జైలు నిర్బంధాలూ కూడా అతడి సంకల్పాన్ని మార్చలేకపోయిన సంగతిని సహితం. అయితే విచారించాల్సిందేమిటంటే, ఇన్ని విశిష్టతల కలబోత అయిన సలావత్ యులాయేవ్ గురించిన వ్యక్తిగత వివరాలు అతి కొద్దిగా మాత్రమే తెలియడం! అయితే సంతోషించాల్సిందేమిటంటే, జారిజం రికార్డుల పరంగా తయారు చేసిన అతడి నేరాల చిట్టా ద్వారా, అతడి పోరాట పటిమ గురించి రాతపూర్వకంగా కొన్ని విషయాలైనా తెలియడం, లభిస్తున్న అతడి కవితల ద్వారా అతడి ఆంతరంగ ఆలోచనలూ, ఊహాశక్తి సజీవంగా దొరకడం!

చివరగా పుగాచేవ్ తిరుగుబాటులో బష్కీర్ల చేరిక ప్రాముఖ్యత గురించి

# భావజాల గతితర్కం - సామాజిక చైతన్య దృగ్విషయం-2

*మేధో చరిత్రలో అత్యంత కీలకమైన భావజాల భావనను సరిగా అర్థం చేసుకోకపోవడం వల్ల జరిగిన పొరపాట్లను చూపుతూ, ఆ భావనను వివరిస్తున్నారు* **వెన్నెలకంటి రామారావు**

*(...మే సంచికకు కొనసాగింపు)*

**భావజాలం: కాల్పనికం, శాస్త్రీయం**

**చ**రిత్రలో బల ప్రయోగం (ఫోర్స్), భావజాలం (ఐడియాలజీ) అనే రెండు అంశాలు అన్ని రకాల సామాజిక వ్యవస్థల్లో అత్యంత కీలకపాత్ర పోషించాయి. పాలకవర్గాల ఆధిపత్యం కొనసాగేందుకు గానీ, కొత్త పాలక వర్గాలు చారిత్రక పాత్ర పోషించేందుకు గానీ ఆ రెండు అంశాలూ అత్యంత కీలకమైనవి. అయితే ప్రతి వ్యవస్థలోనూ, చారిత్రక సందర్భంలోనూ ఆ రెండు అంశాలు సమానమైన పాత్రలు పోషించ లేదు. జీవనాధారాల రూపంలో (ఫలవంతమైన నేలా, ధాన్యాలూ, పక్షులూ, చేపలూ తదితర జీవజాలం మెండుగా ఉన్న ప్రాంతాలలో) ప్ర కృతి సంపద ఉన్న చోట వ్యవసాయాధారిత తొలి నాగరిక సమాజాలు వెల్లివిరిసాయి. ఆ తర్వాత శ్రమ సాధనాల రూపంలో ప్రకృతి సంపద (లోహాలు, బొగ్గూ, పెట్రోలియం, గైరా, నౌకాయానం వగైరా) ఉన్న ప్రాంతాలలో మలి నాగరికతలు అభివృద్ధి చెందాయి. తొలి నాగరికత వెల్లి విరిసిన వ్యవసాయాధారిత సమాజాల్లో భావజాలం ప్రధానంగానూ, బలప్రయోగం అప్రధానమైనదిగా, ద్వితీయమైనదిగా పనిచేశాయి. అయితే మలి నాగరికతలు వెల్లివిరిసిన శ్రమ సాధానాల రూపంలో ప్రకృతి సంపద కలిగిన ప్రాంతాల్లోని సమాజాల్లో బలప్రయోగం ప్రధానంగానూ, భావజాలం ద్వితీయైనది, అప్రధానమైన అంశాలుగా పనిచేశాయి. వ్యవసాయాధారిత ఆసియా, లాటిన్ అమెరికా, ఆఫ్రికా – వ్యవసాయాధారిత దేశాల్లో భావజాలం ప్రధానంగానూ, బలప్రయోగం ద్వితీయంగానూ, అప్రధానంగానూ సాగింది. సమాజానికి, పర్యావరణానికి మధ్య గల సమీకరణాల దృష్ట్యా జీవ వైవిధ్యం మెండుగా ఉన్న వ్యవసాధారిత సమాజాల్లో బలప్రయోగంపై కంటే భావజాలంపై ఆధారపడి పాలకవర్గం ఆధిపత్యం కొనసాగించింది. ఈ నేపథ్యంలో ఆసియాటిక్ సమాజాల్లో సామాజిక పాదార్థిక సంబంధాల (ఉత్పత్తి సంబంధాలు, భాషా సంబంధాలు, ప్రాథమిక రూంపలోని కుటుంబ సంబంధాలు) ప్రతిఫలనం ద్వారా ఏర్పడిన భావజాల సంబంధాలు, భావజాల వ్యవస్థలు, భావజాల సంస్థల నిర్మాణం చాలా సంక్లిష్టంగా ఉంటుంది. జీవ వైవిధ్యంతో ముడిపడిన అక్కడి సమాజంలో అతీంద్రియ శక్తుల గురించిన భ్రమలతో ముడిపడిన కాల్పనిక భావజాలం అధికంగా ఉంటుంది. తొలి వ్యవసాయ నాగరిక సమాజ పదార్థిక సంబంధాల ప్రతిఫలనానికి అనుమేయంగా విశ్వాసాలు, కట్టుబాట్లు, సంప్రదాయాలతో కూడిన భావజాలం, భావజాల సంబంధాలు, ఖనవజాల వ్యవస్థలు ఆవిర్భవించేందుకు దోహదం చేసింది. విశ్వాసాలు, కట్టుబాట్లు, సాంప్రదాయాల భావజాల ఆచ్ఛాదనతో ఏర్పడిన భావజాల శ్రమ సంబంధాలు తొలుత వర్ణాలుగా, ఆ తర్వాత (క్రీ.శ. నాల్గవ శతాబ్దంతంలో గ్రీకు, రోమన్ బానిస వ్యవస్థలు అంతరించిన సందర్భంలో) కులాలుగా సమాజంల వ్యవస్థితమయ్యాయి. వర్ణ, కుల వ్యవస్థలు మానవ చారిత్రక అర్థరాహిత్యం (ఆనాటి మత తాత్విక దృక్పథం పునాదిగా) పర్యవసానంగా సాపేక్ష సత్యంగా రూపొందిన భావజాల సంబంధాలు భౌతిక సామాజిక సంబంధాలుగా ఉనికిలో కొనసాగాయి. మతభావ జాల సంబంధాలు, వ్యవస్థల్లో అంతర్భాగమైన కులాన్ని ఉపరితలం అంశంగా పరిగణించడాన్ని అస్తిత్వవాదులు తీవ్రంగా తప్పుపట్టారు. అయితే అలాంటి వైఖరి ఆనాటి భావవాద భావజాల కర్తల అర్థరాహిత్యంతో పాలుపంచుకున్నట్లవుతుంది. అది ఒక సామాజిక పరిణామ క్రమం అది. పాదార్థిక సంబంధమైన వర్గం కంటే, ఆనాటి

---

చరిత్రకారుడు అలెన్ బోడ్జెర్ వాదన ప్రకారం, తిరుగుబాటులో కనుక బష్కిర్లు మమేకం కానట్లయితే, నిర్ణాయకపాత్ర వహించక పోయినట్లయితే తిరుగుబాటు ఆరంభ దినాల్లోనే అంతమయ్యేదని! ఇక తిరుగుబాటులో సలావత్ పాత్ర గురించి ఇంతకు ముందే చెప్పుకున్నట్లు జార్ సైన్యంలోని జనరళ్లు పొత్యోమ్కిన్, పానిన్‌లు తిరుగుబాటు పోరాటానికి సలావత్ ప్రధాన నాయకుడు'గా కీర్తించడం తెలిసిందే!

జారిజం అంతమై, బూర్జువా విప్లవానంతరం బోల్షివిక్ పార్టీ ఆధ్వర్యంలో లెనిన్ నాయకత్వంలో జరిగిన అక్టోబర్ విప్లవానంతరం, బాష్కోర్తొస్తాన్‌ని రిపబ్లిక్‌గా ప్రకటించడమే గాక, సలావత్ యులాయేవ్‌ని బష్కిర్ల జాతీయ నాయకునిగా ప్రకటించారు. అంతేగాక, ఆ రిపబ్లిక్‌లో అతడి పేర పలు జ్ఞాపక చిహ్నాల్ని ఏర్పరచారు. సలావత్ పేరుతో ఒక నగరాన్ని నిర్మించారు. అది నేడు రష్యాలోని పెద్ద నగరాల్లో ఒకటిగా అభివృద్ధి చెందడం గమనార్హం! అంతేగాక, సలావత్ పుట్టిన ప్రాంతాన్ని సలావత్ రీజియన్‌గా పేరు పెట్టారు. అలాగే ఆ రిపబ్లిక్ రాజధాని నగరమైన ఊఫానగరంలో అశ్వధిరూడుడైన సలావత్ విగ్రహాన్ని భారీ సైజులో నిర్మించారు. ఆ అశ్వం దేశంలోని అశ్వ శిల్పాలన్నింటిలో అతిపెద్దది. ఇక విగ్రహం ఎత్తు 10 మీటర్లు. ఈ విగ్రహాన్నే బష్కోర్తొస్తాన్ రిపబ్లిక్ అధికారిక చిహ్నంగా ప్రకటించారు. ఉఫా నగరంలో సలావత్ అవెన్యూ అని, పుగాచేవ్ అవెన్యూ అని పేరుంచారు. అలాగే సలావత్ పేరు రిపబ్లిక్ అధికారిక హాకీ టీమ్‌కు పెట్టారు. సలావత్ పేరుతో రిపబ్లిక్ ప్రభుత్వం ఇచ్చే బహుమతిని ఏర్పాటు చేశారు. 1940లో సలావత్ యులాయేవ్ పేరుతో అతడి పోరాట గాథను చలన చిత్రం నిర్మించారు. దీని దర్శకుడు యాకోవ్ ప్రొతాజనోవ్. 1954లో సంగీతకారుడు జిగిర్ ఇస్మజిలోవ్, కవి బయెజిత్ బిక్‌బేలు కలిసి సలావత్ పేర ఒక ఒపేరాను సృషించారు!

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

మతం, రాజ్యం చారిత్రక అర్థరాహిత్యంతో రూపొందించిన వర్ణం, కుల వ్యవస్థలు అత్యంత సంక్లిష్టమైనవి, శక్తిమంతమైనవి, భౌతికమైనవి. సమాజ పాదార్థిక సంబంధాల ప్రతిఫలనం రెటీనాపై ఏర్పడే ప్రతిబింబంలా తలకిందులుగా ఉంటుంది. ప్రతి పాదార్థిక సంబంధానికి ప్రతిఫలనంగా ఒక భావజాల సంబంధం మనుషుల కార్యకలాపంలో కీలక పాత్ర పోషిస్తుంది. పైకి కనిపించే ప్రపంచమూ ( ప్రకృతి సమాజం), దాని అంతస్సారం రెండూ ఒకటే అయితే విజ్ఞాన శాస్త్రాలు నిరర్థకమైనవి గా మారుతాయని మార్క్ ఒక సందర్భంలో చెప్పారు. పైకి కనిపించే పాదార్థిక ప్రపంచ విషయాలను అర్థం చేసుకుని, వివిధ ప్రాపంచిక విషయాలతో వ్యవహరించేందుకు మనుషులు ఏర్పరచుకునే, రూపొందించుకునే భావ వ్యవస్థను భావజాలం అంటాం. అందువల్ల భావజాలంలో కాల్పనికత ప్రధానంగా ఉంటుంది. అయితే ప్రపంచ అంతస్సారం సామాజిక సంసర్గం ద్వారా మానవ జాతికి క్రమంగా అవగతమయ్యే కొద్దీ భావజాలంలో కాల్పనికత తగ్గుతూ, శాస్త్రీయత చోటు చేసుకుంటుంది. సమాజ చారిత్రక గమనంలో సా మాజిక పాదార్థిక సంబంధాల ప్రతిఫలనం సజీవంగా, వాస్తవికంగా జరిగే వైపుకు మానవజాతి పురోగమిస్తుంది.

భావజాలంపై గతంలో సృజన పత్రికలో పాక్షికమైన చర్చ జరిగింది. త్రిపురనేని మధుసూదనరావు, బాలగోపాల్ తదతరులు భావజాలం భావన గురించి వివరించేందుకు కొంత ప్రయత్నించారు. అయితే వారు భావజాలాన్ని తప్పుడు భావాల వ్యవస్థగా మాత్రమేనని భావించి విశ్లేషించారు కానీ, సామాజిక చలనంలో దాని కీలకపాత్రను గురించి వారు అవగతం చేసుకోలేకపోయిన భావజాలాన్ని సాపేక్ష సత్యంగాను, తప్పుడు చైతన్యం గాను విశ్లేషించారేగానీ మొత్తంగా తృణీకరించలేదని వారు గ్రహించలేదు. వారు ప్రసిద్ధి గావించిన కనీస మాత్రపు అవగాహనను కూడా వివిధ వామపక్ష పార్టీలు, మేధావులు సైతం ఏ మాత్రమూ గ్రహించలేదు సరికదా, భావజా లాన్ని, సిద్ధాంతమని భ్రమపడ్డారు. మలి నాగరికతకు చెందిన పారిశ్రామిక దేశంలో విప్లవోద్యమం నిర్మించిన లెనిన్‌కు భావజాలం గురించి అవసరం లేకపోయి ఉండవచ్చు. అయితే బల ప్రయోగం కంటే భావజాలం ప్రధాన ఆయుధంగా చేపట్టవలసి ఆసియాటిక్ సమాజంలో విప్లవం సాధించిన మావో 'భావజాలం'పై సైద్ధాంతిక కృషి చేయకపోవడం దురదృష్టకరం. వ్యవసాయాధారిత దేశాల్లో భావజాలం ప్రబలంగా ఉన్నప్పటికీ, మావో ఆ భావనను సరిగ్గా పట్టించుకోకపోవడం భవిష్యత్ విప్లవ శక్తులు పక్కదారి పట్టేందు కు దారితీసింది. ఆసియాటిక్ వ్యవసాయ సమాజాల నియంత్రణలో కీలకపాత్ర పోషిస్తున్న భావజాలం పై మావో తగిన కృషి చేయవలసి ఉండింది. దాంతో సంక్లిష్ట భావజాల సంబంధాలు, వ్యవస్థలు, భావజాలం వంటి నిర్మాణంతో కూడిన సమాజం విప్లవాత్మక పునర్నిర్మాణం జరిగేందుకు శాస్త్రీయ భావజాలం అత్యావశ్యకం. కాల్పనిక భావజాలంలోఅసత్యం కాని అవాస్తవికంగా ఉండే భావజాలం, ప్రస్తుత జ్ఞానా భివృద్ధి దశలో సాపేక్షంగా అభివృద్ధి కరమైన పాత్ర పోషించినప్పటికీ, ఆ తర్వాతి ప్రజ్ఞాన కృషి పర్యవసానంగా అది తప్పుడు సూత్రీకరణం – మారొచ్చు.

**'విశ్వజనీనత'కు విఘాతం**

పెట్టుబడిదారీ విప్లవం వరకూ గడచిన విప్లవాలన్నీ సద్యోజనిత విప్లవాలుగానూ లేదా సద్యోజనిత చరిత్ర నిర్మాణ రూపంలో ఉన్నాయి. ప్రతి వ్యవస్థలోనూ ఉనికిలో ఉన్న పాలకవర్గాన్ని పక్కకు తోసి, దాని స్థానంలోకి రాబోయే, చారిత్రకంగా విప్లవానికి సారథ్యం వహించే వర్గ శక్తుల ప్రయోజనాల కేంద్రంగా రూపొందే భావజాలం ఆ సమాజంలోని అణగారిన వర్గాల ఆశల్ని, ఆకాంక్షలను నెరవేర్చగలదనే భ్రమను కలిగిస్తుంది. ఇలా రాబోయే పాలకవర్గ తరం ముందుకు తీసుకొచ్చిన నినాదాలు, ప్రజాస్వామిక ఆకాంక్షలు సమకాలీన అణగారిన వర్గాల ఆకాంక్షలుగా, అభిప్రాయాలుగా మారే ప్రక్రియే భావజాలం. ఈ నేపథ్యంలో భావజాలం అనేది పాలకవర్గానికి వ్యతిరేకంగా భవిష్య పాలకవర్గ తరం సారథ్యంలో సకల జనావళి ఆకళింపు చేసుకున్న సాపేక్ష సత్యం లేదా తప్పుడు చైతన్యంతో రూపొందిన భావాల వ్యవస్థ... భావజాలం లేనిదే ఎలాంటి విప్లవాత్మక పునర్నిర్మాణం సాధ్యం కాదు. అంటే సమాజంలో వాన్ గార్డ్ గా ఉన్న వర్గానికి అనుకూలంగా మిగిలిన అన్ని వర్గాల ప్రజల ప్రయోజనాలను ప్రతిఫలిస్తున్నట్లు కనిపించే భావజాల వ్యవస్థ సమాజపురోభివృద్ధికి అత్యవసరం. సమకాలీన పాలకవర్గానికి వ్యతిరేకంగా పోరాడే ప్రజల మధ్య ఐక్యతకు అది ఒక షరతు. వాన్‌గార్డ్ భావజాలం లేకుండా పాలకవర్గానికి వ్యతిరేకంగా సబ్బండ వర్గాల ఐక్యత సాధ్యం కాదు. సమగ్ర సామాజిక విప్లవం విజయవంతం కావాలంటే సమకాలీన వాన్ గార్డ్ సెక్షన్ సారథ్యంలో సాగవలసిన సబ్బండ వర్ణాల, వర్గాల ఐక్య సంఘటనతో కూడిన భావజాల సంస్థలు, వ్యవస్థల నిర్మాణం అవసరం. అయితే వివిధ సామాజిక వర్గాల మధ్య ఐక్యత సాధించే భావజాల క్రమం రూపుదిద్దుకునేందుకు పాలకవర్గాలు విఘాతం కలిగిస్తున్నాయి. నిర్దిష్ట వర్గ భావజాలం, ఇతర అణగారిన వర్గాలన్నిటి ఆశలు, ఆకాంక్షలుగా భావించే విశ్వజనీన భావజాలంగా మారే క్రమానికి గండి కొట్టేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి.

సబ్బండవర్గాల ప్రజానీకాన్ని ఐక్యంచేసి పాలకవర్గంతో పోరాడేందుకు అవసరమైన భావజాలాన్ని బలహీనంచేసే లక్ష్యంతో సమస్త అస్తిత్వాలకు విడి విడి భావజాలాలను రూపొందించి, అందుకు అనుగుణంగా అస్తిత్వవాద ఉద్యమాలను నిర్మిస్తున్నాయి, ప్రోత్సహిస్తున్నాం. వివిధ అస్తిత్వవాద ఉద్యమాలు పైకి చూసేందుకు అభివృద్ధికరమైనవిగా కనిపించినా, ఆచరణలో అవి సమగ్ర సామాజిక విప్లవం విజయవంతం కావడానికి అవసరమైన "విశ్వజనీనత క్రమాన్ని (భావజాల నిర్మాణాన్ని అడ్డుకుంటున్నాయి, నిరోధిస్తున్నాయి. అయితే వర్గదృక్పథంతో కూడిన అస్తిత్వ ఉద్యమాలు ఒక శక్తివంతమైన భావజాల ఆయుధం రూపకల్పనకు దోహదం చేస్తాయి. అస్తిత్వ ఉద్యమం తప్పుకాదు. సమగ్ర సామాజిక విముక్తి భావజాలాన్ని అడ్డుకునే అస్తిత్వవాదం లేదా అస్తిత్వవాద ఉద్యమాలు అపసవ్య చారిత్రక పాత్రను పోషిస్తాం. విముక్తి భావజాలం, తదనుగుణమైన భావజాల సంస్థల ఆవిర్భావాన్ని విడి విడి అస్తిత్వవాద ఉద్యమాలు అడ్డుకోవడం వల్ల సమాజంలో సమూల ప్రజాస్వామిక ఉద్యమాల పురోగతికి గండి పడుతుంది. చరిత్ర పురోగతికి దోహదపడే భావజాలం, భావజాల సంస్థలు, వ్యవస్థల నిర్మాణం సవ్యంగా సాగితేనే అణగారిన వర్గాల, అస్తిత్వాల విముక్తి సాకారమవుతుంది.

**భావజాలం అంతం కాదు, అంతర్ధానం**

సార్వత్రిక సంక్షోభంలో కూరుకుపోయి విలవిల్లాడుతున్న ప్రపంచ ఆర్థిక వ్యవస్థను నిలబెట్టుకునేందుకు కార్మికవర్గం సారథ్యంలో సకల సబ్బండ వర్గాలు, అస్తిత్వాల ఐక్యతను కార్మికవర్గ భావజాలం ద్వారా సాకారం కావడాన్ని అడ్డుకునేందుకు ప్రపంచ పాలకవర్గాలు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. అందుకు వివిధ అస్తిత్వ వాదాలను, విడి విడి అస్తిత్వవాద భావజాలాలను, సంబంధిత ఉద్యమాలను రంగంపైకి

తీసుకొచ్చాయి లేదా ప్రోత్సహిస్తున్నాయి. దాంతో కార్మిక వర్గం సారథ్యంలో సకల అణగారిన వర్గాల, అస్తిత్వాల ప్రయోజనాలను ప్రతిఫలించే ఉమ్మడి భావజాలం రూపొందే క్రమానికి ప్రపంచవ్యాప్తంగా గండి పడింది. విడి విడి అస్తిత్వాల ప్రయోజనాలను ఒంటరిగా సాధించే లక్ష్యంతో కూడిన శకల భావజాల వ్యవస్థలు, సంస్థలు అంతర్జాతీయంగా ప్రబలంగా విస్తరించాయి. విభిన్న వర్గాలు, అస్తిత్వాలకు ఒకే సమగ్ర భావజాలం అవసరం లేదని, శకల భావజాలాలతో విడివిడిగా సాగే అస్తిత్వ ఉద్యమాల వల్లే ఆయా నిర్దిష్ట అస్తిత్వ ప్రజానీకానికి మేలు జరుగుతుందన్న వాదన ముందుకొచ్చింది. గతంలో (శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాలు, భావజాల సంస్థలు, ఉద్యమాలు ఉనికి లోకి రాకపూర్వం) చారిత్రకంగా నాయకత్వం వహించిన ఉనికిలో ఉన్న చారిత్రక వరుస క్రమంలో ఉద్యమిస్తున్న పాలకవర్గ ప్రయోజనాల రహస్య ఎజెండా కింద రూపొందిన భావజాలం తో మమేకమై ఉద్యమించిన ఇతర అణగారినవర్గాలు, అస్తిత్వాల ప్రయోజనాలు అణగదొక్కబడ్డాయి. విప్లవానంతరం నాయకత్వం వహించిన పాలక వర్గానికి మాత్రమే అలాంటి భావజాలం వల్ల మేలు జరిగింది. ఈ నేపథ్యంలో ఉమ్మడి భావజాలం కంటే శకల భావజాలాలు, ఉద్యమాలు వల్లనే ఆయా నిర్దిష్టవర్గాలు తమ ప్రయోజనాలను నెరవేర్చుకునే అవకాశముందనే పోస్ట్ మాడరిస్టు (ఆధునికాంతర వాదులు) వాదనలు ప్రబలంగా ముందుకొచ్చాయి. ఈ నేపథ్యంలో 'భావజాలాల అంతం' అనే నినాదాన్ని అంతర్జాతీయంగా పోస్ట్ మాడర్నిస్టు (ఆధునికానంతరవాదం) మేధావులు చేపట్టారు.

భావజాలాలను అంతం చేయలేం కానీ, అంతర్ధానమయ్యే క్రమాన్ని సుగమం చేయగలం. ఎందుకంటే భావజాలాల పునాదిగా, వాటి సారథ్యంలో నడిచే సమాజంలో వాటిని అంతం చేయడం సాధ్యం కానే కాదు. అయితే అందుకోసం సామాజిక పదార్థిక/వస్తుగత సంబంధాల భ్రమాత్మక లేదా సాపేక్ష సత్యం రూపంలోని ప్రతిఫలనంగా ఆవిర్భవించి, సామాజిక వ్యవస్థ పటిష్టతకు/మార్పుకు సాధనమైన భావజాలం స్థానంలో వాస్తవ ప్రతిఫలనం రూపంలోని భావజాలాన్ని తీసుకురాగలిగాలి. దాంతో సామాజిక చైతన్యపు ప్రజ్ఞాన (సిద్ధాంతరం), భావజాల పార్శ్వాలు రెండూ పరస్పరం అంతర్భాగీకరణకు (ఇన్ కార్పొరేషన్) గురై తప్పుడు చైతన్యంగా నిలిచే భావజాలం పరిసమాప్తవ అవుతుంది, లేదా అంతర్ధానమవుతుంది. కార్మిక వర్గ దృక్పథం కేంద్రంగా సమాజంలోని అణగారిన వర్గాల, అస్తిత్వాల విముక్తికి బాటలు వేసే కార్మిక వర్గ భావజాలం మాత్రమే సమాజ పాదార్థిక సంబంధాలను సవ్యంగా ప్రతిఫలించి, అందుకు తగిన శాస్త్రీయ భావజాల సం స్థలు, వ్యవస్థల ఆవిర్భావానికి దోహదం చేస్తుంది. భౌతికవాద గతితర్క దృక్పథంతో నిర్మించే వివిధ వర్గ, అస్తిత్వ సంస్థలు, పార్టీలు, ప్రజా సంఘాల నిర్మాణం ద్వారా సామాజిక చైతన్యంలోని ప్రజ్ఞాన పార్శ్వానికి (సిద్ధాంతానికి), భావజాల పార్శ్వానికి మధ్యనున్న వైరుధ్యాన్ని పరిష్కరించేందుకు వీలవుతుంది. శాస్త్రీయ సామాజిక సిద్ధాంతానికి అనుగుణమైన వర్గ, అస్తిత్వ సంస్థల నిర్మాణం ద్వారా సమాజ పాదార్థిక సంబంధాలకు నిజ ప్రతిఫలనాలుగా ఆ భావజాల సంస్థలు నిలుస్తాయి. సిద్ధాంతానికి-భావజాలానికి ఉన్న వైరుధ్యం చారిత్రకంగా పరిష్కారమయ్యేందుకు మార్గం సుగమమవుతుంది. పర్యవసానంగా సమాజంలో తప్పుడు చైతన్యంతో ఏర్పడిన భావజాల సంబంధాలు, భావజాల సంస్థలు క్రమంగా అంతర్ధానమవుతాయి.

సమాజంలోని వివిధ అణగారిన వర్గాలు, అస్తిత్వాల ఆశలు, ఆకాంక్షలను ప్రతిబింబించే భౌతికవాద గతితార్కిక దృక్పథంతో రూపొందే శాస్త్రీయ భావజాలం, సంబంధిత సంస్థలు, వ్యవస్థలు సమగ్ర సామాజిక విప్లవాన్ని విజయవంతం చేయగలవు. అందుకు తగినట్లు భౌతికవాద గతితర్క దృక్పథం గల రాజకీయ పార్టీలు, వాటి ప్రజాసంఘాల నిర్మాణాలను పునర్నిర్వచించుకోవలసి ఉంటుంది. రాజకీయ పార్టీలు, వాటి ప్రజా సంఘాల నిర్మాణాలన్నీ కూడా భావజాల సంస్థలే. ఈ భావజాల సంస్థలు తమ సిద్ధాంతాన్ని భావజాలంగా మార్చి, ప్రజా ఉద్యమాలకు, విప్లవానికి నాయకత్వం వహించాల్సిన కేంద్రాలుగా పనిచేయాలి. అలాంటిది దేశంలోని వామపక్ష పార్టీలకు, వాటి ప్రజా సంఘాలకు తాము విప్లవ భావజాల ఉత్పత్తి-పునరుత్పత్తి కేంద్రాలుగా పనిచేయాలనే ఎరుక పట్ల స్పష్టత లేకపోవడం దురదృష్టకరం. రాజకీయ పార్టీ, కార్మిక, విద్యార్థి, యువజన, మహిళా, సాహిత్యం, కళలు తదితర రంగాలకు చెందిన ప్రజా సంఘాలన్నీ సంబంధిత రంగంలో ప్రజ్ఞాన లేదా సైద్ధాంతిక కృషిని చేపట్టడమే కాక, ఆ సిద్ధాంతాన్ని తమ శ్రేణులకు, ప్రజానీకానికి భావజాలంగా అందించవలసిన కర్తవ్యాన్ని నెరవేర్చవలసి ఉంటుంది. ఈ రెండు రకాల కృషిని ప్రస్తుతం ఉనికిలో ఉన్న సంస్థలు, పార్టీలు అసలే చేయడంలేదని అర్థం చేసుకోకూడదు. అయితే ఇంటర్నెట్ తదితర ఆధునిక కమ్యూనికేషన్లు ప్రజల ఆత్మిక జీవితాలను పెద్ద ఎత్తున ప్రభావితం చేస్తున్న తరుణం లో సైద్ధాంతిక కృషి, సిద్ధాంతాన్ని భావజాలంగా మార్చే కర్తవ్యాన్ని నెరవేర్చడంలో మరింత నైపుణ్యం సంతరించుకోవలసి ఉంది. ఈ కర్తవ్య నిర్వహణ వాసిలోను, రాశిలోను మునుపెన్నడూ లేనంతగా బ్రహ్మాండమైన స్థాయికి చేరుకోవడంతో పార్టీ/ ప్రజా సంఘాల నిర్మాణాల్లో అ ందుకు అనువైన పనివిభజనతో కూడిన సంస్కరణలు తక్షణం చేపట్టాలి. ఈ నేపథ్యంలో పార్టీల్లోనూ, వివిధ రంగాలకు చెందిన ప్రజాసం ఘాల్లోనూ సైద్ధాంతిక కృషిని సాగించే సిద్ధాంతవేత్తలను, సిద్ధాంతాన్ని భావజాలంగా మలచే కర్తవ్యాన్ని నెరవేర్చే భావజాల కర్తలను సబ్ క మిటీలుగా వివిధ స్థాయిల్లో ఏర్పరచి వాటి మధ్య సమన్వయం తీసుకురావలసిన అవసరం ఉంది. భౌతికవాద గతితర్క తాత్వికతను సకల అణగారిన వర్గాల విముక్తి భావజాలంగా మలచి ప్రజలకు అందించవలసిన చారిత్రక కర్తవ్యాన్ని భావజాల సంస్థలైన పార్టీ, ప్రజాసంఘాలు యుద్ధ ప్రాతిపదికన చేపట్టవలసిన తరుణమిది.

*as philosophy finds its its material weapons in the proletariat, so the proletariat finds its spiritual weapons in philosophy. — Marx Engels; Collected Works, Vol.3 Moscow edition p..187*

*(అయిపోయింది)*

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

**రామతీర్థ కన్నుమూత**

ప్రముఖ రచయిత, అనువాదకులు యబలూరు సుందర రాంబాబు (రామతీర్థ) మే 30న విశాఖపట్నంలో గుండెపోటుతో మరణించారు. రామతీర్థ నెల్లూరు జిల్లా అలగానిపాడులో జన్మించారు. ప్రాథమిక విద్య ఒడిశాలో, ఇంటర్, బిఏ నెల్లూరులో చదివారు. 1981లో పారాదీప్‌లో పోర్టు ట్రస్టుకు సంబంధించిన కార్మిక రక్షణ శాఖలో పనిచేశారు. 1985లో విశాఖకు బదిలీపై వచ్చి, అక్కడే స్థిరపడ్డారు. 2003లో 'మొజాయిక్' సంస్థను స్థాపించారు. తొలుత పత్రిక రూపంలో ఉండే ఇందులో ఆంగ్ల అనువాదాలు, ప్రముఖ రచయితల రచనలు ప్రచురించేవారు. కొంతకాలానికి దీన్ని సాహిత్య సంస్థగా రిజిష్టర్ చేయించారు. ప్రతి సోమవారం 'మండే మొజాయిక్' పేరుతో సాహిత్య కార్యక్రమాలు నిర్వహించేవారు.

# డేవిడ్ హార్వే: పెట్టుబడి - 7 ప్రధాన వైరుధ్యాలు

***పెట్టుబడిదారీ వ్యవస్థ తనలోని పదిహేడు అంతర్ వైరుధ్యాల వల్ల పతనం దిశగా పయనిస్తుందని డేవిడ్ హార్వే చేసిన విశ్లేషణలోని ఏడు ప్రాథమిక వైరుధ్యాలను వివరిస్తున్నారు* రమేష్ పట్నాయక్**

*(...గత సంచిక తరువాయి భాగం)*

డేవిడ్ హార్వే, 'పెట్టుబడిదారీ వర్గ సేవలో రాజ్యం విస్తారమైన వ్యవహారాలు నిర్వహించవలసి ఉంటుందని, వాస్తవంగా కూడా రాజ్యం విస్తృతమైన, తీవ్రమైన వ్యవహారాలు నిర్వహిస్తుంద'ని వివరించాడు. 'రాజ్యం ఎ) పెట్టుబడిదారులందరికీ అవసరమైన జాతీయ రహదారులు, రైల్వేలు నియంత్రించాలి; బి) ప్రైవేటు ఆస్తులను పరిరక్షించడమే కాకుండా వివిధ వాణిజ్య సంస్థల మధ్య వ్యక్తులకు మధ్య ఒప్పందాలను ఏ ఒక్కరు ఏక పక్షంగా ఉల్లంఘించకుండా, అవసరమైతే బలప్రయోగం చేసి అవి అమలు అయ్యేటట్లు చేయాలి; సి) ప్రైవేటు పరిశ్రమలు వాతావరణాన్ని విధ్వంసం చేస్తాయి. కాని పర్యావరణ పరిరక్షణ, పునరుద్ధరణ కోసం సమిష్టి తరపున ప్రభుత్వం పనిచేయవలసి ఉంటుంది; డి) పెట్టుబడి ప్రయోజనాలను విస్తరించడానికి దౌత్యం, యుద్ధరంగాలను నిర్వహించ వలసి ఉంటుంది; ఇ) ప్రభుత్వాన్ని నిర్వహించడానికి బల ప్రయోగం చేయాలి, పోలీసు, మిలటరీ వ్యవస్థలను నిర్వహించాలి; యఫ్) వీటన్నింటికి మించి మార్కెట్ విఫలమైనప్పుడు ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రజా ధనాన్ని వ్యయం చేయవలసి ఉంటుంది. – వీటన్నింటికి డబ్బులు కావలసి ఉంటుంది. అందుకు అందరి నుంచి (పెట్టుబడిదారుల నుంచి మాత్రమే కాక ప్రజలందరి నుంచి) పన్నులు వసూలు చేయవలసి ఉంటుంద'ని డేవిడ్ హార్వే వివరిస్తాడు. కార్మికుల సమ్మెల విషయంలో, విస్తాపన, ఇతర ప్రజా ఉద్యమాల విషయంలో ప్రభుత్వాలు పెట్టుబడిదారుల తరపున చట్ట బద్ధంగా, అత్యధిక సందర్భాలలో, చట్ట విరుద్ధంగా కొమ్ముకాయడం అందుకై బలప్రయోగం చేయడం అనే ప్రధానమైన విషయాన్ని రచయిత ఎందుకో విడిచి పెట్టేశాడు. అయినా రచయిత రాజ్యం వాచ్‌మన్ పాత్రను మాత్రమే పోషిస్తుందన్న శుష్క వాదనలను తూర్పారబట్టాడు. 'ప్రపంచ అవనిక మీద జరిగే ప్రాదేశిక రాజకీయ ఘర్షణలు, ప్రాదేశిక ఆర్థిక ఘర్షణలలో స్వదేశీ పెట్టుబడిదారీ ప్రయోజనాలను కాపాడడానికి యుద్ధ యంత్రాంగాన్ని నిర్వహించడంలో రాజ్యం పెట్టుబడిదారీపూర్వ, పెట్టుబడిదారీ వ్యవస్థలలో తానే సర్వస్వంగా ఉండడం తెలిసిన విషయమే. 'రాజ్యం ఒక నైట్ వాచ్‌మన్ కాదని ఒక కరుకైన భారీ యుద్ధ యంత్రాంగమని' డేవిడ్ హార్వే విశ్లేషించి చూపాడు. డేవిడ్ హార్వే 'పెట్టుబడిదారీ ప్రయోజనాల కోసం రాజ్యం చేసే యుద్ధాల వలన విదేశీ వ్యవహారాలలో ఒనగూడిన ప్రయోజనాలను పెట్టుబడిదారులకు కట్టబెట్టడమేగాక, దేశీయ రంగంలో కూడా ప్రభుత్వాన్ని నడిపే నాయకులను, ఆ నాయకుల దగ్గరగా నున్న సెక్షన్లను, వ్యక్తులను మరింత ధనికంగా మరింత పలుకుబడి కలిగిన వారిగా పెంపొందిస్తుందని' వివరించారు. మొత్తంపైన రాజ్యం వాచ్‌మన్ మాత్రమే కాదని రచయిత అనేక వివరాలతో చూపించాడు.

డేవిడ్ హార్వే పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రజాస్వామ్యానికి 'సహజమైన సంబంధం' లేదంటాడు. 'ఏ దేశంలోనైనా ప్రజాస్వామిక హక్కులు ఏ స్థాయిలోనైనా ఉన్నాయంటే దానికి కారణం ఆయా దేశాలలో జరిగే రాజకీయ పోరాటాలేన'ని రచయిత ప్రతిపాదించాడు. ప్రజలు పోరాడకుండా పెట్టుబడిదారులు ఏ హక్కును తమకు తాముగా ప్రజలకివ్వరు అన్న విషయంలో మనం హార్వేతో అంగీకరిస్తాం. అయితే ఆధునిక పరిశ్రమలు రాకముందు, పెట్టుబడిదారీ వ్యవస్థ స్థాపనకు ముందు ఎంత పోరాడినా భూస్వామ్య ఎస్టేట్ వ్యవస్థలో ప్రజాస్వామిక హక్కులు వచ్చి ఉండేవి కావనేదే చరిత్ర విశ్లేషణలో ప్రధానమైన విషయం. ఈ విషయం రచయిత గుర్తించినట్లు కనిపించదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజాస్వామిక హక్కులు ఒక సంభావ్యత, అయితే పోరాటం ద్వారా మాత్రమే వాటిని వాస్తవీకరించుకోగలం. పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ప్రజాస్వామ్యానికి ప్రాతిపదికలను ఏర్పాటుచేస్తాయి. పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో అట్టి ప్రాతిపదికలు ఉండవు. ఇక, పెట్టుబడిదారీ వ్యవస్థ అనుమతించగల ప్రజాస్వామ్యం రాజకీయ, సాంస్కృతి రంగాలకు మాత్రమే పరిమితం. ఆర్థిక రంగంలో సమానత్వాన్ని అది అంగీకరించదు. ఆర్థిక రంగంలో సమానత్వం లేకపోవడంతో రాజకీయ, సాంస్కృతిక సమానత్వపు హక్కులు తమ అమలులో అనేక అడ్డంకులు ఎదుర్కొంటాయి. ఎంత డబ్బు ఉంటే అంత ప్రజాస్వామ్యం. ఇక ఆర్థిక రంగంలో సమానత్వం కోసం చేసే పోరాటాలను, బూర్జువాయేతర ప్రైవేటు ఆస్తిని కాపాడడం కోసం జరిగే పోరాటాలను, అంటే విస్తాపన వ్యతిరేక పోరాటాలను, ఇంకా మార్కెట్ వ్యతిరేక పోరాటాలను వ్యవస్థకు వ్యతిరేకమైన పోరాటాలుగా పాలక వర్గం పరిగణిస్తుంది, వాటిని పూర్తిగా అణిచివేయాలని చూస్తుంది. ఆ పోరాటాలను అభివృద్ధి వ్యతిరేకమని ఇంకా దేశద్రోహం అని అంటుంది. అటువంటి పోరాటాలను అణచివేయడానికి అవసరమైతే ఫాసిజాన్ని తీసుకువస్తుంది. వ్యవస్థ మారుతున్న అవసరాలకు లోబడిన వారికి రాజకీయ, సాంస్కృతిక హక్కులు ఉంటాయి. వ్యవస్థ మారుతున్న అవసరాలను వ్యతిరేకించే వ్యక్తులకు, సంస్థలకు ఆ హక్కులు కూడా ఉండవు. అలా హక్కులు నిరాకరించబడాన్ని చూపి ఇది పెట్టుబడిదారీ వ్యవస్థకాదు అని ఎవరైనా అంటే వారికి పెట్టుబడిదారీ వ్యవస్థ సారం తెలియదని చెప్పాలి. ఇక రచయిత విషయానికి వస్తే, పెట్టబడిదారీ వ్యవస్థలో సాధించగల హక్కులకు, మార్పులకు ఒక చారిత్రకమైన పరిమితి ఉన్న విషయం గుర్తించడంలో హార్వే పూర్తిగా విఫలమైనాడని తెలుసుకోవడానికి మనం ఈ అధ్యాయం చివరి వరకు ఆగాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రజాస్వామిక హక్కులకు ప్రాతిపదికలను కల్పిస్తుంది, అలాగే ఆ ప్రాతిపదికలు పరిమితమైనవి – ఈ రెండు విషయాలను కూడా రచయిత గుర్తించలేదనిపిస్తున్నది.

యుద్ధ పరిణామాలను వివరిస్తూ యుద్ధం రాజ్యానికి ద్రవ్య పెట్టుబడికి మధ్య గట్టి సంబంధాన్ని ఏర్పాటు చేస్తుందని రచయిత చెప్తాడు. 'యుద్ధ ఖర్చుల కోసం లండన్ మర్చెంట్స్ అసోసియేషన్ ఇంగ్లాండు ప్రభుత్వానికి పెద్ద ఎత్తున ఋణమిచ్చింది. ఆ సందర్భంగా ప్రభుత్వం నుంచి ఒక హక్కు పత్రాన్ని పొందింది. ఆ విధంగా పొందిన హక్కుపై ఆధారపడి 1694లో బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండును స్థాపించి దాని ద్వారా డబ్బు వ్యవస్థపై ఏకస్వామ్య అధికారాలు పొందింది. ఈ బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండు అనంతర కాలంలో అన్ని పెట్టుబడిదారీ దేశాలకు మోడల్ అయిపోయింద'ని రచయిత పేర్కొంటాడు. బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండు 1964లో జాతీయం చేయబడింది. అన్ని దేశాలలో సెంట్రల్ బ్యాంకులు (అమెరికాలో ఫెడరల్ బ్యాంకు, మన దేశంలో రిజర్వ్ బ్యాంకు) ట్రెజరీ డిపార్ట్‌మెంట్‌తో సహసంబంధంలో ఉంటాయి. 2008 నాటి అమెరికా సబ్ ప్రైమ్ సంక్షోభంలో వాణిజ్య బ్యాంకులను రక్షించడానికి ఫెడరల్ బ్యాంకు బిలియన్ డాలర్లు ఎత్తిపోసింది (పంప్‌చేసింది). అందుకు ట్రెజరీ సహకరించింది. వాణిజ్య బ్యాంకులే కాదు ఫెడరల్ బ్యాంకు కూడా ఇళ్లు కోల్పోయి రోడ్డుమీద పడిన వారిని పట్టించుకోలేదు. అన్ని దేశాలలో సెంట్రల్ బ్యాంకులు ప్రధానంగా పెట్టుబడిదారీ వర్గ సేవలోనే మునిగి తేలుతూ ఉంటాయి.

ఇతర విధులతోపాటు నోట్ల విలువను కాపాడ వలసిన బాధ్యత కూడా ప్రభుత్వంపై ఉంది. అందులో ట్రెజరీ ముద్రించిన నోట్లను ఎవరూ తిరస్కరించకుండా చూడడం మొదటిది. అందుకే ట్రెజరీ ముద్రించిన నోట్లను లీగల్ టెండర్ అంటారు. ఈ సమస్య సాధారణంగా తలెత్తదు. ఇక రెండవ విషయం, ట్రెజరీ ఆదేశం లేకుండా ఎవరూ నోట్లు ముద్రించకూడదు. సరళంగా చెప్పాలంటే దొంగనోట్ల ముద్రణ జరగకుండా చూడాలి. దొంగనోట్ల ముద్రణ ఎంతమేరకు నియంత్రించ బడుతుందో పాఠకుడికి తెలుసు. నోట్ల చలామణి విషయం పరిశీలిస్తే, ఒక దేశంలో ఎంత విలువ గలిగిన నోట్లు చలామణిలో ఉండాలన్న విషయంలో ఆ దేశపు సెంట్రల్ బ్యాంకు నిర్ణయం చేస్తుంది. సెంట్రల్ బ్యాంకుకు వాణిజ్య బ్యాంకుల వద్ద ఉండగల డబ్బును నియంత్రిస్తుంది. డబ్బు చలామణి తగ్గించాలంటే సెక్యూరిటీలు అమ్మి కరెన్సీ తీసుకుంటాయి. చలామణి పెంచాలంటే సెక్యూరిటీలను వెనక్కి కొని కరెన్సీ ఇస్తుంది. వివిధ దేశాలలో సెంట్రల్ బ్యాంకులకు స్వతంత్ర ప్రతిపత్తి ఉంది. ఈ గొప్ప మాటకు అర్థం ఏమంటే ఈ సెంట్రల్ బ్యాంకులు ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాల మాట విననవసరం లేదని, తను స్వయంగా నిర్ణయాలు తీసుకోవచ్చని, అయితే అత్యధిక సందర్భాలలో వాణిజ్య బ్యాంకులకు అనుకూలమైన నిర్ణయాలనే ఈ సెంట్రల్ బ్యాంకులు తీసుకుంటాయి. అమెరికాలో సెంట్రల్ బ్యాంకును ఫెడరల్ బ్యాంకు అంటారన్న విషయం తెలిసిందే. అమెరికా ప్రభుత్వం తరపున అధికారం చలాయించే ఫెడరల్ బ్యాంకు ప్రభుత్వం మాట విననవసరం లేకపోవడాన్నే రాజ్యాధికారాన్ని కాంట్రాక్టుకు ఇవ్వడం అన్నాడు డేవిడ్ హార్వే. నోట్ల చలామణిపై రాజ్యాధికారాన్ని కాంట్రాక్టుకు ఇవ్వడం ద్వారా నోట్ల విలువను రక్షించడం అన్న కర్తవ్యం బూజు పడుతుందన్నాడు డేవిడ్ హార్వే.

ద్రవ్య వ్యవహారాలలో అమెరికాకు ఒక ప్రత్యేక సౌకర్యం ఉంది. అంతర్జాతీయ వాణిజ్యం విస్తారంగా ఉన్న ప్రస్తుత పరిస్థితులలో అమెరికా డాలర్ అంతర్జాతీయంగా చలామణి అవుతుంది. వివిధ దేశాల మధ్య ఎగుమతుల, దిగుమతుల సంబంధమైన చెల్లింపులు, ఋణాల చెల్లింపులు, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి, ఇతర బహుళజాతి బ్యాంకుల లావాదేవీలు అమెరికన్ డాలర్లలో జరుగుతున్నాయి. అమెరికా అనేక సందర్భాలలో అదనపు నోట్లను ముద్రిస్తుంది. ప్రపంచ స్థాయిలో పెద్ద ఎత్తున ఉన్న డాలర్ నిల్వల వలన డాలర్ విలువ చాలా స్వల్పంగా మాత్రమే తగ్గుతుంది. డాలర్లలో నిల్వలు గల దేశాలన్నీ ఆ మేరకు నష్టపోతాయి. అదనంగా ప్రింటయిన డాలర్లు అమెరికా చేతిలో ఉంటాయి. ఈ సౌకర్యం ఇతర దేశాలకు లేదనేది తేటతెల్లమే. డేవిడ్ హార్వే 'ప్రపంచ డబ్బు వ్యవస్థపై అమెరికాకు ఉన్న ఆధిపత్యం అంటే, అంతర్జాతీయ ద్రవ్యమైన డాలర్లను ప్రింట్‌చేసే అధికారం అమెరికాకు ఉండడం, ప్రపంచంపై అమెరికా అధిపత్యం నిలబడడానికి కారణంగా ఉంది. అమెరికా అతిగా చేసే యుద్ధ ఖర్చుల కోసం అవసరమైన ధనాన్ని డాలర్ల అదనపు ప్రింటింగ్ ద్వారా సమకూర్చుకోగలుగుతుంంద'ని అంటాడు. డేవిడ్ హార్వే చెప్పింది మనం కళ్లారా చూసే విషయమే! డాలర్‌లను అదనంగా ముద్రిస్తూ ఆ నిధులతో యుద్ధాలు చేస్తూ అమెరికా తన ఆధిపత్యాన్ని ప్రపంచంలో నిలబెట్టుకుంటుంది. అదనపు డాలర్‌లు అమెరికా ముద్రించిన ప్రతిసారీ డాలర్ విలువ ఆ మేరకు తగ్గుతుంది. డాలర్ విలువ ఒక శాతం తగ్గిందనుకుంటే భారత్‌దేశం వద్ద ఉన్న రెండువందల బిలియన్ డాలర్ల ఫారెక్స్ విలువలు ఒక శాతం తగ్గినట్లే లెక్క. అంటే అమెరికా యుద్ధ ఖర్చులు భారత్ అదే విధంగా ప్రపంచ వ్యాప్తంగా ఇతర దేశాలు భరిస్తున్నట్లు లెక్క. అయితే అన్ని దేశాలు ఎందుకు ఒప్పుకుంటున్నాయి? సామ్రాజ్యవాద దేశాలకు అమెరికా నాయక దేశం. ప్రపంచంలో సామ్రాజ్యవాదం నిలబడాలంటే మార్కెట్ వ్యవస్థకు వ్యతిరేకంగా తలెత్తిన ప్రతి దేశంపై యుద్ధం చేస్తూ ఉండాలి. అందుకే సామ్రాజ్యవాద దేశాలు (పశ్చిమ ఐరోపా, ఆస్ట్రేలియా, జపాన్) అమెరికా యుద్ధాలను అందుకు ఖర్చయ్యే డాలర్ల అదనపు ముద్రణను మౌనంగా అనుమతిస్తాయి. మిగిలిన దేశాలు వ్యతిరేకించినా ప్రయోజనం లేదు. మొత్తంగా చెప్పుకోవాలంటే, అమెరికా రాజకీయ రంగంలో (యుద్ధరంగంలో) తన ఆధిపత్యం కారణంగానే డాలర్‌లను అదనంగా ముద్రించగలుగుతున్నది. డాలర్‌లను ముద్రించి యుద్ధాలు చేయగలుగుతున్నది కనుకనే రాజకీయంగా తన ఆధిపత్యాన్ని కొనసాగించగలుగుతున్నది. రాజకీయ, ఆర్థిక స్తోమతలు పరస్పరం పూరకంగా ఉన్నాయి. చెప్పుకోవలసిన విషయం ఏమంటే నోట్ల విలువకు గ్యారంటీ ఇవ్వవలసిన రాజ్యమే నోట్ల విలువను తారుమారు చేస్తున్నది. ఫెడరల్ బ్యాంకు ద్వారా నోట్ల చలామణిని కాంట్రాక్టుకివ్వడం, ఆపైన డాలర్ల ముద్రణలో అమెరికాకు ఉన్న అనుచితమైన స్వేచ్ఛ వంటి విషయాలు 'రాజ్యం నోటు విలువను కాపాడడం అన్న భావనకు విరుద్ధమైనవని' డేవిడ్ హార్వే అంటాడు.

డేవిడ్ హార్వే 'ఒక దేశ ప్రభుత్వం వామపక్షం చేతిలోనికి, సోషల్ డెమోక్రాటిక్ పార్టీల చేతిలోనికి వెళ్లినప్పుడు అది పెట్టుబడిని నియంత్రిస్తుందని, అటువంటి సందర్భాలలో వ్యక్తిగత ఆస్తిగా ఉన్న పెట్టుబడికి లేబర్ మార్కెట్ల నిర్వహణలో, లేబర్ ప్రక్రియల నిర్వహణలో, ఆదాయ వితరణ వంటి విషయాలలో స్వేచ్ఛ పరిమితమవుతుంద'ని అంటాడు. కొన్ని సందర్భాలలో 'పబ్లిక్ ప్రైవేటుకు వ్యతిరేకంగా, అలాగే రాజ్యం మార్కెట్‌కు వ్యతిరేకంగా నిలబడడం సంభవిస్తుంది. అటువంటి పరిస్థితులలో పెట్టుబడికి రాజ్యానికి మధ్య తీవ్రమైన వైరుధ్యం నెలకొంటుంద'ని రచయిత పేర్కొన్నాడు. అయితే భారత దేశంలో మన అనుభవంగాని, రాజ్యం వర్గపాలన పనిముట్టు అని మనకున్న మార్క్సిస్టు దృక్పథం నుండిగాని హార్వే అభిప్రాయాన్ని అంగీకరించడం కష్టం. పెట్టుబడికి వ్యతిరేకంగా రాజ్యం నిలబడగలుగతుందని అంగీకరించడం

కష్టం. మనకు తెలిసి రాజ్యం పెట్టుబడి సెక్షన్ల మధ్య వైరుధ్యాన్ని పరిష్కరించడానికి వివిధ పెట్టుబడి సెక్షన్లను నియంత్రించడం ఒక సాధ్యమైన వ్యవహారంగా అలాగే దాని లక్షణంగా గమనిస్తాం. అలాగే పెట్టుబడిపై, మార్కెట్‌పై ప్రజలలో తీవ్ర వ్యతిరేకత పెరిగినప్పుడు రాజ్యం సోషల్ డెమోక్రాటిక్ రూపమెత్తి పెట్టుబడిని తాత్కాలికంగా 'నియంత్రించడం' మనం గమనిస్తాము. ఈ తాత్కాలిక నియంత్రణ పెట్టుబడిదారీ వ్యవస్థ దీర్ఘకాల పరిరక్షణకే అన్న విషయం ప్రజలకంటే పెట్టుబడికి, ప్రతి సందర్భంలో, బాగా తెలుసు. కాని రచయిత ఎన్నికల ద్వారా అధికారంలోనికి వచ్చిన సోషల్ డెమోక్రాట్లు రాజ్యాన్ని మార్కెట్‌కు వ్యతిరేకంగా నిలబెట్టగలుగుతారు అని చెప్పడం ఆశ్చర్యకరమైన విషయమే. అయితే రచయిత, రెండవ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటన్ అలాగే డిగాలే అధ్యక్షతన ఫ్రాన్స్, తూర్పు యూరోపియన్ దేశాలు, చైనాను తన వాదనకు ఉదాహరణగా చెప్తాడు. ఇదంతా పరిశీలిస్తే, డేవిడ్ హార్వే రాజ్యాన్ని వర్గాతీత వ్యవస్థగా పరిగణిస్తున్నట్లు కనిపిస్తున్నది. డేవిడ్ హార్వే తాను పైన చేసిన ప్రతిపాదనకు ఉదాహరణగా బ్రిటన్ పేరు, చైనా పేరూ కూడా చెప్పాడు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత నాలుగు సంవత్సరాల అంతర్యుద్ధం తరువాత 1949లో చైనా అంతటా కార్మిక కర్షక రాజ్యం ఏర్పడింది. అది ఒక క్రొత్త రాజ్యం. పెట్టుబడికి వ్యతిరేకంగా ఏర్పడిన రాజ్యం. డేవిడ్ హార్వే చైనా విప్లవాన్నే గుర్తించనట్లు, సాయుధ పోరాటం ద్వారా పాత రాజ్యం కూలదోయబడి ఒక కొత్త రాజ్యం స్థాపించబడిన విషయం గుర్తించనట్లు ఉంది. రాజ్యాన్ని చరిత్రకు దూరంగా, వర్గ పునాదులకు దూరంగా పరిశీలిస్తున్నట్లు ఉంది. డేవిడ్ హార్వే విషయమే కాదు, ఐరోపా సోషల్ డెమోక్రాట్లలో సాయుధ పోరాటం ద్వారా కాకుండా పార్లమెంటులో మెజారిటీ ద్వారా కార్మిక వర్గం రాజ్య వ్యవస్థను హస్త గతం చేసుకోవచ్చుననే భావన బలంగా ఉంది. డేవిడ్ హార్వే ఆలోచనలలో అదే యూరో కమ్యూనిజం కనిపిస్తున్నది. పార్లమెంటు ద్వారా సోషలిజం సిద్ధాంతాన్ని అంగీకరించినా చైనాలో అనాడు అలా జరిగి ఉండగలిగేది కాదని యూరో కమ్యూనిస్టులు కూడా భావిస్తారు. డేవిడ్ హార్వే ఆ ప్రత్యేకతను కూడా చూడకపోవడం ఆశ్చర్యకరం.

రాజ్యాన్ని జన సామాన్యం ఎన్నికల ద్వారా హస్తగతం చేసుకోవడమే కాకుండా దానిని దెబ్బతీయడం గురించి కూడా డేవిడ్ హార్వే వ్రాస్తాడు. డేవిడ్ హార్వే 'పెట్టుబడి రాజ్యం బలం, దానికి గల రెండు ఏకస్వామ్య అధికారాలు అనే స్తంభాలపై – ఒకటి, చట్టబద్ధంగా బల ప్రయోగం చేయగల ఏకైక సంస్థ కావడం; రెండు, డబ్బుకు సంబంధించి ముద్రణ, ఇతర వ్యవహారాలపైన నిర్ణయాలు తీసుకోగలిగే మోనోపలి అధికారం కలిగి ఉండడం – పాక్షికంగా ఆధారపడుతుంద'ంటాడు. డేవిడ్ హార్వే 'డబ్బుపై దానికున్న ఏకచ్ఛత్రాధిపత్యం తొలగిస్తే ఆ చర్య బల ప్రయోగ అధికారాన్ని, అంతిమంగా రాజ్యాన్ని (పగుల కొట్టడం కంటే) రద్దుచేస్తుంది. ఒక్కసారి ఆర్థిక వనరులపై దానికి అధికారం పోయిన తరువాత రాజ్యానికి తన ప్రజలపై హింసను ప్రయోగించే శక్తికూడా పోతుంది. ఈ ప్రతిపాదన అసాధ్యమైనదిగా కనిపించవచ్చుగాని, అది సాధ్యమే అని గ్రీస్, ఇటలీ, స్పెయిన్ వంటి దేశాలలో బాండు హోల్డర్ల ఆర్థిక శక్తి రాజ్య విధానాలు ప్రజల ప్రయోజనాల వైపు మొగ్గేట్లు రాజ్యంపై ఒత్తిడి చేయడం కనిపిస్తున్నద'ంటాడు.

అలాగే డేవిడ్ హార్వే 'రాజ్యం అనేది వివిధ దేశాలకు చెందిన నిర్దిష్ట యంత్రాంగమే గాక ప్రపంచ వ్యాప్తంగా ఒక సార్వత్రిక లక్షణం కలిగి ఉన్న కారణంగా, ప్రపంచ వ్యవస్థలో ద్రవ్య పెట్టుబడిని, అమెరికా డాలర్ సామ్రాజ్యవాదాన్ని బలపరిచే సంస్థగా ఉన్న ఐ.ఎం.ఎఫ్‌ను రద్దుచేయడం వామపక్ష రాజకీయాల కర్తవ్యంగా ఉంటుంద'ంటాడు. అట్టి చర్య సాధ్యమేనా? దక్షిణ ప్రపంచం కార్మిక, శ్రామిక రైతు వర్గాల ఆధిపత్యం లోనికి రాకుండా, ఐరోపా కనీసం సోషల్ డెమోక్రాటిక్ శక్తుల చేతిలోనికి రాకుండా, ఐ.యమ్.యఫ్‌ను, అలాగే, అమెరికా మిలిటరీ, ఫైనాన్స్, డాలర్ ఆధిపత్యాలను తొలగించడం అసాధ్యమని సాధారణ అవగాహన. అయితే, అమెరికా ప్రజానీకమే అమెరికా ప్రభుత్వాన్ని, పెట్టుబడిని, రాజ్యాన్ని ఎదిరించగలుగుతుందా అంటే అది ట్రిలియన్ డాలర్ల ప్రశ్న అవుతుంది. 2008 సంక్షోభాన్ని కూడా అమెరికా పాలక వర్గాలు ప్రపంచం అంతటా సర్దివేసి మరొక రకంగా చెప్పాలంటే సంక్షోభాన్ని ఇతర దేశాలకు ఎగుమతిచేసి తన ప్రజలు భరించే పరిమాణానికి దేశంలో సంక్షోభాన్ని తగ్గించగలిగిన విషయం తెలిసిందే. వెనుకబడిన దేశాలే సామ్రాజ్యవాద గొలుసులో బలహీనమైన లింకులుగా ఉంటాయి. ఈ అన్ని విషయాలను ప్రక్కన పెట్టినా పార్లమెంటులో మెజారిటీ ద్వారా రాజ్య వర్గ లక్షణం మారడం అనేది పెద్దచర్చనీయాంశం. ఇదే అధ్యాయం లో ప్రిమిటివ్ అక్యూమ్యులేషన్ విషయంలో 'పెట్టుబడిని వృద్ధిచేయడానికి అవసరమైన ఆవరణలను తెరవడంలో రాజ్యం అణచివేత శక్తి ఒక ప్రధానమైన పాత్ర పోషించదనడానికి కావలసినన్ని ఆధారాలు న్నాయ'ని, 'రాజ్యం ఒక నైట్ వాచ్‌మన్ కాదని ఒక చురుకైన భారీ యుద్ధ యంత్రాంగమ'ని చెప్పిన రచయిత అదే రాజ్యవ్యవస్థ, వామపక్ష పార్టీలు ఎన్నికైనంత మాత్రాన, మెజారిటీ ప్రజల కోసం పెట్టుబడికి వ్యతిరేకంగా నిలబడుతుందని అలవోకగా చెప్పడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. పెట్టుబడిదారీ వర్గం అంతగా బలపడక ముందు, ఇంకా పటిష్టపడక ముందు కూడా అటు ఫ్యూడల్ శక్తులను, ఇటు కార్మిక శక్తులను ఒకదాని తరువాత మరొక దానిని అణచివేయడం చరిత్రలో కనిపిస్తున్నది. మరి ప్రపంచవ్యాప్తంగా ఉత్పత్తి శక్తులను తన స్వాధీనంలో తీసుకున్న బలపడిన, ఎంతగానో పటిష్టపడిన పెట్టుబడి అంత సులువుగా తన అధికారాన్ని, రాజ్య వ్యవస్థపై తనకున్న పట్టును వదులుకుంటుందని హార్వే భావించడం తీవ్రమైన విషయమే. ఉన్న ఆర్థిక శక్తిని తగ్గిస్తే మిలటరీకి ప్రజలపై హింసను ప్రయోగించే శక్తి తగ్గిపోతుందంటాడు రచయిత. కాని పాలక వర్గాలు యుద్ధం ద్వారా తమ పలుకుబడిని పెంచుకుని ఫలితంగా తన ఆర్థిక శక్తికి ఎటువంటి లోపం రాకుండా చూసుకోగలవని, రాజకీయ, ఆర్థిక స్తోమతలు పరస్పరం పూరకంగా ఉండడాన్ని రచయిత గ్రహించలేదనిపిస్తున్నది. అమెరికా ప్రజల చైతన్య స్థాయి పెరిగితే, ఉద్యమ శక్తులు పెరిగితే, వామ పక్ష శక్తులు అధికారంలోనికి వచ్చినా రాకపోయినా అమెరికా ఇతర దేశాల మీద దాడి చేయకుండా, ఇతర దేశాల వ్యవహారాలలో జోక్యం చేసుకోకుండా చూడగలిగితే అలాగే పర్యావరణ ఒప్పందాలను అమెరికా అమలు చేసేట్టు చూడగలిగితే ప్రపంచంలో ప్రగతిశీల మార్పుకు ఎంతో దోహదం చేసినట్లు అవుతుంది. అమెరికా చరిత్రలో యుద్ధ వ్యతిరేక ఉద్యమాలు, అమెరికా ప్రజల్లో పర్యావరణ చైతన్యం ఉండడమే నేను పై ప్రతిపాదన చేయడానికి కారణం. అమెరికాలో విపరీతంగా పెరిగిన వినిమయవాద సంస్కృతికి వ్యతిరేకంగా ఉద్యమాలు జరగడం ఎంతైనా అవసరం. అమెరికా ఆయుధాలను ఎగుమతిచేసి వినిమయ సరుకులను దిగుమతి చేసుకుంటుంది. అమెరికా ఆయుధ వ్యాపారం తగ్గాలి. అమెరికాలో వామపక్ష ఉద్యమం ఆ దిశలో సాగాలి. ఏదేమైనా, పెట్టుబడిదారీ రాజ్యానికి, ప్రైవేటు ఆస్తికి ఉన్న వైరుధ్యాన్ని అనేక పార్శ్వాలలో డేవిడ్ హార్వే ఈ అధ్యాయంలో చర్చించాడు.

*(ఇంకా ఉంది)*

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

### ప్రశ్నించాడన్న కారణంలో ఉపాధ్యాయుడి సస్పెన్షన్

ముఖ్యమంత్రి కెసిఆర్‌కు వ్యతిరేకంగా యూట్యూబ్‌లో వీడియోను పోస్టు చేసిన ప్రధానోపాధ్యాయుడు లతీఫ్ మహ్మద్ ఖాన్‌ను తెలంగాణ ప్రభుత్వం సస్పెండ్ చేసింది. ఈ నిషేధాన్ని ఎత్తివేయాలని తెలంగాణ ప్రభుత్వాన్ని ఢిల్లీ మైనారిటీ కమిషన్ మే 27న ఆదేశించింది. ఎన్నికల హామీలను సిఎం కెసిఆర్ నెరవేర్చలేదని ప్రశ్నించినందుకు సస్పెండ్ చేయడం సరికాదన్నారు. ప్రజాస్వామ్యదేశంలో ప్రశ్నించే వారిపై చర్యలు తీసుకోవడం సరికాదన్నారు. గత 20 ఏళ్లుగా పౌరహక్కుల పరిరక్షణ కమిటీలో పనిచేస్తున్న లతీఫ్ మహ్మద్ ఖాన్ నాంపల్లి ప్రభుత్వ పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా విధులు నిర్వర్తిస్తున్నారు.

### ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా జగన్‌మోహన్‌రెడ్డి

వైఎస్ఆర్‌సిపి అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా మే 30న ప్రమాణ స్వీకారం చేశారు. గవర్నర్ నరసింహన్ ఆయన చేత విజయవాడలోని ఇందిరాగాంధీ మున్సిపల్ స్టేడియంలో ప్రమాణ స్వీకారం చేయించారు. ఇరవై ఐదు మంది మంత్రులతో జగన్‌మోహన్‌రెడ్డి రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడింది. వెలగపూడిలోని అసెంబ్లీ ప్రాంగణంలో గవర్నర్ నరసింహన్ నూతన మంత్రులచేత జూన్ 1న ప్రమాణస్వీకారం చేయించారు. వీరిలో ఐదుగురు డిప్యూటి సిఎంలుగా నియమితులయ్యారు.

### ప్రజాస్వామికవాదుల విడుదలకై సిఆర్‌పిపి సభలు

ప్రొ. జి.ఎన్. సాయిబాబా, విరసం నేత వరవరరావుతో పాటు జైళ్లలో నిర్బంధించిన ఆదివాసులను, ప్రజాస్వామిక వాదులందరిని విడుదల చేయాలని ప్రొ. హరగోపాల్ డిమాండ్ చేశారు. పౌర స్వేచ్ఛను, ప్రశ్నించే ప్రజాస్వామ్యాన్ని పాలకుల నుండి కాపాడుకోవాల్సిన అవసరం ఉందన్నారు. పూనే, నాగపూర్ జైళ్లలో నిర్బంధించిన రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని కోరుతూ మే 31న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో కమిటీ ఫర్ ద రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ (సిఆర్‌పిపి) తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల కమిటీల సంయుక్త ఆధ్వర్యంలో నిరసన సభ నిర్వహించారు. విజయవాడ, కర్నూలులో ధర్నాలు జరిగాయి. వక్తలు ప్రభుత్వాలు మనుషుల ఆలోచనలు, విశ్వాసాలు, రాజకీయాలను ఎలా నిషేధిస్తాయని ప్రశ్నించారు. సాయిబాబా, వరవరరావుల ఆరోగ్యం క్షీణించినా జైలు నుంచి విడుదల చేయకపోవడం దుర్మార్గమన్నారు.

### తెలంగాణ ఆర్‌టిసి కార్మికుల ధర్నా

వేతన సవరణ, డిఏ బకాయిలు, పనిభారాల తగ్గింపు, కనీస వసతులు, ఆర్.టి.సి. పరిరక్షణ, తార్నాక ఆసుపత్రి ఆధునీకరణ, బడ్జెట్‌లో 1 శాతం నిధుల కేటాయింపు వంటి సమస్యలను పరిష్కరించాలని ఆర్.టి.సి. కార్మికులు డిమాండ్ చేశారు. హైదరాబాద్‌లోని ఎండి కార్యాలయం ముందు పెద్ద సంఖ్యలో కార్మికులు నినాదాలు చేస్తూ తమ సమస్యల పట్ల యాజమాన్య ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని నిలదీస్తూ టిఎస్ ఆర్‌టిసి స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్ ఆధ్వర్యంలో జూన్ 11న ధర్నా నిర్వహించారు. వక్తలు కార్మిక చట్టాల కోసం పోరాటాలు, ఆ తర్వాత వాటిని అమలు చేయమని మళ్లీ ఆందోళనలు చేయడం ప్రభుత్వ వైఫల్యాలను తెలియపరుస్తుందన్నారు. గడిచిన ఐదు సంవత్సరాల్లో ప్రభుత్వం ఇచ్చిన హామీలు ఏమి అమలుచేయలేదన్నారు. ఆర్.టి.సి. కార్మికులు ఐక్య ఉద్యమాలకు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు.

### పౌర హక్కుల సంఘాల ధర్నా

ప్రజల పక్షాన ప్రశ్నించే ప్రజాస్వామిక వాదుల అక్రమ నిర్బంధాలపై రాజీలేని పోరాటం చేయాలని ప్రొ. హరగోపాల్ అన్నారు. దేశవ్యాప్తంగా జరుగుతున్న అణచివేతను, వాస్తవాలను ప్రజలకు తెలియజేసేందుకు మేధావులంతా ఏకం కావాలని కోరారు. దేశవ్యాప్తంగా అరెస్టు చేసి నిర్బంధించిన హక్కుల నాయకులను విడుదల చేయాలని కోరుతూ పౌరహక్కుల సంఘం(తెలంగాణ, ఎ.పి, ప్రజాస్వామిక హక్కుల సంఘాల సమన్వయ సంస్థ) ఆధ్వర్యంలో జూన్ 23న ఇందిరాపార్కు వద్ద ధర్నా నిర్వహించారు. కేంద్ర ప్రభుత్వం అక్రమంగా జైలులో నిర్బంధించిన ప్రజా గొంతుకలను కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రజలందరిపై ఉందన్నారు.

### ప్రజా పాదయాత్ర

రాయలసీమ జిల్లాలతో పాటు తెలంగాణలోని మహబూబ్‌నగర్ కరువుబారిన పడకుండా సిద్ధేశ్వరం అలుగు సాధన కోసం రాయలసీమ సాగునీటి సాధన సమితి ఆధ్వర్యంలో మే 28 ప్రజా పాదయాత్ర ప్రారంభమైంది. సిద్ధేశ్వరం అలుగు నిర్మించి కరువును నివారించాలని, రైతుల ఆత్మహత్యలను రూపుమాపాలని, ప్రాంతీయ అసమానతలను తొలగించాలని కోరుతూ నాలుగు రోజులు కొనసాగనున్న ఈ పాదయాత్రకు రైతులు, ప్రజలు భారీ స్వాగతం పలికారు. కర్నూలు, అనంతపురం, ప్రకాశం, నెల్లూరు, మహబూబ్‌నగర్ జిల్లాల నుంచి రైతులు, రైతు సంఘాల నాయకులు పెద్ద ఎత్తున వచ్చారు. కర్నూలు జిల్లాలోని నంద్యాలలో ఈ యాత్ర ప్రారంభించారు.

### ఔట్ సోర్సింగ్ ఉద్యోగుల ధర్నా

మున్సిపాలిటీల్లోని కాంట్రాక్ట్, ఔట్‌సోర్సింగ్ ఉద్యోగుల, కార్మికుల సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ కార్మిక శాఖ కమిషనరేట్ ముందు తెలంగాణ మున్సిపల్ స్టాఫ్ అండ్ ఔట్‌సోర్సింగ్ వర్కర్ల యూనియన్ జూన్ 25న ధర్నా చేసింది. ఈ సందర్భంగా ఏఐటియుసి రాష్ట్ర అధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి మున్సిపాలిటీల్లో దీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న సమస్యలను పరిష్కరించాల్సిందిగా ఎన్నిసార్లు కోరినా ప్రభుత్వం పట్టించుకోలేదని ఆగ్రహం వ్యక్తం చేశారు. కార్మికులను పర్మినెంట్ చేస్తామని ప్రభుత్వం ఇచ్చిన హామీని తక్షణమే నెరవేర్చాలని డిమాండ్ చేశారు. తమ సమస్యలు పరిష్కరించకపోతే జూలైలో సమ్మె చేస్తామని హెచ్చరించారు.

### ఆదివాసుల హక్కులకు మద్దతుగా సభలు, ప్రదర్శనలు

ములుగు జిల్లా ఏటూరు నాగారంలోని కొమురం భీం మినీ స్టేడియంలో పోడు రైతుల హక్కుల రక్షణ సభ జూన్ 11న నిర్వహించారు. ఈ సభకు ఉమ్మడి వరంగల్ జిల్లాతోపాటు ఖమ్మం నుంచి కూడా పెద్దఎత్తున ఆదివాసీలు తరలివచ్చారు. పోడు భూములకు పట్టాలు ఇవ్వాలని, హరితహారం పేరుతో ఆ భూముల్లో మొక్కలు నాటడం ఆపాలన్నారు. ఆదివాసుల హక్కులుకు సంఘీభావంగా జూన్ 15 నుంచి జూలై 10 వరకు వారు కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నామని ఇందులో భాగంగానే ట్యాంక్‌బండ్‌పై ఉన్న కొమురం భీం విగ్రహం వద్ద రైతు స్వరాజ్య వేదిక ఆధ్వర్యంలో వివిధ ప్రజా సంఘాలు జూన్ 14న నిరసన ప్రదర్శనలు చేశారు. ఆదివాసులను అక్రమంగా తరలించడంపై పౌరహక్కుల సంఘం హైకోర్టులో దాఖలు చేసిన వ్యాజ్యంపై స్పందిస్తూ వారికి ఆరునెలల్లోగా పునరావాసం కల్పించాలని అప్పటివరకు వసతి గృహంలో ఆశ్రయం కల్పించాలని తీర్పునిచ్చింది.

### టిఆర్‌టి అభ్యర్థుల సిఎం క్యాంప్ ఆఫీసు ముట్టడి

ఉపాధ్యాయ పోస్టుల భర్తీకోసం 2017లో టిఎస్‌పిఎస్‌సి నోటిఫికేషన్ జారీచేసింది. రాత పరీక్ష ద్వారా 7,400 పోస్టులకు అభ్యర్థులను ఎంపిక చేసిన టిఎస్‌పిఎస్‌సి ఏడాది గడిచినా ప్రభుత్వం నియామకాలు చేపట్టలేదు. దీంతో టిఆర్‌టి అభ్యర్థులు నియామకాలకోసం వివిధ రూపాల్లో నిరసన వ్యక్తం చేస్తున్నారు. ఎంపికైన వారికి వెంటనే ఉద్యోగాలు కల్పించాలని కోరుతూ వివిధ జిల్లాల నుంచి వచ్చిన అభ్యర్థులు జూన్ 8న ప్రగతి భవన్‌ను ముట్టడించే ప్రయత్నం చేయగా పోలీసులు వారిని అడ్డుకొని అరెస్ట్ చేశారు. ఇదే క్రమంలో జూన్ 12న సిఎం క్యాంప్ ఆఫీసు ముట్టడించడంతో వారిని పోలీసులు గోషామహల్ పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అట్లాగే ధర్నా చౌక్ వద్ద నిరాహార దీక్షలు చేశారు. వీ

### ముజఫర్‌నగర్ కేసు కొట్టివేత

ముజఫర్‌నగర్ దాడుల కేసులోని 12 మంది నిందితులకు వ్యతిరేకంగా సాక్ష్యాధారాలు లేవనే కారణంతో జిల్లా అడిషన్ సెషన్ జడ్జీ సుశీల్‌కుమార్ తివారీ వారిని నిర్దోషులుగా విడుదల చేశారు. 2013లో ముజఫర్‌నగర్‌లో దాడులు జరిగి ఒకరు చనిపోవడంతో 13 మందిపై కేసు నమోదుచేశారు. కాని సాక్షులు, కేసు నమోదుచేసిన వ్యక్తి ప్రాసిక్యూషన్‌కు సహకరించక పోవడంతో కేసును మూసివేశారు. ఇసాద్ గ్రామంలో లూటీలు, దహనాలకు పాల్పడి, ఒకరి మరణానికి కారణమయిన వ్యక్తులను మే 28న ఉత్తరప్రదేశ్ లోని బిజెపి ప్రభుత్వం నిర్దోషులుగా విడుదల చేసింది.

### రెండవసారి ప్రధానిగా మోదీ

భారతదేశ పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో పూర్తిస్థాయి మెజారిటీ సాధించిన బిజెపి అధికారంలోకి వచ్చింది. దేశ ప్రధానిగా నరేంద్ర మోదీ రెండవ సారీ ప్రమాణ స్వీకారం చేశారు. రాష్ట్రపతి భవన్‌లో మే 30న రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ ప్రమాణ స్వీకారం చేయించారు. మోదీతో పాటు 58 మంది మంత్రులు ప్రమాణ స్వీకారం చేశారు. వీరిలో కేబినెట్ మంత్రులుగా 24 మంది, స్వతంత్ర హోదా సహాయ మంత్రులుగా 9 మంది, సహాయ మంత్రులుగా 24 మంది బాధ్యతలు చేపట్టారు. రక్షణ మంత్రిగా రాజ్‌నాథ్ సింగ్, ఆర్థికమంత్రిగా నిర్మలా సీతారామన్, హోం శాఖ మంత్రిగా అమిత్ షా, తదితరులు కేంద్ర మంత్రులుగా బాధ్యతలు చేపట్టారు.

### జంతర్ మంతర్ వద్ద ప్రజా సంఘాల నిరసన

భీమా కోరేగావ్ కేసులో అరెస్టు చేసిన హక్కుల కార్యకర్తలకు బెయిల్ మంజూరు చేయాలని ప్రజా సంఘాల నేతలు డిమాండ్ చేశారు. దేశవ్యాప్తంగా అక్రమంగా అరెస్టు చేసి జైళ్లలో నిర్బంధించిన రాజకీయ ఖైదీలను వెంటనే విడుదల చేయాలని కోరారు. భీమా కోరేగావ్ కేసులో హక్కుల కార్యకర్తలను అరెస్టు చేసి ఏడాది పూర్తవుతున్న సందర్భంగా వివిధ ప్రజా, సాంస్కృతిక సంఘాల ఆధ్వర్యాన జూన్ 8న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద నిరసన సభ చేపట్టారు. ప్రజల కోసం పోరాడేవారిని అక్రమంగా నిర్బంధించారన్నారు. పోరాటాల్లో పాల్గొంటున్న కార్మికులు, దళితులు, ఆదివాసులు, మైనారిటీలు, మహిళలను అక్రమంగా అరెస్టు చేయడం రాజ్యం అణచివేత దోరణిని కొనసాగిస్తుందన్నారు. దేశంలో మైనారిటీలపై గోరక్షక్ దళాలు దాడులు చేస్తుంటే దేశంలో రాజ్యాంగానికి బదులు మనుధర్మశాస్త్రం అమలు చేస్తున్నట్టుందన్నారు.

### ఉత్తరప్రదేశ్‌లో ముగ్గురు జర్నలిస్టుల అరెస్టు

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి యోగి ఆదిత్యానాథ్‌పై అభ్యంతరకర వ్యాఖ్యలకు సంబంధించి ముగ్గురు జర్నలిస్టులను పోలీసులు అరెస్టు చేశారు. సిఎం యోగితో సన్నిహిత సంబంధముందని, పెళ్లి చేసుకుంటా నంటూ సందేశం పంపాను అని విలేకరులతో ఓ మహిళ మాట్లాడుతున్న వీడియోను ఢిల్లీకి చెందిన జర్నలిస్టు ప్రశాంత్ కనోజియా సామాజిక మాధ్యమాల్లో పోస్టు చేశాడు. దీంతో పోలీసులు ప్రశాంత్‌ను అరెస్టు చేశారు. కాగా, ఈ వ్యాఖ్యలను నోయిడాకు చెందిన నేషన్ లైవ్ ఛానెల్ ప్రసారం చేసింది. దీంతో ఆ ఛానెల్ చీఫ్ ఇషికా సింగ్, ఎడిటర్ అనూజ్ శుక్లాలనూ పోలీసులు జూన్ 10న అరెస్టు చేశారు.

### కతువా కేసులో ముగ్గురికి యావజ్జీవ శిక్ష

జమ్మూ కశ్మీర్‌లోని కతువాలో ఎనిమిదేళ్ల బాలికపై గతేడాది జనవరిలో సామూహిక లైంగికదాడికి పాల్పడి దారుణంగా హతమార్చిన ముగ్గురు దోషుల కేసును విచారిస్తున్న పటాన్‌కోట్ ప్రత్యేక న్యాయస్థానం జూన్ 10న యావజ్జీవ శిక్ష విధించింది. అలాగే, దోషులకు సహకరించిన ముగ్గురు పోలీసులకు ఐదేళ్ల జైలు శిక్ష విధించింది. లైంగికదాడితో పాటు హత్యానేరానికి పాల్పడిన దోషులకు 25 ఏళ్ల జైలు శిక్షలతోపాటు ఒక లక్ష రూపాయల జరిమానా విధించింది. లంచం తీసుకుని, సాక్ష్యాధారాలను ధ్వంసం చేసి నేరస్తులకు సహకరించిన పోలీసులకు ఐదేళ్ల కారాగారంతోపాటు రు. 50 వేల జరిమానా విధించింది. ఘటనా సమయంలో అక్కడలేనని చెప్పిన సాంజీరామ్ కుమారుడు విశాల్‌ను సంశయ లాభం కింద నిర్దోషిగా ప్రకటించింది. కాగా, ఎనిమిదో నిందితుడైన మైనర్‌పై విచారణ జమ్మూకశ్మీర్ హైకోర్టులో పెండింగ్‌లో ఉన్నది.

### సిక్కిం, ఒడిశా, అరుణాచల్‌ప్రదేశ్ సిఎంలు

సిక్కిం ముఖ్యమంత్రిగా సిక్కిం క్రాంతికారి మోర్చా (ఎస్‌కెఎం) నేత ప్రేమ్‌సింగ్ తమాంగ్ మే 27న 6వ ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. ఆపాల్జోర్ స్టేడియంలో గవర్నర్ గంగా ప్రసాద్ ఆయనచేత ప్రమాణ స్వీకారం చేయించారు. మే 29న ఒడిశా ముఖ్యమంత్రిగా నవీన్ పట్నాయక్‌తో పాటు ఇరవై మంది మంత్రుల చేత గవర్నర్ రమేశ్ లాల్ ప్రమాణస్వీకారం చేయించారు. మే 30న అరుణాచల్ ప్రదేశ్ 10వ ముఖ్యమంత్రిగా బిజెపి నేత పెమఖండుతో పాటు పదకొండు మంది మంత్రుల చేత గవర్నర్ బి.డి. మిశ్రా దోర్జీ కన్వెన్షన్ సెంటర్‌లో ప్రమాణ స్వీకారం చేయించారు.

### బెంగాల్‌లో జూనియర్ డాక్టర్ల సమ్మె

జూన్ 10న మొహమ్మద్ షాహిద్ అనే 75 ఏళ్ల వృద్ధున్ని కోల్‌కత్తా ప్రభుత్వ ఆసుపత్రికి కొందరు తీసుకొచ్చారు. వచ్చిన కాసేపటికే ఆ వృద్ధుడు చనిపోయాడు. దాంతో వెంట వచ్చిన 200 మంది ఆసుపత్రి సిబ్బందిపై దాడి చేశారు. జూనియర్ డాక్టర్లను కొట్టగా ఇద్దరు తీవ్రంగా గాయపడ్డారు. జూనియర్ డాక్టర్లకు భద్రత కల్పించాలని, ఈ ఘటనకు ముఖ్యమంత్రి క్షమాపణ చెప్పాలని కోల్‌కత్తాలో, రాష్ట్రంలోని జూనియర్ డాక్టర్లు సమ్మెకు దిగారు. అనంతరం దేశవ్యాప్తంగా ధర్నాలు చేశారు.

### ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్‌లలో ఎన్‌కౌంటర్‌లు

ఛత్తీస్‌గఢ్‌లో కాంకేర్ జిల్లాలోని తడోకి పోలీసు స్టేషన్ పరిధిలో మర్నార్ అటవీ ప్రాంతంలో జూన్ 13న కూంబింగ్‌కు వెళ్లిన పోలీసులకు, మావోయిస్టులకు మధ్య ఎదురుకాల్పులు జరిగాయని, ఈ కాల్పుల్లో ఇద్దరు మావోయిస్టులు మరణించినట్లుగా పోలీసులు తెలిపారు. జార్ఖండ్‌లో సరైకేలా జిల్లాలోని బక్రుహత్ ప్రాంతంలోని సంత సందర్భంగా పెట్రోలింగ్‌లో ఉన్న పోలీసులకు, మావోయిస్టులకు మధ్య జూన్ 14న కాల్పులు జరిగాయని ఇందులో ఇద్దరు ఎస్సైలు సహా ఐదుగురు పోలీసులు మృతి చెందారని పోలీసు అధికారులు తెలిపారు.

### జంతర్ మంతర్ వద్ద చేనేత కార్మికుల ధర్నా

ఆర్థికంగా చితికిపోయిన చేనేత కార్మికులను ప్రభుత్వం ఆదుకోవాలని నేతన్నల ఐక్య కార్యాచరణ కమిటీ (జెఏసి) డిమాండ్ చేసింది. తెలంగాణలో చేనేత కార్మికుల ఆత్మహత్యలను నిరోధించి, వారికి ఆర్థిక సహకారం అందించాలని కోరుతూ జెఏసి ఆధ్వర్యంలో జూన్ 25న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద ధర్నా నిర్వహించారు. ఇప్పటి వరకు తెలంగాణలో 350 మంది చేనేత కార్మికులు ఆత్మహత్య చేసుకున్నారని, వారి కుటుంబ సభ్యులకు పరిహారం అందించాలని కోరారు.

### బీహార్‌లో చిన్నపిల్లల మరణాలు

బీహార్‌లోని ముజఫర్‌పూర్ జిల్లాలో మెదడు వాపు వ్యాధితో రెండు వందల మంది పిల్లలు మరణించారు. పిల్లల్లో గ్లూకోజు లోపం, మెదడు సరిగా పనిచేయని కారణంగా ఈ వ్యాధి వ్యాప్తి చెందుతోంది. గ్రామీణ ఆరోగ్య కేంద్రాలలో వసతుల కొరత కారణంగా చాలా మంది పిల్లలు ముజఫర్‌పూర్‌లోని ప్రధాన ఆసుపత్రికి తీసుకువచ్చే లోపే మరణిస్తున్నారు. బీహార్‌లో మొత్తం మూడు వేలకు పైగా పిహెచ్‌సిలు ఉండాల్సి ఉండగా కేవలం 1800 మాత్రమే ఉన్నాయి. ప్రతి 17,685 మందికి ఒక వైద్యుడు మాత్రమే అందుబాటులో ఉన్నాడు. వీ

### ఐరోపా పార్లమెంట్ ఎన్నికలు

ఐరోపా పార్లమెంట్‌కు మే 23 నుంచి 26 వరకు ఎన్నికలు జరిగాయి. మొత్తం 751 స్థానాలకు ఎన్నికలు నిర్వహించారు. 28 సభ్య దేశాలకు చెందిన నలభై ఐదు కోట్ల మంది తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు. అయితే మెజారిటీకి కావాల్సిన 376 స్థానాలను ఏ ఒక్క పార్టీ సాధించలేదు. యూరోపియన్ పీపుల్స్ పార్టీ (ఇపిపి) 179 స్థానాలు, సోషల్ డెమోక్రాట్స్‌కు 153 స్థానాలు లభించాయి. ఇపిపి నేత మాన్‌ఫ్రెడ్ వెబర్ యూరోపియన్ కమిషన్‌కు అధ్యక్షుడు అయ్యే అవకాశాలు ఉన్నాయి.

### నైజీరియా అధ్యక్ష ఎన్నికలు

గత ఫిబ్రవరిలో జరిగిన నైజీరియా అధ్యక్ష ఎన్నికల ఫలితాలు వెలువడ్డాయి. ఈ ఫలితాల్లో ఆల్ ప్రోగ్రెసివ్ కాంగ్రెస్ పార్టీ నేత, ప్రస్తుత అధ్యక్షుడు మహ్మద్ బుహారీ విజయం సాధించారు. ఎన్నికలు ఫిబ్రవరిలో జరిగినా ఎన్నికల సమయంలో రిగ్గింగ్ జరిగిందనే ఆరోపణలతో హింసాత్మక ఘర్షణలు జరిగాయి. బుహారీకి 1.51 కోట్ల ఓట్లు రాగా ఆయన ప్రత్యర్థి పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ నేత అటీకు అబూబకర్‌కు 1.12 కోట్ల ఓట్లు వచ్చాయి. జూలై 12న ఆయన రెండోసారి దేశాధ్యక్షుడిగా ప్రమాణం చేస్తారు.

### ఇజ్రాయిల్ పార్లమెంట్ రద్దు

ఇజ్రాయిల్ పార్లమెంట్ (నెస్సెట్)ను రద్దు చేస్తూ మే 31న ఎంపిలు తీర్మానించారు. పార్లమెంట్‌ను రద్దు చేయాలని కోరుతూ తీర్మానం ప్రవేశపెట్టగా మొత్తం 120 ఎంపిలలో 74 మంది తీర్మానానికి అనుకూలంగా, 45 మంది ప్రతికూలంగా ఓటు వేశారు. ఈ ఏడాది ఏప్రిల్ 9న జరిగిన ఎన్నికల్లో అధ్యక్షుడు బెంజిమన్ నెతన్యాహూ నేతృత్వంలోని లికుడ్ పార్టీ కూటమి 65 సీట్లు సాధించింది. అయితే ఓ మితవాద పార్టీకి చెందిన ఐదుగురు ఎంపిలు కూటమికి మద్దతు నిరాకరించడంతో ప్రభుత్వం ఏర్పాటులో నెతన్యాహూ విఫలమయ్యారు. దీంతో సెప్టెంబర్ 17న మరోసారి ఇజ్రాయిల్ పార్లమెంట్‌కు ఎన్నికలు జరగనున్నాయి.

### హోండ్యురాస్‌లో నిరసనలు

హోండ్యురాస్‌లో విద్య, ఆరోగ్య రంగాలను ప్రభుత్వం ప్రైవేటీకరించనున్నట్లు ప్రకటించడంతో ప్రజలు నిరసన తెలిపారు. జూన్ 3న రాజధాని తెగూసిగల్పలో వేలాది మంది నిరసనకారులు బ్యానర్లు, ప్లకార్డులు పట్టుకొని ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. అధ్యక్షుడు జువాన్ ఓర్లాండో హెర్నాండేజ్ పాలనలో అవినీతి, ప్రజా వ్యతిరేక విధానాలు అధికమయ్యాయని తమ నిరసన తెలిపారు. అధ్యక్షుడు జువాన్ వెంటనే తన పదవికి రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు.

### డెన్మార్క్ ఎన్నికలు

యూరోపియన్ దేశమైన డెన్మార్క్ పార్లమెంట్‌కు జూన్ 5న ఎన్నికలు జరిగాయి. మొత్తం 179 స్థానాలకు జరిగిన ఈ ఎన్నికల్లో 35.6 లక్షల మంది పౌరులు తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు. ఈ ఎన్నికల్లో సోషల్ డెమోక్రాటిక్ పార్టీ 47 సీట్లు సాధించింది. ఆ పార్టీ నేతలకు 25.9 శాతం ఓట్లు వచ్చాయి. సోషల్ డెమోక్రాటిక్ పార్టీ, సోషల్ లిబరల్స్, సోషలిస్ట్ పీపుల్స్ పార్టీ ఇతర పార్టీల కూటమి రెడ్ బ్లాక్‌కు మొత్తం 93 సీట్లు వచ్చాయి. అధికార లిబరల్ అలయన్స్‌కు 76 సీట్లు మాత్రమే వచ్చాయి. సోషల్ డెమోక్రాటిక్ పార్టీ అధినేత మెట్ ఫ్రెడరిక్సన్ ప్రధానిగా బాధ్యతలు చెపడతారు.

### బ్రిటన్ ప్రధాని థెరిస్సా మే రాజీనామా

బ్రిటన్ ప్రధానమంత్రి థెరిస్సా మే జూన్ 7న తన పదవికి రాజీనామా చేశారు. బ్రెగ్జిట్‌పై ఏకాభిప్రాయం సాధించడంలో విఫలమైనందున ఈ నిర్ణయం తీసుకున్నారు. కన్జర్వేటివ్ పార్టీ నాయకత్వం నుంచి కూడా తప్పుకుంటున్నట్లు తెలిపారు. కొత్త ప్రధానమంత్రిగా మరొకరిని ఎన్నుకునే వరకు ఆమె ప్రధానిగా కొనసాగుతారు. యూరోపియన్ యూనియన్ నుంచి బ్రిటన్ తప్పుకునే బ్రెగ్జిట్ ఒప్పందంపై పార్లమెంట్‌లో బిల్లుకు అనుకూలంగా మద్దతు కూడగట్టడంలో థెరిస్సా మే పలుమార్లు విఫలమయ్యారు. దీంతో ఆమె తన పదవికి రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించారు. బ్రిటన్ ప్రధానమంత్రి పదవి చేపట్టేందుకు బ్రిటన్ మాజీ విదేశాంగ మంత్రి బోరిస్ జాన్సన్ సహా పలువు కన్జర్వేటివ్ పార్టీ ఎంపిలు పోటీ పడుతున్నారు. బ్రెగ్జిట్‌పై గడువు అక్టోబర్ 31తో ముగుస్తుంది.

### చిలీలో ప్రభుత్వ విద్య కోసం భారీ ర్యాలీ

చిలీ రాజధాని శాంటియాగోలో ఉపాధ్యాయులు, విద్యార్థులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారీ ర్యాలీలు నిర్వహించారు. ప్రభుత్వ విద్య, ఉపాధ్యాయులకు ఉద్యోగ భద్రత, పని ఒత్తిడి వంటి అంశాలపై ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. ఉపాధ్యాయులను స్వల్పకాలిక కాంట్రాక్టు వ్యవస్థను రద్దు చేసి శాశ్వత కాంట్రాక్టు పద్ధతిలో కొనసాగించాలని ప్రభుత్వ విద్యను పటిష్టపరచాలని, పాఠశాలల్లో మౌలిక సదుపాయాలు కల్పించాలని టీచర్ల సంఘాలు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాయి. అలాగే విద్యా మంత్రిత్వ శాఖ ప్రకటించిన పాఠ్య ప్రణాళికలో మార్పులు సరిగా లేవన్నారు.

### హాంగ్‌కాంగ్‌లో కొనసాగుతున్న నిరసనలు

హాంగ్‌కాంగ్‌లో పలు కేసుల్లో ఆరోపణలు ఎదుర్కొంటున్న అనుమానితులను చైనా కోర్టుల్లో విచారించాలని ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఈ మేరకు బిల్లును ప్రతిపాదించింది. అనుమానితులను చైనాకు అప్పగించే బిల్లును వ్యతిరేకిస్తూ హాంగ్‌కాంగ్ పౌరులు పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శనలు చేపట్టారు. ప్రభుత్వం వెంటనే ఈ బిల్లును ఉపసంహరించాలని డిమాండ్ చేశారు. లక్షలాది మంది హాంగ్‌కాంగ్ వీధుల్లోకి వచ్చి భారీ ర్యాలీలు నిర్వహించారు. చైనా చట్టాలపై తమకు నమ్మకం లేదని, ఈ బిల్లును ప్రతిపాదించిన హాంగ్‌కాంగ్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ కరీ లామ్ వెంటనే రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు.

### ఐరాస భద్రతామండలి ఆసియా ప్రతినిధిగా వియత్నాం

ఐక్యరాజ్య సమితి భద్రతామండలిలో ఆసియా దేశాలకు ప్రతినిధిగా వియత్నాంను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. లాటిన్ అమెరికా, కరీబియన్ దేశాల మధ్య జరిగిన పోటీలో పెటిని సెయింట్ విన్సెంట్, గ్రెనడైన్స్ దేశాలు ఎన్నికయ్యాయి. ఆఫ్రికా దేశాల స్థానాలకు ట్యూనిషియా, నైగర్‌లు ఎన్నిక కాగా, తూర్పు ఐరోపా దేశాలకు ఎస్టోనియా ఎన్నికైంది. మండలి సభ్యత్వానికి వియత్నాం ఎన్నిక కావడం తమ విదేశాంగ విధానానికి, స్వాతంత్ర్యానికి, సహకార సూత్రాలకు గుర్తింపు అని వియత్నాం ప్రతినిధి డాంగ్‌డిన్ కై అన్నారు.

### బ్రెజిల్‌లో నిరసనలు

బ్రెజిల్‌లో ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు సమ్మె చేశారు. జూన్ 14న ప్రజలు వీధుల్లోకి వచ్చి నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. పదవీ విరమణ వయస్సు పెంచుతూ, పెన్షన్ పథకాలలో కార్మిక వ్యతిరేక సంస్కరణలు తెస్తున్న ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా 24 గంటల పాటు సమ్మె చేశారు. విద్యుత్‌రంగ కార్మికులు, డ్రైవర్లు, పెట్రోలియం రంగం కార్మికులు, వివిధ కార్మిక సంఘాలే కాకుండా విద్యార్థులు కూడా ఈ సమ్మెలో పాల్గొన్నారు. ఇప్పుడు ఉన్న ఉద్యోగ విరమణ వయస్సు సగటు 55 ఏండ్లు. కొత్త పెన్షన్ నిబంధనల ప్రకారం ఇది పురుషులకు 65, మహిళలకు 62 ఏండ్లకు పెంచనున్నారు. అలాగే ఉద్యోగంలో 35 ఏళ్లపాటు కొనసాగిన వారికి మాత్రమే పెన్షన్ ఇచ్చేలా బ్రెజిల్ ప్రభుత్వం సంస్కరణ చేయడానికి ప్రయత్నిస్తోంది. అలాగే కార్మిక చట్టాల్లో తీసుకొచ్చిన కార్మిక వ్యతిరేక సంస్కరణలు, విద్యారంగానికి సంబంధించిన బడ్జెట్‌లో కోతకు వ్యతిరేకంగా కార్మికులు, విద్యార్థులు భారీగా నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ప్రభుత్వం వెంటనే ఈ సంస్కరణలు ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మే 1 నుండి మే 31, 2019 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1178), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (1105) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2283)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 2 | - | 16 | 18 | 8 | 11 | 5 | 2 | 3 | 3 | 3 | 2 | 3 | 34 | 28 | - | - | - | 4 | 9 |
| హైదరాబాద్ | - | - | - | 14 | 12 | 5 | 8 | 4 | 2 | 4 | 5 | 10 | 4 | 7 | 21 | 19 | - | - | - | 1 | 6 |
| కరీంనగర్ | - | 3 | 2 | 6 | 8 | 2 | 3 | 1 | 2 | 3 | - | 2 | 2 | 4 | 17 | 13 | - | - | - | - | 36 |
| ఖమ్మం | - | 2 | - | 7 | 11 | 2 | 8 | 2 | 1 | - | 3 | 2 | 1 | 3 | 25 | 21 | - | - | - | - | 94 |
| మహబూబ్‌నగర్ | - | 2 | 1 | 3 | 5 | 3 | 3 | 4 | 2 | 2 | 3 | 3 | 9 | 10 | 48 | 5 | - | - | - | - | 5 |
| మెదక్ | 1 | 16 | 2 | 3 | 6 | 2 | 3 | 1 | 1 | 4 | 3 | 4 | 6 | 19 | 17 | 22 | - | - | - | 4 | 2 |
| నల్గొండ | - | 4 | - | 4 | 6 | 3 | 4 | 3 | 2 | 4 | 4 | 2 | 3 | 6 | 21 | 11 | - | - | - | - | 40 |
| నిజామాబాద్ | - | 3 | - | 5 | 5 | 2 | 5 | 3 | 1 | 2 | 1 | 5 | 2 | 6 | 17 | 11 | - | - | - | - | 7 |
| వరంగల్ | - | 9 | 3 | 4 | 3 | 3 | 4 | 2 | 1 | 5 | 3 | 4 | 5 | 17 | 19 | 21 | - | - | - | 1 | 1 |
| వికారాబాద్ | - | 2 | - | 3 | 5 | 3 | 6 | 3 | 3 | 4 | 2 | 4 | 4 | 6 | 23 | 18 | - | - | - | - | 13 |
| **తెలంగాణ** | **3** | **43** | **8** | **65** | **79** | **30** | **55** | **28** | **17** | **31** | **27** | **39** | **38** | **81** | **242** | **169** | **-** | **-** | **-** | **10** | **213** |
| అనంతపురం | - | 6 | - | 18 | 35 | - | 3 | 1 | - | 8 | 4 | 6 | 16 | 8 | 50 | - | - | - | - | - | 25 |
| చిత్తూరు | - | 1 | - | 4 | 13 | - | - | - | - | 4 | 2 | 10 | 7 | 5 | 39 | 10 | - | - | - | - | 19 |
| కడప | - | - | - | 2 | 4 | - | - | - | - | 1 | - | - | - | 3 | 9 | 11 | - | - | - | - | - |
| గుంటూరు | - | 2 | - | 3 | 5 | 5 | 6 | - | 1 | 3 | 1 | 3 | 2 | 3 | 25 | 14 | - | - | - | - | 5 |
| కృష్ణా | - | - | - | 4 | 6 | 2 | 3 | 3 | 1 | 2 | 2 | 3 | 2 | 4 | 16 | 9 | - | - | - | - | 4 |
| కర్నూలు | - | 4 | - | 4 | 9 | 2 | 7 | 1 | 1 | 2 | 3 | 4 | 2 | 6 | 36 | 14 | - | - | - | - | 11 |
| తూర్పు గోదావరి | - | - | - | 6 | 5 | 5 | 4 | 5 | 6 | 3 | 3 | 6 | 2 | 3 | 28 | 18 | 2 | - | - | - | - |
| ప్రకాశం | - | - | - | 3 | 5 | 2 | 4 | 1 | 2 | 2 | 2 | 3 | 3 | 2 | 19 | 13 | - | - | - | - | 4 |
| శ్రీకాకుళం | - | - | - | 4 | 5 | 1 | 2 | 1 | 1 | 5 | 3 | 1 | 1 | 4 | 34 | 19 | - | - | - | - | 8 |
| పశ్చిమ గోదావరి | - | - | - | 2 | 4 | 2 | 5 | 1 | - | 2 | - | 2 | - | 3 | 16 | 8 | - | - | - | - | 2 |
| నెల్లూరు | - | 2 | - | 4 | 6 | 3 | 4 | 2 | 1 | 3 | 2 | 4 | 2 | 3 | 23 | 17 | - | - | - | - | 6 |
| విజయనగరం | - | - | - | 2 | 8 | 1 | 4 | 2 | 1 | 3 | 3 | 1 | - | - | 15 | 7 | - | - | - | - | 18 |
| విశాఖపట్నం | - | - | - | 10 | 11 | - | 8 | 2 | - | 4 | 2 | 1 | 5 | 3 | 15 | 6 | - | - | - | 10 | 11 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **15** | **-** | **70** | **116** | **23** | **50** | **19** | **14** | **42** | **27** | **44** | **42** | **47** | **325** | **146** | **2** | **-** | **-** | **10** | **113** |

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | అబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్ | కాచిగూడ, హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ హైదరాబాద్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ హైదరాబాద్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్‌షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ హైదరాబాద్ | 9848672831 |
| సుధాకర్ బుక్‌స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక హైదరాబాద్ | 9949337605 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్ | రామ్‌నగర్ గుండు హైదరాబాద్ | 9502964995 |
| భవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ హైదరాబాద్ | 9849836996 |
| శ్రీభవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) హైదరాబాద్ | 9640712555 |
| ఓరియన్ బుక్‌స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) హైదరాబాద్ | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) హైదరాబాద్ | 8977995537 |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలయబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీ లక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| మల్లిఖార్జున బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజారెడ్డి బుక్‌స్టాల్ | చందానగర్ బిఎచ్ఇఎల్ | 93466 07648 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 94900 99373 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | బాగ్‌లింగంపల్లి-సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్ | 94900 99378 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | నామ్‌దేవ్‌వాడ, నిజామాబాద్ | 83329 95395 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | సుందరయ్య భవన్, నల్గొండ | 94906 18735 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | జగ్‌జీవన్‌నగర్, న్యూ బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 99593 74907 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | బాప్టిస్ట్ చర్చ్ కాంప్లెక్స్, మొదటి అంతస్తు, హనుమకొండ | 94900 99197 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | పాత సిపిఐ (ఎం) ఆఫీస్, బాలాజీనగర్, ఖమ్మం | 94900 99329 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| అక్షర బుక్ వరల్డ్, ఎటిసి మార్కెటింగ్ | న్యూ టౌన్, మహబూబ్‌నగర్ | 90102 10464 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్‌స్టాల్, కూల్‌డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | 79890 81728 |
| రాజన్న బుక్ స్టాల్ | హనుమకొండ చౌరస్తా | 93955 07773 |
| ఎ.ఎచ్. వీలర్ బుక్‌స్టాల్ | వరంగల్ రైల్వే స్టేషన్ | 70757 59274 |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్‌స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దుటూరు | 81210 02112 |
| క్రిసెంట్ న్యూస్ ఏజెన్సీ | కడప | 98852 35846 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్‌సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | దాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీదేవి సాయి కూల్‌డ్రింక్స్, కమ్యూనికేషన్స్ | దేవి చౌక్, రాజమండ్రి | 98489 84394 |
| త్రినాథ్ పాన్ షాప్ | మరిడి మహాలక్ష్మి టెంపుల్, రాజమండ్రి | 99519 76044 |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 216 - July 2019 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/6/2019 ● Postal Regn. No. HD/1100/2017-19

Date of Posting : 29th, 30th



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao